





# కథలు

వచన

# నూరు మంచి మాటలు



## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి. కనుక తమవంతుగా భక్తి,జ్ఞాన ప్రచారార్ధం TTD(తిరుమల తిరుపతి దేవస్థానం) వారు ఉచితంగా విలువైన గ్రంధాలను ఆన్ లైన్ లో eBOOK(PDF) అందిస్తున్నారు. వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(www.google.co.in), మైక్రోసాఫ్ట్ సైట్ (www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇంట్లో ఆధ్యాత్మిక గ్రంధాలయం ఉండాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) TTD(తిరుమల తిరుపతి దేవస్థానం) వెబ్ సైట్: http://ebooks.tirumala.org
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సాయి రామ్ సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము.

**గమనిక:** భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో TTD(తిరుమల తిరుపతి దేవస్థానం) సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు.

**SaiRealAttitudeManagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)**

* సర్వం శ్రీ సాయి నాథ పాద సమర్పణమస్తు *

# అతి విశిష్టం ఈ దానం!

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# నూరు మంచిమాటలు

## (కథా సంకలనం)




రచయిత్రి : శ్రీమతి చుండి కృష్ణవేణి

# నూరు మంచిమాటలు

## (కథా సంకలనం)

రచయిత్రి

**శ్రీమతి చుండి కృష్ణవేణి**

# నూరు మంచిమాటలు (కథా సంకలనం)

## శ్రీమతి చుండి కృష్ణవేణి



ప్రథమ ముద్రణ : సర్వధారి నామ సం॥, కార్తిక మాసం.
నవంబర్, 2008

ప్రతులు : 1000

వెల : రూ. 100/-

**ప్రతులకు :**

**శ్రీమతి శ్రీకంఠం అరుణకుమారి,**
APHB, MIG-2, Block-25, Plot No 8,
అంబేద్కర్ కాలేజీ వెనుక,
బాగ్ లింగంపల్లి, హైదరాబాద్.
సెల్ : 9963169546

**శ్రీమతి చుండి కృష్ణవేణి,**
22/37, కచేరికట్ట వీధి,
పాత గుంతకల్ - 515 803.
సెల్ : 9963169546

**డి.టి.పి. అండ్ ముద్రణ :**

**మైత్రేయ ఆర్ట్స్ అండ్ ప్రింటర్స్,**
**అంబర్‌పేట, హైదరాబాదు - 13.**
**సెల్ : 9908084797**

## అంకితం



శ్రీ పద్మావతీ సమేత శ్రీ వేంకటేశ్వరస్వామివారి
చరణారవిందములకు

**ఈ పుస్తకము తిరుమల తిరుపతి దేవస్థానములవారి ఆర్థిక సహకారముతో ముద్రించబడినది.**

### గమనిక

*ఈ పుస్తకములోని విషయాలు నేను చదివిన పుస్తకాల నుంచి, పెద్దల నుంచి తెలుసుకున్న విషయాల నుంచి నాకు తెలిసిన జ్ఞానాన్ననుసరించి వ్రాసినవి. వీటికి సంబంధించిన ఎటువంటి విమర్శలకు తిరుమల తిరుపతి దేవస్థానం బాధ్యత వహించదు. ఆ బాధ్యత నాదే.*

– రచయిత్రి

*Dr. J. Hanumath Sastri*
M.A. (Eng; Tel.), B.Ed., D.Litt.
Lecturer in English (Retd.)
డా॥ జానమద్ది హనుమచ్ఛాస్త్రి

"MAHATI"
1/1845, Gandhi Naagr,
KADAPA - 516 004, A.P.
(Cuddapah)
Phone: 08562 - 243923
e-mail : janamaddi@yahoo.co.in
janamaddi@sancharnet.in

## అభినందన

మనసు మర్మమెరిగినవాడు ఘనుడు అన్నారు త్యాగరాజస్వామి. మనసును శుద్ధిచేయగల శక్తి మాటలకుంది. మంచి మాటలు పలుకుటవల్ల మనకేమాత్రం శ్రమ వుండదు. వ్యయం అసలే వుండదు. మధురమైన వాక్కుతో మన్ననలందుకోగలం.

శ్రీమతి చుండి కృష్ణవేణమ్మ ఉపాధ్యాయినిగ విద్యార్థులలో ఉత్తమాభిరుచులను పెంపొందించారు. సద్గ్రంథ పఠనం, సచ్చింతనల ద్వారా లభించిన జ్ఞానాన్ని, చిన్న రచనలలో పొందుపరచి, పత్రికల ద్వారా పాఠకులకు అందజేశారు.

'మంచి అన్నది పెంచుమన్న' అన్న గురజాడవారి బోధనను, అక్షర రూపంలో అందజేసిన రచయిత్రిని మనసారా అభినందిస్తున్నాను.

తేది: 03.04.2008

జానమద్ది హనుమచ్ఛాస్త్రి

Founder Secretary: C.P. Brown Memorial Trust Library.
Ph: 08562-255517

పొత్తూరి వెంకటేశ్వర్వరావు
ప్రముఖ జర్నలిస్టు

# ఆర్ష విజ్ఞాన ఖని

మన వైదిక వాఙ్మయంలో వేదాలు, ఉపనిషత్తులు, పురాణాలు, ఇతిహాసాలు మొదలైనవి ఒక్కొక్కటీ ఒక్కొక్క మహానిధి. ఎవరు ఎంత తవ్వి తీసుకున్నా ఇంకా అంతే మిగిలి ఉంటుంది. కాళిదాసాది మహాకవుల నుంచి నేటి రచయితల వరకు అందులోని కొన్ని రతనాలను ఎంచుకొని వివిధ ప్రక్రియలలో మహా గ్రంథాలను నిర్మించారు. నాడూ, నేడూ కూడా ఈ జ్ఞానసంపద జన జీవితాన్ని ప్రభావితం చేస్తూనే ఉంది. సత్యం, ధర్మం మొదలైన విలువలు సమాజాన్ని వెలుగుబాటలో ముందుకు నడిపిస్తున్నాయి.

ఇప్పుడు మీ చేతుల్లో వున్న "నూరు మంచి మాటలు" ఈ కోవకు చెందిన మరో పఠనీయ గ్రంథం. రచయిత్రి శ్రీమతి చుండి కృష్ణవేణిగారు పురాణేతిహాసాలను, స్మృతులను, ఇతర ప్రాచీన వాఙ్మయాన్ని లోతుగా చదివినవారు. మంచిమాటలు పలకడం ఆమెకు కొత్తకాదు. ఉపాధ్యాయ వృత్తిలో ఉండి, ఉద్యోగ విరమణ వరకు ఆమె చేసినది అదే. కాకపోతే, అప్పుడు ఆమె పరిధి విద్యార్థులకే పరిమితం. ఇప్పుడామె ఆ పరిధిని జన బాహుళ్యానికి విస్తరింపజేశారు. పిల్లలకే కాదు, పెద్దలకు సైతం మన ప్రాచీన వాఙ్మయం ప్రసరించే ధార్మిక వెలుగులను అందించడానికి పూనుకొన్నారు. కృష్ణవేణిగారి ఈ ప్రయత్నం ఆర్ష ధర్మాన్ని అతి సామాన్యులకు సైతం సులభగ్రాహ్యం చేస్తున్నది. ఆమె ఇందుకోసం కథా ప్రక్రియను ఉపయోగించుకున్నారు. తెలిసినవైనప్పటికీ చదువుదామనిపించే శక్తి ఈ కథలకూ ఉన్నవి, రచయిత్రి శైలికీ ఉన్నది.

కథకు వస్తువును ఎంచుకోవడంలోనూ రచయిత్రి ప్రతిభ కనబరిచారు. ఉదాహరణకు రామాయణం నుంచి రాముడు, సీత, లక్ష్మణుడు, హనుమంతుడు మొదలైన పాత్రలను తీసుకొని అసంఖ్యాకంగా రచనలు వచ్చాయి. కాని, శ్రీమతి

కృష్ణవేణిగారు సుమిత్ర పాత్రను ఎంచుకొని "వాల్మీకి సృష్టించిన పాత్రలలో సుమిత్ర గొప్ప శ్రేష్ఠురాలు" అని సహేతుకంగా తేల్చి చెప్పారు. ఇదొక్కటే కాదు, భిన్న దృక్కోణాలనుంచి లోకాన్ని చూసి, ప్రాచీన సాహిత్యాన్ని అర్థం చేసుకొని ఆమె చెప్పిన ఆసక్తికరమైన విశేషాలు మరెన్నో ఉన్నాయి. వినాయకుడికి చెవులు ఎందుకు పెద్దవిగా ఉన్నాయంటే అవి శ్రవణానికి గుర్తుగా ఉన్నాయంటారు. ఎవరు చక్కగా శ్రవణం చేస్తారో వారు జ్ఞానవంతులవుతారని అంటారామె. మనదేశంలో "గృహ హింస" చాలా ఎక్కువే. ఐనా పోలీసుల దృష్టికివచ్చే సంఘటనలు తక్కువ. ఎందుకంటే, ఇంటి విషయాలు రచ్చకెక్కకూడదని భారతీయ మహిళలు తమ కష్టాలను బయటికి చెప్పరు. వారి "సహనశీలత అటువంటిదం"టారు. సుబ్రహ్మణ్యం అంటే బ్రహ్మజ్ఞానం కలిగినవాడని అర్థం చెప్పారు. "కోపం నరకానికి ముఖద్వారం" అని హెచ్చరించారు. "ఆయుఃక్షీణానికి ఆరు కారణాలను మహాభారతం చెపుతున్నది – ఇవిగో చదవండి" అని అందించారు. పురాణ పాత్రలను గురించేకాదు, పురాణ మూర్తులను గురించి కూడా కథలు ఉన్నాయి ఈ గ్రంథంలో. చాలామందికి తెలిసిన సాయిబాబా గురించే కాదు, ఎక్కువమందికి తెలియని "ఎర్రితాత" గురించి విశేషాలు ఉన్నాయి.

కుటుంబంలో అనుబంధాలను పెంచే సందేశాత్మక కథలు ఉన్నాయి. వృద్ధుల పెద్దరికానికి విలువ ఇవ్వాలని హితోక్తులు ఉన్నాయి. పంక్తిలో భేదభావం చూపకూడదనీ, సామాజిక ధర్మాలూ, ఒక కాలంతో మరొక కాలానికి రుద్దకూడదనే ఆరోగ్య సూత్రాలూ ఈ పుస్తకంలో కనిపిస్తాయి.

"నూరు మంచి మాటలు" అని పుస్తకానికి పేరు ఉన్నదేగా? అంతకుమించిన సంఖ్యలో విజ్ఞానదాయక విషయాలు ఉన్నాయి. జీవిత విలువలను పెంచే మార్గదర్శక హితోక్తులు ఉన్నాయి.

శ్రీమతి చుండి కృష్ణవేణిగారి రచన బహుధా అభినందనీయం.

– పొత్తూరి వెంకటేశ్వర్వరావు

ధర్మవరపు సీతారాం

సీనియర్ జర్నలిస్టు

# మరోమాట

వ్రాయటం ఎవరి సొత్తూ కాదు. కవులు, విలేఖరులు, సంపాదకులు ఎన్నెన్నో వ్రాయవచ్చు. నిజం చెప్పాలంటే ప్రతి మనిషి రచయితే, కళాకారుడే, గాయకుడే. కాకపోతే కొంతమంది ఈ రంగాలలో ప్రావీణ్యత ఉండవచ్చు. కాబట్టే అటు విశ్వనాథవారి నుండి ఇటు ఏకలవ్య వరకు, ప్రతి మనిషికి తన ఆలోచనలు, ఆశయాలు, ఏదోరకంగా రాతపూర్వకంగా వ్యక్తీకరిస్తారు. కొంతమంది కూనిరాగాలు తీస్తారు. ఇంకొంతమంది పిచ్చిగీతలు గీస్తారు.

కొంతమంది లోపలి భావాలు వ్యక్తీకరిస్తారు. నా మటుకు నేను చదువు, సంధ్య లేకపోయినా, విలేఖరిగా, సంపాదకునిగా అరవై ఐదు సంవత్సరాలుగా చలామణీ అయ్యాను. ఏమిటి ఇది? సృష్టి ప్రభావమా? అలాగే ఈ రచయిత్రి కృష్ణవేణి. చెప్పాలంటే నా మరదలు కృష్ణవేణి ఒక రచయిత్రే. ఉత్సాహం, పట్టుదల, ఆలోచనలు ఎన్నెన్నో... వాటి ప్రభావమే రచయిత్రిగా పైకొచ్చింది. ఈ అన్నిటి ప్రభావమే ఈ పుస్తకం వెలువడింది.

ఇది నేను వ్రాయడం లేదు. నా మనసు చెప్తోంది. ఒక గృహిణి అయినాక టీచర్ ట్రైనింగ్ అయి ఉపాధ్యాయురాలై తన జీవితాన్ని ఎన్నో మలుపులతో సార్థకం చేసుకుంది. ఈ పుస్తకం కూడా ఆ కోవలోనిదే. బ్రతకటమంటే ఇది.

– ధర్మవరపు సీతారాం

యం.కె.ప్రభావతి,
అష్టావధానిని,
రిటైర్డు ప్రిన్సిపాల్,
విశ్రాంత ప్రాచార్యురాలు,
రైల్వే జూనియర్ కళాశాల,
గుంతకల్లు.

## మంచిమాట - కృష్ణవేణి

శ్రీమతి చుండి కృష్ణవేణిగారితో తొలి పరిచయం సెప్టెంబర్ 1966లో జరిగింది. వారింటి పొరుగున నేనద్దెకు చేరాను. అటు తర్వాత ఆరేళ్ళకు వారి తమ్ముడు శ్రీ సి.వి.యల్. నారాయణరావుగారితో సహోపాధ్యాయినిగా మైత్రి ఏర్పడింది. ఇట్లా ఆరంభమైన నాటినుండి మా ఇరు కుటుంబాలమధ్య సన్నిహితత్వం పెరుగుతూనే వచ్చింది.

ఆంధ్రభూమి దినపత్రికలో 'మంచిమాట' శీర్షికన అనేక ఏళ్ళు ప్రచురింపబడిన ఈమె రచనలను సంకలనపరచి 'నూరు మంచి మాటలు'గా వెలువడుతున్న పుస్తకానికి, ఈమెతోడి పరిచయానికి సంబంధమేమిటా అని అనుకుంటున్నారా? చాలా సంబంధమున్నది.

ఏదైనా త్రికరణశుద్ధి ఉన్నప్పుడే అది పలుకైనా పనియైనా శోభిస్తుంది. ఇందులో ఈమె ప్రవచించిన అనేక మంచి లక్షణాలు ఆమె జీవితంలో జీర్ణించుకొన్నవే.

ఆమె వ్రాసికొన్న విన్నపంలోనే కొన్ని మంచి లక్షణాలు బయటపడ్డాయి. చిన్నతనం నుండి నాయనమ్మ చెప్పిన మాటలు, తండ్రిగారి క్రమశిక్షణ, చదివిన చదువులలోని నీతికథలు, జీవితంలో ఒడిదుడుకులు వచ్చినప్పుడు వానిని నిగ్రహించుకోవడానికి కావలసిన నిబ్బరాన్ని, కాళ్ళక్రింద భూమి కదులుతున్నా ఆత్మ స్థైర్యంతో నిలద్రొక్కుకుని మర్యాదాయుతమైన జీవితాన్ని తాను గడుపుతూ తనలాగా కష్టాలుపడేవారికి ఒక దిక్సూచిగా నిలిచిన ఘనత కృష్ణవేణమ్మది.

మంచిమాటల విలువేమే ఆమెకు బాగా తెలుసు. అలాంటి మాటలను ఆచరణలో చూపిన జీవితాలను చూచినారు, చదివినారు, తాను ఆచరించారు. అందుకే ఇవి వ్రాయడానికి ఆమెకు అర్హత ఉన్నది. ఇవి చదివి ముల్ముందు ఏ కొందరైనా తమ జీవితాలను చక్కదిద్దుకోకపోతారా? అనే ఆశ ఆమెకే కాదు అవి చదివిన నాకు, మిగతా పాఠకులకు తప్పక ఉంటుందనే నమ్మకము ఉన్నది.

తానున్నా, లేకపోయినా, తనపేరుతో ఒక పుస్తకం వుంటుందనే ఆశతో ప్రచురణ వ్యయానికి తి.తి.దేవస్థానములవారి ఆర్థిక సహాయముతో పదవీ విరమణ అయిన పన్నెండేళ్ళకు ఆమె ఈ మాటలకు పుస్తకరూపం కల్పిస్తున్నారు. ఆమె కోరిక అన్నివిధాలా సఫలం కావాలని ఆశిస్తూ...

గుంతకల్లు,
02.04.2008.

యం.కె.ప్రభావతి

సి.వి. యల్. నారాయణరావు,

యం.ఎ., బి.ఇడి.

రిటైర్డు గెజిటెడ్ హెడ్ మాస్టర్, (ద.మ.రైల్వే),

32-67/18, శ్రీ బాలజీ కాలనీ,

రామకృష్ణాపురం, సికింద్రాబాద్.

## శుభమస్తు - శ్రీరస్తు

మా మాతా పితరులైన కీ॥శే॥ చుండి సరస్వతమ్మ, శ్రీ చుండి హనుమంతరావుల తృతీయ పుత్రిక శ్రీమతి శ్రీకంఠం కృష్ణవేణి. మా మూడో అక్కయ్య. పవిత్ర కృష్ణాతీరమైన నాటి బెజవాడ, నేటి విజయవాడయే ఈమె జన్మస్థలం. నేను, మా అక్కయ్య కృష్ణవేణి ఒకే నక్షత్ర (భరణి) జాతకులమగుట చేతనో లేక తను, నేనూ వెనువెంటనే జన్మించుట చేతనో తెలియదు కానీ మేమిరువురుమూ మా చిన్ననాటి నుండి ఒకేనైజము గలవారమై అన్యోన్యతకంటెనూ ఎక్కువగా అనేక విషయాలలో ఒకళ్ళతో ఒకళ్ళము పోటీపడుతూనో లేక ఒకళ్ళకంటెనూ ఒకళ్ళము మిన్న అని నిరూపించుకొనుటకో ఎక్కువగా పోట్లాడుకుంటూ, తుంటరితనముతోనే మా బాల్యమును హెచ్చుగా గడిపితిమి.

అయిననూ మా అమ్మ తరువాత నా యోగక్షేమములను బాల్యములో "మా కృష్ణ"యే ఎక్కువగా చూచుకొంటూ వచ్చెడిది. అట్టి అమాయకపు భ్రాతృమూర్తి వెనుక యెంతటి ఆధ్యాత్మికత మరియు జీవితపు పరిపక్వత దాగియున్నవను విషయము నాకు పత్రికలద్వారా ప్రచురితమైన ఈమె "మంచిమాటల" ద్వారాను, ఆకాశవాణి కడప, హైద్రాబాద్ కేంద్రముల ద్వారా ప్రసారమైన ఈమె "సూక్తి ముక్తావళి", "భావన"ల ద్వారానే తెలిసింది.

ఈమెకుగల కార్యదీక్ష, పట్టుదల, సాహితీ అభిమానమే నేటి ఈ చిన్న పుస్తకపు ప్రచురణకు కారణము. సాహితీ జిజ్ఞాస, నిస్వార్థపూరితమైన సాహితీ అభిమానులకు అనుభవమే. ఈమె తన యొక్క పదవీ విరమణ చేయబోవు సమయమునన్నూ, పదవీ విరమణానంతరము సాధించగలిగిన విద్యార్హత పట్టాలైన డిప్లమో ఇన్ జర్నలిజం, యం.ఇడి. డిగ్రీలు ఈమె కార్యసాధన, దీక్షలకు నిదర్శనము.

కేవలం ఈమె తమ్ముడినైన చనువుకొద్దీ వీరి రచనల గురించి వ్రాయుటకు సాహసించుచున్నానే తప్ప నాకున్న పరిమిత సాహితీ జ్ఞానముతో వీరి రచనల గురించి మరింత వ్రాయుటకు నేనసమర్థుడనన్న విషయమును చదువరులు గుర్తించగలరు.

వీరి ఈ చిన్ని పుస్తకమునకు పాఠకులయొక్క ఆదరాభిమానములు తప్పక లభింపగలవని పూర్తిగా విశ్వసిస్తూ, భగవంతుడు ముమ్ముందు ఈమె మరిన్ని కవితలను పాఠకలోకానికి అందించుటకు తగిన ఆయురారోగ్యాలను ప్రసాదింపగలడని ప్రార్థిస్తూ...

రామకృష్ణాపురం, సికింద్రాబాద్,

తేది : 05.05.2008. సి.వి.యల్. నారాయణరావు

**పెట్లూరి లక్ష్మీనారాయణ,**
తెలుగు పండిట్,
రైల్వే హైస్కూల్,
గుంతకల్లు.

శ్రీమతి కృష్ణవేణిగారు సదాచార సంపన్నమైన బ్రాహ్మణ కుటుంబంలో జన్మించి, బాల్యమాదిగ తల్లిదండ్రుల ననుకరించుచు, భక్తి, సేవాభావాలను పెంపొందించుకొని, సౌశీల్యవతిగా జీవితాన్ని కొనసాగిస్తున్న మహిళామణి. ఈమె, భగవద్గీత, భారతం, భాగవతం, రామాయణంలాంటి ప్రామాణిక గ్రంథాలను పఠించడమేగాక, అందలి శ్లోకాలను, పద్యాలను పెక్కింటిని కంఠస్థం చేశారు కూడా. తాను గ్రహించిన అనుభవ విజ్ఞానాన్ని గ్రంథరూపంలో సాటి మానవులకు అందించాలనే సదుద్దేశంతో ఈ గ్రంథ రచనకు శ్రీకారం చుట్టారు. ఇందు లౌకిక పారమార్థిక అంశాలను పొందుపరచటంతోపాటు, అందుకాధారాలైన మూల శ్లోకాలను సైతం ప్రకటించారు. ఇందు రచయిత్రి గణపతి, గాయత్రి, తులసి, శైవారాధన మొదలైన నిత్యపూజా విధులనేగాక, మాహాత్ముల జీవితానుభవాలు, మహాభక్తుల ఉపన్యాసాలు, భక్తి మార్గాలు, అవధూతచరిత్ర మున్నగు ప్రకరణాలను కూర్చి పాఠకుల కుత్సాహకరంగా, సులభశైలిలో రచన సాగించారు.

జీవిత సాఫల్యానికి ఉపయుక్తమైన విషయ సేకరణ ఇందు ప్రతిఫలించును. ఈ గ్రంథంలోని సూక్తులు మానవాభ్యుదయానికి సోపానాలనడంలో సందేహం లేదు. ఇందలి సౌరభాన్ని ఆశ్వాసించినవారు ధన్యులే. ఇలాంటి పెక్కు రచనలు శ్రీమతి కృష్ణవేణిగారి కలం నుండి వెలువడుటకై ఆమెకు తగిన ఆయురారోగ్యాలు ఆ శ్రీనివాసుడు ప్రసాదించుగాక.

**పెట్లూరి లక్ష్మీనారాయణ**

# విన్నపం

నా ఉపాధ్యాయ పదవీ అనంతరం నాకు ఏదైనా వ్యాపకం ఉండాలి అనీ, సాహిత్య గ్రంథాలన్నీ చదువుతూ ఉండేదాన్ని. అనుకోకుండా ఒకరోజు 'ఆంధ్రభూమి' దినపత్రిక చూశాను. అందులో స్త్రీలకు సంబంధించిన పేజ 'ప్రియదర్శిని' చూశాను. అందులో విశేషాలన్నీ చదువుతుంటే ఎంతో ఆసక్తి కలిగించింది. ముఖ్యంగా 'మంచిమాట' నన్ను ప్రతిరోజూ చదివింపజేసింది. ఒక్కరోజు 'మంచిమాట' చదువకపోతే ఏదో విలువైన వస్తువును పోగొట్టుకున్నట్లు అనుభూతి కలిగేది. అలాగే ఆకాశవాణి కడప కేంద్రంలో ఉదయం 6 గంటలకు ప్రసారం చేసే 'సూక్తి రత్నావళి' వినటానికి ఆతురత పడేదాన్ని. బాల్యం నుండి ఎమ్.ఎస్.సుబ్బులక్ష్మి, బాలమురళీకృష్ణ తదితర గాయకులు గానంచేసిన కీర్తనలు, శ్లోకాలు క్రమం తప్పకుండా వినేదాన్ని. కడప ఆకాశవాణి కేంద్రం ద్వారా ఎన్నో సాహిత్య ప్రసంగాలు పెద్దలు వినిపించేవి వింటూంటే అద్భుతంగా, ఆనందంగా ఉండేది.

ముఖ్యంగా నాకు 'ఆంధ్రభూమి' దినపత్రికలో మంచిమాట వ్రాయటానికి ప్రోత్సహాన్ని అందించి, వారి దినపత్రికలో ప్రచురించిన సంపాదకుల వారికి, తదితర సిబ్బందికి నా హృదయపూర్వక కృతజ్ఞతలు తెలుపుతున్నాను. విరామకాలం సద్వినియోగం చెందటానికి ఇలాంటి చిన్న చిన్న రచనలు మనకు ఆనందాన్ని కల్గిస్తాయి. 'వార్త' దినపత్రికలో కొన్ని ప్రచురింపబడ్డాయి. అయితే నేను, ఆదోని, గుంతకల్ తిరగటం వలన వాటిని భద్రపరచలేకపోయాను. ఇవి అయినా, అటూ ఇటూ తిరిగితే మిస్ అవుతాయని మిత్రులు పుస్తకరూపంలో వెయ్యమని సలహా ఇస్తే ప్రచురణకు పూనుకున్నాను. వీటి డి.టి.పి. మరియు ప్రింటింగ్ విషయంలో సహాయపడిన చిరంజీవి చెరుకుపల్లి అరుణప్రసాద్‌కు, చి॥ల॥సౌ॥నాగలక్ష్మి, మైత్రేయ ఆర్ట్స్ అండ్ ప్రింటర్స్ వార్కి నా దీవెనలు ఆప్యాయంగా అందిస్తున్నాను.

సి. కృష్ణవేణి,

రిటైర్డ్ టీచర్, గుంతకల్.

# విషయ సూచిక


| | |
|---|---|
| 1. గణపతి ప్రాశస్త్యము | 1 |
| 2. గాయత్రి | 6 |
| 3. తులసి | 9 |
| 4. తులసిపూజ | 13 |
| 5. మహాశివరాత్రి | 17 |
| 6. శివరాత్రి మహత్యం | 20 |
| 7. ఎర్రితాత | 24 |
| 8. శివదీక్ష | 26 |
| 9. శ్రవణ మహిమ | 30 |
| 10. గణపతి సచ్చిదానంద స్వామీజి | 36 |
| 11. ముత్తుస్వామి దీక్షితులు | 38 |
| 12. హస్తామలకుడు | 42 |
| 13. సుమిత్ర | 45 |
| 14. వాక్య విశారదుడు – హనుమ | 48 |
| 15. వృత్రాసురుడు | 51 |
| 16. శిరిడి బాబా | 55 |
| 17. మన ఋషులు | 57 |
| 18. కుమారస్వామి | 60 |
| 19. ఆదిత్యుడు | 63 |
| 20. అంజనా సుతుడు | 66 |
| 21. గురు రాఘవేంద్రులు | 69 |
| 22. తులసీదాసు | 72 |
| 23. రంతిదేవుడు | 75 |
| 24. భక్త శబరి | 77 |
| 25. దత్తాత్రేయుడు | 81 |

26. మనుస్మృతిలో స్త్రీ 84
27. త్యాగం 89
28. అష్టాక్షరి 91
29. నరకానికి ముఖద్వారం 96
30. ఆచారం 102
31. శ్రవణం 105
32. మోక్షసాధనం భక్తి 108
33. తపస్సు 111
34. గోవిందనామం 114
35. ఆముక్తమాల్యద 117
36. మానవుల కర్తవ్యం 121
37. గురుకృప-1 124
38. సమానత్వం నినాదాలకే పరిమితమా? 126
39. కన్యాదానం 128
40. దీర్ఘాయువు 130
41. ఆయుక్షీణానికి ఏది కారణం? 132
42. సత్యము 135
43. మార్గశిరం 138
44. పితృదేవోభవ 141
45. భక్తి-లత క్షితిరుహం 144
46. ధర్మము 147
47. రిటైర్‌మెంట్ తర్వాత 150
48. ఋణానుబంధం 152
49. మనశ్శాంతి - మార్గాలు 156
50. గురుభక్తి - 2 159
51. అష్టావక్రుడు 162
52. జరామరణాలు 165

53. నైమిశారణ్యం 168
54. సజ్జన సాంగత్యం 172
55. ఓంకార సాధన 175
56. కర్తవ్యం 177
57. ఇంద్రియాలు 180
58. మంచితనం 182
59. భగవన్నామ మహత్మ్యం 186
60. మన హృదయం ఒక దేవాలయం 189
61. కాంతివృత్తం 192
62. సంపూర్ణ శరణాగతి 193
63. గురుకృప - 3 196
64. సత్యపాలన 199
65. పినాకం-కోదండం-గాండీవం-మురళి 202
66. ప్రమద్వర 205
67. వైరాగ్యం 208
68. ఆచార వ్యవహారాలు 211
69. అఖండ కీర్తివంతుడు పృథు చక్రవర్తి 214
70. అన్నదానం 217
71. గోమాత 220
72. మహాత్ముల గుణాలు 223
73. సంకల్పబలం 228
74. జాషువా - దేశాభిమాన కవి 233
75. సహజీవనం 237
76. వృద్ధాప్యం శాపం కారాదు 240
77. అమూల్య గుణాలు - సహనం, కృతజ్ఞత 242

# గణపతి ప్రాశస్త్యము

గణపతి మొదటి వందనము అందుకునే దైవము. శివపార్వతులకు ప్రియపుత్రుడు. ఎలాంటి శుభకార్యాలు తలపెట్టినా ముందు గణపతిని పూజిస్తాము.

**'జ్ఞానార్థ వాచకోగశ్చ, ణశ్చ, నిర్వాణ వాచకః**

**తయోరీం పరబ్రహ్మ గణేశం ప్రణమామ్యహమ్'**

'గ' అనే అక్షరము జ్ఞానార్థ వాచకము. 'ణ' అనే అక్షరము నిర్వాణ వాచకము. ఈ రెండింటికి – ప్రభువైనటువంటి – గణపతికి నా ప్రణామాలు – అని శాస్త్రాలు గణపతిని కీర్తిస్తున్నాయి.

విఘ్నాలన్నిటిని కూడా తొలగిస్తాడు – అందువల్ల విఘ్నేశ్వరుడు అని స్తుతిస్తాము. వినాయకుడు జ్ఞాన సంపన్నుడు. ఆయన తల 'హస్తి' శిరము. ఆయన వాహనము మూషికము.

శివ పురాణములో గణపతి – పుట్టుక ఈ విధంగా చెప్పబడింది. ఒకనాడు పార్వతి స్నానం చేసేటపుడు, నలుగు పిండితో – ఒక అందమైన బొమ్మను చేసింది. ఆ బొమ్మకు ప్రాణం పోస్తే బాగుంటుందని, బ్రహ్మను స్మరించింది. వెంటనే సుందరమైన బొమ్మకు ప్రాణం వచ్చింది. ఆ బాలుని ద్వారపాలకునిగా వుంచి, తన అనుమతి లేనిదే ఎవ్వరిని లోపలకు రానీయవద్దని, పార్వతీదేవి బాలుని ఆజ్ఞాపిస్తుంది.

కొంత సమయానికి మందిరంలోనికి శివుడు ప్రవేశింపబోతాడు, లోపలకు వెళ్లుటకు వీలుపడదని, బాలుడు వారిస్తాడు. కాని శివుడు ముందుకు పోబోగా బాలుడు అడ్డగించటం చూచి, శివుడు ఆగ్రహంతో అతని తలను ఖండిస్తాడు.

ఈ వార్తవిని పార్వతీదేవి హృదయం చలించిపోయింది. దేవి దుఃఖం జూచి, పరమశివుడు, శివగణాల్ని పిలిచి, ఉత్తరం వైపుగా ఏ జంతువు కనపడ్డా, దాని శిరస్సు ఖండించి తీసుకురమ్మని ఆజ్ఞాపిస్తాడు. వారు బయలుదేరగా, ఏకదంతము వుండే గజము మొదట కనపడుతుంది. దానిని వధించి, శిరస్సును శివునికి అందిస్తారు. శివుడు ఆ గజశిరమును బాలుని కంఠంపై వుంచగానే విగత జీవుడైన బాలుడు నిద్రలేచిన వానివలె లేచి ప్రసన్నంగా దర్శనమిస్తాడు.

**'సుభగః సుందర తరో గజ వక్త్రో సురక్త కః**

**ప్రసన్న వదనశ్చాతి సుప్రభో లలితా కృతిః'**

గజముఖుడైన ఆ బాలుని సుందర వదనము అరుణకాంతితో వెలిగిపోయింది. మనోహరమైన ఆతని ఆకారము నుండి జ్యోతులు ప్రకాశంగా వెలిగాయి. బాలుడు లేచి నిల్చుని, అక్కడే దర్శనమిస్తున్న బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులకు భక్తితో నమస్కరిస్తూ – "క్షంతవ్యశ్చాపరాధో యే మానశ్చైవే దృశో నృణామ్" అభిమానవంతుడై ప్రవర్తించినందుకు, నా అపరాధాన్ని మన్నించండి అని త్రిమూర్తులకు నమస్కరిస్తాడు.

జగజ్జననియైన ఉమాదేవి, సంతోషంతో తన బిడ్డను ఒడిలో కూర్చోబెట్టుకొని, ముద్దాడి ఆశీర్వదిస్తుంది. నాయనా, గజవదనా! నీవు అందరికి శుభాన్ని కలుగజేస్తావు. నీకు ఇక మీదట దేవతలు, మానవులలో ప్రధమ పూజ నీకే లభిస్తుంది అని ఆశీర్వదిస్తుంది.

గజవదనుని చెవులు చాలా పెద్దవిగా వుంటాయి. శ్రవణమునకు బాగా గుర్తుగా వుంటాయి. ఎవరు చక్కగా శ్రవణం చేస్తారో వారే జ్ఞానవంతులౌతారని భావం. గణేశుడు, గిరిజానందనుడుగా అలరారుతూ భగవానుడు మనకు సర్వ సంపదలు, శుభాలు కలుగజేస్తాడు. గణేశుని స్మరిస్తే చాలు, ఏ కార్యమైన నిర్విఘ్నంగా జరుగుతుంది.

'కావ్యస్య లేఖనార్ధాయ గణేశః స్మర్యతాం మునే"

కావ్య రచన చేసేముందు గణేశుని స్మరించాలని మహాభారతం చెబుతోంది.

ఒక్కొక్క యుగంలో ఒక్కొక్క రూపంతో వినాయకుడు శోభిల్లుతూ వుంటాడు. కృతయుగంలో సింహవానునిగా పది తలలతో దర్శనమిస్తాడు. త్రేతాయుగంలో మయూర వాహనంకలిగి, మయూరేశుడు అని కీర్తింపబడ్డాడు. ద్వాపర యుగంలో అరుణకాంతి గల దేహం కలిగి చతుర్భుజుడై కనిపిస్తాడు. ఇక కలియుగంలో పెద్దతొండము, ఏక దంతము, లావు బొజ్జ కలిగి, గజాననుడై దర్శనమిస్తాడు.

ప్రజాపతి తన కుమార్తెలైన సిద్ధి, బుద్ధి అనే కన్యలను వినాయకునికిచ్చి వివాహం జరిపాడని, వారికి జన్మించినటువంటి సంతానమే క్షేముడు, లాభుడు అని ఒకచో పేర్కొనబడింది. ఇందులో మనకు తెలిసే విషయం సిద్ధి, బుద్ధి ఎవరికి తోడుగా వుంటారో వారికి లాభం, క్షేమము కలుగుతుందని, వాస్తవంగా వినాయకుడుగాని, కార్తికేయుడుగాని బ్రహ్మచారులే అని మహాత్ముల అభిప్రాయం.

వినాయక చవితినాడు గణపతి నారాధిస్తే, సర్వరోగాలనుంచి విముక్తి లభిస్తుంది అని శాస్త్రాలు చెపుతున్నాయి. యాజ్ఞవల్క్య స్మృతి రోగాధిపతి విఘ్నేశ్వరుడే అని తెలుపుతోంది. ఈ చతుర్ధినాడే వినాయకపూజ ఎందుకు చేయాలంటే, భాద్రపద శుక్లపక్ష చవితినాడే గణేశుడు, పార్వతీ, పరమేశ్వరులకు పుత్రునిగా జన్మించాడు.

గజముఖుని ఆరువిధాలుగా పూజించడంవల్ల ఆరు శాఖలు ఏర్పడ్డాయి. 1. మహాగణపతి, 2. హరిద్రా గణపతి, 3. స్వర్ణగణపతి, 4. ఉత్తిష్ఠ గణపతి, 5. సంతానగణపతి, 6. నవనీత గణపతి.

త్రిపురాసురుని సంహరించుటకు బయలుదేరే సమయంలో పరమశివుడు గణపతినే స్మరించాడు. రాణి ఇందుమతిదేవి, నారదుని సలహాతో, గణపతి మృత్తికా విగ్రహం చేసి చవితినాడు పూజించి నాగలోకంలో బంధింపబడి నటువంటి తన భర్తను తిరిగి పొందింది.

చింతామణి క్షేత్రంలో రాజైనటువంటి రుక్మాంగదుడు తనకున్న భయంకరమైన కుష్ఠువ్యాధిని పోగొట్టుకొనుటకై గణపతి పూజించి, ఆరోగ్యాన్ని పొందాడు. గణపతి ఆశీర్వాదము వలననే రుక్మిణీదేవి, తన కుమారుడైన ప్రద్యుమ్నుని పొందగల్గింది. కార్తవీర్యుని కుమారుడు సహస్రార్జునుడు వక్రాంగుడై జన్మిస్తాడు. గణపతిని పూజించి తనుమళ్లీ సర్వ అంగాలతో శోభిల్లుతాడు.

గణపతి విశ్వం అంతట నిండియుండే దైవము, సమస్త ప్రపంచము ఆయనను ఆరాధిస్తుంది. మన భారతదేశమే కాకుండా చైనా, జపాన్, మెక్సికో, బర్మా, కాంబోడియా, చంపా మొదలైన ప్రాంతాలలో గూడా ఆయన ఆరాధనలు అందుంకుంటాడు.

**"సర్వస్యాత్మా సర్వగః సర్వశక్తిః**
**సర్వవ్యాపీ సర్వకర్తా పరేశః**
**సర్వద్రష్టా సర్వసంహారకర్తా**
**దాతా పాతా విశ్వనేతా పితాపి"**

గణపతి ఒక్కొక్క ప్రాంతంలో, ఒక్కొక్క నామంతో, ప్రత్యేక రూపంతో శోభిస్తూ వుంటాడు. అన్ని నామములూ కూడా ఆతని స్వరూపంలో, వేరేగాదని నిరూపించబడ్డాయి. జబల్‌పూర్‌లో వినాయకుని 'గణేశుని' అనే స్త్రీ రూపంతో మనకు కనిపిస్తాడు. సుచేంద్రములో కూడ స్త్రీ రూపంతోనే గోచరిస్తాడు. మధురై పట్టణంలో ఒక చేతిలో పద్మము ధరించి, వ్యాఘ్ర పాద గణేశుడుగా

దర్శనమిస్తాడు. వేలూరులో జలగండేశ్వర ఆలయంలో ద్రోగాడే బాలునివలె దర్శనమిస్తాడు.

ఇక ఇతర దేశాలైన బోస్నియాలో 'మహాబిని' అనే నామంతో, మంగోలియాలో 'తోట్కర్' అనే పేరుతో, టిబెట్‌లో 'చోప్రక్' అనేనామంతో, కంబోడియాలో బ్రహ్ గణేశ్ అనే పేరుతో, చైనాలో క్వన్షిడియల్ అనేపేరుతో, జపానులో 'వినయక్ష'అనే నామంతో ఆరాధించబడుతున్నాడు. జావా ద్వీపంలో ధ్యానరూపుడై దర్శనమిస్తాడు. మనదేశంలో తిరువత్తూరులో వరుసగా అమర్చిన ఐదు ముఖములు కలిగియున్నాడు. నాగపట్నంలో చుట్టు నాలుగు ముఖములు వీటిపైన ఐదవముఖము నిలిచియుంది. మైసూరు హాలేబీడులో నృత్య గణపతిగా దర్శనమిస్తాడు. అయితే ఈ ఆలయాన్ని విష్ణువర్ధనుడు అనే రాజు నిర్మించినట్లుగా తెలుస్తోంది. శ్రీశైలంలో సాక్షి గణపతిగా వున్నారు. కోయంబత్తూరులో భవాని అనేచోట వీణాహస్తుడై దర్శనమిస్తాడు.

విఘ్ననాశనుడైనందుకు విఘ్నేశ్వరుడని, నృత్య స్వరూపుడైనందున ఏకదంతుని, కష్టాలు తొలగించేవాడైనందుకు హేరంబుడని, సర్వలోక రక్షకుడైనందున లంబోదరుడని, ఉత్తమ జ్ఞానాన్నిచ్చి, రక్షించే వాడైనందున శూర్పకర్ణుడని, కార్తికేయునికి సోదరుడైనందున స్కందపూర్వజుడని, సిద్ధి, బుద్ధి ప్రదాత, లోకక్షేమ అనుగ్రహ ప్రదాత గౌరీనందనుడని స్తుతించి, ధ్యానించి, మోక్షాన్ని ప్రసాదించమని సర్వులు కోరుకోవాలి.

ఎవరైతే ప్రతిరోజు గణేశ పంచరత్నాన్ని ప్రాతఃకాలంలో భక్తిశ్రద్ధలతో పఠిస్తారో వారికి ఆరోగ్యము, ఉత్తమ సాహిత్యము, శుభకరమైన సంతతి, పూర్ణ ఆయుష్షు, అష్టైశ్వర్యాలు గణపతి కలుగజేస్తాడు.

*(ఆంధ్రభూమి, సెప్టెంబర్ 18. 2004)*

# గాయత్రి

మానవులకు ఆయుష్షు, ఆరోగ్యం, ఐశ్వర్యం - ఇహలోక పరలోక సాధనకు అవసరమైనవి ఎంతో ఉత్తమమైనది. అందుకే **"యజ్ఞోపవీతం పరమం పవిత్రం ప్రజాపతై ర్య త్సహజం పురస్తా, ఆయుష్యమగ్ర్యం ప్రతిముంచు శుభ్రం, యజ్ఞోపవీతం బలమస్తు తేజః"** అని పండితులు తెలిపారు. గాయత్రి జపం మోక్షమునకు అర్హమైనది. తల్లిని మించిన దైవము లేదు "నగాయత్ర్యాః పరోమంత్రః నమాతాః పరందైవతమ్" అనేటటువంటి గాయత్రి సర్వసుఖాల్ని అందిస్తుంది. పంచ ప్రాణాలు, మనస్సు, బుద్ధి దశేంద్రియాలు మొత్తం పదిహేడు ఇంద్రియాలు సూక్ష్మ శరీరానికున్నాయి. ఇవన్నీ సుఖానికి, దుఃఖానికి, సాధనంగా వుంటాయి. క్షణికమైన ప్రాపంచిక సుఖాలకోసంగాక, భక్తి, శ్రద్ధ వీటితో గాయత్రిని ధ్యానించి, సంసారమనే సముద్రం దాటవచ్చు.

యుగయుగాలనుండి మన ఋషులు, హిందూ ధర్మ ప్రకారం సంధ్యావందనం, దేవతార్చన, హోమం యివన్నీ కూడా ప్రచారంలోకి తెచ్చారు.

**'ఓం భూర్భువస్సువః ఓం తత్సవితుర్వరేణ్యం**

**భర్గో దేవస్య ధీమహి ధియోయోనః ప్రచోదయాత్'**

భూర్భువః - స్వర్లోకములు గాయత్రీ స్థానాలు, గాయత్రీ తత్త్వమే రామ తత్త్వము.

ఋగ్వేదంలో - భూః యజుర్వేదంలో భువః స్వః అనే మూడు అక్షరాలు త్రయసారంగా కన్పిస్తోంది.

త్రికాల సంధ్య అంటే సూర్యోదయం, మధ్యాహ్నం, సూర్యాస్తమయం మూడు వేళల చేయవలసి వుంది. ఓపికలేనివారు ఒకపూటైనా చేయాలి. ముఖ్యంగా ఆచమనము సంకల్పము, ప్రాణాయామము, గాయత్రిమంత్ర జపం, అర్ఘ్య ప్రదానము ముఖ్యమైనవి. ప్రాణాయామం చేయటం ఎన్నోసార్లు మనం

చదివి వినియున్నాం. శరీరంలోని అనారోగ్యం పోగొట్టి తేజస్సు ఉత్సాహం కల్గిస్తుంది.

బ్రహ్మ ఋషులు సూర్యోదయానికి పూర్వమే ప్రథమ సంధ్య గావిస్తారు. నదా ప్రభాత సమయే బద్ధ బ్రహ్మాసనస్థితి షట్చక్ర చింతనం కుర్యాద్యథోక్త మఃజనా క్రమయే "అస్యా సంకల్ప మాత్రేణ సర్వపాపై ప్రముచ్యతే" బ్రహ్మముహూర్తంలో నిద్రలేచి గురువును స్మరించుకుని, అరచేతిలో త్రిశక్తులనూ స్మరించి – 'కరాగ్రే వసతే లక్ష్మీః కరమధ్యే సరస్వతీ కరపృష్ఠేతు సావిత్రీ ప్రభాతే కరదర్శనమ్' అంటూ తర్వాత కాలకృత్యాలు తీర్చుకుని, స్నానమయ్యాక, పద్మాసనం వేసుకొని కనులు మూసికొనిగాని కనులు తెరిచిగాని, ఏకాగ్రతతో గాయత్రీ మంత్రం జపించాలి. యోగం అభ్యసించేవారికి సహస్రాం ముందున్న బ్రహ్మ సాక్షాత్కారం, జ్ఞానికి సర్వాంతర్యామియై నటువంటివారికి, బ్ర సాక్షాత్కారం లభిస్తుంది.

అలాగే మధ్యాహ్న సమయంలో సూర్యునికి గాయత్రి జపించి అర్ఘ్యమీయాలి. ఎందుకనగా సూర్యుడు ప్రత్యక్ష దైవము. తన కిరణాల ప్రభావం వల్ల భూలోక ప్రజలకు ఆరోగ్యం కల్పిస్తున్నాడు.

పూర్వం రాక్షసులు బ్రహ్మను గూర్చి తపస్సు చేశారుట. వారు సూర్యునితో యుద్ధం చేయాలి అని వరమడిగారట. అలా సూర్యునితో యుద్ధం మొదలు పెట్టేసరికి సూర్యుని భూపరిభ్రమణం వల్ల వారితో యుద్ధం చేయడం కష్టంగా పరిణమించింది. అప్పుడు భూలోకంలో ద్విజులందరూ గాయత్రీ మంత్రజపం చేసిన ఆ నీరు సూర్యునిపై విసిరివేయగా, ఆ నీటిబిందువులు వజ్రాయుధం మాదిరి – రాక్షసిమూకలపై పడి వారిని పారద్రోలాయట. అప్పుడు సూర్యుడు యధావిధిగా తన దినచర్య కొనసాగించాడట. అందువల్లనే, ఉదయిస్తున్న, అస్తమిస్తున్న సూర్యునికి త్రిసంధ్యలలో ఎవడు అర్ఘ్యం విడుస్తాడో అతనికి ఇహలోక సుఖములు పరలోక సుఖములు అనుభవిస్తారని సూర్యుడు వరాలిచ్చాడట.

ఇలా గాయత్రి జపించినందువల్ల సత్త్వగుణం అభివృద్ధి అవుతుంది. బుద్ధి వికసిస్తుంది, తత్త్వజ్ఞానం పట్టువిడ్డుంది. అల్లసాని పెద్దన మనుచరిత్రలో ప్రవరుడు తనుదాన, జపాగ్నిహోత్ర, పరతంత్రుడను కాబట్టే తన అరికాలికి పూనుకున్న పసరు హిమాలయపర్వత మంచులో కరిగినప్పటికీ తను జపించే గాయత్రీ మంత్రజప ప్రభావం వల్లనే అరుణాస్పద పురం చేరుకోగలిగాడు. వటువుకు ఉపనయనానికి ముందుగా, తల వెనుకవైపు కొద్ది జుట్టును కత్తిరించి, శిఖను వుంచి, స్నానం చేయించి, యజ్ఞోపవీతం ధరింపచేసి, గాయత్రి మంత్రం ఉపదేశిస్తారు. 'శిఖి' అనేది జ్ఞానానికి, యజ్ఞోపవీతం అనేది వేదాంతానికి గుర్తు. ఉపనయన సందర్భంలో బాలుని తండ్రే గురువై గాయత్రీ మంత్ర రహస్యం చెవిలో ఉపదేశిస్తాడు.,

పద్ధెనిమిది విద్యలలో 'మీమాంస' గొప్పది. 'మీమాంస' కంటే తర్క శాస్త్రం గొప్పది. ధర్మశాస్త్రాల్‌టే వేదత్రయి గొప్పది. వేదత్రయి కంటే ఉపనిషత్తులు శ్రేష్టమైనవి, ఆ ఉపనిషత్తులకంటే గాయత్రి గొప్పది, గానము చేసే వానిని రక్షిస్తుంది. కనుక గాయత్రి అని పేరు ప్రణవంతో కూడినటువంటి ఈ గాయత్రి ఎంతో ఉత్తమమైనది.

తల్లిను మించిన దేవం లేదు 'న గాయత్ర్యాః వరో మంత్రః నమాతుః పరం దైవతమ్' అనేటటువంటి గాయత్రిజపం సర్వసుఖాల్ని, మనశ్శాంతిని, మనకు అందిస్తుంది. పరమేశ్వరుని ద్వారా, పరమేశ్వరీ రూపమైన గాయత్రీ మాత తరింపచేసే లోకమాత. శైవులు శివుడే దేవుడని, వైష్ణవులు విష్ణువే దేవుడని వాదించే ముసుగులో అంతా తానేనని ప్రకటించడం జరిగింది.

సకల ఆపదలను దూరంగా తరిమివేసి సర్వసంపదలు మనకు అందించే 'గాయత్రి' జపిస్తే ప్రజలు తరిస్తారనడంలో ఎలాంటి సందేహం లేదు.

*(ఆంధ్రభూమి, జులై 25, 2004)*

# తులసి

'తులసీ కాననం రాజన్ - గృహేయస్యావతిష్ఠతే
తద్గృహం తీర్థ రూపంతు నాయాంతి యమకింకరాః"

ఎవని గృహమందు తులసి మొలకవుండునో వాని గృహము తీర్థ స్వరూపముగా వుంటుంది. అచటికి యమదూతలు రారు. అవసాన సమయంలో విష్ణు దూతలే వచ్చి, వానిని విష్ణు సాయుజ్యం పొందజేస్తారు అని పృథుచక్రవర్తికి నారద మహర్షి తెలిపియున్నారు.

లక్ష్మీ సహితుడైన మహావిష్ణువు తులసివనంలో విహరిస్తూ వుంటాడు. తులసిగాలి తగిలితే పుణ్యప్రదము, ఆరోగ్యప్రదము. వైద్యం ప్రకారం తులసి పసరు గనుక రాస్తే కొన్ని చర్మవ్యాధులు నశిస్తాయి. చంటిపిల్లకు తులసి రసం పట్టిస్తే కఫం, దగ్గు తగ్గుతాయి. ప్రతివారు భోజనం చేసిన తర్వాత తులసి దళం గనుక నమిలి మ్రింగితే అన్నం చక్కగా జీర్ణమవుతుంది. తులసి పూసల దండ జపమాలగా ఉపయోగపడుతుంది. కొంతమంది తులసిదండను జబ్బలకు, అంటే భుజాలక్రింద మోచేతికి కట్టుకుంటారు.

అవసాన సమయంలో వృద్ధులకు, తులసి తీర్థం నోటిలో పోస్తే శివసాయుజ్యం పొందుతారని పెద్దల విశ్వాసం.

"ధాత్ర్యుద్భవా స్మృతాధాత్రీ
మాభవామాలతీ స్మృతా
గౌరీభవాచ తులసీ
రజ, స్సత్త్వ, తమోగుణాః"

రజ, స్సత్త్వ, తమో గుణాలు కలిగి, సరస్వతీ అనుగ్రహం వలన ఉసిరిక చెట్టు జనించింది. శ్రీలక్ష్మీదేవి అనుగ్రహం వలన, మాలతీ వృక్షం పుట్టింది. పార్వతీ అనుగ్రహం వలన తులసి ఉద్భవించింది.

**"కార్తికో ద్యాపనే విష్ణుః**
**తస్మాత్ పూజా విధీయతే**
**తులసీ మూలదేశేతు**
**ప్రీతిదా సాతతఃస్మృతా"**

అంటే కార్తీకమాసంలో ఉద్యానవనమందు విష్ణుపూజ ముఖ్యము. ఆ పూజ తులసి సన్నిధిలో చేస్తే విష్ణువు మిక్కిలి సంతోషిస్తాడు. అందుకే కార్తీకస్నానాలు చేసేవారు ప్రతి నిత్యము తులసికోటలో నీళ్ళుపోసి దీపారాధన చేసి పూజిస్తే పవిత్రమైన విష్ణుసాయుజ్యం పొందుతారు.

**"సర్వపాపహరం పుణ్యం కామదంతులసీ వనమ్**
**రోపయంతి నరశ్రేష్టాః తేతుపశ్యంతి భాస్కరమ్"**

తులసి వనము సమస్త పాపాలను హరిస్తుంది. అంతేకాకుండా మనం కోరే కోరికలను కూడా నెరవేరుస్తుంది. అందువల్ల తులసి వనము ప్రతిష్టచేసేవారు, తులసిని పెంచేవారు సూర్యలోకాన్ని చేరుకుంటారు. వారికి యమధర్మరాజు దర్శనముకాదు. సూర్యమండలాన్ని ఛేదించుకుపోయి మోక్షాన్ని పొందుతారు అని వేదశాస్త్రాలు చెప్తున్నాయి.

"దర్శనం నర్మదాయాస్తు
గంగాస్నానం తద్దైవతు
తులసీవన సంసర్గః
సమయే తత్త్రయం స్మృతయే"

నర్మదానదిని చూచుట, గంగలో స్నానం చేయటం, తులసీ వనం సేవించడం ఈ మూడు సమాన ఫలాన్ని అందిస్తాయి. అనగా పుణ్యఫలాన్ని ఇస్తాయని అర్థం.

తులసిని నాటడం తులసికి నీళ్లుపోసి పెంచడం, తులసిని దర్శించటం, తులసిని స్పర్శించటం వలన మనస్సుతో, వాక్కుతో, శరీరంతో మానవులు చేసిన పాపాలన్నీ దహింపబడతాయి. అనగా తులసి మానవుల సంచిత పాపాల్ని నశింపచేసి పుణ్యమును ప్రసాదించును.

**"తులసీ మంజరీబిః యః**
**కుర్యాత్ హరి హరార్చనమ్**
**సనగర్భ గృహంయాతి**
**ముక్తి భాక్చ న సంశయః"**

తులసిదళాలతో శివకేశవులను పూజించువారికి, జన్మరాహిత్యం సిద్ధిస్తుంది. తప్పక ముక్తిని పొందుతారు. సంశయము లేదు. తులసి దళాలతో శివుని పూజింపరాదని కొందరంటారు. కాని శివుని కూడా తులసీ దళాలతో పూజించవచ్చును.

**"పుష్కరా దీని తీర్థాని**
**గంగాద్యాః సరితఃతథా**
**వాసుదేవాదయో దేవాః**
**తిష్టంతి తులసి దళే"**

పుష్కరము మొదలైన తీర్థాలు గంగా మొదలైన పవిత్ర నదులు విష్ణువు మొదలగు సమస్త దేవతలు, తులసీదళాలందు నివసిస్తారు. అనేక పాపాలు చేసినా తులసి మట్టిని (చెట్టువద్ద వున్న మట్టి) పూస్తే మరణించినవారు మోక్షాన్ని పొందుతారు. పూర్వకాలంలో క్షురకర్మ చేసుకున్న తర్వాత తులసిమట్టిని శుద్ధికొరకు పూసుకుని స్నానం చేయడం సాంప్రదాయం.

తులసిచెట్టు గంధము ధరించిన మానవుడు సర్వపాపాల నుంచి విముక్తుడౌతాడు. పాపాలు ఆతని శరీరాన్ని స్పృశింపజాలవు. సర్వదా, సర్వులు తులసి గంధము ధరించవచ్చును.

**"తులసి విపినచ్ఛాయా యత్ర యత్ర భవేన్నృప**
**తత్రశ్రాద్ధం ప్రకర్తవ్యం పితృణాందత్త మక్షయమ్"**

తులసీవన నీడలో సమీపములో శ్రాద్ధకర్మలు చేస్తే పితృదేవతలకిచ్చినది అక్షయమౌతుంది. అంతేగాక వారికి శాశ్వత బ్రహ్మలోక ప్రాప్తి కల్గుతుంది.

ద్వాదశిరోజున తులసీదళాన్ని, కార్తీకమాసాన ఉసిరిక పత్రిని కోయువారు నింద్యమైన నరకాన్ని పొందుతారు. అంటే ద్వాదశినాడు పూజకోసం కూడా తులసీదళాలు కోయరాదు.

**"గణేశం తులసీ పత్రైః నవదుర్గాశ్చైత దూర్వాయా**
**ముని పుష్పైః తథా సూర్యం లక్ష్మీ కామోన చార్చయేత్"**

తులసి దళాలతో గణపతిని, దూర్వం (గరిక)తో దుర్గను (పార్వతి) అవిశ పుష్పాలతో సూర్యుని లక్ష్మీకాముడు అనగా సంపదలను కోరువాడు పూజించరాదు.

**"శిరిషో, న్మత్త, గిరిజా, మల్లికా, శాల్మలీ, భవైః**
**అర్కజైః కర్ణికారైశ్చ విష్ణుఃనార్చః సితాక్షతైః"**

దిరిశెన, ఉమ్మెత్త, మల్లి, బూరుగ, జిల్లేడు, కొండగోగు ఇలాంటి పుష్పాలతో విష్ణువును పూజింపరాదు. తెల్లని అక్షతలు (అంటే పసుపు, కుంకుమ కలపకుండా)తో విష్ణుపూజ చేయరాదు. పసుపు కుంకుమతో అక్షతలు కలిపి పూజించాలి. ఇది శుభాన్ని కలిగిస్తుంది.

*(ఆంధ్రభూమి జనవరి 14, 2006)*

# తులసిపూజ

ఈ కార్తీకమాసం శరదృతువులో వస్తుంది. శరత్కాలంలో పృథివి సస్యశ్యామలంగా వుండి, ఎంతో శోభాయమానంగా వుందనిపిస్తుంది. చంద్రుడు తన కళలన్నీ ప్రదర్శిస్తూ, ప్రకృతికి ఎంతో రమణీయతను చేకూరుస్తాడు.

దేవతారాధన అనారోగ్యం తొలగిపోవడానికి, దైవానుగ్రహం ఎల్లప్పుడు వుండడానికి కార్తీకమాసంలో శివపూజ, గౌరీపూజ తప్పక చేస్తారు. ప్రతిగ్రామంలో, పట్టణంలో అన్ని కులాలవారు స్త్రీ పురుషులు ఆచరిస్తారు కార్తీక పౌర్ణమి. తులసి పుట్టిన పండుగగా భావిస్తారు. సంప్రదాయబద్ధంగా ఈ పండుగ చేసుకుంటారు.

చైత్రమాసంలో శ్రీరామనవమి రోజు, సీతాకళ్యాణం, మార్గశిరమాసంలో గోదాదేవి కళ్యాణం ఎలా నిర్వహిస్తారో అలా తులసి నారాయణుల కళ్యాణం కార్తీక పౌర్ణమి లేక కార్తీక ద్వాదశినాడైనా జరుపుతారు.

**"సమోక్షం లక్ష్యతేజంతుః విష్ణు లోకం తథాక్షయం**
**ప్రాపోన్నతి వాపులాన్ భోగాన్ విష్ణునా సహమోదతే"**

ఎవరైతే మంగళవాయిద్యాలతో, వైదిక పద్ధతులతో తులసి, నారాయణుల కళ్యాణం జరిపి అన్నదానం చేస్తారో, వారికి వైకుంఠ ప్రాప్తి కలుగుతుంది. సర్వసర్వసౌఖ్యాలు అనుభవిస్తారని పై శ్లోక తాత్పర్యం.

తులసి నామాలు శాస్త్ర ప్రకారం జపిస్తూ, ఈ మాసంలో పూజిస్తే అశ్వమేధ యాగం చేసినంత ఫలం లభిస్తుందని వేదాలు చెప్తున్నాయి.

**"బృందా బృందావనం విశ్వపూజితాం విశ్వపావనీం**
**పుష్పాసారాం నందినీంచ తులసీ కృష్ణ జీవనీం**
**తులసీ శ్రీమహాలక్ష్మి విద్యా విద్యా యశస్వినీ**
**ధర్మా ధర్మాసనాదేవీ దేవదేవ మనఃప్రియా**
**లక్ష్మి ప్రియసఖీ దేవీద్యౌర్భూమి రచలాచలా"**

అన్ని తీర్థాలూ, అన్ని నదులూ, అందరు దేవతలూ, తులసీదళంలో వున్నట్లుగా పురాణాలు వివరిస్తున్నాయి. ఎప్పుడుపడితే అప్పుడు తులసీదళాలు త్రుంచరాదు.

పౌర్ణమి, అమావాస్య, ద్వాదశి, సంక్రాంతి అలాంటి పర్వదినాలలో, మధ్యాహ్నం రాత్రిపూట, సంధ్యాకాలం, స్నానం చేయని సమయంలో స్త్రీలు బహిష్టు సమయంలో తులసి స్పర్శించటంగాని, త్రుంచటంగాని చేయరాదు. అలా త్రుంచితే శ్రీమన్నారాయణుని శిరస్సు త్రుంచినట్లే అని శ్లోకం చెప్తోంది.

**"పూర్ణిమాయాం అమాయాంచ**
**ద్వాదశ్యాం రవి సంక్రమే**
**తైలాభ్యంగే స్నాతేన మధ్యాహ్నే నిశిసంధ్యయో**
**అశౌచ, అశుచి కాలేచ రాత్రివాసాన్వితే సినా**
**తులసీం యే చ చిన్వంతితే ఛిన్దతి హరేః శివః"**

తులసిని త్రుంచేముందు ఈ మంత్రం జపించి, నమస్కరించి, ఆకులను కోయకుండా దళాలను మాత్రమే త్రుంచాలి. తులసి కొమ్మలను విరువకూడదు. అలా విరిస్తే మహావిష్ణువు హృదయాన్ని విరిచినట్లేనని చెప్పబడింది.

**మాతా తులసి గోవింద హృదయానందకారిణి**
**నారాయణస్య పూజార్థం చినోమిత్వామ్ నమోస్తుతే**

**త్వయావినా మహాభాగే సమస్తం కర్మ నిష్ఫలం**

**అతత్తులసి దేవిత్వాం చినోమివరదో భవా**

**చయనోద్భవ దుఃఖం యద్దేనితే హృదివర్తతే**

**తతౌక్షమస్త్వ జగన్మాత తులసీత్వాం నమామ్యహమ్**

ఓమాతా! తులసీ గోవిందుని హృదయానందకారిణీ! నేను నారాయణుని పూజించటానికిగాను, నిన్ను త్రుంచుచున్నాను. నీ... లేకుండా ఆయనను పూజిస్తే ఆ పూజలన్నీ నిష్ఫలమవుతాయి.

గనుక మహావిష్ణువును పూజించటానికై నీవు కావాలి, నన్ను కరుణించి ఆశీర్వదించు తులసీ నీ నుంచి దళములు త్రుంచడంద్వారా, నీకు కలుగు బాధకుగాను, నన్ను క్షమించు, నా నమస్సులందుకో అని శ్లోకభావం.

గంగా స్నానం చేస్తే ఎంత ఫలితం కల్గుతుందో అంత ఫలితం తులసీ సమూహాన్ని తాకడం వలన లభిస్తుంది. తులసితో కూడ హరిహరులను పూజించినవారు, తిరిగి జన్మ ఎత్తవల్సిన దుర్గతి వుండదని, తులసి దగ్గర కార్తీకంలో ఎవరు దీపం వెలిగిస్తారో, వారు విష్ణు సాయుజ్యం పొందుతారని, మరణశయ్యపై వున్నవారి నోటిలో తులసి తీర్థం పోస్తే వారికి మోక్షప్రాప్తి కలుగుతుందని, తులసి నీడలో పితృకర్మలు జరిపితే పితృదేవతలు, ఆనంద పరవశులవుతారనీ, విష్ణు సహస్రనామం, భగవద్గీత స్తోత్ర పారాయణం, తులసి సుముఖంలో దర్భాసనంపై కూర్చుని చదివితే సత్ఫలి కలుగుతాయని పద్మపురాణంలో ఉత్తరకాండలో స్పష్టంగా చెప్పబడింది.

**పుష్పాణాం సారభూతాత్వ భవిష్యసి మనోరమే**

**కలాంసేన మహాభాగ స్వయం నారాయణ ప్రియా**

**ప్రియాత్వం సర్వదేవానాం కృష్ణస్య చ విశేషతః**

**పూజా విముక్తి దానృణాం మమత్యా జ్యాచ నర్యదా**

ఓ సౌందర్యరాశీ! తులసీ అన్ని పుష్పాలకెల్లా నీవే గొప్పదానివి. నీవు నారాయణుడి ప్రియురాలివేగాక, ఆయనలో సగభాగానివి. అందరు దేవతలు నిన్ను ఇష్టపడతారు. శ్రీకృష్ణుడు నిన్ను అధికముగా ప్రేమిస్తాడు.

నీ పూజ తప్పక మోక్షాన్ని ప్రసాదిస్తుంది. తులసిని వినాయకుని పూజలో మాత్రం వినియోగించకూడదని బ్రహ్మ వైవర్త పురాణంలో ప్రధమ పూజను అందుకునే విఘ్నేశ్వరుడే తెలిపాడు.

కాని భాద్రపద చవితినాడు మాత్రమే తులసీపత్రం గణపతి పూజలో వినియోగించవచ్చునట.

శ్రీకృష్ణుడు కూడా ఒకసారి తులసిని పూజించి, ప్రార్థించి ఆమెను శరణు కోరినట్లు దేవిభాగవతం చెప్తోంది. ఆ స్తోత్రం ఒకసారి గుర్తు చేసుకుందాం.

**"యస్యా దేవ్యా స్తులానాస్తి**
**విశ్వేషు నిఖిలేషు చ**
**తులసీ తేన విఖ్యా తితాం**
**యామి శరణం ప్రియా"**

*(ఆంధ్రభూమి, నవంబర్ 5, 2003)*

# మహాశివరాత్రి

మాఘ మాసంలో వచ్చే బహుళపక్ష చతుర్దశినాడు శివరాత్రి జరుపు కుంటాం. దుష్టశిక్షణార్థం ఒక సమయంలో ఆదిపరాశక్తి తన పూజాకాలమైన ఒక రాత్రిని శివునికిచ్చి తొమ్మిది పగటిపూజలు తాను తీసుకున్నదట. ఈ తొమ్మిది పగటి పూటలను దేవి నవరాత్రులు అంటారు. శివుడికి అమ్మవారు ఇచ్చిన రాత్రి శివరాత్రి. ఈశ్వరుని 'లింగావతార' సమయం, పగలంతా ఉపవాసం వుండి రాత్రివేళ లింగోద్భవ సమయంలో శివుని పూజించి అభిషేకం చేసి నైవేద్యం పెట్టి అప్పుడు ప్రసాదం తీసుకోవాలని, పెద్దలు తెలియపరచారు. ప్రతినెలా వచ్చే మాసశివరాత్రికన్నా సంవత్సరానికి ఒకసారి వచ్చే మహాశివరాత్రి పర్వదినంగా భావిస్తారు. భక్తులంతా ఈ రోజు 'నమఃశివాయ' అనే పంచాక్షరీ మంత్రాన్ని జపిస్తే అటు త్రిమూర్తులు, ఇటు పంచభూతాలను కూడా జపించినట్లే అవుతుంది.

'న'కారం బ్రహ్మనూ, భూమినీ సూచిస్తుంది. 'మ'కారం విష్ణుమూర్తి జలమును సూచిస్తుంది. 'శి'కారం రుద్రుని, అగ్నిని సూచిస్తుంది. 'వ'కారం మహేశ్వరుని, వాయువుని సూచిస్తుంది. 'య' సదాశివుడిని ఆకాశాన్ని సూచిస్తుంది.

శివరాత్రిరోజున శివాలయాలు దర్శించటం, జాగరణ చేయటం ముఖ్యం. బిల్వపత్రాలు, పంచామృత అభిషేకం, శివనామాలతో అష్టోత్తర శతనామ పూజ, రుద్రపఠనం పురాణ శ్రవణం, మన శక్తిమేరకు దానధర్మాలు చేయటం ముఖ్యం. కామక్రోదాధులకు, విషయవాంఛలకు దూరంగా వుండి భక్తి, విశ్వాసాలతో శివుని స్మరించాలి. దేవాలయ ధ్వజస్తంభంపై మూడువందల అరవై ఐదు వత్తులను ఆవు నేతితో తడిపి ఆకాశదీపం వెలిగించాలి.

మన స్థూలశరీరం దేనితో సురక్షితమవుతుందో మన మనోమయ శరీరం దేనివలన అనుకూల ఆహారం పొంది పుష్టి చేకూరుతుందో మన ప్రాణమయ శరీరం సత్వగుణ శక్తి ఉద్దీపింపబడుతుందో, మన విజ్ఞానమయ శరీరం ఏ పూజ, వైదిక కర్మలతో విశుద్ధ జ్ఞానమనే ఆహారాన్ని పొందుతుందో మన ఆనందమయ శరీరం సాత్త్విక ఆనందం పొందుతుందో ఇవన్నీ బాగా గుర్తించే ఏడాది పొడవునా విశేష పూజలు జరుపబడుతున్నాయి. ఏ మాసంలో, ఏ పక్షంలో ఏ తిథిలో ఏ సమయంలో పూజలు చేయాలో అది చేయడం వలన అజ్ఞానం అనేది ఎలా నశిస్తుందో అట్టి పూజలనే మన పూర్వులు ఆచరింపచేశారు. సత్యద్రష్టలైన ఋషులు విధించిన నియమాలు, తలొగ్గి కర్మలను ఆచరిస్తే ప్రతిఫలం అందరికీ కలుగుతుంది. మన దేశంలో జరిపే పూజ, వైదిక కర్మలు, అల్పజ్ఞులు నియమించినవి కావు. సర్వజ్ఞులు, సత్యదర్శులైన ఋషులు, జగత్కళ్యాణానికై విధింపబడ్డవి.

పరమేశ్వరుడు ఒక్కడే. అతనిని వేర్వేరు సమయాలలో వేర్వేరుగా పూజిస్తున్నాం. ఎందుకంటే జీవులు ఎప్పుడూ కూడా మార్పును ఇష్టపడతారు. మనం జీవులం. తెలిసో తెలియకో మార్పునే కోరుతాం. కాని మన ప్రాణ దేవత మాత్రం ఏకరూపుడే. మన ప్రీతికోసం అతడు వేర్వేరు సమయాలలో వేర్వేరు భావాలతో ప్రకాశిస్తుంటాడు. వివిధమైన పూజలన్నీ కూడా అధికభాగం శుక్లపక్షం, పూర్ణిమ, అష్టమి ఇలా సమీప తిథులలో చేస్తుంటాము.

కాని శివరాత్రి పూజ నిర్గుణ సంపత్తికి సంబంధించినది. సాధకుని మనస్సు 'శివరాత్రి' సమీపిస్తున్నప్పటి నుంచి శివుని వైపు, వేగంగా పరుగెత్తుతుంది. ప్రకృతి సహజంగా 'చతుర్దశి' నాటికి పధ్నాలుగు కళలు క్షీణించడం మూలంగా లౌకిక విషయవాంఛలు క్షీణిస్తాయి. మనస్సు నిర్మలంగా వుంటుంది. ధ్యానం

తాదాత్మ్యం చెందుతుంది. అర్ధరాత్రి లింగోద్భవకాలం. పరమాత్మతో జీవునకు తాదాత్మ్య సిద్ధి పొందడం ఎంతో మంగళం. అందుకే అది శివరాత్రి.

సామాన్యంగా రోజు తినే ఆహార పదార్థాలు విడచిబెట్టి చిరుతిండ్లతో పొట్ట నింపుకుంటూ లౌకికపనులన్నీ చక్కబెట్టుకుంటూ ఎలాగో సమయానుకూలం చేసుకుని శివాలయానికి వెళ్లి పూజ చేసి రాత్రి జాగరణ చేస్తారు. అలాకాకుండా సాధకుడు శివరాత్రినాడు శివసాన్నిధ్యం చేసుకుని కొంతసేపు శివమంత్ర జపంతో కొంతసేపు అభిషేకాలతో, శివపురాణ పఠనంతో, సంకీర్తనలతో గడుపుతూ దేహపోషణకోసం వస్తువుల గురించి ఆలోచించకుండా సమయానికి మితాహారం తీసుకొని తృప్తి చెందుతూ ఇంద్రియాలకు లొంగిపోకుండా నిష్టతో భగవధ్యానం చేస్తుంటే ఉపవాస ఫలం సార్ధకమవుతుంది. ప్రదోషకాలం లింగార్చనలో నిమగ్నుడై శివునితో తాదాత్మ్యం పెంచుకుంటూ సత్త్వగుణ వికాసం కలిగి తమో రూప నిద్రావస్థకు లొంగిపోకుండా, జ్ఞానానికి, విరోధి అయినటువంటి నిద్రని గెలిచి శివకరుణకు పాత్రుడై లింగోద్భవ భాగ్యం కలుగచేసుకొని ఆనందంగా వుండాలి.

అర్చకుడు ఆలయంలో దేవునకు పుష్ప, ధూప దీపాలు ఎలా సమర్పిస్తాడో అలాగే పూజా ద్రవ్యాలన్నిటినీ మన హృదయంలో స్థాపించుకుని కాలాన్ని వ్యర్థపుచ్చకుండా మానసికంగా పూజించాలి. శివుని చిన్మయరూపం మన ఎదుటవున్నట్లే ధ్యానించి పూజించాలి. అంతా శివమయం అని గుర్తుంచుకోవాలి.

*(ఆంధ్రభూమి ఫిబ్రవరి 15, 2007)*

# శివరాత్రి మహత్త్వం

మన భారతీయ సంస్కృతి, సంప్రదాయాలకు పండుగలు, వ్రతాలకు పట్టుకొమ్మలు. పండుగనాడు జరుపుకునే ఆచారాలు, నియమనిష్టలు, మానవ జీవితానికి అవసరమైన ఎన్నో అంశాలు ఇందులో ఇమిడి వున్నాయి. ఈ పండుగలు ఆచరించటం వలన ఆరోగ్యం బాగుపడటమే కాకుండా ధర్మాచరణయందు ఆసక్తి, ఆధ్యాత్మిక భావన, మోక్షసిద్ధి కలుగుతుంది.

వ్రతమంటే ఏమిటి? 'వ్రజంతి అనేన స్వర్గమే' ఏ పని చేస్తే స్వర్గానికి వెళ్తామో, అదే వ్రతము అని చెప్తారు. ఉపవాసము చేసేవారు తమ తమ దారిద్ర్యాన్ని పోగొట్టుకొని మనశ్శాంతిని పొందగలుగుతారు.

ప్రతి సంవత్సరం మాఘమాసంలో వచ్చే బహుళ చతుర్దశి అంటే అమావాస్యకు ముందురోజు శివరాత్రి పండుగ జరుపుకుంటాము. ప్రతినెలా అమావాస్య ముందు కృష్ణ చతుర్దశినాడు మాసశివరాత్రి అని కూడా అంటాము. కృష్ణ చతుర్దశి నాటి రాత్రి పరమేశ్వరుడు లింగాకార రూపంలో కోటి సూర్యకాంతులతో అవతరించాడట. అప్పటినుంచి శివుని, లింగాకార రూపంలో పూజించే ఆచారం వచ్చింది. అందుకే దీనిని మహాశివరాత్రి అని పిలుస్తారు.

ఒకప్పుడు ప్రపంచమంతటా నైతిక, ధార్మిక విలువలు పతనమై కుట్రలు, కుతంత్రాలు మోసాలు దౌర్జన్యము, దోపిడీ, హింసాప్రవృత్తి ప్రబలి మానవుడు దానవుడుగా మారి అజ్ఞాన అంధకారంలో మునిగి కృష్ణ కాళరాత్రి సమయంలో నిరాకార, జ్యోతి బిందు స్వరూపి, పతిత పావనుడు, కల్యాణకారి, జ్ఞాన సూర్యుడైన శివపరమాత్మ అవతరించి, సత్య గీతాజ్ఞానము, సహజ రాజయోగాలు బోధించి సర్వమానవులకు, జీవన్ముక్తిని ప్రసాదించాడు. సూర్యోదయం కాగానే చీకటి పటాపంచలైనట్లు, జ్ఞాన సూర్యుడైన పరమాత్మ అవతరించగానే అజ్ఞానం అనే

అంధకారం తొలగిపోతుంది. ‌ శక్తి పరమేశ్వరి ఆయనకు సన్నిహితురాలు. ఆమె లేనిదే జగత్కారణమైన స్పందనలు పుట్టేవి కావు.

కామేశ్వరీ కామేశ్వరులు, భైరవీ భైరవులు, శివాశివులు శంకరీ శంకరులు, పార్వతీ పరమేశ్వరులు ఇలా ఒక్క పేరుతో మనం సంబోధిస్తాం. ఈశ్వరుడు నిర్గుణుడు, భూత, భవిష్యత్, వర్తమాన కాలానికి అతీతుడు. సచ్చిదానంద స్వరూపుడు. వేదవాక్యములు కూడా ఆయనని నిర్వచించలేక పోయాయి. శివుడు లోక కళ్యాణ కారకుడు, శుభకరుడు మంగళకరుడు, శివునాజ్ఞ లేనిదే చీమైనా కుట్టదు అనే సామెతను మనం వినేవున్నాం.

శివుడు లయకర్త. శివోపాసన వల్ల మనలో వున్న చెడువాసనలు లయమైపోతాయి. పరమ శివుడిని ఉపాసిస్తే వైరాగ్య భావం ఏర్పడుతుంది. శివారాధన వలన జ్ఞానవైరాగ్యాలు అభివృద్ధి పొందుతాయి. అగ్నికి ఎలాగైతే సర్వం తన స్వరూపం చేసుకునే శక్తి వుందో అలాగే శివుడు లయకర్త కాబట్టి తన యందు ప్రీతి వున్న సర్వులను, తన స్వరూపం చేసుకుంటాడు.

అజ్ఞానులకు ఏమీ తెలియకపోవడమే కాకుండా తెలుసుకోవాలనే కుతూహలం కూడా వుండదు. భోగ విలాసాలతో, సుఖదుఃఖాలతో బాధపడుతూ వుంటారు. శివకేశవుల భేదం లేనివారు, శివ తత్త్వం గురించి బాగా తెలిసినవారిని, జ్ఞానులు అంటారు. హరిహరాదులు కలిసే ఆపద మొక్కులవాడుగా మారాడు.

ఈ సంగమ యుగంలో పరమాత్మ అనాది. ప్రతి శివరాత్రి కూడా అనాదియే. పరమాత్మ సర్వ మానవులకు కళ్యాణ కారకుడు కాబట్టి పరమాత్ముని నామము శివరూపమే. సర్వగుణ సాగరుడు, అశరీర జననమరణ రహితుడు, త్రిలోకనాథుడు, త్రికాలదర్శి, సృష్టి స్థితి లయాలు పరమాత్ముని కర్తవ్యము.

శివరాత్రి మాఘమాసంలో వస్తుంది. అన్ని మాసాలకంటే మాఘమాసం మహోన్నతమైనది. ఈ నెలలో వచ్చే పండుగ దినాలే కాకుండా మిగతా రోజులు

కూడా ఉత్తమగతులు సమకూర్చే పుణ్యదినాలు. వేకువ ఝామునే నదీ స్నానం చేస్తే పుణ్య ఫలితాలు పొంది తరిస్తారు. నదీస్నానం అవకాశం లేనివారు నూతి నీటిని తోడుకొని సూర్యుని ఆవాహన చేసి తర్వాత స్నానం చేయాలి.

సూర్యస్తోత్రం, శివ, ఇంద్ర, దుర్గా సంకీర్తన మననం చేస్తుండాలి. ఒంటిపూట భోజనం చేస్తే మంచిది. మాఘశుద్ధ ఏకాదశి చాల విశేషమైనరోజు, మనకు వచ్చే 24 ఏకాదశులలో మాఘ ఏకాదశి, భీష్మ ఏకాదశి అని కూడా అంటారు. ఈ మాఘంలో చాలామంది భక్తులు శివదీక్షను పొందుతారు. దృఢసంకల్పం గలవారుగా వుండటం, సంధ్యా వందనం, పితృ కార్యాలలో శ్రద్ధ కలిగియుండుట, ఇంట్లోనే దైవ మంటపం ఏర్పరచుకుని పూజ చేయడం, ఉపవాసాలు పారాయణాలు భగవత్ సంకీర్తన చేస్తుండాలి. మాఘశుద్ధ ఏకాదశి పంచ పాండవులలో భీముడు శ్రద్ధగా చేయడంవల్ల భీమ ఏకాదశి అని పేరు వచ్చింది.

శివునికి బిల్వాలతో అర్చన చేయడం, అభిషేకం చేయడం, ఉపవాసం జాగరణ ఇవి ఎంతో ముఖ్యం. ప్రాపంచిక విషయాల నుంచి బుద్ధిని మళ్ళించి ఆత్మను శివుని సన్నిధిలో వుంచటమే ఉపవాసము.

శ్రీనాథుడు 'శివరాత్రి మహత్మ్యం' అనే కావ్యాన్ని వ్రాశాడు. శైవ మఠాధిపతి ముమ్మయ్యకు అంకితమిచ్చాడు. ఎంతటి పాపాత్ముడైనా శివరాత్రినాడు శివుడిని ధ్యానిస్తే పాపరహితుడై మోక్షాన్ని పొందుతాడని ఈ కావ్యసందేశం.

హరవిలాసం, భీమఖండం, కాశీఖండం ఈ మూడు కావ్యాలలో శ్రీనాథుని శివభక్తి ప్రదర్శితమైంది. బ్రహ్మ, విష్ణు ఎవరికివారు తామే ఘనులమని గర్వించి పరస్పరం బ్రహ్మాస్త్రం, నారాయణాస్త్రం ఉపయోగించు కుంటారు. ఆ సమయంలోనే ఆత్మలింగం ఆవిర్భవించింది. పాతాళ లోకాలనుంచి చొచ్చుకొని వచ్చి భూలోకాన్ని భువర్లోకాన్ని దాటి బ్రహ్మాండ భాండాన్ని పగులగొట్టి విజృంభించిన జ్వాలాలింగ స్వరూపమే అనన్యంగా వర్ణించబడింది.

శివరాత్రినాడు కొంతమంది మౌనవ్రతం పాటిస్తారు. దానిద్వారా కొంత శక్తి మనకు కలుగుతుంది. అభిషేకం తర్వాత పురాణ కథ - సత్సంగము, శ్రవణము, జాగరణ చేయాలి అనే విషయం మనందరికీ తెలుసు. జాగరణ తర్వాత మరుసటి ఉదయమే శుచిగా స్నానం చేసి అభిషేకం చేసి మన శక్తి కొద్దీ దానధర్మాలు చేస్తే మంచిది. ఆ ఒక్కరోజు చేసినా వేయి జన్మలలో చేసిన పాప ఫలాలు మాయమవుతాయి.

శ్రీశైలం, భీమేశ్వరం, కాళహస్తి, కోటప్పకొండ, మహానంది ఇంకా ఎన్నో క్షేత్రాలలో శివరాత్రి పూజలు జరుగుతాయి. దూర్జటి తన కాళహస్తి శతకంలో శ్రీరామునితో పూజింపబడినవాడా, నీ స్వరూపం మొదలు చివర తెలియనివాడను. నీవు కూడా దయతో నన్ను దగ్గరికి రమ్మని పిలువవు. ఇక అనవసర ప్రయత్నమెందుకు? నిన్నే నమ్ముకున్నాను, నన్ను నీటముంచినా పాలముంచినా నీదే భారం సుమా!

**శివ శివేతి శివేతివా**

**భవ భవేతి, భవేతివా**

**హర హరేతి హరేతివా**

**భజ నమశ్శివమేవ నిరంతరమ్ ॥**

*(ఆంధ్రభూమి మార్చి 2, 2005)*

# ఎ(గ్రితాత

అనంతపురం జిల్లా బళ్లారి మార్గంలో 'చేళ్లగుర్కి' చిన్న గ్రామం. అక్కడ వెలసిన చిన్న సమాధి ఎ(గ్రితాత సమాధి. ఎ(గ్రిస్వామి ముందు పేరు నంజుండయ్య. ఇతను తెలంగాణ నుంచి విద్యకోసం మైసూరు వెళ్లి అక్కడ డిప్యూటీ కమీషనర్‌గా పనిచేసి జీవితంపై విరక్తి పుట్టి భార్యబిడ్డలను విడిచిపెట్టి అవధూతలైనారు. 1920లో కరువు ఎక్కువగా వుండేది. ప్రజలను విచారించడానికి అనంతపురం, రాయదుర్గం, బళ్లారి వెళ్లిన అధికారికి చేళ్లగురికి వెళ్లి ఎ(గ్రితాతను చూడాలనిపించింది. ఎప్పుడూ ఒకమాట కూడా పలకని ఎ(గ్రితాత ఆ అధికారిని చూసి, ఆంగ్లభాషలో సంభాషించారు. ప్రజలకు ఆశ్చర్యం కలిగింది. ఆ అధికారి, ఎ(గ్రితాత ఒకే గురువు వద్ద విద్య అభ్యసించారని, ఇద్దరూ అన్యోన్యంగా మాట్లాడుకోవడం వల్ల అక్కడివారికా విషయం తెలిసింది. ఎ(గ్రితాత ఎప్పుడూ బావిలో, చెరువులో మునిగి ఈదుకుంటూ గట్టుకు వచ్చేవాడు. అల్లరి పిల్లలు ఇతనిని ఆటపట్టించేవారు. ఆ ఊరిలో ఒక భక్తురాలు బీజమ్మ అలా స్వామి భక్తురాలై ఎ(గ్రితాతతను సేవించి తరించింది. ఆమెకు ధనధాన్యాలు సమృద్ధిగా లభించాయి. ఒకసారి గాలివాన, తుఫాను ఎక్కడా తలదాచుకోటానికి స్థలం లేదు. తాత కదలలేదు. గ్రామస్థులు అతను నీటిలో కొట్టుకు పోయాడనుకున్నారు. తాత సమాధి నిష్టలో వున్నాడు. నీరు అతనికి ప్రదక్షిణంగా ప్రవహించింది. ఏది దొరికితే అది భుజించేవాడు. ఎ(గ్రితాత గురువు గగనాచార్యులు దగ్గర ఉపదేశం పొందాడు. అతను ఎ(గ్రితాతకు 'నిరంజనుడు' అని పేరుపెట్టాడు. గురువు గ్రామాంతరం వెళ్లినప్పుడు నిరంజనుడు గురువు రాసిన గ్రంథానికి శుద్ధ ప్రతిని రాసేవాడు. ఒకసారి నిరంజనుడు మైసూరు వెళ్లాడు. గురువు శివసాయుజ్యం పొందే సమయం. అయ్యో! నా ప్రియశిష్యుడు నా దగ్గర లేడే

అని 'నిరంజనా నిరంజనా' అని కలవరిస్తాడు. మైసూరులో వున్న నిరంజనునికి ఆ పిలుపు వినిపిస్తుంది. నిరంజనుడు మీ ఎదుటే వున్నాడు అని గురువు ఎదుట నిలబడ్డాడు. శిష్యుడ్ని చూడగానే శివా, శివా అంటూ కళ్లు మూసాడు.

ఒకసారి పెద్ద లక్ష్మమ్మ అనే భక్తురాలికి ఐశ్వర్యం అనుగ్రహించాడు. అతడు ఒక పుట్టవద్దకు వెళ్లి గొంగళిపరచి కళ్లు మూసుకోమని అన్నాడు. ఆమె కళ్లు మూసుకోగానే ఎర్రితాత పుట్టలో చెయ్యిపెట్టి పాములని తీసు గొంగళిమీద వేసి మూటకట్టాడు. కొంతసేపు పూజచేసి మూట విప్పమన్నాడు, గొంగళి మూట విప్పగానే పాములు, బంగారు కడ్డీలుగా మారాయి.

ఎర్రితాత మల్లప్ప గట్టువద్ద నిలిచాడు. ఊరిబయట గుడిసెలో కొన్ని రోజులు వేపచెట్టు నీడలో కొద్దిరోజులు వున్నాడు. కొందరు అతనిని తమ కోరికలు నెరవేరడం కోసం పూజించేవారు. తిక్కయ్య అనే శిష్యుడు విశాల ప్రదేశంలో మఠం కట్టించాడు. తాత ఆ మఠంలోనే వుండేవాడు. అన్ని మతాలవారు ఆయనను సేవించేవారు. 30-5-1922 శరీరం త్యజించి ఎర్రితాత జీవసమాధి పొందారు. భక్తులకు పూజించేటపుడు స్వప్నంలో దర్శనమిస్తాడు. వీరి ఉపదేశం దక్షిణామూర్తి మౌన వ్యాఖ్యానం. ఆయనకు ఎవరైనా బట్టలు కడితే కట్టించుకుంటాడు. లేకపోతే దిగంబరం. గుంతకల్ సమీపంలో వుండే ఈ ఎర్రితాత సమాధిని దర్శించడానికి భక్తులు వెళుతుంటారు.

*(ఆంధ్రభూమి జులై, 2007)*

# శివదీక్ష

సాధారణంగా కార్తీకమాసంలో శివదీక్ష పొందుతారు. 'శివుడు' అమంగళాలను సంహరించేవాడు అని అర్థం. మామూలుగా సృష్టి స్థితి లయ వీటిలో శివుడు లయించేవాడనే అనుకుంటాం. నిజానికి పాపాలను, అమంగళాలను సంహరించడం వల్లనే విష్ణువుకీ, బ్రహ్మకు కూడా పూజనీయు డయ్యాడు. దేవతలలోని శక్తినంతా తనలో సంపూర్ణంగా లీనం చేసుకొని అర్ధనారీశ్వరుడి రూపంలో మనకు దర్శనమిచ్చేది ఒక్క శివుడు మాత్రమే. అందువల్లనే శివుడిని పూజిస్తే శక్తిని పూజించినట్లే.

దేవతలలో దయకు, పరాకాష్ట శివుడు మాత్రమే. అందుకనే ఆయనను భోళాశంకరుడు అని కూడా అంటారు. భక్తులకు వెనకముందు చూడకుండా వరాలిచ్చేయటం ఆయన స్వభావం. దీని వలన ఆయన ఎన్నో సార్లు చిక్కుల్లో పడటం, మనం పురాణాలద్వారా వినేవున్నాం.

శివుని ఆకారం సమస్తమైన తత్త్వాల్ని మనకు గుర్తు చేస్తుంటుంది. ఆయన శిరస్సులో గంగను భరించాడు గనుక ఆయనలో 'జలతత్త్వం' కనిపిస్తుంది. ఆయన త్రినేత్రుడు. మూడవ కన్ను 'అగ్నినేత్రం' గనుక 'అగ్నితత్త్వం' కనిపిస్తుంది. ఆయన 'నాగాభరణుడు' గనుక వాయుతత్త్వం మనకు కనిపిస్తుంది. అంతేకాకుండా ఆయన యోగానికి మూల పురుషుడు. కనుక ఆయనలో 'భూమితత్త్వం' కనిపిస్తుంది. అన్నిరకాల విశేషాలు ఆయనలో వున్నాయి. గనుకనే శివారాధనలో సమస్త దేవతారాధనను మనం దర్శించగలం. అంటే ఏ దేవుని పూజించే భక్తులైనా, శివుని తప్పక ఆరాధించవచ్చు, శివపూజకు ఏ భేదభావము లేదు.

సంపూర్ణమైన భక్తి, సమర్పణ, స్థిరమైనటువంటి నిశ్చయ భావం, శాస్త్రీయమైన నియమాలు జోడించి, అర్చిస్తేనే ఆ ఆరాధన ఫలవంతం అవుతుంది.

శివుని ఆరాధన చేయటానికి, చాలా రకాలైన వ్రతాలు మనం వింటూ వుంటాం. సోమవార పూజ, మాసశివరాత్రి ఇలా ఎన్నో అయినా శివదీక్ష శివునికి ఎంతో ప్రీతి కలిగించేది. శివుడి గణాలలో నందీశ్వరుడికి గల స్థానం ఎంతో విశిష్టమైనది. మనం ఏ శివాలయానికి వెళ్లినా నందీశ్వరుడు ముందు దర్శనమిస్తాడు. నందీశ్వరుడికి అంత భాగ్యం ఎలా కలిగింది అంటే 'శివదీక్ష' వలననే కలిగినది.

నందీశ్వరుడి తండ్రి పేరు శిలాదుడు. ఆయన గొప్ప శివభక్తుడు. మంచి సంతానం కలగాలని, శివదీక్ష వహిస్తాడు. దాని పలితంగా నందీశ్వరుడు జన్మిస్తాడు. బాల్యం నుంచి నందీశ్వరుడు గొప్ప సద్గుణాలతో పెరుగుతూ వచ్చాడు. ఒకనాడు నారదుడు వచ్చి బాలుడు 'అల్పాయుష్కుడు' అని తెలిపి వెళ్లిపోతాడు. ఆ మాటలు విన్న నందీశ్వరుడు తన తండ్రి నుంచి శివదీక్షను తాను స్వీకరించి సంపూర్ణమైన భక్తి శ్రద్ధలతో శివారాధన చేస్తాడు. అతని శివదీక్షా బలానికి ఎంతో సంతోషపడి, శివుడు ప్రత్యక్షమై 'ఏంకావాలి అని?' ప్రశ్నిస్తాడు.

శివదీక్షలో వున్న నందీశ్వరుడి మేధస్సు అమోఘంగా పెరుగుతుంది. నాకు ఆయుష్షుపెంచు అని శివుని అడగలేదు. 'దేవా! నేను ఎప్పుడూ నిన్ను చూస్తూ, నిన్నే సేవిస్తూ వుండాలి. ఆ వరం నాకివ్వవలసిందని' భక్తిశ్రద్ధలతో కోరుతాడు.

నందీశ్వరుడు ఎప్పుడూ శివుని ఎదుటనే వుండాలి అంటే జీవించి వుండాలి కాబట్టి ఎంతకాలం జీవించి వుండాలి? శివుడు వున్నంత కాలం జీవించి వుండాలి అలా శివదీక్ష బలం వల్ల నందీశ్వరుడు చిరంజీవి అయ్యాడు. ఆనాటి నుంచి శివదీక్ష అనుష్టానం, సంప్రదాయబద్ధంగా వస్తూవుంది.

శివుడు సంహరించే దేవతకదా! రక్షణ అనేది ఎలా లభిస్తుంది? కొంతమందికి సందేహం కలుగవచ్చు. అలా అనుకోవడం చాలా పొరపాటు!

సముద్రం మధించినపుడు దేవతల ఎదురుగా హాలాహలం పుట్టింది. అయితే ఆ విషాన్ని బ్రహ్మగాని, విష్ణువుగాని ఆపలేకపోయారు. ఆ విషం వలన ముల్లోకాలు దహించుకుని పోతున్నాయి. ఆ సమయంలో ఈశ్వరుడొక్కడే ముందుకు వచ్చి ఆ భయంకర కాలకూట విషాన్ని స్వయంగా సేవించి ముల్లోకాలను రక్షిస్తాడు. దీనిని బట్టి ముల్లోకాలలో అందరినీ రక్షించే శక్తి ఒక్క శివుడికే వుందని మనకర్థమౌవుతుంది.

శివుడిని ఆశ్రయించే మార్కండేయుడు దీర్ఘాయువును పొందగలిగాడు. తనను ఆరాధించే కుబేరునికి అష్టైశ్వర్యాలను ఇవ్వడమేకాకుండా అతనికి రక్షకుడిగా, అతని దగ్గరే వుండిపోయాడు. అందుకనే శివదీక్ష వహించేవారంతా ఏది కోరినా వారి కోరిక సఫలమవుతుంది.

ఈ శివదీక్ష అమూల్యమైన క్రమశిక్షణ కలిగిస్తుంది, సహనాన్ని పెంపొందిస్తుంది. ఏకాగ్రత, హృదయంలో నిర్మలత్వం కలిగిస్తుంది. ఆరోగ్య సమస్యలు వుంటే అవి కూడా నివారణ అవుతాయి.

**'ఓం త్ర్యంబకం యజామహే**

**సుగంధిం పుష్టివర్ధనమ్**

**ఉర్వారుక మివ బంధనాత్**

**మృత్యోర్ముక్షీయ మామృతాత్"**

గాయత్రీ జపం మాదిరి ఇది కూడా విశేష ఫలాన్ని అందిస్తుంది. మృత్యు భయాన్నుంచి, రక్షించే ఏకైక మంత్రం మృత్యుంజయ మంత్రం. దీనిని పఠించడం వల్ల నూతన తేజస్సు, బలం మనకు కలుగుతుంది.

దీని భావం మనం తెలుసుకోవలసి వుంది. ఓయి త్రినేత్రుడా! శంకర భగవాన్ మేము మీ ఉపాసన చేస్తున్నాము. మీ ప్రార్దన వలన మాకు సుఖము

శాంతి లభిస్తుంది. అంతేకాకుండా శారీకరకంగా, మానసికంగా పుష్టిని అందిస్తుంది. మీ ప్రార్థనవల్ల అన్ని రకాల రోగాలనుంచి, దుఃఖాలనుంచి, వృద్ధాప్య కష్టాలనుంచి మమ్మల్ని విముక్తి చేస్తుంది. యే భగవాన్! దోసతీగనుంచి పండు ఎలాగైతే వేరవుతుందో అలా మమ్మల్ని మృత్యువు నుంచి వేరుచేసి మోక్షాన్నివ్వండి.

ఈ మంత్రం సాధన చేసేవారికి, సకలార్థాలనూ సాధించి పెడుతుంది. సత్ప్రవర్తన అలవరచుకొని, ఆర్తితో, చిత్తశుద్ధితో సంపూర్ణ విశ్వాసంతో, భక్తి శ్రద్ధలతో చేయాలి.

సాధనమున పనులు సమకూరు అన్నట్లుగా, భక్తికి, నిష్ఠకు, జాతి, విద్య, రూప, కుల, మత, ధన బేధాలు లేవు అని నారద సూత్రాలలో చెప్పబడింది. కనుక భక్తి, శ్రద్ధలు అనేవి ముఖ్యం.

*(ఆంధ్రభూమి నవంబర్29, 2004)*

# శ్రవణ మహిమ

భగవంతుని కథాగానం ఎక్కడ జరుగుతుందో, భక్తులందరూ ఎక్కడ గుంపుగా ఆసీనులై వుంటారో, అక్కడ గంగ, యమున, గోదావరి, సరస్వతీ నదులు, సరోవరాలు వెలుస్తాయి. హరికథా ప్రసంగం ఎక్కడ జరుగుతుందో అక్కడ యేరకమైన క్లేశాలు, యక్ష పిశాచపీడలు జన్మాంతర బాధలు వుండవు.

భాగవతంలో ప్రారంభంలో నారద మహర్షి ఏమంటున్నాడంటే – వ్యక్తి జపతపాలు, యజ్ఞదానాలు స్వాధ్యాయము, యోగము అన్ని పరమార్థాలు, పరమాత్మ గుణగానమే. భగవత్ కథాశ్రవణ భాగ్యం పుణ్య జీవులకు మాత్రమే లభిస్తుంది. దీనికి ఉదాహరణగా ఒక కథ –

గంగానదికి రెండు క్రోసుల దూరంలో సత్యవ్రతము అనే గ్రామముండేది. అక్కడ 'బృహత్తపుడ'నే తపస్వి నివాసముండేవాడు. అక్కడే దీర్ఘతముడనే పుట్టు గ్రుడ్డివాడు, మహర్షికి నూరు సంవత్సరముల వరకు భగవత్ కథలు వినిపించేవాడు. అదే గ్రామంలో పుణ్యధాముడనే బ్రాహ్మణుడు వుండేవాడు. ఇతడు కూడా భక్తుడు. బృహత్తపుడు వినిపించే సమయానికి పుణ్యధాముడు కూడా వినేందుకు వెళ్లేవాడు. క్రమం తప్పకుండా హరిలీలలను వినేందుకు వచ్చి పుణ్యధాముడు తన గ్రామానికి సమీపంగా రెండు క్రోసుల దూరంలో వున్న గంగానదీ దర్శనానికి ఒక్కరోజు కూడా వెళ్లలేదు. భగవత్ కథలు వినేచోటనే అన్ని తీర్థాలు వున్నాయని భక్తుని విశ్వాసం.

అన్ని కార్యకలాపాలు తగ్గించుకుని, రామచరిత గానం వేద పురాణం, ఉపనిషత్తులు, వివరంగా అర్థం చేసుకోవడానికి, క్రమం తప్పకుండా వెళ్లేవాడు. త్రిసంధ్య గాయత్రి జపం, రాత్రి పూట యాత్రికుల సేవకు కొంత సమయం కేటాయించేవాడు. ఒకసారి పుణ్యధాముడు హరికథ విని, ఇంటికి వచ్చేటప్పటికి

జ్ఞానసింధు అనే వృద్ధ తీర్థయాత్రికుడు, గంగాతీర్థ స్నానానికి వెళ్తూ పుణ్యధాముని ఇంట అతిథిగా వచ్చాడు. వారిని చూడగానే పుణ్యధాముడు భక్తితో నమస్కరించి, భోజనం పెట్టి పాదసేవనం చేశాడు.

ప్రసంగం మధ్యలో గంగాతీర్థం ఇంకా ఎంత దూరం వుంది అని ప్రశ్నించాడు జ్ఞానసింధువు. పుణ్యధాముడు సవినయంగా "స్వామీ 80 సం॥ల నుంచీ భగవత్ కథా శ్రవణంలో మునిగిన నేను, ఎప్పుడూ గంగా స్నానం గురించి ఆలోచించలేదు. చాలామంది చెప్పగా విన్నాను. ఇక్కడికి ఉత్తరంగా రెండు క్రోసుల దూరంలో వుందిట అనగానే యాత్రికుడు దిగ్గున లేచి, సర్వపాపహారిణి, సకల పుణ్యదాయిని అయిన గంగమ్మ తల్లిని ఇంత దగ్గరవున్నా అటువైపు తిరిగైనా చూడలేదా! మాతృ సమానురాలైన ఆ మహా తల్లిని చూడనందుకు క్షమించమని అడగాల్సిందిపోయి తనకసలు ఆలోచనే లేదంటారేమిటి? ఈరోజు వీరింటికి రావడం నాదే తప్పు అనుకుంటూ ఆ క్షణమే ప్రయాణం కట్టాడు. ప్రాతఃకాలానికి గంగాతీరం చేరుకున్నాడు. దూరంనుంచే శతకోటి వందనాలు చేస్తూ సమీపించాడు. మహాదేవుని శిరస్సును అలంకరించిన ఓ దేవీ! నిన్నేనాడు స్మరించని ఒక పాపి ఇంట ఆతిథ్యం పొందిన నన్ను క్షమించవమ్మా, నన్ను పవిత్రుడిని చేయమని వేడుకుంటున్నా!' అంటూ స్నానం చేయటానికి నదిలో ప్రవేశించాడు. కాని ఎంతసేపటికీ కొంచెం జలంకూడా అతనికి కనిపించలేదు. అతను ఆర్ద్రహృదయంతో దయామయి, భగవతి అని గంగను స్తోత్రించడం మొదలుపెట్టాడు.

ఆఖరికి ఆ తల్లి నిజరూపంలో ప్రత్యక్షమై, గంభీర కంఠంతో ఇలా అంది. 'ఓరీ! మూర్ఖుడా! మహా భక్తుడు పుణ్యధాముని నిందించావు. అతను ఎన్నో సంవత్సరాల నుంచి క్రమం తప్పకుండా విష్ణుకథలు భక్తితో వింటున్నాడు. ఆ భక్తుని దర్శనంకోసం నేనే క్షణక్షణం ఎదురుచూస్తున్నాను. అతని ఆతిథ్యం పొంది నీవు, అతనిని నిందించటమేమిటి? విష్ణు కథ శ్రవణము చాలా

శ్రేష్టమైనది. దానిని నిర్యక్ష్యం చేయడం మహాపాపం. ఆయన గొప్పదనం భక్తి తత్పరత నేనెంతని వివరించేది. అతనిని నిందిస్తే నీ పాపం జన్మజన్మాల వరకూ పోదు. విష్ణు భక్తులను ఎప్పటికీ నిందించకూడదు. భగవంతుడు తన భక్తులను అవమానపరిస్తే క్షమించడు. భక్తావమానం క్షమతే నైవక్వాపికథంచన" వెంటనే ఆ భక్తున వద్దకు వెళ్లి క్షమాభిక్ష పొందండి. కలలోనైనా తన భక్తుని మరచిపోని భగవంతుడు వారిని అవమానిస్తే క్షమించడు. వెంటనే వెళ్లి వారిని క్షమించమని కోరు, అప్పటివరకూ నీ కంటికి నేను కనిపించను' అన్నది గంగ.

గంగ పలుకులు విన్న జ్ఞానసింధువుకు జ్ఞానోదయమైంది. వెంటనే గ్రామానికి వెళ్లి, పుణ్యధాముని కాళ్లపైబడ్డాడు. ఆయన వారించి, తన గురువు వద్దకు తీసుకుని వెళ్లాడు. మరికొన్న సంవత్సరాలు హ రికథా శ్రవణం చేసి, దోష నివారణ చేసుకున్నాడు. అందరూ కలిసి గంగా దర్శనానికి వెళ్లారు. అక్కడికి వెళ్లగానే స్వయంగా గంగాదేవే వచ్చి బృహత్తప్తుడిని, పుణ్యదాముడిని ఆదరించి దీవించింది. వారంతా కూడా హరికథ శ్రవణం మహాత్మ్యం గురించి తెలుసుకున్నారు. అప్పుడు గంగ మళ్లీ నదీ రూపంలో ప్రవహించింది. తమజన్మ ధన్యమైందని, సంతోషపడి వారందరూ ఆ తల్లికి భక్తితో ప్రణమిల్లారు. శ్రవణం ఎంత గొప్పదో యాత్రికుడు అనుభవ పూర్వకంగా తెలుసుకున్నాడు.

*(ఆంధ్రభూమి మే 10, 2006)*

# నందనార్

భగవంతుడిని మనసారా స్మరించడానికి మోక్షం పొందటానికి, కులం, మతం చేసే వృత్తితో పనిలేదు. రూపంతో కూడా సంబంధం లేదు. పరమాత్ముని ఎదుట అందరూ సమానులే.

అదొక పల్లెటూరు. పేరు అదనూర్. తమిళనాడు ఆర్కాట్ జిల్లా కొళ్లిడి నదీ తీరంలో వుంది. అక్కడ హరిజనవాడలో నిరుపేద కుటుంబలో 660-840 మధ్య కాలంలో నందనార్ జన్మించాడు. గత జన్మ సుకృతం వల్ల నందనార్‌కు శివభక్తి ఏర్పడింది. అతడు తోటి పిల్లలతో ఆడేవాడు కాదు. బంకమట్టితో దేవతా విగ్రహాలు చేసి తనకు తోచినట్లు అలంకరించేవాడు. ఆ బొమ్మల చుట్టూ ప్రదక్షిణం చేసి ఊరేగింపు జరుపుతూ వుండేవాడు.

గ్రామంలో బ్రాహ్మణ వీధిలో శివాలయగోపురం నందనార్‌ను ఆకర్షించింది. హరిజనుడు అయినందున ఆలయంలోకి ప్రవేశం కలగలేదు. కాని ఎంతో ఆశతో గోపురాన్ని తిలకిస్తూ, లోపల స్వామి ఎలా వుంటాడో ఊహించుకునేవాడు. ఉత్సవ సమయంలో స్వామి ఊరేగింపు చూసి పరవశించేవాడు. వయసు గడిచేకొద్దీ నందనార్‌కు శివభక్తి పెరిగింది. తను నివసించే కుటీరాన్ని అతి శుభ్రంగా వుంచుకునేవాడు. మూడు పూటలా స్నానం చేసి, విభూతి ధరించి, లింగానికి కూడా విభూతిని అలంకరిస్తూ, శివనామ సంకీర్తనతో కాలం ఎలా గడిచేదో తెలిసేది కాదు. తన కులవృత్తి చెప్పులు కుట్టడం, తోలు వాయిద్యాలు తయారు చేయడం, తనకున్న కొద్ది భూమిలో వ్యవసాయ పనులు కూడా చూసుకునేవాడు. అదే దారిలో వున్న నదిలో రోజూ స్నానం చేసేవాడు. ఒకరోజు పొలం పనిలేనందున దగ్గరలో వుండే శివక్షేత్రం చూడటానికి వెళ్లాడు. అక్కడ నదీస్నానం చేసి విభూతి ధరించి, గోపురం చూస్తూ ఆలయం చుట్టూ ప్రదక్షిణలు చేశాడు. శివుని మనసులో ధ్యానిస్తూ ధ్వజస్తంభం ఆవల నిలుచున్నాడు. పూజారి ఆలయం తెరువగానే శివలింగం

నందనార్‌కు కనిపించలేదు. నంది అడ్డుగా వున్నందున పరమేశ్వరుని దర్శనం కలగలేదని శివుని ప్రార్థిస్తాడు. అలాగే నందిని కూడా స్తుతిస్తాడు. సదాశివునికి తన భక్తునిపై జాలి కలుగుతుంది. నందితో తన భక్తునికి అడ్డు తొలగమని ఆజ్ఞాపిస్తాడు. శివుని ఆజ్ఞమేరకు నంది ప్రక్కకు జరుగుతాడు. ఈనాటికి తిరుపునూర్ శివాలయంలో నంది ఎదురుగా లేకుండా ప్రక్కగా వుంటుంది. అద్భుతమైన ఈ సంఘటన వలన ఆలయానికి ఎంతో విశిష్టత కల్గుతుంది. శివలింగాన్ని తృప్తిగా దర్శించినందువల్ల నందనార్ పరమానందంతో గంతులు వేస్తాడు. దేవాలయం వెనుక భాగాన ఒక పల్లపు ప్రదేశం కనిపిస్తుంది. అక్కడ ఒక తటాకం నిర్మించాలని నందనార్‌కి కోరిక కల్గుతుంది. ఆలయ ధర్మకర్తను వినయంతో కోరతాడు. వారి అనుమతిపై తాను ఒక్కడే పలుగు, పార తెచ్చుకుని మట్టిని ఎత్తిపోసి చుట్టు గట్టు కడ్తాడు. నీరు సమృద్ధిగా ఊరుతుంది. ఇప్పటికీ అక్కడ నందనార్ పేరిట కోనేరులో అందరూ స్నానం చేస్తారు. శివభక్తులందరినీ నందనార్ పరిచయం చేసుకుంటాడు. అనేక శివాలయాలను దర్శిస్తాడు. అన్ని ఆలయాలలో కూడా గోపురం చూసి తృప్తిపొందేవాడు. ఒకప్పుడు చిదంబరం క్షేత్రం చూడాల్సని, నందనార్‌కు కోర్కె కలుగుతుంది. భక్తుల ద్వారా క్షేత్ర మహిమ తెలుసుకుని, నటరాజస్వామిని, గోవిందుని కళ్లారా చూసి తరించాలని బయలుదేరతాడు. తాను పనిచేస్తున్న యజమానితో చిదంబరం వెళ్లటానికి అనుమతి అడిగాడు. భూస్వామి అంగీకరించలేదు. ఎలాగైనా వెళ్లి త్వరలో వస్తానని వేడుకుంటాడు. పంటకోత పూర్తి చేసుకుని వెళ్ళమని షరతు పెడతాడు.

సంతోషంతో పరుగున వెళ్లి పొలంలో పని పూర్తిచేసుకుని అదే పరుగుతో తిరిగి వస్తాడు. నందనార్ భూస్వామి ఆశ్చర్యపడి పొలం చూడటానికి వెళ్తాడు. ఆశ్చర్యం, ధాన్యం కుప్పలుగా పోసివుండటం, కొన్ని వందల ఎకరాల కోత పని కొద్దిసేపట్లో ముగించి కుప్పలు పెట్టివుండటం చూసి ఇది కలకాదుకదా అని సందేహిస్తూ అంతటి శివభక్తుని తాను అనుమానించినందుకు కుమిలిపోతాడు. నందా! నీ వొక్కడివే ఇంత పని ఎలా చేయగలిగావు? సదాశివుడే దగ్గరుండి నీకు సహాయపడ్డాడు నీవు దైవ అనుగ్రహాన్ని పొందావు. నన్ను నీ దాసునిగా

చేసుకో. ఈ పంట, భూమి అంతా నీకే స్వంతం, నన్ను మన్నించు అంటాడు. అపరిమిత సంతోషంతో నందనార్ కాలినడకతో చిదంబరానికి ప్రయాణమవుతాడు. నదీతీరానికి వస్తాడు. పడవ నడిపేవాడు నటరాజస్వామి మాదిరే కన్పిస్తాడు నందనార్‌కు. ఆప్యాయంగా ఎదురెళ్లి అవతలితీరం చేరుస్తాడు. ఆలయ గోపురం చూసి ఆనందంతో చిందులు వేస్తాడు. తనను అనుగ్రహించవలసిందిగా ప్రార్థిస్తాడు. ప్రాకారం చుట్టూ ప్రదక్షిణలు చేస్తూ అలసిపోయి ఒకచోట నిద్రిస్తాడు. ఆ రాత్రి నటరాజస్వామి కలలో కనిపించి 'భక్తా నీవు నా అనుగ్రహం పొందావు, రేపటి దినం ఇక్కడి భక్తులు నీకోసం వస్తారు. నీవు అగ్నిలో ప్రవేశించి నీ జన్మదోషం పోగొట్టుకో, నన్ను చేరుకుంటావు' అని చెప్పి అంతర్ధానమవుతాడు. నటరాజస్వామి భక్తులకు, ఈశ్వరుడు కలలో కనిపించి నాకు ప్రియమైన భక్తుడు ఆలయంలోకి ప్రవేశిస్తాడు. రేపు మీరు ఆయన ఆలయంలోకి ప్రవేశిస్తే అగ్ని శుద్ధి చేయమని ఆజ్ఞాపించాడు. అందరిలో వృద్ధుడైన దీక్షితులు అనే అతనికి, నటరాజస్వామి తనకు కలలో కనిపించి చెప్పిన విషయం అందరికీ తెలుపుతాడు.

మర్నాడు కొందరు భక్తులు అగ్నిగుండం ఏర్పాటుచేసి నందనార్‌ని అందులోకి దూకమంటారు. నందనార్ నవ్వుతూ సంతోషంతో అందులోకి దూకుతాడు. నిప్పులో కరిగిన మేలిమి బంగారు కాంతితో ఉదయించిన సూర్యబింబంలా నందనార్ యజ్ఞోపవీతం, కుండలాలు ధరించి అమిత తేజస్సుతో బయటికి వస్తాడు. మునీంద్రుడిగా మారిన నందనార్‌ని చూసి అందరూ ఆశ్చర్యపడి భక్తులు అతని పాదాలకు నమస్కరించి వారి శిష్యులుగా మారారు. నందనార్ గొప్ప భక్తుడుగా పేరు పొందుతాడు.

*(ఆంధ్రభూమి సెప్టెంబర్ 29, 2005)*

# గణపతి సచ్చిదానంద స్వామీజీ

కర్ణాటక రాష్ట్రంలోని కుగ్రామం 'మేకేదాటు'లో జన్మించిన స్వామీజీ తమ పదకొండవ ఏటనే యోగదీక్ష స్వీకరించడం ఒక దైవలీల అనిపిస్తుంది. మాతృమూర్తి గురుమూర్తి ఆదేశం ప్రకారం పన్నెండు సంవత్సరాలు నిరంతర సాధనచేసి తమ సిద్ధిని మానవజాతికి అంకితం చేశారు. 1968లో మైసూరులోని ఊటీరోడ్‌లో దత్తపీఠస్థాపన చేశారు. చాముండి క్షేత్రంలో ఆనాడు మొలచిన ఈ మొక్క మహా వృక్షమై ప్రపంచం నలుమూలలా అనేక జీవులకు చల్లని నీడలను అందిస్తోంది.

సాధనా సిద్ధులన్నీ అఖండ నిధిగా తమకు అందుబాటులో వున్నా వాటి ఆవిష్కారాలు, అప్రయత్నంగా జరిగిపోతున్నా, స్వామీజీ ఈ అష్టసిద్ధులను విలువైనవిగా భావించడం లేదు. యోగ విద్యను, నాద మాధ్యమికం ద్వారా మానవసేవకు ఉపయోగించటమే స్వామీజీ లక్ష్యం. సమన్వయం వారి బోధలకు జీవనాడి. సమస్త సంప్రదాయ సమన్వయ ప్రథమాచార్యుడైన దత్తాత్రేయుడి తత్త్వాన్ని స్వామీజీ ప్రపంచవ్యాప్తంగా ప్రచారం చేస్తున్నారు. తమ భక్తులకు 'దత్తమూర్తి' ప్రత్యేక అవతారంగా దర్శనమిస్తున్నారు.

యోగం, నాదం, భక్తితో సమన్వయించి శ్రీ స్వామీజీ దివ్య నామసంకీర్తన, మానవజీవిత సమస్యలకు మూలికా ప్రయోగమని ప్రబోధిస్తున్నారు. అందువలననే ప్రతిరోజు నామ సంకీర్తన విధిగా ఆచరించి చూపిస్తున్నారు. వారి నామ సంకీర్తనలో రాగరాగిణీనాద సమ్మిళితమైన గాత్ర, వాద్య, సంగీత లహరులు శ్రోతలను అలరిస్తున్నాయి. హృదయ ఉద్వేగం చల్లబరచి, మనందరికీ చిత్తశాంతిని కలిగిస్తున్నాయి. అనేక దీర్ఘ వ్యాధులు కూడా వారి రాగాలాపన ద్వారా నయమవుతున్నాయి. వారిలో దైవీశక్తి మనకు విశ్వాసాన్ని కల్గించి

మనల్ని భక్తి మార్గంలోకి ప్రవేశపెడుతున్నాయి. ఆ భక్తిమార్గం మనల్ని సత్వగుణం వైపు నడిపించి, ఆత్మసిద్ధిని కల్గిస్తున్నాయి. ఈ ప్రక్రియవలన, యోగ, నాద, భక్తి, మార్గాలు సమన్వయం చెందాయని మనం తెలుసుకోవలసి వుంటుంది.

యోగ బ్రహ్మగా ప్రపంచఖ్యాతి వహించిన స్వామీజీ మానవతా మందిరానికి మల్లెల గుబాళింపు పంపిణీ చేస్తున్నారు. సనాతన భారతీయ సంపదలో యోగవిద్య పేర్కొనదగినది. కొన్ని వందల యోగ తరగతులు, దేశవిదేశాలలో జరిగాయి. యోగసిద్ధికోసం విదేశీయులు వందలకొద్దీ మన దేశానికి వచ్చి నెలల తరబడి స్వామీజీ దగ్గర యోగ శిక్షణ పొందుతున్నారు.

లక్ష్య సిద్ధికోసం తపనవలన నియమాలను స్వీకరించడం, సద్విషయాలు అధ్యయనం చేయడం ఈశ్వరుని యందు భక్తిపూర్వకమైన ఏకాగ్రత కలిగి వుండటం వైరాగ్యం, ఇవి అభ్యాసపూర్వకంగానే వస్తుంది. స్వయంగా మహా యోగీశ్వరులైన స్వామీజీ సన్నిధిలో ఆవిష్కరించబడే మహోత్యాలకు అవధులు లేవు. స్వామీజీ చేసే వస్తుసృష్టి పలువురిని ఆకర్షిస్తుంది. రోగనివారణ కూడా ప్రజలను మంత్రముగ్ధులను చేస్తుంది.

మహాశివరాత్రి పండుగనాడు ప్రజ్వరిల్లే అగ్నిశిఖల మధ్య నిలబడి స్వామీజీ హోమం చేయటం, మహిమలు చూపడం. అయితే ఈ మహిమలు అల్పమైనవనీ, వీటికి మోహపడవద్దనీ సద్బోధ మాత్రం ఆలకించమనీ అంటారు. నాదోపాసనే వారికి యోగము. పడుగు, పేకవస్త్రంలో ఎలా కలిసి వుంటుందో అలా నాదోపాసన, ఆధ్యాత్మిక వికాసం, ఆరోగ్య సంపదలను ఏకకాలంలో శ్రోతలకు పంచి పెట్టగలదని వారు ప్రభోదించారు.

వ్యాధిగ్రస్తులకు ఏకొద్ది శాంతియైనా పంచిపెట్టడమే తమ జీవిత లక్ష్యమనీ, శ్రీ స్వామీజీ ఆరోగ్య దానాన్ని నిత్య దీక్షగా ఎన్నుకొన్నారు. అగస్త్య

మహర్షి నుంచి సంక్రమించిన ఈ విద్య, అనేక మహాత్ములను ప్రదర్శిస్తోంది. వారు సామాన్య ప్రజలకు అందుబాటులోకి తెచ్చేందుకు గత మూడు దశాబ్దాలుగా, పరిశోధన, నిర్విరామ కృషి చేస్తున్నారు. నిత్య పూజలో దేవతా విగ్రహాలు వుంచి, 32 మూలికల చూర్ణాన్ని మేళవించి, బీజాక్షరం, మంత్రోచ్చారణ పూర్వకంగా అభిషేకం చేసి, ఆ పవిత్ర తీర్థం భక్తులకు ఇస్తుంటారు. వేద పాఠశాల, అనాథ శరణాలయాలు, వృద్ధాశ్రమాలు వగైరాలు నిస్వార్థ సేవ ద్వారా అందించారు.

*(ఆంధ్రభూమి ఫిబ్రవరి 6, 2006)*

# ముత్తుస్వామి దీక్షితులు

తెలుగులో మనం కవిత్రయం నన్నయ, తిక్కన, ఎర్రాప్రగడ అని చదివాం. అలాగే దక్షిణ భారతదేశంలో సంగీత త్రిమూర్తులు 'త్యాగయ్య, దీక్షితార్, శ్యామశాస్త్రి'. 1750-1850 మధ్యకాలంలో వీరు ముగ్గురూ కూడా తంజావూర్ జిల్లాలోనే జన్మించారు.

త్యాగరాజుకు స్వయంగా నారదమహర్షి వచ్చి స్వరార్ణవమనే సంగీత గ్రంథాన్ని బహూకరించారు. శ్యామశాస్త్రికి సంగీత స్వామి జ్ఞానోపదేశం చేశారు. దీక్షితులవారికి సుబ్రహ్మణ్యస్వామి కండచక్కెర లాంటి కీర్తనలు వ్రాసేందుకు ప్రోత్సహించారు. ముగ్గురు గాయకులు కూడా తను కోరినట్లు ప్రాణాలు వదలడం ఆశ్చర్యం కలిగిస్తుంది. రఘునాధనాయకుని కొలువులో గోవింద దీక్షితులు మంత్రిగా వుండేవారు. మన్మథ నా సం॥ 1775 మార్చి 24వ తేదీ రామస్వామి సుబ్బమ్మలకు కుమారుడు కలిగాడు. ముత్తు కుమారస్వామి అనుగ్రహం వలన తమకు కొడుకు పుట్టాడని తల్లిదండ్రులు 'ముత్తుస్వామి' అని పేరుపెట్టారు.

బాల్యంలోనే ఏకాసంథాగ్రాహి, గురువులకు అభిమాన శిష్యుడయ్యాడు. తన పదహారవ సంవత్సరంలోనే వేదాలు చదివాడు. కావ్యాలు అలంకారశాస్త్రాలు నేర్చుకున్నాడు. సంగీత అభ్యాసం మొదలు పెట్టాడు. జ్యోతిషం, వైద్యం, తాంత్రికం తెలుసుకోవాలనే పట్టుదల పెరిగింది. బాల్యంలోనే దేవి ఉపాసన వలన 'శ్రీవిద్య' బాగా నేర్చుకున్నాడు. అప్పట్లో సంస్కృతంలో ఇంత బాగా కీర్తనలు రచించిన వారులేరు. దీక్షితులు వీణానాదంతో మైమరచిపోయేవాడు. గురువులు అతని ప్రతిభను మెచ్చుకునేవారు. భవిష్యత్తులో గొప్ప ప్రతిభామూర్తి కాగలడని, పాండిత్యం సకల విద్యలలోను సంపాదిస్తాడని విశ్వసించారు. కుమారునికి చిన్న వయసులోనే వివాహం చేశారు. అయితే శాస్త్రాలు నేర్చుకోవడంలో తలమునకలై ఇంటి ధ్యాసలేదు ముత్తుస్వామికి. తండ్రితో కలిసి కచేరీలకు వెళ్లి శ్రోతలను మైమరపించేలా గానం చేసేవాడు.

ఇంట్లో అత్తమామలతో అణకువగా నడుచుకునేది కోడలు సంగీత సాధనలో రాత్రి, పగలు గడుపుతూ కుటుంబ విషయాలు పూర్తిగా మరచి తిరగడం వల్ల తల్లిదండ్రులకు విచారం కలిగించింది. అతని భార్య రూపవతి కానందువలన అలా వున్నాడని భావించి తల్లిదండ్రులు రెండవ వివాహం చేసి అందమైన కోడల్ని తెస్తే కుమారునికి భార్యపై ప్రేమ కల్గుతుందని, బంధువులు సలహా ఇచ్చారు. రెండవ పెళ్లి చేశారు. కాని ముత్తుస్వామిలో ఎలాంటి మార్పు లేదు. భగవంతునిపై భక్తి ఏమాత్రం మరువలేదు. జమిందారు సంస్థానంలో ఉద్యోగిగా చేరతాడు. ఒకనాడు చిదంబర యోగి అనే సంగీత విద్వాంసుడు ముత్తుస్వామి జమీందారుగారి సంస్థానంలో ఉద్యోగం చేసేచోటికి వస్తాడు. కొంతకాలం అక్కడ వుండి జమిందారును సంతోషపరిచాడు. ముత్తుస్వామి కూడా చిదంబరయోగి వద్ద తనకు గల సందేహాలన్నీ అడిగి తెలుసుకున్నాడు. చిదంబరయోగి కాశీపట్టణానికి వెళ్తూ, ముత్తుస్వామిని అతని ఇద్దరు భార్యలను ఆహ్వానిస్తాడు కుమారునికి ప్రవర్తనలో మార్పు వస్తుందని తండ్రి, కుమారుని, కోడళ్లని అతని వెంట పంపుతారు. సూర్యోదయం కాగానే గంగలో స్నానం చేసి కాశీవిశ్వేశ్వరుని, అన్నపూర్ణాదేవిని సేవించి మధ్యాహ్నానిక ఇంటికి వచ్చేవాడు ముత్తుస్వామి. ఇద్దరు భార్యలు, భర్తను ప్రసన్నం చేసుకోవడానికి ప్రయత్నించారు. మంత్రజప, సంగీత సాధనలోనే ప్రపంచమే మరిచిపోయాడు. ఆయనలో దివ్య తేజస్సు ఆవరిస్తుంది. భార్యలిద్దరూ తమ స్వగ్రామానికి తిరిగి వెళ్లిపోదామని బ్రతిమాలుతారు.

ముత్తుస్వామి గురువు ఆజ్ఞప్రకారం నదిలో దిగి గాయత్రి మంత్రం జపించి అమ్మా సరస్వతి ఏ వీణానాదంతో ప్రపంచమంతా మైమరపించే శక్తి నీకుందో అలాంటి వీణను నాకు బహూకరించు తల్లీ అని భక్తితో ప్రార్థిస్తాడు. మరుక్షణంలో అతని పవిత్ర హస్తాలలో తేజోవంతమైన వీణ ప్రత్యక్షమౌతుంది. నది నుంచి బయటికి వచ్చి ఆనంద తాండవం చేస్తాడు. ఆ అద్భుతశక్తిని చూసి చుట్టు జనం ఆశ్చర్యపోయి అతని పాదాలకు నమస్కరిస్తాడు. కారణజన్ముడైన ముత్తుస్వామి దేవి బహూకరించిన వీణను చూసి తన జీవితం ధన్యమైందని ఆనందంతో పరవశిస్తాడు

ముత్తుస్వామి ఇద్దరు భార్యలతో స్వస్థలానికి బయలుదేరుతాడు. దారి పొడవునా జనాలు, అతనికి అతిథి సత్కారాలు చేస్తారు. జమీందారు పూర్ణకుంభంతో స్వాగతమిచ్చారు. కొంతకాలానికి తిరుత్తణి సుబ్రహ్మణ్యస్వామి క్షేత్రానికి వెళ్తాడు. నిత్యం కొండమీద దేవాలయానికి వెళ్ళి సుబ్రహ్మణ్యస్వామిని, తన గానామృతంతో కొలిచేవాడు. కుటుంబపోషణ విషయం ముత్తుస్వామి పట్టించుకోలేదు. జమీందారే కుటుంబ భారం స్వీకరించి కానుకలు పంపేవాడు. అతనికి దైవచింతన తప్ప మరో ప్రపంచం తెలీదు. తిరుత్తణి వచ్చిన తర్వాత అతని మనసుకేదో ప్రశాంతి లభిస్తుంది. భక్తులు, ముత్తుస్వామి భగవంతుని దర్శించినట్లుగా ఆనందం పొంది పాదాభివందనం చేసేవారు. సంగీతంలో మొట్టమొదటి కీర్తన 'వాతాపి గణపతింభజే' హంసధ్వని, గణపతి విగ్రహం ముందర, భక్తి పారవశ్యంతో గానం చేశారు. ఇప్పటికీ ఈ కీర్తన సంగీత విద్వాంసులనోట ఆరంభ కీర్తనగా సాగిపోతోంది. ఆ కాలంలో దీక్షితులు చుట్టు శిష్యగణమే. శిష్యులపై గురువుకు విపరీతమైన అభిమానం ప్రేమతో కీర్తనలను నేర్పేవాడు.

తర్వాత దీక్షితులు కాంచీపురం వచ్చారు. వారి వెంబడి శిష్యులు, తమ్ముళ్లు వెంట వచ్చారు. కంచి కామాక్షిని సేవిస్తూ కాలం గడిపారు. ఆమె సన్నిధిలో శ్రీవిద్య ఉపాసన కూడా సిద్ధించింది. శ్రోతలు ఆయన కీర్తనలు విని మైమరచేవారు. ఏయే క్షేత్రాలు దర్శిస్తే ఆయా దేవతలపై కీర్తనలను భక్తితో గానం చేసేవారు. ఒకచోట ఎండిపోయిన పైరును చూసి ముత్తుస్వామి హృదయం ద్రవించి అమృతవర్షిణి రాగంలో కీర్తన అందుకున్నారు. ప్రకృతి పులకించి, వర్షం కురిపించింది. పంటలు బాగా పండి పైరు పచ్చగా కళకళలాడింది. గ్రామస్థులు సంతోషంతో పులకించిపోయారు. వీరు కీర్తనలలో చివరలో 'గురుగుహ' ముద్ర పొందుపరచారు. ప్రజలంతా ఆ మహనీయుని వేనోళ్ల కీర్తించేవారు. వీరు చిరస్మరణీయులు.

*(ఆంధ్రభూమి)*

# హస్తామలకుడు

**'నదీనాం సాగరోగతిః'** అన్ని నదులు చివరకు సముద్రంలోనే కలుస్తాయని మనకు తెలుసు. అది ఎప్పుడూ ప్రవహిస్తూనే వుంటుంది. దాని గాంభీర్యంలో నిశ్చలతలో మార్పు వుండదు. తీవ్రమైన తపస్సు చేసేవారు కూడా సముద్రంవలె నిశ్చలంగా వుంటారు. ఇహలోకవాసులు వారిలో ఏ విధమైన సంచలనమూ కలిగించరు. వారి నిత్యకర్మలు యథావిధంగా సాగుతూనే వుంటాయి. ఆహార నియమాలన్నీ కూడా శరీర శుద్ధికోసం ఏర్పడినవే. మన దేహం, మనసు శుద్ధంగా వుంటేనే గానీ మంత్రం సిద్ధించదు. మంత్రం సిద్ధిస్తే మనకేకాదు లోకానికి క్షేమం. ఈ మంత్రసిద్ధికొరకే భగవంతుని ప్రార్థించాలి.

ఒకప్పుడు అద్వైతమత ప్రచారం కొరకు శంకరాచార్యులవారు విజయయాత్ర సాగిస్తున్న రోజులు. 'శ్రీబలి' అగ్రహారంలో ప్రభాకరుడు అనే పండితుడు వుండేవాడు. అతను బహు నిష్టతో, నిత్య కర్మలు చేసేవాడు. అతనికి సిరిసంపదలకు తక్కువేమీ కాదు. అయితే అతనికున్న ఒక్క కుమారుడు పిచ్చివాడు. ఎవరైనా పిలిస్తే పలకడు. తల్లివేళకు అన్నం పెడితే తింటాడు. లేకపోతే లేదు. ఉపనయనం చేస్తే బాగుపడతాడని తల్లిదండ్రులు ఉపనయనం చేసి జంధ్యం పోగు వేస్తారు. అయినా ప్రయోజనం లేదు.

ఆచార్య శంకరస్వామి వీరి అగ్రహారానికి వస్తాడు. ప్రభాకరుడు ఆయనకు ఎదురువెళ్లి నమస్కరించి తన కుమారుని ఆయన పాదాలపై పడవేసి వినయంతో యతీశ్వరా, తమ పేరు విన్నాను. మీ దర్శన భాగ్యం వలన నాకు ఎంతో ఆనందం కలిగింది. మూకాంబికా క్షేత్రంలో చనిపోయిన ఒక బాలుని జీవింపచేశారట. తమరు సాక్షాత్ శంకర స్వరూపులు. నా కుమారుడు బాల్యం నుంచి పిచ్చివాడుగా వున్నాడు. ఎన్నో వైద్యాలు చేయించాను అయినా ఫలితం లేదు. పదమూడేళ్లు నిండాయి. ఉలకడు, పలకడు. వీడి చింతే నన్ను

దహించి వేస్తోంది. వీడిని దారిలో పెట్టడానికి మీరే సమర్థులు. మామీద దయచూపండి"అని వినయంగా ప్రార్థిస్తాడు. అప్పుడు యతీంద్రుడు ఆ బాలుని లేవనెత్తి తల నిమురుతూ నీవెవ్వరవు? ఇలా వుండటానికి గల కారణమేమిటి? అని చిరునవ్వుతో ప్రశ్నిస్తాడు. ఎప్పుడూ ప్రకాశిస్తూ, శరీరం మనసుకు కూడా శక్తిని ఇస్తూ ప్రపంచమంతా ఏది వెలుగును ప్రకాశిస్తుందో అట్టి ఆత్మను నేను అని భావాన్ని అందించే పన్నెండు శ్లోకాలు ఆశువుగా చెప్తాడు గంభీర స్వరంతో ఆ పిచ్చివాడు.

అది విని అందరూ ఆశ్చర్యపడతారు. తండ్రి ప్రభాకరుడు ఎంతో ఆనందపడ్తాడు. అరచేతిలో అమలకము (ఉసిరికాయ) వలె ఇమిడివుంది ఆత్మతత్త్వము ఆ శ్లోకాలలో. శంకరులవారు అతనికి 'హస్తామలకుడు'అని పేరు పెడ్తాడు.

'ఈరోజు ఇతనికి మీకు ఋణం తీరిపోయింది. ఇతడు మహా జ్ఞాని అవుతాడు. ప్రాపంచిక విషయాలలో ఆసక్తిలేక ఇలా తన ధ్యానంలో తానున్నాడు. ఇంతటి వానికి తల్లితండ్రులైన మీరు ధన్యులు. ఇతడు ఇన్నిరోజులు నా కొరకే ఎదురు చూస్తున్నాడు. నా శిష్యునిగా స్వీకరించి నా వెంబడి తీసుకుని వెళ్తాను. మీ అనుమతి కావాలి' అంటారు ఆచార్యులవారు.

ప్రభాకర పండితుడు ఎంతో సంతోషంతో సమ్మతిస్తాడు. ఆవు వెంట దూడలా ఆయనను అనుసరిస్తాడు హస్తామలకుడు. దారిలో స్వామివారి వెంట వెళ్తున్న శిష్యులు 'ఏ బోధనా లేక ఇంత ప్రజ్ఞాపాటవాలు ఇతనికి ఎలా వచ్చాయి స్వామీ' అని అడుగుతారు. అప్పుడు శంకరులవారు ఇలా జవాబిస్తారు. "దీనికి కారణం ఇతని పూర్వజన్మ చరిత్ర. ప్రభాకరుని భార్య తన రెండు సంవత్సరాల కుమారుని చంకపెట్టుకుని యమునా నదికి నీళ్లకు వెళ్లింది. ఒడ్డున ఒక సిద్ధుడు కూర్చుని, తపస్సు చేసుకుంటూ వున్నాడు. ఆయనవద్ద తన కుర్రవాడిని కూర్చుండబెట్టి వీడిని కాస్త చూస్తూ వుండండి స్వామీ, నేను త్వరలో నీరు

తీసుకుని వస్తాను" అన్నది. ఆయన తన తపో ధ్యాసలో తాను కూర్చుని తల ఊపుతూ వుంటే వారు సమ్మతించారని ఆమె భావించింది.

ఈలోగా ఆ బాలుడు తప్పటడుగులు వేస్తూ జారి నదిలో పడ్డాడు. వెంటనే ప్రాణం పోయింది. చూసినవారు ఆ బాలుని గట్టుమీద వున్న సన్యాసి వద్దకు తెచ్చి పరుండబెట్టారు.

'అయ్యో అయ్యో ఎంత పని జరిగింది' అని ఆయన కళ్లు తెరుస్తాడు. తల్లి వచ్చి గొల్లుమంది, గుండెలు బాదుకుంటూ బావురుమంది. తల్లి ఆవేదన చూడలేక, సన్యాసి మీ బాలుడు తప్పక బ్రతుకుతాడు చూస్తూ వుండండి"అని చెప్పి తాను ఒకచెట్టు చాటుకు వెళ్తాడు. అక్కడ తన శరీరాన్ని వదిలేసి పరకాయ ప్రవేశవిద్యతో ఆ బాలుని శరీరంలోకి ప్రవేశిస్తాడు. ఆ కుర్రాడు తిరిగి లేచి కూర్చుంటాడు తల్లి సంతోషంతో, కుమారుని ఎత్తుకుని ముద్దాడి ఇంటికి తీసుకొని వెళ్తుంది. సన్యాసి సంగతి ఎవరూ పట్టించుకోలేదు. చుట్టూవున్నవారు ఎవరి ఇళ్లకు వారు వెళ్లిపోతారు.

ఆ జీవికి, పూర్వపు వాసన పోలేదు అందువల్లనే అతను గొప్ప జ్ఞాని, పండితుడు అయ్యాడు అని చెప్పి ముగిస్తాడు శంకరులవారు. ప్రతి జీవికీ పూర్వపు వాసనలు వుంటాయని, తద్వారా భక్తి, జ్ఞానము, పాండిత్యము కల్గుతాయని ఈ కథ ద్వారా మనం తెలుసుకోవలసి వుంది.

*(ఆంధ్రభూమి డిసెంబరు 14, 2005)*

# సుమిత్ర

అయోధ్యను పాలించిన దశరథ మహారాజుకు ధర్మపత్నులు ముగ్గురు. అందులో మొదటి భార్య కౌసల్య. కోసల రాజపుత్రి, కేకయ రాజు కుమార్తె కైకేయి చిన్నరాణి. మగధేశ్వరుని కుమార్తె మధ్యనున్న రాణిపేరు సుమిత్ర. కైకేయికి, కౌసల్యకు స్వంత పేర్లేగాని వాల్మీకి సుమిత్రకు మాత్రం స్వంతంగా పేరు పెట్టాడు. ఆమె స్వభావానికి తగ్గట్లు వుండటం ఇందులో విశేషం. వాల్మీకి పాత్రలకు పేర్లు నిర్ణయించటంలో కూడా ఎంతో చాతుర్యం ప్రదర్శించాడని మనకు స్పష్టంగా తెలుస్తోంది.

సుమిత్ర తాను ఎంత సుఖ సంతోషాలు లభించినా దానితోనే తృప్తిపడుతుంది, సాధ్వీమణి. దశరథుడు ఆమె అంటే ఎక్కువ ప్రేమ చూపెట్టలేదు. అటు పట్టపురాణి కాదు ఇటు మెప్పులు పొందే రాణి కాదు. సుమిత్ర ఇద్దరు కుమారులను ప్రసవించింది. ఒక్కొక్కడు ఒక్కొక్క అన్నతో కలిసి పెరిగారు. వారి కష్టసుఖాల గురించి సుమిత్ర ఆలోచించే అవసరం కలగలేదు. రామునకైనది లక్ష్మణునకు, భరతునకైనది శత్రుఘ్ననకు ఇలా భావించింది.

రాజు చిన్న రాణి కైకేయితోనే ఎప్పుడూ వుంటున్నందు వలన సుమిత్ర, కౌసల్యతోనే స్నేహం చేసింది. కౌసల్యకైనది తనకు. సుమిత్ర జీవనతత్త్వము ఇలాటిది. రామునికి సంభవించిన వనవాసము, లక్ష్మణునికి కూడా వనవాసమైంది. సుమిత్ర కౌసల్య దుఃఖంలో భాగం పంచుకుంది.

రాముని తల్లి కౌసల్య రాముని వనవాసానికి వెళ్లవద్దన్నది. కాని లక్ష్మణుని తల్లి రామునితో కూడా అతనిని వనవాసానికి పోవలసిందిగా ఆజ్ఞాపించింది. రాముడు వనవాసానికి పోతే లక్ష్మణుడు కూడా అతనితో పోవలసిందే. కౌసల్య పుత్ర వియోగంతో దుఃఖిస్తుంటే సుమిత్ర ఆమెకు ధైర్యం చెప్పింది. ఆమె స్వభావం ఎంత స్నేహమాధుర్యంగలదో మనకు ఈమె ప్రవర్తన వలన తెలుస్తోంది.

రాముడు ఎంతో గుణవంతుడు. సూర్యుడు అతనిపై వేడిని ప్రతాపాన్ని చూపించలేదు. గాలి అతనికి అనుకూలంగా వీచింది. చంద్రుడు అతడిని కౌగలించుకుని ముద్దాడుతాడు. అతని వెంట లక్ష్మీదేవి మాదిరి సీత. రాముని సేవ చేయుటకు తన కుమారుడు లక్ష్మణుడు. ఇంక అతనికేమి తక్కువ? సుమిత్ర ఒక విషయం అతి స్పష్టంగా అర్థం చేసుకున్నది. మనకు కావలసినవారు దగ్గరుంటే అడవే నగరము, అటువంటి వారు కనుక లేకపోతే నగరమే అడవి (వనవాసం) లక్ష్మణుడిని అయోధ్య మాదిరిగానే వనవాసాన్ని భావించమని అతనికి హితబోధ చేస్తుంది. తన దుఃఖం కౌసల్య దుఃఖం కంటే తక్కువకాదు అయినా ఆమె కౌసల్యకు చెప్తుంది. ఆమెను ప్రీతితో ఓదారుస్తుంది. ఆమె ధైర్య వచనాలు, నిజమైన ప్రేమ హృదయం నుంచి వచ్చినమాటలు విని కౌసల్యకు దుఃఖం కొంత తగ్గుతుంది.

సుమిత్ర ప్రవర్తన రాజ్యంలో అందరికీ ఆశ్చర్యం కల్గిస్తుంది. మరణ సమయం సమీపించిన దశరథ మహారాజుకు వీరిని చూస్తు వీరి మాటలు వింటుంటే ముఖ్యంగా తన రెండవ భార్య అయిన సుమిత్రపై గౌరవభావం, ఆప్యాయత, ఆదరణ కలుగుతుంది. అతడు మరణించుటకు ముందు పలికిన పలుకులలో కైకేయిని 'అమిత్రే కులపాంసని' అని నిందిస్తూ సుమిత్రవైపు చూస్తూ 'హా! సుమిత్రా తపస్వినీ' అని ప్రశంసిస్తాడు. దశరథుని ఈ మాటలలో ఎంతో సత్యం దాగివుంది. సుమిత్ర వాస్తవంగా తపస్వినే.

కైకేయి రాముని అరణ్యవాసానికి పంపి తనకు రాజ్యం సంపాదించి పెట్టినదని, దశరథ మహారాజు మరణానికి కారణమైందని భరతుడికి తెలిసి అతడు తల్లిని నిందిస్తాడు. తనకు అసలు రాజ్యం అక్కర్లేదంటాడు. రాముని వేడుకొని తిరిగి రాజ్యానికి పిలుచుకుని వస్తానంటాడు. ఒకవేళ రాముడు అయోధ్యకు రాకపోతే తాను రామునికి దాసుడై వనములందే నివసిస్తానంటాడు. అప్పుడు కైకేయి ఎలా ప్రవర్తించింది వాల్మీకి బాగా వర్ణిస్తాడు. కైకేయికి తన

ఆశ ఫలించలేదని, తాను చేసిన పని భరతునికి ఇష్టంగాలేదని, ఆ పని చాలా దుర్మార్గంతో కూడినదని తెలుసుకుంటుంది. అందువలన ఆమె పశ్చాత్తాపంతో క్రుంగిపోయి వుంటుంది. ఆ సమయంలో సుమిత్ర ఆమెకు జరిగినదేదో జరిగిపోయింది. దీనికి దిగులుపడి ప్రయోజనం లేదు, ప్రశాంతంగా వుండాలి. మనం విధి చేతిలో కీలుబొమ్మలం. విషఘడియ అయినందున నీకు ఇలాంటి చెడుతలపు కల్గింది. రాముని తిరిగి అయోధ్యకు రప్పించడానికి మన ప్రయత్నం మనం చేద్దాం. భరతుని పంపి రాముని తిరిగి పిలిపిస్తాం అని ఆమెను సమాధానపరచి వుండవచ్చు, కాని ఆమె మౌనంగా వుండిపోతుంది.

అయితే సుమిత్రకు శత్రువులు ఎవరూ లేరు. ఆమెకు అందరు మిత్రులే. ఆమె శాంతగుణ స్వభావురాలు. గొప్ప మహిళామణి వినయశీలి. త్యాగనిధి, పేరుకు తగినటువంటి స్వభావురాలు. వాల్మీకి సృష్టించిన స్త్రీపాత్రలలో సుమిత్ర గొప్ప శ్రేష్టురాలు. రామాయణంలో సుమిత్ర పాత్రకు ప్రముఖ స్థానం లేదని అనుకోవడం మన అవివేకము. కాని రామాయణం క్షుణ్ణంగా పఠిస్తే పాఠకుల హృదయాలలో ఆ అమృతమూర్తి సుమిత్రకు ప్రముఖస్థానం తప్పకుండా వుంది.

*(ఆంధ్రభూమి నవంబర్ 7, 2005)*

# వాక్య విశారదుడు - హనుమ

పాతివ్రత్యమే రక్షణగా వున్న సీతాదేవిని చూచిన హనుమంతుడు, మనసా, రామ, లక్ష్మణులకు నమస్కరించి అశోకవనంలో చెట్ల కొమ్మల మధ్యనుంచి ఆ వనితా శిరోమణివైపే చూస్తున్నాడు. ఆవిడతో మాట్లాడే అవకాశం కోసమే ఎదురుచూస్తున్నాడు.

తెలతెలవారుతోంది. రావణుడు వచ్చి మరొక రెండు మాసాలలోపుగా మనసు మార్చుకుని, తన అంతఃపురానికి రానట్లయితే మృత్యులోకానికి పంపుతానని బెదిరించి అక్కడి నుంచి వెళ్ళిపోతాడు.

తమ ప్రభువు వెళ్లగానే సీతాదేవి చుట్టూవున్న రాక్షస స్త్రీలు ఆమెకు నచ్చచెప్పటానికి ప్రయత్నం చేస్తారు. ఇదంతా గమనిస్తున్నాడు హనుమంతుడు. రాక్షస స్త్రీల మాటలు వింటూ సీతాదేవి కన్నీరు మున్నీరుగా విలపిస్తోంది. 'త్రిజట' అనే రాక్షసి అక్కడవున్న స్త్రీలవైపు చూస్తూ తన స్వప్న వృత్తాంతం వినిపించింది. వారికి. అది విన్న రాక్షస స్త్రీలు మూర్ఛపోతారు.

అప్పుడు సీతాదేవి నాకు మరణం తప్ప గత్యంతరం లేదు. ఆ రాక్షసుని చేతిలో మరణించడం కంటే ఆత్మహత్యేమేలు. ఈజడతోనే ఉరిపోసుకుని చస్తాను అనుకుంటూ తన జుట్టు ముడివిప్పి మెడచుట్టూ తిప్పుతూ లేచి పక్కనున్న చెట్టుకొమ్మ పట్టుకొని నిలబడింది. ఇంక కొన్ని క్షణాలలో ప్రాణత్యాగం చేయబోతున్నది. చెట్టుకొమ్మ మీద నుంచి చూస్తున్న హనుమంతుడు ఈమెకు నేను తప్పక ఆశాభావం కలిగించాలి. సీతాదేవి ఆత్మహత్యను ఎలాగైనా ఆపాలి. ఆవిడ ప్రాణత్యాగం చేశాక, ఇంక రామలక్ష్మణులు, సుగ్రీవుడు మిగిలినవారు వచ్చి ప్రయోజనమేముంది? సరే నేనిప్పుడు ఈవిడతో ఏ భాషలో మాట్లాడాలి? సంస్కృతంలో మాట్లాడితే అది బ్రాహ్మణుడైన రావణుని మాటలని వాడే కామరూపుడిగా వచ్చాడని సీత అనుమానిస్తుందేమో? నేను మరే భాషలో

మాట్లాడినా, ఈవిడ భయపడుతుందేమో. ఈమె భయంతో ఏడిస్తే రాక్షసవీరులు ఆయుధాలతో వస్తారేమో నేను తప్పించుకోవడానికి ప్రయత్నిస్తే యుద్ధానికి దిగుతారు. అప్పుడు పరిణామం ఎలా వుంటుంది? వారు నన్ను బంధించినా, వధించినా, నా శ్రమ పూర్తిగా వ్యర్థం. ఈ వార్త అక్కడకు అందించేవారుండరు. నేను సంస్కృతంలోనే రాఘవుని గుణాలను కీర్తిస్తాను. అప్పుడు జానకి ఉత్సాహంగా వినవచ్చు అని ఆలోచించి, 'రాజా దశరథో నామ రథకుంజర వాజిమాన్' అని ప్రారంభిస్తాడు.

అయోధ్య నగరాన్ని దశరథుడనే రాజు పాలిస్తున్నాడు. ఆయన కీర్తి మూడు లోకాలూ వ్యాపించింది. మొదటి వాక్యం వినగానే సీతాదేవి ఆత్మహత్య ప్రయత్నాన్ని విరమించింది.

నిమిష కాలంలో తన ప్రసంగం ఎలా ప్రారంభించాలి నిశ్చయించుకో గలిగిన ధీమంతుడు హనుమ. ఆ నిశ్చయంతోనే సీతాదేవి నిశ్చయం మారాలి. మార్చగలిగాడు కూడా. హనుమంతుడు అందుకనే ప్రథమ పరిచయంలోనే హనుమంతుడు రామచంద్రుని ఆకర్షించగలిగాడు. సీతారాముల కథ అంతా చెట్టుకొమ్మల సందులోనుంచి చూస్తూ అయిదారు క్షణాలలో క్లుప్తంగా వినిపించాడు. తనవైపే చూసే జానకీదేవి మనసు గ్రహించి, హనుమంతుడు క్రిందకు దిగి నమస్కరించాడు.

తల్లీ! ఈ చెట్టు నీడన నిలబడి ఎందుకు విచారిస్తున్నావు? ఎవరి బిడ్డవు నీవు? నా కంటికి దేవతా స్త్రీలా కనపడుతున్నావు. తల్లీ నీవు చంద్రుని వదలిపెట్టి వచ్చిన రోహిణివా? వశిష్ఠుల వారిమీద కోపగించి విడిచివచ్చిన అరుంధతివా? అమ్మా! ఎందుకు కన్నీరు పెడుతున్నావు? నీ పాదాలు భూమిని తాకుతున్నాయి. ఈ లక్షణాలబట్టిచూస్తే నీవు దేవతా స్త్రీ కావని తెలుస్తోంది. నీలో రాచరికపు లక్షణాలు కనిపిస్తున్నాయి. రావణుడు అపహరించిన జానకీదేవి కాదు కదా! అంటాడు.

ప్రసంగం ప్రారంభించిన వైనం, దానిని కొనసాగించినతీరు చూస్తే ఆ ఇల్లాలి గురించి, తనకేమీ తెలీనట్లు ఆరంభించాడు. చివరకు 'రామపత్నివి కాదుగదా' అన్నాడు. ఒక్కసారిగా సీత ముందు నిలబడి అమ్మా ! నీవు రాముపత్నివే కదా! నేను నిన్ను వెదకటానికి వచ్చిన రామదూతను' అని రెండుమాటల్లో చెప్పేస్తే కార్యం జరిగిపోదా! కాని అప్పటికి పదిమాసాలుగా, ఆ ఇల్లాలు లంకలోని రాక్షసులనోట, నిరంతరం రామదూషణే వింటోంది. వారి మాయరూపాలు గమనిస్తోంది. ఎవ్వరిమాట వినే స్థితిలో లేదు. అక్కడ రాక్షస జనంలో దశరథ మహారాజు పేరుగానీ, అయోధ్య విశేషాలుగానీ తెలిసినవారు ఎవరూ లేరు. ఒక రాముడి పేరు తప్ప.

రాముడి వంశకీర్తనం ప్రారంభిస్తే తప్పకుండా తన ఆత్మీయులెవరో వచ్చారని గ్రహిస్తుంది. గ్రహించగానే తన ప్రయత్నం విరమిస్తుంది. అలాచేస్తే రామసందేశం కూడా అందించవచ్చు అని ఆలోచిస్తాడు. అతని ఆలోచన ఫలిస్తుంది. ఆత్మహత్యా ప్రయత్నం ఆగిపోయింది. ఇలా ప్రతిచోట, ప్రతిమాటా, ఎలా మాటాడాలో, మనకు అడుగడుగునా చూపిస్తాడు హనుమంతుడు. ఆవిడకు సంపూర్ణ విశ్వాసం, కలిగించాకనే రామచంద్రుని అంగుళీయకాన్ని అందించాడు హనుమంతుడు. నీవు నా భుజంమీద కూర్చోతల్లీ! నిన్ను రామచంద్రుని దగ్గరకు చేరుస్తాను అంటాడు. ఇలా హనుమ వాక్యవిశారదత్వం కలవాడు.

*(ఆంధ్రభూమి జూన్ 16, 2007)*

# వృత్రాసురుడు

దేవతలలో 'త్వష్ట' అనే అతనికి గొప్ప పేరుంది. అతడు తన తపశ్శక్తిని అంతా ధారపోసి మూడు ముఖాలు కలిగిన కొడుకును సృష్టించి అతనికి 'విశ్వరూపుడు' అని పేరుపెట్టాడు. విశ్వరూపుడు ఒక ముఖంతో వేదాలు చదువుతూ, మరొక ముఖంతో మద్యం సేవిస్తూ, ఇంకొక ముఖంతో సృష్టిలోని వింతలూ, విశేషాలూ గమనిస్తూ వుండేవాడు.

కొంతకాలం తర్వాత సంసార సుఖాలపై మోహం మొత్తి తపస్సు ప్రారంభించాడు. ఈ విషయం తెలుసుకున్న ఇంద్రుడు, రంభ, ఊర్వశి, అప్సరసలను పంపి విశ్వరూపుని తపస్సుకు భంగం కలిగించమన్నాడు. అప్సరసలు, తమ రూపురేఖలతో విశ్వరూపుని మెప్పించలేక పోయారు. తిరిగి ఇంద్రుని వద్దకు వెళ్ళి మొరపెట్టుకున్నారు. ఇంద్రుడు కోపంతో వజ్రాయుధాన్ని చేపట్టి ఐరావతం ఎక్కి విశ్వరూపుని పర్ణశాలకు వెళ్లాడు. అక్కడ తపః దీక్షలో వున్న విశ్వరూపునిపై వజ్రాయుధాన్ని ప్రయోగించి విగతజీవుని చేశాడు. మునులందరు ఇంద్రుని బాగా దూషించారు.

అయినా ఇంద్రుడు భయపడకుండా పక్కనే వున్న తక్షుని పిలిచి విశ్వరూపుని మూడు తలలూ నరికి రమ్మన్నాడు. తక్షుడు వెంటనే విశ్వరూపుని మూడు తలలూ నరికివేశాడు. అందుకు ప్రతిఫలం ఎక్కడ యజ్ఞం జరిగినా, యజ్ఞ పశువు తల తక్షునికి చెందేటట్లు వరం అనుగ్రహించాడు.

విశ్వరూపుని మూడు తలలూ తెగి చెల్లాచెదురుగా పడివున్నాయి. వేదం పఠిస్తున్న ముఖం నుంచి కౌజుపిట్టలు, మద్యం సేవించే ముఖం నుంచి పిచ్చుకలు, సృష్టిని పరిశీలించే ముఖం నుంచి తీతువుపిట్టలూ పుట్టాయి.

పుత్రుడి మరణవార్త విన్న 'త్వష్ట' దిగులుచెంది ఇంద్రుడిని చంపగలిగే బలవంతుడిని సృష్టించాలని తలచి ఒక గొప్ప హోమం తలపెట్టాడు. ఆ అగ్నిగుండంలో నుంచి తేజస్సుతో వెలిగే ఒక కుమారుడు జన్మించాడు. ఆ

శిశువే 'త్వష్ట' కళ్లెదుటే పర్వతమంత ఎత్తు ఎదిగాడు. త్వష్ట తన కొడుకుకి 'వృత్రుడు' అని పేరుపెట్టాడు.

పుత్రా! ధ్యాననిష్టలో వున్న నీ అన్నను ఇంద్రుడు నిష్కారణంగా తన వజ్రాయుధంతో నరికాడు. కాబట్టి ఆ హంతకుడిని చంపిరా! అంటూ దివ్య అస్త్రాల్ని దివ్య రధాన్ని కొడుకుకు బహూకరించాడు. వెంటనే వృత్రుడు తండ్రి ఆశీర్వాదం తీసుకొని దివ్య రథం ఎక్కి బయలుదేరాడు. ఈలోగా ఇంద్రుడు వృత్రుడు వస్తున్నాడని తెలుసుకుని, దేవగురువు బృహస్పతిని పిలిపించి కర్తవ్యం ఏమిటని ప్రశ్నిస్తాడు. ఏ పని అయినా ఆలోచించి చేయాలి. అతని ధాటికి మనం నిలువలేము అని బృహస్పతి ఇంద్రుని చీవాట్లు పెట్టి వెళతాడు. ఇక చేసేది లేక ఇంద్రుడు దేవతలను వెంటబెట్టుకుని వృత్రాసురునితో ఒంటరిగానే తలపడతాడు.

వృత్తుడు యుద్ధభేరీలు మ్రోగించి శంఖం పూరిస్తాడు. దాని ధాటికి తట్టుకోలేక ఇంద్రుడు, దేవతలు పారిపోతారు. ఐరావతంపై విజయగర్వంతో వచ్చిన కొడుకుని చూసి త్వష్ట మహదానందం చెందుతాడు. కుమారా! నా పేరు నిలబెట్టావు. ఆ ఇంద్రుడు మోసగాడు. అతడిని జయించే శక్తి సంపాదించు బ్రహ్మను గూర్చి తపస్సు చేయి అని దీవించి పంపుతాడు. తండ్రి మాట కాదనలేక వృత్రుడు ఘోర తపస్సు చేస్తాడు. బ్రహ్మ అతడి తపస్సుకు మెచ్చి ప్రత్యక్షమౌతాడు. వృత్రుడు బ్రహ్మకు సాష్టాంగపడి ప్రభూ లోహముచే, తడిసినవాటిచే, శస్త్ర అస్త్రాలచేత తనకు మరణం లేకుండా వరం ప్రసాదించమని ప్రార్థిస్తాడు. బ్రహ్మ తథాస్తు అని అదృశ్యమౌతాడు.

వృత్రుడు మళ్లీ దేవలోకంపై దండెత్తుతాడు. దేవ, దానవులకు హోరాహోరీ పోరు జరుగుతుంది. వృత్రుడు ఇంద్రుడిని గటుక్కున తన నోటితో మింగేస్తాడు. దేవగురువు బృహస్పతితో దేవతలు మొర పెట్టుకుంటారు. బృహస్పతి 'జృంభిక' అనే శక్తిని సృష్టించి వృత్రుడిపైకి పంపుతాడు. జృంభిక అతడికి ఆవులింత కలిగిస్తుంది. అతను ఆవిలించగానే వేగంగా ఇంద్రుడు బయటికి వస్తాడు. జృంభిక ప్రభావం వల్ల అక్కడ వున్నవారందరికీ ఆవులింతలు వస్తాయి. మళ్లీ

యిరువురి మధ్య యుద్ధం జరుగుతుంది. వృత్రుడు ఇంద్రుని ఓడించి లోకానికి రాజయ్యాడు. త్వష్ట సంతృప్తి చెందుతాడు.

దేవతలు విష్ణువు వద్దకు వెళ్లి తమ గాధ చెప్పుకుంటారు. విష్ణువు దేవతలారా! వాడు మామూలు ఆయుధాలతో చావడు. జగజ్జనని మెప్పించి ఆమె అనుగ్రహం పొందండి అంటాడు. వెంటనే దేవతలు లోకమాతను ప్రార్థిస్తారు. ఆమె ప్రసన్నురాలై వాడు మీతో స్నేహం చేసేటట్లు నేను చేస్తాను. వాడిని చంపటం సులభం వెళ్లండి అని పంపుతుంది.

కొంతమంది ఋషులు, దేవతలవైపు నుంచి వృత్రుడికి, దేవతల మధ్య స్నేహం కుదర్చటానికి వెళ్తారు. వృత్రుడు అంగీకరిస్తాడు. మునులారా! ఇంద్రుడు వజ్రాయుధంతో నన్ను చంప పూనుకోకూడదు. పగలుగాని, రాత్రిగాని తడిసిన వస్తులతో, లోహంతో నన్ను చంపటానికి ప్రయత్నించ కూడదు. ఇందుకు సిద్ధమైతే నేను ఇంద్రునితో స్నేహం చేస్తాను అంటాడు.

మునులు ఇంద్రుని వెంటబెట్టుకొచ్చి ఇద్దరికి స్నేహం చేయిస్తారు. అప్పటి నుంచి ఇద్దరు మైత్రిగా వుంటారు. వీరి స్నేహం విన్న త్వష్ట కొడుకుతో ఇంద్రుడు దుర్మార్గుడని సలహా ఇస్తాడు. కాని వృత్రుడు తండ్రి మాట వినిపించుకోడు, పెడచెవిన పెడతాడు.

ఒకరోజు ఇంద్రుడు, వృత్రుడు వ్యాహ్యాళిగా సముద్ర తీరానికి వెళతారు. అది సాయం సమయం. ఇంద్రునికి పగలు, రాత్రిగాని సమయమిదే అని విష్ణువును తలుస్తాడు. వజ్రాయుధాన్ని సముద్ర అలల నురుగులో ముంచి వృత్రుని మెడపై ఒక్కవేటు వేస్తాడు. వృత్రాసురుడు హాహాకారాలు చేస్తూ కూలిపోయాడు. అప్పుడు దేవతలందరూ రాక్షసులను ఓడించి, దేవలోకాన్ని స్వాధీనం చేసుకుంటారు. దేవేంద్రుడు తను పూజించే వరదేవతకు ఒక మందిరం కడతాడు. దేవతలు ప్రతిరోజు లోకమాతను పూజిస్తారు. వృత్రుని సంహరించినందుకు ఇంద్రుడు 'వృత్రహంత'అనే పేరుతో పిలువబడతాడు. ఇదే వృత్రాసురుని సంహారము.

*(ఆంధ్రభూమి నవంబర్ 18, 2006)*

# శిరిడిబాబా

అశాంతితో బాధపడేవారికోసం, భారతదేశంలో మహనీయులు, పుణ్య పురుషులు జన్మిస్తూనే ఉన్నారు. అట్టి అవతార పురుషుల వలన మానవజాతిలో ఆనందజ్యోతులు వెలుగుతాయి. అలాటి సిద్ధపురుషులే శ్రీ షిరిడీబాబా.

మహారాష్ట్రలోని అహ్మద్‌నగర్ జిల్లాలో ఓ కుగ్రామమైన షిర్డీలో పదహారు సంవత్సరాల వయసులో మొదటిసారిగా బాబా ప్రత్యక్షమయ్యాడు. ఆధ్యాత్మిక సాధనలో పరిపూర్ణుడైన ఈ యువకునిలో మానవాతీత శక్తులు కనిపిస్తాయి. మొట్టమొదటిసారిగా ఒక వేపచెట్టు కింద కూర్చున్న బాబా, కొంతకాలం గడిచాక ఒక శిథిలమైన మసీదుకు తన నివాసం మార్చుకుంటాడు. ఈ మసీదుకే ఆయన 'ద్వారకామాయి' అని పేరుపెట్టారు. ఇక్కడే ఆయన తన దేహయాత్ర చాలించేవరకు నివసించాడు.

సాయిబాబా ప్రేమ, కరుణలకు, మూర్తి స్వరూపుడు. బీదవారి కష్టాలను అడిగి తెలుసుకుంటూ వారికి సలహాలు ఇస్తూ రోగాలకు మందులిస్తూ మానవాళికి సేవ చేశాడు. మసీదులోని పవిత్ర అగ్ని (ధుని) వెలిగించి అందులోంచి విభూతి తీసి భక్తులకు పంచి పెట్టేవాడు. ఇప్పటికీ షిర్డీ 'ద్వారకామాయి'లో ఆయన వెలిగించిన అగ్నిహోత్రం ఆరకుండా వెలుగుతూనే వుంది. ఆయన కరుణ దృష్టి పడినవారంతా పుణ్యాత్ములయాయ్యరు. ఆయన తలచుకుంటే ఎలాంటి బీదవారైనా భాగ్యవంతులయ్యేవారు. ఆయన మాత్రం ఫకీరు వేషంలో భిక్షా పాత్రలద్వారా యాచించి ఆ భిక్షాన్నంతోనే తన భక్తులతో కలిసి భుజిస్తూ జీవ యాత్ర గడిపే వాడు. ఆయన మానవతావాది. నిజమైన త్రికాలవేది. స్థిరంకాని వస్తువులపై ఆయన ఎప్పుడూ ఆసక్తి చూపలేదు. ఎప్పుడూ ధ్యాననిష్టతో, అద్వైత సుఖంతో కాలం గడిపేవాడు. ఆయన హృదయం అతి పవిత్రంగా, నిర్మలంగా వుండేది. భక్తులకు ఆయన అమృత వాక్కులు కురిపించేవాడు. ధనికుడు దరిద్రుడు వీరిమీద సమాన దృష్టితో వుండేవారు. నిందలను ప్రశంసలను సమదృష్టితో

స్వీకరించేవాడు. ఆయన ఎప్పుడూ సిద్ధులను మాయలను ప్రదర్శించలేదు. అవసరమని తోచినపుడు భక్తుల అనుగ్రహం భగవంతునిపై కలగాలని, కొన్ని మహిమల్ని మాత్రం చూపేవాడు. అవి కూడా భగవానుడు సర్వ శక్తిగలవాడని, సర్వజ్ఞుడని తెలపడానికే ఆయన ఆ దివ్య శక్తులను ప్రదర్శించేవాడు.

అప్పట్లో షిర్డీ గ్రామంలో వర్తకులు జ్యోతులు వెలిగించడానికి, చమురు ఇవ్వడానికి బాబాకు నిరాకరించేవారు. అప్పుడు బాబా నీళ్లతోనే వత్తులు వెలిగించాడు. ఈ జ్యోతులు నిర్విరామంగా రాత్రంగా వెలిగాయి. ఒకసారి షిర్డీలో పెద్ద తుపాను వచ్చి ప్రజలంతా భయపడి ఆయన వద్దకు వచ్చి రక్షించమని మొరపెట్టుకున్నారు. బాబా బయటికి వచ్చి తలెత్తి మేఘాలవంక చూస్తూ పెద్ద స్వరంతో 'చాలు చాలు మీ ఉధృతం తగ్గించుకుని ప్రశాంతంగా సాగిపొండి' అని ఆదేశించాడు. వెంటనే పెనుగాలులు తగ్గి వర్షమాగిపోయి ప్రశాంత వాతావరణం ఏర్పడింది.

బాబా భక్తులనుంచి కోరేది రెండే ఒకటి అచంచల విశ్వాసము, రెండు సహనము (ఓర్పు). గురువును త్రిమూర్తులుగా భావించి పరిపూర్ణ విశ్వాసం ఉంచమని భక్తులకు ఉపదేశమిచ్చేవారు.

ఎప్పటికీ నయంకాని దీర్ఘవ్యాధులను బాబా తమ దివ్యశక్తులతో నయం చేసేవారు. భీమాజీ పటేల్ చాలా కాలంగా గుండెనొప్పితో బాధపడుతూ వుండేవాడు. అదే చివరికి భయంకర వ్యాధి 'క్షయ'గా మారింది. అన్ని చికిత్సలు చేయించుకుని విసిగిపోయి నిరాశతో చివరకు బాబాను ఆశ్రయించాడు. బాబా హృదయం ద్రవించింది. రెండు స్వప్నాలతో అతని వ్యాధిని పోగొట్టాడు మరొక భక్తుడు పిళ్ళై నోటి కురుపులతో బాధపడేవాడు. బాధ భరించడం చేతకానపుడు అతను బాబా వద్దకు వచ్చి తన బాధను వెంటనే పోగొట్టమని ప్రార్థించాడు. మరో పదిజన్మలు ఈ బాధ అనుభవిస్తానని మొరపెట్టుకున్నాడు. ఈ సంగతి బాబా వినగానే పది జన్మలెందుకు? పదిరోజులలో పురాతన కర్మ ఫలాన్ని అనుభవిస్తే సరిపోతుంది అని చెప్పి పదిరోజుల లోనే పిళ్ళైను స్వస్థుడిని చేశాడు.

భక్తులంటే బాబాకు అమిత ప్రేమ. వారి బాధలను, కష్టాలను తనపై వేసుకుని వారి స్థానంలో తాను ఆ బాధలను అనుభవించేవాడు. బాబా దగ్గర ఒక భక్తురాలు తన కుమారునితో వుంటూ వుండేది. ఆ పిల్లవానికి ఒకరోజు ప్లేగువ్యాధి వచ్చి ఒళ్లంతా బొబ్బలెక్కాయి. అవి ప్లేగుగా మారాయి. ఆ భక్తురాలు బాబాను ఆశ్రయించగా ఆయన ఆమెను ఏమీ భయపడవద్దన్నాడు. బాబా ధరించిన అంగీ విప్పి చూస్తే ఆయన శరీరమంతా బొబ్బలే. భక్తుల కష్టాలను తనవిగా భావించి వాటిని భరిస్తూవుండేవాడు.

1918వ సంవత్సరం అక్టోబర్ నెలలో తాత్యా పటేల్ అనే భక్తుడు తీవ్రమైన వ్యాధికి లోనై మరణశయ్యపై వున్నాడు. అందరూ ఇక బ్రతకడని ఆశ వదులుకున్నారు. బాబా కూడా ఆ సమయంలో వ్యాధిగ్రస్తుడై జ్వరంతో బాధపడుతున్నాడు. విజయదశమి రోజున విచిత్ర సంఘటన జరిగింది: జ్వరంతో వున్న బాబా సమాధి పొందాడు. మరణశయ్యమీద వున్న తాత్యాపటేల్ వెంటనే కోలుకున్నాడు. బాబా అంటూ వుండేవాడు భక్తుల ప్రాణాలు కాపాడటానికి నా ప్రాణాలనే అర్పిస్తాను అని.

బాబా మన మధ్య లేకపోయినా ఆయన సర్వాంతర్యామి. ఎన్నో రూపాలలో భక్తులకు దర్శనమిస్తూ ఎన్నో విధాలుగా ఆదుకుంటూ మన మధ్యనే సంచరిస్తున్నాడు. బాబా ప్రధాన లక్ష్యం మానవుల బాధలను తొలగించడం, భక్తులకు మంచి వస్తువులు అందివ్వడం, వారిని ప్రారబ్ధ కర్మల నుంచి విముక్తి చేయడం. మనం చేయవలసిందల్లా ఆయనపై విశ్వాసముంచటం, శరణువేడటం. ఆయన దృష్టిలో రామ్ రహీమ్ ఒక్కరే. దేవాలయం, మసీదు ఆయన నివాస స్థలాలే. గీత-ఖురాను ఆయన పవిత్ర గ్రంధాలే. అన్ని మతాలు ఒకే లక్ష్యం కోసం ఏర్పడినవని, భగవంతుడు అందరికీ ఒకడేనని సాయిబాబా అందరికీ ప్రబోధించేవాడు. జాతి సమైక్యత భావంకోసం ప్రయత్నించే నేటి సమాజానికి బాబా బోధనలు ఆచారణ యోగ్యమైనవి.

*(ఆంధ్రభూమి మార్చి 16, 2006)*

# మన ఋషులు

ఆయన ఋషివంటి వారు. అంటూ ఉంటాం – 'ఋషి' అంటే మంత్రాలను దర్శించినవాడు అని కూడా అర్థం. నిష్ఠ గలిగిన పురుషుడిని ఋషి అంటాం. కొంతమందిని ముని అని అంటూ ఉంటాం అంటే మనవి చేసేవాడు ముని. ఆలోచించేవాడు, మనసులోనే నెమరవేసుకునేవాడు ముని. ఋషులలో బ్రహ్మర్షి, రాజర్షి, దేవర్షి అని మూడు విధాలుగా ఉన్నారు. బ్రహ్మర్షి అంటే జ్ఞానయోగి, జ్ఞాన మార్గాన్ని చూసినవాడు. తత్త్వజ్ఞానం కలవాడు. కొత్తకొత్త సిద్ధాంతాలను వెలుగులోకి తెచ్చి సమాజం ముందు ఉంచేవాడు. సమాజహితం కోసం వీరు సమాజానికి దూరంగా ఆశ్రమాలలో ఉంటారు. శాస్త్రాలను అభివృద్ధి చేయడం వీరి ముఖ్య కర్తవ్యం.

ప్రజలను రంజింపజేసేవాడు రాజు. అలాటి రాజు ఆత్మజ్ఞానం కల్గి తామరాకుమీద నీటి బిందువులా విధి నిర్వహణ చేసేవాడు. సిద్ధాంతాల ఉపయోగాన్ని అమలులోకి తేవడం రాజర్షులపని. వీరికి ఉదాహరణమే జనకమహర్షి, మనువు మొదలగువారు. భక్తిమార్గంలో నడుస్తూ ఈశ్వరుని రూపాన్ని ఉపాసించే దృష్టి గలవాడు దేవర్షి. భగవంతుని గుణాన్ని భక్తితో గానం చేస్తారు. సహృదయుడు సంగీత శాస్త్రం తెలిసినవారు, కళలను బాగా అర్థం చేసుకునేవారు దేవర్షిలు. ఉదాహరణకు నారదుడు, శుకుడు, వాల్మీకి.

వేదంలో సూక్తి ఋషిశతం – వైఖానస అర్యాలలో తపస్సు చేసుకునేవారిని 'వైఖానసులు' అంటారు. వీరు సూక్తులు చెప్తుంటే మిగతావారు దానిని గూర్చి చర్చించేవారు. అర్థాలు ఒకరికొకరు తెలుసుకునే వారు. ఏదన్నా చేర్పులు, మార్పులు చేసేవారు. ఈ మాదిరిగా సామూహికంగా శాస్త్రాలు చర్చించుకొని అధ్యయనం చేసేవారు.

అనేక కుటీరాలు ఉన్న తపస్వినులు నివసించే ప్రాంతం 'తపోవన'మని పిలిచేవారు. లేకపోతే ఆశ్రమమని పిలిచేవారు. వీరందరికీ అధిపతిగా, వయోవృద్ధుడైన ముని ఉండేవారు. అతనిని 'కులపతి' అనేవారు.

రామాయణ కాలంలో ఉత్తర ప్రాంతంలో సరయూ తీరం నుండి దక్షిణంలో గోదావరి తీరం వరకు ఆశ్రమాల వరస ఉండేది. దండకారణ్యంలో నర్మద, గంగాతీరాలలో చిత్రకూట పర్వతంమీద అనేకమైన ఆశ్రమాలు ఉండేవిట. వశిష్టుడు, అగస్త్యుడు, అత్రి, వాల్మీకి, సుతీక్షుడు, శబరి వీరి ఆశ్రమాలు ఎప్పుడూ వేదాధ్యాయన ఘోషతో ఆశ్ర మ పరిసరాలన్నీ కూడా ప్రతిధ్వనించేవి. అవి బ్రహ్మలోకాన్ని గుర్తుకు తెచ్చేవి. ఋషులు సమాజానికి ఇచ్చింది ఏమంటే యుగయుగాలుగా తరతరాలుగా మార్పులు పొందుతున్నా వాటికి, కాలదోషం పట్టకుండూ సంస్కృతినిధిని వారు మనకు సమకూర్చిపెట్టారు. ఋషుల శక్తి, యుక్తుల గురించి ప్రజ్ఞాపాటవాల గురించి రామాయణ, భారతం, పరిచయాల ద్వారా మనకు తెలుస్తోంది రామాయణ కర్త వాల్మీకి, మహాభారత గ్రంథకర్త, కృష్ణద్వైపాయనుడు, నారదుడు, వశిష్టుడు, జనకుడు ఇలా అందరూ వీటిలో మనకు దర్శనమిస్తారు. వీరందరు కూడా ఆయా సందర్భాలలో సమాజానికి, ఆచరణీయమైన ఉపదేశాలు అందించారు. నారద మహర్షికి, పరమాత్మ గురించి తెలుసు అంటే మనం ఆశ్చర్యపడాల్సిన పనిలేదు.

అయితే ప్రజల, కార్మికుల కష్టాలు, వ్యవసాయ కూలీల బాధలు, బడుగు వర్గాల ఇక్కట్లు ఇది కూడా ఆయనకు తెలుసుంటే మనకు ఆశ్చర్యం కలుగుతుంది. భారతంలో నారదుడు, ధర్మరాజుకు, రాజధర్మాల గురించి ఉపదేశిస్తూ కార్మికుల గురించి చర్చించటం మనకు కన్పిస్తుంది. పరాశరుడు, జనకమహర్షి, భృగుమహామునికి, భరద్వాజునకు చెప్పినటువంటి రాజధర్మాలు ఈనాటి పాలకులకు మార్గదర్శకాలు అవేవి మనం తెలుసుకోవలసిన వుంది. దుర్వాసుడు, అగస్త్యుడు, వశిష్ఠుడు, గౌతముడు, విశ్వామిత్రుడు ఇలా ప్రఖ్యాతి గాంచిన

ఋషిపుంగవులు ప్రజలు, మర్యాదను గనుక అతిక్రమిస్తే శపించేవారు. అయితే ఇలా చేసినందువల్ల ఆధ్యాత్మిక సంపద తగ్గుతుంది అని శపించేవాడు కాదు. అందుకని తపస్సు చేసేవారు, యజ్ఞాల రక్షణకోసం రాజులను ఆశ్రయించేవారు. వ్యక్తి, శీలం, సంస్కారం, తీర్చిదిద్దటానికి, ఋషులు చెప్పిన కథలు, ఉపదేశాలు తోడ్పడుతాయి. అప్పట్లో పాలకులు చిత్తశుద్ధితో ఉండటం సమాజం ఆదర్శంగా, ఆరోగ్యంగా ఉండేది. మంత్రమూర్తులైన మహర్షులకు నమస్కరించాలి. వారిని మనం మరువకూడదు.

*(ఆంధ్రభూమి మే 31, 2007)*

# కుమారస్వామి

'కుమారుడు' అంటే పిల్లవాడు అని అర్థం. మన మనస్సు దివ్య సంకల్పంతో, యోగసాధనతో నిండి వున్నపుడు, అనుక్షణం కుమారత్వంతో నిండి వుంటుంది. అంటే మహాశక్తివంతమై వుంటుంది. అందుకే కుమారస్వామి ఆయుధం 'శక్తి' అని చెప్తారు. బాహ్య ప్రపంచంలో శక్తి అంటే ఒక బరువైన ఆయుధం, మానసిక ప్రపంచంలో శక్తి అంటే సంకల్ప శక్తి. రాగద్వేషాలు అనే స్పర్శ లేకుండా, దివ్య సంకల్పంతో మన మనస్సు నిండివున్నంతసేపు మనలో కుమారస్వామి గుర్తు వస్తూనే వుంటాడు. సాధకులకు కుమారస్వామి ఆరాధన వలన, సంకల్పసిద్ధి కలుగుతుంది.

పార్వతీ పరమేశ్వరులు కళ్యాణం జరిగిన తర్వాత వారు గృహస్థ ధర్మాన్ని నిర్వర్తిస్తూ సంతానం కోసం వేచివున్నారు. అంటే పరమాత్మ ప్రకృతితో కలిసి చాలా కాలానికి సృష్టి ఏర్పడటానికి సన్నాహం ప్రారంభమవుతుంది. రుద్రుని తేజస్సు వలన పార్వతిదేవి గర్భం ధరిస్తుంది. కాని ఆ తేజస్సును ఆమె భరించలేకపోతుంది. అప్పుడు వాయుదేవుని సహాయం కోరుతుంది. ఆ తేజస్సును అగ్నిహోత్రుని వద్దకు పంపుతుంది. అయితే అగ్ని కూడా ఆ తేజస్సు భరించలేక, చెదరగొట్టి శకలాలుగా వెలిగించి, ఏడు రంగుల జ్వాలలతో తన భార్య అయిన స్వాహాదేవితో సుఖం అనుభవిస్తాడు. అందులో ఆరు రకాల అగ్నులుగా మాత్రం స్వాహాదేవి అగ్నిని తనలో లీనం చేసుకుంటుంది. ఆ మంటలు కృత్తికల రంగులలో ఏర్పడుతాయి. కృత్తికలు సప్తఋషుల భార్యలని శాస్త్ర ం చెపుతుంది. కృత్తికా నక్షత్రాల గుంపులో ఆరు నక్షత్రాలు మనకు కనపడతాయి ఒకటి మాత్రం కనబడదు. ఆ ఒక్కటీ అరుంధతీ నక్షత్రం. అది వశిష్టుని నక్షత్రం. ప్రక్కనే వెలుగుతూ వుంటుంది. దీనినే పురాణంలో ఒక చక్కని కదగా రూపొందింది. అదే మంటే అగ్నిహోత్రునికి సప్త ఋషుల భార్యలపై వ్యామోహం కలిగింది.

అతని భార్య స్వాహాదేవి అతనిని, ఆ అపచారం నుంచి కాపాడటానికి తానే సప్తఋషుల భార్యల రూపం ధరించి, తన భర్తతో విహరించే ప్రయత్నం చేసింది. ఒక్క వశిష్టుని ధర్మపత్ని అరుంధతి రూపం మాత్రం ధరించలేకపోతుంది. ఆకాశంలో గ్రహాలు కాకుండా, నక్షత్రాలు మనకు వేరుగా కనిపిస్తాయి. ఒక్కొక్క నక్షత్రం ఒక్కొక్క సూర్యుడు. అందులో కొన్ని సూర్యుని కంటే ఉత్తమమైనవి. అందులో ఉత్తమ ఆధ్యాత్మిక సూర్యులు, ఐదుగురు తక్కువ శక్తిగల సూర్యులు కలిసి ఒక పెద్ద కేంద్రం చుట్టు తిరుగుతూ వుంటాయి. అగ్నిదేవుని ద్వారా పుట్టిన కుమారస్వామికి, కృత్తికలు పాలిచ్చిపెంచాయి. అలా జన్మించిన కుమారస్వామికి ఆరు ముఖాలు ఉన్నాయి.

సంతానదోషం వున్నవారికి సుబ్రహ్మణ్యస్వామిని ఆరాధన చేయించడం అనే సంప్రదాయం మన దేశంలో వుంది. సుబ్రహ్మణ్య అంటే బ్రహ్మజ్ఞానం కలవాడు. సప్తధాతు మయమైన మానవశరీరం వెన్నెముకలోని నాడీ మండల ప్రభావంతో ప్రజ్ఞావంతంగా నిర్వహించబడుతోంది. మన శరీరంలో సమస్త నాడీ మండలానికి కేంద్రం వెన్నెముక. ఈ సప్తధాతువులతో నిండిన మానవ శరీరంలో కొన్ని మంచివి, కొన్ని చెడువి వుంటాయి. మానవ జన్మ అంతా కూడా మంచి సంస్కారంతో ప్రభావితం చేయబడుతుంది. చెడు ప్రవృత్తులతో కూడా నిండివుండి సుఖదుఃఖాలతో సాగిపోతూ వుంటుంది.

మన అన్నమయ శరీరంలో, వున్నటువంటి సప్త ధాతువులలో శుక్ర ధాతువు ముఖ్యమైనది. శుక్రకణాలు సర్ప ఆకారంలో వుంటాయి. ఎవడు కామప్రవృత్తితో అపచారం చేస్తాడో వాడు ఆ సర్పాన్ని హత్య చేసినట్లు. సర్పస్వామి అయిన సుబ్రహ్మణ్యస్వామికి ఆచరించినట్లు స్త్రీ పురుష శరీరంలో సర్పదోషం అనే దోషం ఏర్పడుతుంది. ఈ శుక్రం ఊర్ధ్వగతి పట్టినప్పుడు ఓ జిహ్వా బలము, తేజస్సు, దేవతల ధామంగా పరిణమిస్తుంది. ప్రతిరోజు సంధ్యావందనంలో గాయత్రిని ధ్యానిస్తున్నాడు సాధకుడు. ఆపైన ఈ తేజస్సు

ఈ విశ్వానికి సృష్టి చేయబడుతున్న మూల ప్రకృతిగా మనలో అనుభూత మవుతుంది. దానినే విశ్వం ఆయుర్బలంగా సాధకుడు ధ్యానం చేస్తాడు.

ఈ రీతిగా గర్భధారణానికి కారణాలైన పితృ లోకాలకి, ఊర్ధ్వగతికి, కారణాలైన శుక్రధాతువు మానవునికి నిచ్చిన వంటిది. 'శీలము' అనే సంపదతో శుక్రధాతువు భద్రపరచుకుని, దేవ, పితృ లోకాలలో తమ ఋణాన్ని తీర్చుకోగలిగిన వాడే సుబ్రహ్మణ్యుడు అవుతాడు. అతడే సరైన గృహస్థుగా సత్సంతతిని సరైన బ్రహ్మచారిగా, సద్గతిని పొందగలడు. జీవులలో వున్న దివ్యజ్యోతిని ఆరు దిక్కులకే కేంద్రంగా ధ్యానం చేసినట్లయితే సుబ్రహ్మణ్య ఆరాధన అవుతుంది. అందులో ఒక్కొక్కదానికి శ.ర.వ.ణ.భ.వ. అనే ఆరు అక్షరాలు మనం మనసారా ఉచ్చరిస్తూ వుండాలి. అప్పుడు మన మనస్సు షణ్ముఖుని ఆరు ముఖాలుగా ప్రత్యక్షమవుతాయి.

# ఆదిత్యుడు

*"సప్తాశ్వరథమారూఢం ప్రచండం కశ్యపాత్మజం*

*శ్వేత పద్మ ధరం దేవం తం సూర్యం ప్రణమామ్యహమ్"*

రామ, రావణ యుద్ధంలో రాముడు ఎన్ని అస్త్రాలు ప్రయోగించినా, రావణుడు హతుడు కాలేదు. తెగిన తలలు తిరిగి అతుక్కుంటూనే వున్నాయి. రాముడు ఏమి కారణం అని దిగులుచెందుతుండగా, అగస్త్య, మహాముని అక్కడికి వేంచేస్తాడు. రాముడిని దగ్గరకు పిలిచి 'ఆదిత్య హృదయ మహా మంత్రాన్ని' ఉపదేశిస్తాడు. రాముడికి విజయం కలుగుతుంది.

ప్రతి మనిషి కాలంతో కదులుతాడు. సూర్యోదయంతో అతని పనులు ప్రారంభమవుతాయి. మానవుడు వెలుతురుకోసం వెతుక్కుంటాడు. కటిక చీకటి వుంటే అలమటిస్తాడు. సూర్యుడు గనుక లేకుంటే తానెవరో కనుక్కోవడం కష్టం.

**'ఆదిత్యానా మహం విష్ణు**

**జ్యోతిషాం రవిరంశుమాన్'**

'నేను ఆదిత్యులలో విష్ణుడను, ప్రకాశింపచేయువాడిలో కిరణములు గల సూర్యుడను' అని భగవద్గీత సందేశం. సూర్యుని వలననే దిక్కులు, స్వర్గము, భూమి, ఆకాశం అనే భేదాలు కలిగాయి. సూర్యుని రధానికి గుర్రాలు ఛందస్సులు అని ఏడు వున్నాయి. గరుడుని అన్న అయిన అసూరుడు రధానికి సారధి. అంగుష్టమాత్ర ప్రమాణులైన అరవై వేలమంది, వాలఖిల్యాది ఋషులు, దేవ ఋషులు, అప్సరసలు, దేవతలు, సూర్యుని రధానికి ముందు వెళ్తూ, ఆదిత్యుని స్తుతిస్తూ వుంటారని దేవీభాగవతం చెప్తోంది. కాలచక్రాన్ని అనుసరించి ఆయారాసులను బట్టి, గ్రహాలు తిరుగుతూ వుంటాయి. లోకాధారుడైన,

నారాయణుడు లోక క్షేమాన్ని దృష్టిలో వుంచుకొని వేద స్వరూపుడై కర్మశుద్ధి లక్ష్యంగా భాస్కరుడిగా రూపొంది జీవకోటికి చైతన్యం ప్రసాదిస్తున్నాడు.

సూర్యుడు మేరువును పరిభ్రమిస్తూ రేయి, పగలు అనేవి కలిగిస్తూ వుంటాడు. సూర్య దర్శనం కలిగిన వారికి పగలు, కనిపించనివారికి, అస్తమయం అవుతూ వుంటుంది. సూర్యోదయంతూర్పువైపు, అస్తమయం పడమరవైపు అని దేవిభాగవతం స్పష్టం చేసింది. సూర్యుడు ఉత్తరాయణంలో మందగతి, దక్షిణాయనంలో శీఘ్రగతిగా పరుగులిడుతూ వుంటాడు.

సూర్యుడు మకరరాశిలో ప్రవేశించగానే ఉత్తరాయణం, కర్కాటకరాశిలో ప్రవేశించగానే దక్షిణాయనం ప్రారంభమౌతుంది. దేవతలకు ఉత్తరాయణం పగలు, దక్షిణాయనం రాత్రి అని అంటారు. ఈ రెండు కలిస్తే వారికి ఒకరోజు మనకు ఒక సంవత్సరం.

ఆషాఢమాసం రాగానే ఏకాదశినాడు శ్రీ మహావిష్ణువు 'శేషతల్పశాయి' అవుతాడు. అందుకే ఆ ఏకాదశిని 'శయనైకాదశి' 'తొలిఏకాదశి' అని అంటారు. మార్గశిర మాసంలో ఏకాదశినాడు విష్ణుమూర్తి నిద్రనుంచి మేల్కొంటాడు. అందుకే ఈ ఏకాదశిని 'ఉత్థాన ఏకాదశి లేక వైకుంఠ ఏకాదశి' అని అంటారు. ముక్కోటి దేవతలు మేల్కొన్నందు వలన ఇది సంక్రాంతి వరకు సాగుతుంది.

వైకుంఠ ఏకాదశి విష్ణుమూర్తి ఉత్సవ విగ్రహాన్ని ఉత్తర ద్వారం వైపు దర్శనమిచ్చేటట్టుగా అన్ని వైష్ణవాలయాలలో ఏర్పాటుచేస్తారు. దాని విశేషం మనకు మహాభారతంలో వివరించబడింది.

కురుక్షేత్ర యుద్ధంలో, అర్జునుని ముందుగా వున్న శిఖండిని చూచి భీష్ముడు అస్త్రసన్యాసంచేస్తాడు. అప్పుడు అర్జునుడు తన బాణాలతో, అంపశయ్యను ఏర్పాటుచేసి భీష్ముని దానిపై వొరిగి పోయేట్లుగా చేస్తాడు. తాను కోరినపుడే చనిపోయే వరం వున్నందున భీష్ముడు ఉత్తరాయణ పుణ్యకాలం వచ్చేవరకు వేచివుండి, ఏకాదశినాడు కృష్ణుని ఎదురుగా, తన ప్రాణాలు వదలిపెడతాడు.

అతని ప్రాణాలు శ్రీకృష్ణునిలో ఐక్యమౌతాయి. అప్పటి నుంచి అది 'భీష్మఏకాదశి' అని పిలువబడుతోంది. ధనుర్మాసంలో మహిళలు రంగు రంగుల ముగ్గులు సంక్రాంతి పండుగ వరకు వేస్తుంటారు. ఉత్తరాయణ పుణ్య ఫలితాలు మళ్లీ జన్మలేని భీష్ముడులాంటి యోగులకు వర్తిస్తుందన్ని, అజ్ఞానులైన సామాన్య జనులకు వర్తించదని భగవద్గీతలో కృష్ణుడు వివరిస్తాడు.

అగ్ని జ్యోతి, పగలు, శుక్ల పక్షము, ఉత్తరాయణం ఇందులో మొదటి నాలుగు ప్రకాశాన్ని సూచిస్తాయి. ప్రకాశం జ్ఞానానికి సంకేతం. ఐదవది అయిన ఉత్తరాయణం ఊర్ధ్వాన్ని సూచిస్తుంది. జ్ఞానులు మాత్రమే బ్రహ్మాన్ని తప్పక పొందుగలుగుతారని, ఉత్తరాయణంలో మరణించిన ప్రతివాడు పొందలేడని, పురాణాలు చెప్తున్నాయి.

వాయువు మాకు ఆనందమును ఇచ్చుగాక, సముద్రములు మాకు సుఖమునిచ్చుగాక, ఓషధులు మాకు సంతసము కూర్చుగాక, రాత్రిళ్లు, పగళ్లు మాకు శ్రేయస్సును కలుగజేయుగాక, భూమి మాకు సంతృప్తిని కలుగజేయుగాక, తండ్రియగు స్వర్గము మాకు పరమానందము చేకూర్చుగాక, చెట్లు, చేమలు మాకు సుఖము నొసంగుగాక, సూర్యుడు మాకు ఆనందమును కలుగజేయుగాక, గోవులు మాకు సంతోషమును చేకూర్చుగాక, విశ్వరూపులగు పరమాత్మకు నమస్కారము (ఋగ్వేదము).

ప్రజలను బాధించే కఫము, వాతము, ఉబ్బసము, అగ్నిమాంద్యము, మూత్రవాతం, కంటి రోగాలు, శిరోరోగాలు, నేత్రరోగాలు మొదలైనవి ఆదిత్యుని అనుగ్రహం వలన తొలగిపోతాయని ఆయుర్వేద వైద్యులు చెప్తుంటారు. ఏ మంత్రం రాకపోయినా ఉదయానే గ్రామస్తులు చేతులెత్తి సూర్యునికి నమస్కరించడం మనం చూస్తుంటాము. సూర్యుడు ప్రత్యక్ష దైవం అని అశ్వనీ దేవత అని కూడా అంటుంటాం. సూర్యోపాసనతో మన జీవితం సఫలీకృతం చేసుకోవాలి.

*(ఆంధ్రభూమి జనవరి 26, 2006)*

# అంజనా సుతుడు

రెక్కాడితేగాని డొక్కాడని బ్రతుకులు గ్రామ ప్రజలవి. గళాన్ని సవరించుకుని, రాగాలు ఒలికిస్తారు పల్లె ప్రజలు. మనసు ఎంత స్వచ్ఛమో, వాళ్ల పాటలుకూడా అంత స్వచ్ఛత కలిగి వుంటాయి. బ్రతుకుబాటలో కష్టాలు అనుభవించినపుడు వాళ్ల ఉద్రేక హృదయాల నుంచి ఆశువుగా వచ్చే పాటలు, వాళ్ల జీవితంలో భాగమైనాయి. పాట వాళ్ల ఊపిరి. పాట వాళ్లకు ప్రాణం.

ఈ పాటల్లో రామాయణం, భాగవతం కథలు చోటు ఎక్కువగా చేసుకుంటాయి. ముఖ్యంగా రామాయణం, నిర్మలమైన జానపదుల హృదయాలనుంచి అనేక సందర్భాలలో జారివచ్చే పల్లెపదాలన్నీ ఒక ఎత్తు. మొదటిది లౌకిక సంబంధం అయితే రెండవది అలౌకిక సంబంధమైనది.

రామాయణంలో కథా నాయకుడు దివ్య పురుషుడు శ్రీరామచంద్రుడు, పల్లె ప్రజల హృదయాలలో కొలువుదీరి ఆరాధించ బడుతున్నాడు. అనంత స్వామిభక్తిగల ఆంజనేయుడు కూడా వాళ్ల మనసులో ఎప్పుడూ వెలుగుతూ వుంటాడు. సీతారామ లక్ష్మణులు అంటే పల్లెప్రజలకు ఎంతో భక్తి, ఇష్టంకూడాను. పేదల దేవుడుగా, ప్రభుభక్తి పరాయణుడుగా, కీర్తింపబడిన ఆంజనేయస్వామి అంటే అపరిమితమైన ఆరాధన. హనుమంతుడు దయా సముద్రుడు. నమ్మినవారిని , వెంట వుండివాళ్ల యోగక్షేమాలు చూసే దేవుడు. పల్లె ప్రజల గుండెలలో గుడికట్టుకుని పూజలు అందుకుంటున్న మహోన్నత చరితుడు. రామాలయం లేని వూరు వుంటుందేమోగాని, ఆంజనేయస్వామి లేని వూరు వుండదు. సంజీవరాయుడు, హనుమంతుడు, అంజనాసుతుడు, తోకరాయుడు పేర్లతో పిలువబడుతూ, భక్తుల కొంగు బంగారమై, పిలిస్తే పలికే దైవంగా ప్రసిద్ధికెక్కాడు. సీతారాముల గాథ గానం చేసినట్లే రామదాసు అయిన వాయుపుత్రుని కథను కీర్తిస్తూ భక్తి పారవశ్యంలో మునిగి తేలుతూ భజనలు చేస్తుంటారు. గ్రామప్రజల భావనలో ఆలోచనలో ఆరాధనలో పవనసుతుని స్థానం, వాళ్లు పాడే పాటలద్వారా మనం తెలుసుకోవచ్చు.

రావణాసురుడు, స్త్రీ లోలుడై వంచనతో సీతాదేవిని అపహరించుకుని పోయి లంకలో అశోకవనంలో బంధిస్తాడు. ఇది తెలుసుకొని రావణుని భార్య మండోదరి, స్త్రీ వ్యామోహం మంచిది కాదని, పరిపరివిధాలుగా హితం చెబుతూ తనకు రాత్రి స్వప్నం వచ్చిందని, లంకా సామ్రాజ్యం ఎర్రని రంగుతో నిండిపోయి వుందని, ఆకాశమంతా ఆ ధూళి కమ్ముకున్నట్లు ఆ విచిత్ర సంఘటనకు, మనసంతా కలత చెందినట్లు చెప్తుంది. ఎందుకలా జరిగింది? ఆలోచిస్తుంటే నా కళ్లకెదురుగా ఒక వానరం కనిపించింది. అది సామాన్య వానరం కాదు. మూడు మూర్ల తోకతో మూడు నామాలు పెట్టుకుని అగుపించింది. అది అంతటితో ఆగలేదు. మన లంకంతా కలియ తిరుగుతూ ముట్టడించింది. మన వాళ్ళందరిని ముప్పతిప్పలు పెట్టి మూడు చెరువుల నీళ్లు తాగించింది. ఎందుకో నా మనసు కీడు ఊహిస్తోంది. ఆ అపశకునాలన్నిటికీ కారణం మహా పతివ్రతయైన సీతాదేవిని నీవు చెరపట్టటమే అని అంటూ, మండోదరి వద్దునాథా, వద్దు నా మాట మన్నించి వాళ్ల సీతను వాళ్లకిచ్చి రామచంద్రుని శరణుగోరితే ఆ పుణ్య పురుషుడు నిన్ను క్షమించి ప్రాణభిక్ష పెడ్తాడు అని ఆ సాధ్వి ఎంతో హితవు చెప్తుంది. రామాయణ కావ్యంలో సుందరకాండ ఘట్టానికి ఒక విశిష్ట స్థానం వుంది. కోటి సూర్యుల తేజస్సుతో ప్రకాశిస్తూ, సుందర రూపుడైన పవనసుతుడు లంకా నగరాన్ని సందర్శించి, దాని వైభవాన్ని చూచి ఆశ్చర్యపోతూ సీతకోసం వెదుకుతాడు.

పక్షుల కిలకిలా రావం, కోయిలల కుహుకుహు గానం, తుమ్మెదల వీణానాదం మనోహరంగా వున్న అశోకవనంలో సీతను కనుక్కుంటాడు. శత్రువీరుల బలాబలాలు అంచనా వేయడానికి, రాక్షసులతో జగడం పెట్టుకోదలచిన హనుమంతుడు అక్కడ వుండే తోరణ స్తంభాలు పడగొడతాడు. జలాశయాలగట్లు తెంచుతాడు. పువ్వులను, ఫలాలను నేలకూల్చుతాడు. ప్రాకారాలు పడగొడతాడు. మనోహరమైన అశోకవనం, క్షణంలో నాశనం చేస్తాడు.

అశోకవనాన్ని నేలమట్టం చేసిన హనుమన్నను ఇంద్రజిత్తు నాయకత్వంలో రావణుని కొలువుకు తెస్తారు. రావణుడు నువ్వే నా లంకను నాశనం చేసింది. ఎంత ధైర్యం నీకు? నా ఎదుటే వాలంతో గారడీలుచేసి నా కంటే ఎత్తుపై కూర్చుంటావా? ఇక్కడికెందుకొచ్చావు ప్రాణాలు తీస్తాను అంటూ కోపావేశంతో ఊగిపోతాడు దశకంఠుడు.

హనుమంతుడు ఏమాత్రం భయపడకుండా తాను వచ్చిన పని చెప్పి సీతను రాముని కప్పగించి శరణు వేడమని హితం చెప్తాడు. రావణుడికి హనుమంతుడి హితం రుచించదు. నిండుసభలో దశకంఠునికి, వాయుపుత్రునికి జరిగిన సంవాదం గ్రామ ప్రజలు నాటకం మాదిరి చిందులు వేస్తూ పాడతారు.

చూసి రమ్మంటే కాల్చివచ్చిన హనుమంతుని ద్వారా, సీత జాడ తెలుసుకున్న రాముడు కపిసేనను వెంటపెట్టుకుని లంకానగరం చేరి యుద్ధభేరి మ్రోగిస్తాడు. మేఘనాధుడు, రావణుని కుమారుడు, మేఘాలలో వీరవిహారం చేస్తూ మాయా యుద్ధం చేస్తాడు. అతనితో లక్ష్మణస్వామి ఎదురిస్తాడు. లక్ష్మణుడు ఇంద్రజిత్తు మాయ వలన మూర్ఛపోతాడు. నేలకొరిగిన లక్ష్మణుని చూసి రాముడు గుండె పగిలేలా దుఃఖిస్తాడు. అయితే లక్ష్మణుడు మరణించలేదని, మూర్ఛబోయాడని, సూర్యోదయానికి పూర్వమే సంజీవిని తెస్తే దానితో సౌమిత్రి బ్రతుకుతాడని వైద్యుడు చెప్పిన మాటలు, రాముని నోటి నుంచి విన్న హనుమ, సూర్యోదయానికి ముందే సంజీవిని తెచ్చి లక్ష్మణుని బ్రతికించుకోవాలని ఆరాటపడతాడు. అందుకు రావణుని మామ అడ్డుపడటం వాటిని వాయుపుత్రుడు ఛేదిస్తాడు. కోరిన వరాలిచ్చే మహిమాన్వితుడు, కష్టాలు తీర్చే ఇలవేల్పు అయిన వాయుపుత్రుడు తమ హృదయ కమలంపై ఆసీనుడై తమ ఆలనాపాలనా చూసుకుంటాడని భక్తుల ప్రగాఢ విశ్వాసం.

*(ఆంధ్రభూమి ఏప్రిల్ 10, 2005)*

# గురు రాఘవేంద్రులు

శంఖు కర్ణుడనే దేవజాతి పురుషుడు కొన్ని కారణాలవలన బ్రహ్మచే శాపం పొంది ప్రహ్లాదుడుగా అవతరించి నాస్తికత్వాన్ని రూపుమాపి తర్వాత యుగాలలో ధర్మరక్షణకై అవతారం దాల్చి కీర్తి పొందాడు. క్రీ.శ. 1447 సంవత్సరంలో తిరిగి భూమిపై వ్యాసరాయలుగా అవతరించాడు. అప్పటి కాలంలో ధర్మం పెడత్రోవ పడుతోంది. వ్యాసరాయలు ధర్మాన్ని సరిదిద్ది అఖండ హరిభక్తి మధ్వ మత సిద్ధాంతాన్ని పునరుద్ధరించాడు.

క్రీ.శ. 17వ శతాబ్దంలో గోపన్న, తిమ్మనభట్టు అనే బ్రాహ్మణ దంపతులకు శ్రీరాఘవేంద్రస్వామి జన్మించారు. బాల్యంలోనే అపారమైన విజ్ఞానాన్ని సంపాదించి, సుదీంద్రతీర్థులవారి అనుగ్రహంతో సన్యాసము స్వీకరించి, గొప్ప హరిభక్తితో మహిమల్ని చూపించాడు. రాఘవేంద్రునికి తల్లిదండ్రులు మొదట వెంకన్నభట్టు అని నామకరణం చేశాడు. చిన్నతనంలోనే పితృవియోగం తటస్థించడం వలన వారి బాధ్యతలు అన్నగారిపై పడ్డాయి. ఆర్థికంగా చితికిపోయిన స్వామి కుటుంబాన్ని వారి బావగారు ఆదుకుని తన ఇంట్లోనే వుంచుకుని విద్య నేర్పించాడు. వెంకన్నకు సరస్వతి అనే కన్యతో వివాహం జరిపించగా ఒక పుత్రుడుకూడా జన్మించాడు.

సంసార యాత్రలో వున్నా శ్రీవారికి విద్యాతృష్ణ చల్లారలేదు. భార్య అనుమతి తీసుకుని కుంభకోణంలోని మధ్వపీఠాధిపతియైన సుదీంద్రతీర్థులవారి వద్ద బ్రహ్మసూత్రం, ఉన్నత విద్యనేర్చుకోటానికి వెళ్లాడు. సర్వ విద్యాపరిపూర్ణులైన సుదీంధ్ర తీర్థులవారి వద్ద సకల విద్యామర్మాలు తక్కువ కాలంలోనే గ్రహించాడు. వెంకన్న అక్కడి వారందరి మన్ననలకు పాత్రులగుటయేకాక, ప్రత్యేకంగా సుధీంద్రులవారి ఆదరాభిమానాలు సంపాదించ గలిగాడు.

ప్రజలకు ధర్మబోధ చేస్తూ సుధీంద్ర తీర్థులవారు తమతో పాటు వెంకన్ననను కూడా పిల్చుకుని వెళ్లేవాడు. ఈర్ష్య, అసూయగల ఒకసన్యాసి తనకు గల పాండిత్య గర్వముతో సుధీంద్రులవారిని శాస్త్ర వాదానికి ఆహ్వానించాడు. అందుకు సుధీంద్రుడు సమ్మతించారు. ఐతే ముందు తన శిష్యునితో వాదించమని తరువాతనే తాను వాదించగలనని తెలిపాడు. అందుకు సన్యాసి సిద్ధపడగానే, అతనితో వాదోపవాదాలకు వెంకన్నను నియమించారు. పండిత, పామరులంతా దిగ్భ్రాంతి అయ్యేట్లుగా 18 రోజులు ఆ సన్యాసితో శాస్త్రవాదము గావించారు. చివరకు సన్యాసిని ఓడించారు వెంకన్న. తన శిష్యుని విజయానికి సుధీంద్రులవారు ఆనందపడ్డారు.

తన భర్త దక్షిణ దేశంలో అఖండ గౌరవం పొందాడని సరస్వతి చాలా ఆనందించింది. వారి దాంపత్య జీవితంలో ఒక కుమారుడు కలిగాడు. వానికి లక్ష్మీనారాయణ అని నామకరణం చేశారు.

వెంకన్న వద్ద విద్యాభ్యాసం చేయాలని, కొంతమంది శిష్యులు వచ్చి చేరారు. వెంకన్నకు కుటుంబభారం ఆర్థిక ఇబ్బందులు ఎక్కువైనాయి. వెంకన్న కుంభకోణం వెళ్లి – సుధీంద్రతీర్థులను దర్శించి పరిస్థితులు వివరించి తమను కరుణించమని ప్రార్థించారు. సుధీంద్రులవారు వెంకన్నకు ధైర్యం చెప్పి పత్నీ పుత్రులతో మఠంలోనే వుంటూ శిష్యులకు విద్యాబోధ గావించమని చెప్పారు. గురు వాత్సల్యము వెంకన్నకు మనోధైర్యం కల్గించింది. వారి ఆజ్ఞ ప్రకారం మఠంలోనే నివసిస్తూ తన విద్యుక్త ధర్మం నిర్వహించసాగాడు.

సుధీంద్రులకు అనారోగ్యము కలుగుటవలన పీఠానికి వారసుని నియమించాలని కోర్కె కలిగింది. సుధీంద్రులవారికి స్వప్నంలో శ్రీ మూలరామస్వామి దర్శనమిచ్చి నా పూజ చేయుటకు వెంకన్నను నియమించ వలసిందని ఆజ్ఞాపించాడు.

వెంకన్నకు కూడా శారదాదేవి స్వప్నంలో కనిపించి సంసార సాగరం విరమించి సన్యాసం స్వీకరించి ధర్మప్రచారం గావించవలసినదని ఆదేశమిచ్చింది.

వెంకన్న ఆ విషయం గురువుకు విన్నవించాడు. వెంకన్న నిశ్చయాన్ని గురువు విని నీ కుమారునికి ఉపనయనం చేయమని ఆజ్ఞాపిస్తాడు. వెంకన్న వైభవంగా తన కుమారునికి ఉపనయనం జరుపుతాడు. సరస్వతి పరమానంద భరితురాలైంది. తన భార్య పుత్రులను తన అన్న, వదినలకు అప్పగించి శ్రీహరిని స్మరిస్తూ కుంభకోణం వెళ్తాడు వెంకన్న.

శిష్యుని రాకతో సుదీంద్రుని ఆరోగ్యం కుదుటపడ్తుంది. వెంకన్న ఆశ్రమ స్వీకారం, ప్రయత్నం కొనసాగించాడు. ఈ వార్త విన్న తంజావూరు ప్రభువు రఘునాథ నాయకుడు సన్యాస స్వీకరణకు ఏర్పాట్లు ఘనంగా చేశాడు. క్రీ.శ.1623 సంవత్సరం రుధిరోద్గారి నామ సంవత్సరంఫాల్గుణ శుద్ధ విదియనాడు వెంకన్నకు సన్యాస ఆశ్రమము ఇవ్వబడింది. సుధీంద్రులవారు అతనికి 'రాఘవేంద్రతీర్థులు' అని యతులకిచ్చే దీక్షానామము ఇచ్చారు. మహారాజు కూడా రాఘవేంద్రతీర్థులను సన్మానించి వారి ఆశీస్సులు పొందారు.

సుధీంద్రులవారు తనకు గురులబ్ధములైన చతుష్షష్టి కళలను కూడా రాఘవేంద్రునికి ఉపదేశించి శక్తి పాటవములను అనుగ్రహించారు. ఆశ్రమ ధర్మాలను పీఠ బాధ్యతలను సక్రమంగా నిర్వహిస్తూ ధర్మ ప్రచారం చేయవలసిందిగా గురువు ఆజ్ఞాపించారు. వెంకన్న 1623న సన్యాసం స్వీకరించి భక్తులకు ధర్మ, భక్తి, జ్ఞాన మార్గాలు ఉపదేశిస్తూ పండితులను సత్కరిస్తూ తన ఆశ్రమ ధర్మాలను నెరవేర్చేవాడు. ఆదోని నవాబువద్ద దివానుగా పనిచేస్తున్న వెంకన్న గురువుగారిని ఆహ్వానించి తనింటనే స్వామివారికి బస ఏర్పాటు చేశాడు. తాను వివేక శూన్యుడైనపుడు స్వామి తనను కరుణించుట వలననే తానీ స్థితికి రాగలిగానని వెంకన్న మరువలేదు. నిత్యమూ పూజలు చేస్తూ తీర్థప్రసాదాలు స్వీకరించి జన్మ చరితార్థముగా మంచాల గ్రామమును కానుకగా ఇచ్చెను. ఆనాటి మంచాల గ్రామమే ఈనాటి ఆదోని సమీపంలోని మంత్రాలయముగా పవిత్ర క్షేత్రమై భక్తకోటికి, ఈప్సితార్థ నిలయమై ఆంధ్ర రాష్ట్రంలో అలరారుతోంది. ప్రజలు కోరిన కోర్కెలు తీర్చే రాఘవేంద్రస్వామి మంత్రాలయంలో వెలసివున్నాడు. ...

*(ఆంధ్రభూమి జూన్ 7, 2006)*

# తులసీదాసు

అక్బరు చక్రవర్తి మన దేశాన్ని పాలిస్తున్న రోజులు అవి. మతసహనానికి పెట్టింది పేరు అక్బరు పాదుషా.

కాశీపట్నంలో తులసీదాసు అనే రామభక్తుడు వుండేవాడు. ఈయన పిలిస్తే హనుమంతుడు పలుకుతాడని, అందరూ అనుకునేవారు దైవానుగ్రహంవల్ల ఎన్నో మహిమల్ని చూపేవాడు. రామమంత్రం ఉపదేశం చేసి ఎందరినో తరింపచేసేవాడు. శారీరక, మానసిక రోగాల నుంచి విముక్తి కల్గించేవాడు తులసీదాసు.

కాశీపట్టణంలో విశ్వనాధుని ఎదురుగా వుండే రాతి బసవణ్ణకు అన్నం తినిపించటం, మరణించిన వర్తకుని, రామమంత్రంతో బ్రతికించడం ఎన్నో అద్భుతమైన పనులుచేసి తులసీదాసు రామభక్తునిగా కీర్తిగాంచాడు.

ఆంజనేయస్వామితో తులసీదాసు ప్రత్యక్షంగా మాట్లాడతాడనీ అక్బరు పాదుషా విన్నాడు. ఆశ్చర్యపడి తులసీదాసును పరీక్షించ దలచుకున్నాడు. వెంటనే మంత్రిని పిలిపించి, కాశీ నుంచి తులసిదాసును ఆహ్వానించి, తన ఆస్థానానికి పిలుచుకురమ్మని చెప్పి పంపాడు. అమాత్యుడు కాశీపట్నం చేరి, తులసీదాసును దర్శించి, భక్తితో నమస్కరించి, "అక్బరు చక్రవర్తి తమ దర్శనం చేయటానికి ఆతురత పడుతున్నాడని" గౌరవంగా ఆహ్వానం అందజేశాడు. తులసీదాసు సమ్మతించి మంత్రి వెంట ఢిల్లీ ప్రయాణమయ్యాడు.

చక్రవర్తి ఢిల్లీ నగర పొలిమేరలలోనే తులసిదాసుకు ఘనస్వాగతమిచ్చి, రాజనగరుకు పిల్చుకుని వెళ్లి అంతఃపుర భవనంలో విడిది చేయించాడు. ప్రయాణం విశ్రాంతి తర్వాత అక్బరు తులసీదాసును సమీపించి "స్వామీ తమరు కాశీపట్నంలో చాలా మహిమలు చూపారని, ఎవరి అనుగ్రహం వలన ఆ సామర్థ్యము మీకు కల్గిందో నాకు కొంచెం తెలియపరచండి"అన్నాడు వినయంగా

తులసీదాసు "ఓ రాజా! నేను మానవమాత్రుడను అశక్తుడను. ఈ కార్యాలన్నీ శ్రీరామచంద్రుని దివ్య నామం స్మరించడం వల్ల నాకు కలిగిందిగానీ, వేరే ఏమీ లేదు"అని రామమహిమను కీర్తించాడు.

ఓహో అలాగా, అయితే మీరు చెప్పేది సత్యమైతే ఆ కోదండరాముడిని నాకు చూపండి, అలా నీవు చూపకపోతే ఒక అడుగు కూడా నిన్ను కదలనీయను. ఒకరోజు గడువు ఇస్తున్నాను. అది దాటితే మరణశిక్ష విధిస్తాను అని చక్రవర్తి ఆజ్ఞజారీ చేశాడు.

అప్పుడు తులసీదాసు ఆంజనేయుని స్మరించాడు. "స్వామీ నన్ను పిల్చుటకు కారణమేమీ, మీ ఆజ్ఞ శిరసావహిస్తాను"అంటాడు ఆంజనేయుడు. తనకు రాజు వలన కలిగిన నిర్బంధము గురించి వివరిస్తాడు.

ఏమి? రామచంద్రుని దర్శింపవలె నన్నాడా! మీకు ఇన్ని కష్టాలు కల్పించాడా? సర్వజగద్రక్షకుడు, జగత్ ప్రభువు అయిన రామచంద్రుని దర్శనం మానవమాత్రుడైన ఆ రాజుకు అంత సులభంగా దొరకుతుందనుకున్నాడా? అని పలికి, వీరహనుమాన్ ఉగ్రరూపంతో స్మరించి పదివేల వానరులను రప్పించాడు. ఒక నాలుగు గంటలపాటు ఢిల్లీ నగరంలో మీ శక్తి సామర్థ్యాలు చూపించండి అని ఆజ్ఞాపిస్తాడు. వెంటనే కపిసేన వీరావేశంతో కనపడిన వారినంతా గోళ్ళతో రక్కుతూ, పండ్లతో కొరుకుతూ మిద్దెలు మేడల మీదనుంచి అందరినీ క్రిందికి తోస్తూ, పండ్లతోటలనూ, పొలాలనూ నాశనం చేస్తూ గోపురాలను కూలద్రోసి ప్రతి ఇంట్లో దూరి, అన్నింటిని చిందరవందర చేస్తూ నానా భీభత్సం సృష్టించాయి. అంతఃపురంలోదూరి స్త్రీలను, పిల్లలను భయపడేటట్లు చేశాయి. ఢిల్లీ నగరమంతా ప్రజలు గగ్గోలు పెట్టారు.

ప్రజలంతా రాజనగరు చేరుకున్నారు. కోతిమూక వారిని విడిచి పెట్టలేదు. అక్బరు ఈ గందరగోళం చూసి ఆందోళన చెందాడు. ఎక్కడ చూచినా కోతులే, ఇలాంటి పెద్ద పెద్ద కోతులు నగరంలో ఎక్కడా చూడలేదే? దీనికి నివారణ ఏమిటి? అని విచారపడుతూ మంత్రిని పిలిపించి అడిగాడు.

మంత్రి వెంటనే ప్రభూ! మనం రామభక్తుడైన తులసీదాసును నిర్బంధించాము. అలా చేసినందుకే ఈ వైపరీత్యం ఏర్పడి వుంటుంది. అయినా ఇప్పుడు మించిపోయింది లేదు. ఆయనను మనం శరణువేడటమే దీనికి సరియైన మార్గము అని వినయంగా తెలుపుతాడు. వెంటనే అక్బరు, తులసీదాసు దగ్గరకు వెళ్లి కోతిమూక చేస్తున్న విధ్వంసకాండకు కారణమేమిటని అడుగుతాడు.

తులసీదాసు నవ్వుతూ "రాజా! శ్రీరామచంద్రుని దర్శనభాగ్యము కల్గించమని కోరారుగదా? మీ కోరిక ప్రకారం ఆయనను ఆహ్వానించాను. ఆ కోదండరాముడు డెబ్బైరెండుకోట్ల వానర సైన్యంతో ఢిల్లీ నగరానికి వేంచేస్తున్నారు. ముందుగా పదివల వానర సైన్యం వచ్చింది. ఇంక మొత్తం వానరసైన్యం వచ్చాక వెనుక హనుమంతుని వెంట శ్రీరామచంద్రుడు వస్తాడు కొంచెం ఓపిక పట్టండి. మీకు తప్పకుండా కల్యాణరాముని దర్శనభాగ్యం కల్గుతుంది" అని సమాధానమిస్తాడు.

అక్బరు వెంటనే భయకంపిత స్వరంతో "స్వామీ నన్ను క్షమించండి, ఈ పదివేల వానరసైన్యంతోనే ఢిల్లీ నగరమంతా ధ్వంసమైంది. ఇంకా వానర సైన్యంవస్తే నగర రూపురేఖలు మారిపోతాయి. సీతను చూసి రమ్మంటే, లంకను కాల్చి వచ్చిన హనుమంతుడు వస్తే ఇంకేమైనా ఉందా? నా బుద్ధి గడ్డితిన్నది. నా అపరాధము క్షమించండి. మీ దర్శన భాగ్యమే శ్రీరామచంద్రుని భాగ్యము. దయచేసి నాపై కరుణచూపి ఆ వానర సైన్యాన్ని అంతా వెనక్కి పంపండి"అని నమస్కరించి వినయంతో ప్రార్థిస్తాడు. తులసిదాసు వెంటనే వీర హనుమానుని స్మరిస్తాడు. వానరులంతా అదృశ్యమైపోయారు. తులసిదాసు మహిమ చూపిన అక్బరు పాదుషా ఆనందంతో ఇక్కడనే మీరు కొంతకాలం వుండవలసిందని తులసీదాసును ప్రార్థిస్తాడు. తులసీదాసు అంగీకరించి ఒక సంవత్సరము పాటు ఢిల్లీ వాసులకు రామచంద్రుని మహిమలు, భక్తహనుమాను గూర్చి ప్రచారం చేస్తాడు. హనుమాన్ చాలీసా తులసీదాసు విరచితమే.

# రంతిదేవుడు

రాజులలో ఉత్తమమైన రాజురంతి దేవుడు. ఆయన రాజర్షి అంటే ఏ కోరిక లేని పాలకుడు. చాలా ఉదార స్వభావుడు వెన్నవంటి మెత్తని హృదయం మరియు ఎదుటివారి కష్టాలను, దుఃఖాలనుచూసి చాలా విచారించేవాడు. ఏ జీవి అయినా దుఃఖ విముక్తులనుచేయాలని, అదే పరమాత్ముని సేవ అని అదే మోక్షానికి మార్గమని నమ్మేవాడు.

వివాహ శుభకార్యాలకు, ఇల్లు కట్టుకోవడానికి తమ జీవన భృతికోసం జనులు బారులు తీరి అధికమొత్తంలో ధనాలు తీసుకుని వెళ్లేవారు. తను సంపాదించిన ధనం దీనులకు ఇచ్చి తన సర్వస్వం కోల్పోయి నిరుపేదగా నిలిచాడు. తినటానికి తిండిలేక కట్టడానికి బట్టలేక కుటుంబంతోసహా ఎన్నో పస్తులు పడాల్సి వస్తుంది. ఆవిధంగా నలభై ఎనిమిది రోజులు నిరాహారంతో వుండాగా ఒకనాడు ఉదయం అనుకోకుండా పాయసంతో సహా తృప్తికరమైన ఆహారం లభిస్తుంది.

ఎన్నో రోజులనుంచి పస్తులతో మాడి నకనకలాడుతున్న సమయంలో ఆత్రంతో కడుపార తిందామని ఆశతో ఆహారాన్ని భార్యాబిడ్డలతో తినబోతుంటే అతిధిగా ఒక బ్రాహ్మణుడు వచ్చి 'అయ్యా! మూడురోజుల నుంచి ఆహారం లేక అవస్థ పడుతున్నాను. ప్రాణాలు అవిసిపోయాయి. ఏమైనా కాస్త ఆహారం పెట్టి తనను బ్రతికించమని' ప్రార్థించాడు.

అన్నార్తులను ఆదుకోవడం కంటే మించిన ధర్మం ఏం వుందని అనుకొని తనకై పెట్టుకొన్న ఆహారంలో సగభాగం ఇచ్చి ప్రియంగా మాటాడి సాగనంపుతాడు. అతడు కూడా వెళ్లిపోయాక మిగిలిన భాగం అయినా తినబోగా కుక్కల గుంపును వెంటబెట్టుకుని ఆకలి బాధతో మరొక వృద్ధుడు రంతిదేవుని వద్దకు వస్తాడు. తన కుక్కలకు, తనకు ఆహారం దొరకక పది దినాల నుంచి ఆకలితో బాధపడుతున్నానని ఏదైనా ఆహారం ఇచ్చి ఆదుకోమని మొరపెట్టుకుంటాడు. తనవద్ద వున్న ఆహారం తను ఒక్కడే తిని తృప్తి

పొందవచ్చుగాని, తన వలన ఇన్ని జీవులు సంతృప్తి చెందడంకంటే కావలసిందేముంది అని ఎవరికి, ఎప్పుడు ఏది ప్రాప్తమో తెలీదని, మిగిలిన ఆహారం అతనికిచ్చేసి సంతోషపడతాడు.

తనకు ఆరోజుకు అంతే ప్రాప్తం అనుకొని, ప్రక్కనున్న పాత్రలోని నీరు తాగబోగా తన ఎదురుగా ఒక దప్పికగొన్న చండాలుడు వచ్చి 'ఓ రాజా! నేను హీనుడను, ఆహారం లేకపోయినా ఫర్వాలేదు చాలా దప్పిగొన్నాను, ఎక్కడా నీరు పుట్టలేదు. నోరు తడారిపోతోంది. మాట కూడా రావడం లేదు. దయచేసి మీ వద్ద వున్న నీరు ఇచ్చి నన్ను బ్రతికించి పుణ్యంకట్టుకోండి"అని అతి దీనంగా మొరపెట్టుకుంటాడు. అతని ఆరాటం గమనించి రంతిదేవుడు 'ఆహా! ఏమి విచిత్రము, చివరకు నాకు ఈ నీరు కూడా త్రాగే ప్రాప్తం లేదా అనుకొని, నా ప్రాణాలుపోయినా ఫర్వాలేదు, ఎంతో దప్పికతో అలమటిస్తున్న ఇతని దప్పిక తీరిస్తే నాకంతకంటే కావసిందేముంది' అని 'పరోపకారార్థం ఇదం శరీరం' అన్నారుగదా అనుకుని నాకు ఇంక పురుషోత్తముడు ఒక్కడే దిక్కు అని తలంచి ఆ జలం అంతా భగవంతుని కర్పితమని ఆ దప్పికగొన్న వాని పాత్రలో పోసేస్తాడు.

వెంటనే రంతిదేవుని దానగుణానికి, త్యాగం చూసి, బ్రహ్మ మిగిలిన దేవతలంతా సంతోషించి నిజ ఆకారంతో ప్రత్యక్షమౌతారు. 'రంతిదేవా! నీ ధర్మ గుణానికి మేమెంతో సంతోషించాము. నీ కీర్తి అందరూ తెలుసుకోవాలని, మేమే ఈ పరీక్ష పెట్టాము. అందులో నీవు కృతార్థుడైనావు. నీకు కావలసిన వరం ఈయటానికి మేము సిద్ధంగా ఉన్నాము. కోరుకోమనగా రంతిదేవుడు 'స్వామీ! నాకు ఏ కోర్కెలు లేవు. ఎప్పుడూ శ్రీమన్నారాయణుని భక్తి, నా మనసు నిండా వుండేలా వరమీయవలసిందిగా ప్రార్థిస్తాడు. అపుడు దేవతలు, అతనికి పూర్వ సంపదలంతా ఇచ్చి దైవప్రార్థన ఎప్పుడూ మానకుండా ప్రచారం చేయమని చివరి రోజులలో మోక్షాన్ని పొందుతావని' వరమిస్తారు.

రాజర్షి అయిన రంతిదేవుడు ప్రజలు అందరూ ఎప్పుడూ దైవచింతన, ధర్మచింతనతో జీవించి చివరకు సాయుజ్యం పొందుతారు. దానగుణంలో రంతిదేవుని కథ అందరికీ ఆదర్శప్రాయమైనది.

# భక్త శబరి

పంపా సరోవరం. ఎందరో మహర్షులు, అక్కడ తరించారు. పెద్దపెద్ద వృక్షాలు, కన్నుల పండుగ కలిగించే లతలు, పూలతో ఆ పుణ్యభూమి ఎంతో శోభిస్తోంది. మామిడి వృక్షాలు, మర్రిచెట్టు, మల్లెపొదలు, దానిమ్మచెట్లు విరగబూసి, జోరుగా కాసి వున్నాయి.

నిర్భయంగా సంచరించే లేళ్లు, చిలుకలు, మృగాలను చూస్తూ రామలక్ష్మణులు, మతంగముని ఆశ్రమానికి వచ్చారు. పారిజాత పుష్పాల వాసనతో శోభించే ఆ పవిత్ర ముని ఆశ్రమంలో నివసించే వృద్ధ శబరిని చూశారు. రామలక్ష్మణులు.

మల్లెల తెల్లదనంలా, మనసు కలిపి వచ్చిన నల్లనయ్యను, ప్రేమతో వెంట నడచి వచ్చిన ఎర్రనయ్యను చూచి, ఆనందంతో ఎదురుగా వచ్చింది శబరి. తన కల ఫలించిందని, నేత్రాల నుంచి వచ్చే కన్నీటిని ఆపుకుని, నిండు కుండలా, తన అశ్రువులతో రాముని పాదాలను అభిషేకించింది. పూలతో పూజించింది.

శబరి వృద్ధురాలు. తన తపస్సుతో బ్రహ్మను సాక్షాత్కరించుకునిన భక్తురాలు తపోనిధి మతంగమునికి శిష్యురాలు. శబరి రామలక్ష్మణులను అర్ఘ్యము, పాద్యము ఇచ్చి సత్కరించింది. రాముడు ఆమె భక్తికి ఆనందించాడు. లక్ష్మణుడు ఆమె సంయమనం చూచి సంతసపడ్డాడు.

ఓ తపోధనురాలా! నీ తపస్సు విఘ్నం లేకుండా సాగుతోందిగదా! నీ తపస్సు రోజురోజుకి వృద్ధి చెందుతోందిగదా! క్రోధాన్ని పూర్తిగా జయించావా! ఆహార నియమాల్ని పాటిస్తున్నావు గదా! నీ మనస్సు సుఖంగా వుంటున్నది గదా! నీవు చేసిన గురుసేవ ఫలించిందిగదా! అని ప్రశ్నిస్తాడు రాముడు ఆప్యాయంగా –

ఏదో ఒక వృత్తి చేసుకుంటూ మానవడు జీవిస్తాడు. వృత్తులే ప్రవృత్తిని నిర్ణయిస్తాయి. వాటి నివృత్తికి కృషిచేసేదే తపస్సు. ఆ మార్గంలో ఎప్పుడూ తపించేదే తపస్సు. తపస్సు అనేది నిర్విఘ్నంగా సాగుతూ వుండవచ్చు. అంతమాత్రంతో సరిపోదు. సాధనలో అభివృద్ధి కనపడాలి. అందువల్ల నీ తపస్సు వృద్ధిచెందుతోందా! అని ప్రశ్నిస్తాడు రాముడు.

మన ప్రేమ పారవశ్యంతో ద్రవీభవించి భగవంతుని ఆకారము పొందుటే భక్తి అని మధుసూధన సరస్వతి ఈ విషయం ప్రస్తావించారు.

ఈ స్థితి అంత తేలికగా మనకు లభించదు కళ్లకు అడ్డంగా గంతలుకట్టి చూడమంటే ఎలా చూడగలం? అలాగే అనేక ఆటంకాల మధ్య నిలబడి ఆత్మానందం పొందటం అసాధ్యం. గనుక అడ్డు తెరలు తొలిగాయా? అని ప్రశ్నిస్తాడు రాముడు.

ఈ ప్రశ్నలన్నిటికి శబరి ఒక్కమాటలోనే సమాధానం చెప్తుంది. 'రామా! నీ దర్శన భాగ్యంవల్ల ఈనాడు నాకు తపస్సిద్ధి లభించింది. నేను చేసిన తపస్సు గురుసేవ సఫలమైందని నమ్ముతున్నాను' అంటుంది.

'గురుసేవ ద్వారా భగవంతుని దర్శించవచ్చును'అని మనకు నిరూపించిన భక్తురాలు శబరి. 'పవిత్ర జీవితం గడుపుతూ నిర్మలమైన భక్తుల ఇంటికి పిలువకుండానే భగవంతుడు వస్తాడు' అని నిరూపించిన ప్రేమమూర్తి శబరి.

పరమాత్మ భక్తుల హృదయాన్ని చూస్తాడు. మధురమైన ప్రేమకు లొంగిపోతాడు. షడ్రసోపేతమైన విందును ఆర్భాటంగా సిద్ధం చేసాడు దుర్యోధనుడు. కాని కృష్ణుడికి ఏమాత్రం ఇష్టంలేదు. పిలువకపోయినా భక్తుడైన విదురుని ఇంటికి వెళ్లిపండ్ల తొక్కలనే ప్రియంగా ఆరగించాడు. ఆ తొక్కలే కృష్ణునికి ఎంతో రుచిని కలిగిస్తాయి. పరమాత్మ రస స్వరూపుడు.

శబరి రామునికి నమస్కరించి ఇలా చెప్తుంది. 'తండ్రీ! రామా! నీవు చిత్రకూట పర్వతంపై వున్నపుడే నేను సేవించిన మునులందరూ దివ్యమైన విమానాలెక్కి స్వర్గానికి వళ్లారు. వారు వెళ్తూ నాతో ఇలా అన్నారు. 'ఓ శబరీ! రామలక్ష్మణులు నీ పవిత్ర ఆశ్రమానికి వస్తారు. వారికి అతిధి సేవలు అందించిన తర్వాతనే నీవు ఉత్తమ లోకాలకు చేరుతావు' అని పలికారు.

'రామా! ఈ పంపాతీరంలో లభించే ఉత్తమ ఫలాలు నీకోసం భద్రపరచి వుంచాను'అని భక్తితో పలుకుతుంది శబరి.

ఆమె మహర్షులకు చేసిన సేవలు వ్యర్ధం కాలేదు. రామునిరాకను ముందుగానే తెలిపి, రాముని కొరకు వేచివుండు అని ఋషులు శబరికి చెప్పి వెళ్లారు. అలాగే ఆమె ఉత్తమమైన ఫలితాల్ని అందుకుంటుంది.

చక్కగా పండిన పండ్లను, మధురమైన ఫల మూలాలను శబరి స్వయంగా ఆస్వాదించి వాటి తియ్యదనాన్ని పరిశీలించి తాను భక్షించి, ఆ తర్వాతనే రామునికి సమర్పించింది. రాముడు ఆ ఫలాలను ఆరగించి, ఆమెకు ముక్తిని ప్రసాదించాడు అని పద్మపురాణం చెప్తోంది.

దీనిని ఆధారంగా తీసుకొనే భద్రాచల రామదాసు ఈ విషయాన్ని దాశరధీ శతకంలో ప్రస్తావించాడు.

రామా! శబరి ఎంగిలి తిన్నావు. ఆశ్చర్యంగా వుంది. ఆమె ఎంత పుణ్యం చేసిందో? ఉడుతను తమ చేతపట్టుకొని మునివేళ్లతో నిమిరి తృప్తి పరచావు. దానిపై అంత ప్రేమ కలుగుటకు కారణమేమో తెలియదు. దీనిని బట్టి చూడ, నీవు జాతి కులాలనుచూచేవాడివి కాదని తెలుస్తోంది. నీ మహిమ ఎంతో అసమానము, దాశరధీ కరుణాపయోనిధీ!' అన్నాడు గోపన్న.

రాముడిని శబరి కన్నులారా చూచింది. రాముని స్తుతించే శక్తి తనకు లేదని, తాను మందమతినని, మూర్ఖురాలనని సవినయంగా మొరపెట్టుకుంటుంది.

ఈ దేహం ప్రతిక్షణం రాముని సేవలోనే తృప్తి చెందాలని, రాముని అనుగ్రహంలోనే తరించాలని, రాముని సేవకే నిరీక్షిస్తూ వుండమని ఈ దేహాన్ని దైవం కోసమే నిలుపుకోమని వాల్మీకి రామాయణంలో ఋషులు శబరికి చెప్తారు.

'శబరీ! రాముడు నీవద్దకు వచ్చేవరకు ఈ దేహాన్ని రక్షించుకో, రామ దర్శనం కాగానే దేహాన్ని అగ్నికి సమర్పించి పరమాత్మను పొందు' అన్నది ఆధ్యాత్మ రామాయణం.

పరమాత్మను పొందిన తర్వాత దేహం ఇక అవసరం లేదు. తీరం చేరాక తెప్ప అవసరం లేదు, అంత వరకూ దేహం రక్షించుకో ఈ శరీరం కూడా దైవసేవ నిమిత్తమే

శబరి ఒక భక్తురాలేకాదు, మహా జ్ఞాని అని వాల్మీకి మనకు పరిచయం చేయడం గమనించతగ్గ విషయం.

*(ఆంధ్రభూమి ఫిబ్రవరి 21, 2005)*

# దత్తాత్రేయుడు

బ్రహ్మమానస పుత్రులలో అత్రి మహాముని ఒకడు. ఆయన అర్ధాంగి పేరు అనసూయ. ఆయనకు చాలా కాలం సంతానం లేదు. అనసూయ సంతానం కలుగలేదని విచారిస్తూ వుంటుంది. అత్రి మహాముని సంతానం కొరకు గొప్ప తపస్సు చేస్తాడు. త్రిమూర్తులు ఆయనకు ప్రత్యక్షమౌతారు. ముగ్గురు ఒక్కొక్కరుగా మారి నీకు జన్మిస్తామని వరం ఇస్తారు. అంతేకాకుండా బ్రహ్మ అంశతో చంద్రుడు, శివుని అంశతో దుర్వాసుడు ఆ దంపతులకు జన్మిస్తారు.

త్రిమూర్తుల అవతారం కాకుండా విష్ణువు అంశతో వారికి జన్మించినవారే దత్తాత్రేయులవారు. అత్రి తపఃఫలితంగా త్రిమూర్తులు దత్తమయ్యారు గనుక దత్త భగవాన్ అయ్యాడు. అత్రి కుమారుడు గనుక 'ఆత్రేయుడు' అని కూడా పిలుస్తారు. దత్తాత్రేయుడు అవతరించింది మార్గశిర మాసం పౌర్ణమి అని పురాణాలు చెప్తున్నాయి.

దత్తాత్రేయ ఉపాసన చాలా నిష్టతో చేయవలసి వుంది. ఈ ఉపాసన కర్ణాటక, మహారాష్ట్రలలో ఎక్కువగా చేస్తారు. మూడు శిరస్సులు, శంఖం-చక్రం-గద-పద్మ- కమండలం-త్రిశూలం ధరించిన ఆరుచేతులు, కాళ్లకు పాదుకలు, మెడలో రుద్రాక్షమాల, యజ్ఞోపవీతంతో కనిపించే దత్తాత్రేయులవారు పరిపూర్ణమైన జ్ఞానావతారంతో కనిపిస్తారు. వారి వెనుక ఒక గోవు, ఎదురుగా నాలుగు కుక్కలు మనకు కనిపిస్తాయి. ఇవి నాలుగు వేదాలు అని చెప్తారు. ఔదుంబర వృక్షం (మేడిచెట్టు) దత్తాత్రేయులవారికి ఇష్టమైన వృక్షం అని అంటారు. చెడ్డ గుణాల్ని అణచడం, మంచిని పోషించడం, రాగద్వేషాలు, తప్పొప్పులు, శత్రు, మిత్రభేదం వీటన్నిటికి ఇక్కడ చోటు లేదు.

శిరడీసాయిబాబా కూడా దత్త అవతారమనే చాలామంది భక్తుల నమ్మకం. దత్తులు తమ భక్తులను ఎంచుకుంటూ వుంటారు. తమ ప్రభావంలోకి రప్పించి,

వారి హృదయాలను జ్ఞానసిద్ధికి అనుకూలంగా తీర్చిదిద్దుతారు. భక్తులు ఆయన వద్దకు వెళ్లడంకాదు ఎక్కడెక్కడివారిని స్వామి తన వద్దకు పిలిపించుకుంటారట.

'దత్త' అనే రెండు అక్షరాలు జపిస్తే చాలు – దత్త అనుగ్రహం తప్పక లభిస్తుంది. పరశురాముడు, కార్యవీర్యుడు, దత్తాత్రేయులవారి శిష్యులై వారి అనుగ్రహం పొందారు. దత్తాత్రేయ ముని కావేరీ లోయలోని, సహ్యాద్రి పర్వత గుహలలో యోగనిష్టలో వున్నట్లు మార్కండేయ పురాణం చెప్తోంది. నేపాల్‌లోని చిత్రకూటం వద్ద సూక్ష్మరూపంలో నారద మహర్షి నందీశ్వరుడితో ద్వాదశీ వ్రత్త గురించి చెప్తూ మాసమునకు ఒక మహాపురుషుడిని, శ్రద్ధతో పూజించమని చెప్తూ, వీరిలో దత్తాత్రేయస్వామి ఒకరని మత్స్యపురాణం చెప్తోంది.

దత్త స్వరూపం మూడు శిరములు. వీటి అవతార రహస్యం త్రిమూర్తులు. సృష్టి, స్థితి, లయాలు. నాలుగు శునకాలు చతుర్వేదాలు. అంటే ఋగ్, యజుర్, సామ, అధర్వణ వేదాలు. ఆరు మాయకు ప్రతిరూపం. చతుర్విధ పురుషార్థాలకు గుర్తు ధర్మ, అర్ధ, కామ, మోక్షాలు. మన సర్వ వ్యవహారాలకు మూలం చక్రం అవిద్యా నాశము, శంఖం శత్రుసంహారం, కమండలం కర్మ ఫలాల గుర్తు. ఆరు భుజములు అరిషడ్వర్గాలకు గుర్తు.

దత్త పురాణం గురుదత్తునకు పదహారు అంశారూపాలు వున్నట్లు చెప్పబడింది. అవి ఏమంటే 1) యోగిరాజు 2) అత్రివరదుడు, 3) శ్రీదత్తాత్రేయుడు, 4) కాలాగ్ని, 5) యోగిజన వల్లభుడు, 6) శ్రీలీలా విశ్వంభరుడు, 7) శ్రీ సిద్ధిరాజు, 8) జ్ఞానసాగరుడు, 9) శ్రీ విశ్వంభర అవధూత, 10) శ్రీదూత, 11) శ్రీమాయాముక్తుడు, 12)శ్రీ ఆదిగురు, 13) శ్రీ శివరూపుడు, 14) దేవదేవుడు, 15) దిగంబరుడు, 16) శ్రీకృష్ణ శ్యాముడు, హిరణ్య కశిపుని సంహారం అయిన తర్వాత ప్రహ్లాదుడు ఆత్మసాక్షాత్కారము కొరకు, నారదుని సలహా ప్రకారం దత్తుని వాసమైన సహ్యాద్రి పర్వతం చేరుకొన్నాడు. అక్కడ దత్తులు మట్టిలో దొర్లుతూ

ప్రహ్లాదునికి దర్శనం ఇస్తాడు. తనకు ఆత్మానంద బోధ చేయమని ప్రార్థించగా దత్తులవారు ఇలా బోధిస్తారు.

మానావమానాలు సహించి, శీతోష్ణ, సుఖదుఃఖాలు భరిస్తూ ఆత్మానందం పొందుతూ వుంటే ఆత్మసాక్షాత్కారం తప్పక లభిస్తుంది. ఇప్పుడు నేను ఆచరిస్తున్నది అదే అని తన నిజస్వరూపం ప్రహ్లాదునికి చూపాడు. గురుదత్తుని అనుగ్రహం వలన ప్రహ్లాదుని ఆత్మస్వరూపం తెలిసివచ్చింది.

**శ్లో॥ 'దిగంబరం, భస్మ విలేపితాంగం బోధాత్మకం**
**ముక్తితర ప్రసన్నం నిర్మాసనం శ్యామలం తనుంభజేహం'**

దత్తాత్రేయ బ్రహ్మాది సమాధి యుక్తం – అంటూ శ్రీగురుదత్తుని ప్రతిరోజు సేవించేవారికి ఎలాంటి బాధలు వుండవు.

**నమస్తే భగవాన్‌దేవ, దత్తాత్రేయ జగత్ ప్రభో**
**సర్వరోగ ప్రశమనం కురుశాన్తిం ప్రయచ్ఛమే॥**

పై శ్లోకం వల్ల రోగభయం వుండదని ఎక్కువ కాలం నుంచి బాధించే రోగాలు కూడా దత్త జపం వలన నశిస్తాయని పురాణాలు చెప్తున్నాయి. ఈ మార్గశిర పౌర్ణమినాడు ధత్తుని మనసారా స్మరిద్దాం.

*(ఆంధ్రభూమి)*

# మనుస్మృతిలో స్త్రీ

కుటుంబంలో ఆడపిల్ల జన్మిస్తే విసుక్కోవడం, బాధపడటం కొంతమంది చేస్తుంటారు. కాని మనుస్మృతిలో స్త్రీని గురించి వున్నతంగా చెప్పబడింది.

**యత్ర నార్యస్తు పూజ్యంతే, రమంతే తత్ర దేవతాః**
**యత్రై తాస్తు న పూజ్యతే సర్వాస్తత్రా ఫలాః క్రియాః॥**

**మనుస్మృతి, అధ్యాయం-3, శ్లో-56**

ఏ ఇంటి యందు స్త్రీలు అనగా భార్యగాని, కూతురుగాని, కోడలుగాని మొదలైనవారు వస్త్రాలు, అలంకారాలు, మంచిభోజనాలతో సంతోషపెడతారో, ఆ గృహమందు దేవతలు ప్రసన్నులౌతారు. ఏ ఇంటియందు స్త్రీలు గౌరవింపబడక, మనస్తాపాలతో బాధపడుతూ వుంటారో, ఆ ఇంటి యజమాని, చేయుచున్న ధర్మ కార్యాలన్నీ, నిష్ప్రయోజనాలే అవుతాయి. అందుచే స్త్రీలను నొప్పించకుండా వుండటం శ్రేయస్కరం.

**'శోచంతి జామయో యత్ర వినశ్యత్యాశు తత్కులమ్**
**నశోచంతి తు యత్రైతా వర్ధతే తద్ధి సర్వదా'**

**మనుస్మృతి శ్లో -56**

ఇంటియందు దంపతులతో పోషింపబడే కుమార్తెలుగాని, కోడళ్లుగాని మొదలైనవారిపట్ల గౌరవ మర్యాధలు లేకుండా వుంటే ఆ ఇల్లు తొందరగా నశించును. ఏ యింటియందు వారు సుఖము, సంతోషంతో వుంటారో ఆ ఇల్లు వృద్ధిపొంది క్రమక్రమంగా, ఇంకా వృద్ధి పొందుతూనే వుంటుంది.

**జామయో యానిగే హాని సఫంత్య ప్రతిపూజితాః**
**తాని కృత్యాహ తానీవ వినశ్యంతి సమంతతః**

**తస్మాదేవతాస్సదా పూజ్యా, భూషణా చ్ఛాదనాశమైః**
**భూతికామై ర్నరైన్నిత్యం సత్కారేషూ త్స వేషుచ"**
**మనుస్మృతి అ-3, శ్లో-58**

తనకు తోడబుట్టిన స్త్రీలను ఆదరించవలెను. అలా ఆహ్వానములు, ఆదరం లేకపోతే వారు ఆ ఇళ్ళను దూషిస్తుంటారు. అలా ఆ ఇళ్లు అభిచార, హోమాదులతో కొట్టబడినట్లు నశించును. కనుక తమ శ్రేయస్సును, సంపదను, కోరుకొనే దంపతులు, తమ ఇంటిలో జరుగు పండుగలు, వివాహాలు మొదలైన సంతోష సమయాలలో ఇంటి ఆడబిడ్డలను ప్రేమతో ఆహ్వానించి వారికి వస్త్రాలు, భూషణాలు ఇచ్చి విందు భోజనం పెట్టి సత్కరించవలెను. ఇది ఎప్పుడూ జరుగునట్లుగా గృహయజమాని, గృహిణి చూడవలెను. ఒకవేళ ఇంటి కోడలికి అధికారమ గనుక వస్తే ఆడపడుచును, అత్తను ఎదిరించి వారిని దుఃఖింప చేయుట, ఎంత మాత్రం ఇంటికి శ్రేయస్కరము కాదు. అలాగే గృహస్థు కూడా ప్రేమ, గౌరవముతో భార్యను పోషించవలెను. మనుస్మృతి ఇంకా ఈ విధంగా చెప్తోంది.

**'సంతుష్టో భార్యయా భర్తా, భర్త్రా భార్యా తదైవచ**
**యస్మిన్నేవ కులేనిత్యం కల్యాణం తత్రవైధ్రువమే'**

భార్య కారణంగా భర్త, భర్త కారణంగా భార్య, ఏ ఇంటి యందు సంతోషాన్ని పొందివుంటారో ఆ ఇంటిలో శుభము తప్పక జరుగుతుంది. భర్త ఏకపత్నీవ్రతుడు, భార్య పతివ్రత, ఒకరి విషయంలో ఒకరు తృప్తిని పొందుతూవుంటారో ఆ భార్య, భర్తలేగాక కుమారుడు కుమార్తెలకు కూడా శుభాలు కలుగుతుంటాయని అర్థము.

**'నాస్తి స్త్రీణాం ఫృదగ్యజ్ఞో నవ్రతం నా వ్యుపోషితమ్**
**పతిం శుశ్రూషతే, యేనతేన స్వర్గే మహీయతే'**

స్త్రీ భర్తను విడచిగాని, భర్త అనుమతి లేకుండగాని యజ్ఞము, వ్రతము ఉపవాసము చేయుటయందు అధికారము లేదు. శ్రీరాముడు అరణ్యవాస సమయంలో సీత బదులు బంగారు ప్రతిమను ప్రక్కన వుంచుకొని, యజ్ఞముచేయడం మనం గుర్తుంచుకోవలసి వుంటుంది. అలాగే సత్యనారాయణ స్వామి వ్రతము తదితర ప్రజా సమయాలలో ఇద్దరు కలిసి చేయడం ఉత్తమమైనది దానిద్వారా ఆమెకు స్వర్గం లభిస్తుందని చెప్పబడింది. ఇంకా మనుస్మృతి స్త్రీకి ధనములోగల అధికారాన్ని గూర్చి చెప్పబడింది.

**'అధ్యగ్నధ్యా వాహనికం దత్తం చప్రీతి కర్మణి**
**ఖాతతృమాతృ పితృప్రాప్తం షడ్విధం స్త్రీ ధనం స్మృతమ్'**

**మను-శ్లో-164**

స్త్రీకి సంపూర్ణమైన స్వాతంత్ర్యము గల ధనం ఆరు విధాలుగా వుంటుందని, అందులో మొదటిది వివాహ సమయంలో అగ్ని ఎదురుగా, తల్లిదండ్రులు, తోబుట్టువులు ఇతర బంధువులు ఇచ్చిన ధనము 'అద్యగ్ని' అనబడుతుంది. ఇక రెండవది అధ్యావాహనికము కూతురు అత్తవారింటికి వెళ్తునప్పుడు తల్లిదండ్రులు, అరణముగా ఇచ్చిన ధనము 'అధ్యావాహనికము' అంటారు. మూడవది స్త్రీకి భర్త సంతోషంతో, ప్రేమతో ఇచ్చునది 'దత్త' అని అంటారు. శోభనసమయంలో స్త్రీకి భర్త, భార్య చీర కొంగుకు ముడివేసిన ఆభరణము, వుంగరము, ధనం మరేదైనాగాని 'దత్త' అని అంటారు. నాల్గవది అన్నలు, తమ్ములు ఇచ్చినది 'భాతృ' దత్త అని, ఐదవది తల్లి ఇచ్చినది 'మాతృదత్త' అని, ఆరవది తండ్రి ఇచ్చినది 'పితృప్రాప్త'మని అంటారు. అలా ఆరువిధములైనదే కాకుండా తన స్వయం కృషితో స్త్రీ సంపాదించిన ధనం 'అన్వాధేయం'అంటారు. ఈ ధనంపై భర్తకుగాని, ఏ ఇతర బంధువులకు గాని అధికారం లేదు. ఒకవేళ భర్త బ్రతికియుంటే, స్వర్గస్తురాలైన భార్య ధనము ఆమె సంతానానికి చెందుతుంది. ఆధునిక కాలంలో స్త్రీ ఉద్యోగాలు చేస్తున్నది. ఆ ధనంతో తమ జీవనం

గడిచిపోతుందిలే అని తలంచే భావాలు, ధర్మ సమ్మతం కాదు అని మనుస్మృతి చెప్తోంది.

అరణ్యపర్వంలోని యక్ష ప్రశ్నల సందర్భంగా వ్యాస మహర్షి ఈవిధంగా చెప్పారు -

**ధర్మ శ్చార్ధశ్చ కామశ్చ పరస్పర విరోధినః**
**ఏషం నిత్య విరుద్ధానాం కధమే కత్ర సంగమః'**

**మ.భా-అరణ్యపర్వం**

యక్షుడు ధర్మరాజుతో ఇలా ప్రశ్నిస్తాడు - ధర్మము, అర్ధము, కామము ఈ మూడు పురుషార్ధాలు ఒకదానికొకటి విరోధముగలవి అంటే ఒకటి సంపాదించబోతే మరొకటి హాని కలుగుతుంది. దానం చేయబోతే ధర్మం ప్రకారం ధనం నశిస్తుంది. ఇలా ఒకదానికొకటి పొసగదు గదా! ఎలాగంటే-

మహాభారతంలో ధర్మాన్ని గురించి ఇంకా కొన్ని విషయాలు విశ్లేషించారు. ఎప్పుడైతే గృహిణి తన ధర్మమును విడవకుండా నడుచుకుంటుందో అప్పుడు ధర్మార్ధ కామాలు, మూడు కూడా పరస్పర విరోధము లేకుండా ఒకటేచోట నిలుస్తాయి. అంటే ఎప్పుడు భార్యకు ధర్మముమీద ఆసక్తి వుంటుందో అప్పుడు ఆమె, తన భర్తను కూడా ధర్మమార్గంలో నడచుకోవడానికి ప్రోత్సాహాన్ని అందిస్తుంది. అర్ధ, కామాలనుపొందటానికి న్యాయమార్గాన్ని అనుసరించడానికి పురికొల్పుతుంది. అలాంటి భార్య లభించినపుడు, పురుషుడు ధర్మ నిర్వహణలో ఏమరుపాటు లేకుండా, ధనార్జన వినయంలోగాని, కామానుభూతుల విషయంలోగాని, శాస్త్ర సమ్మతంగా నిర్వహించి, కృతార్ధుడై, పుణ్యాన్ని సంపాదించుకో గల్గుతాడని, ధర్మరాజు, యక్షుడు వేసిన ప్రశ్నకు జవాబు చెప్తున్నది.

**'యా పాపరక్తా, పిశున స్వభావా**
**స్వాధీనకాంతం పరిభూయతే చ,**
**అమర్ష కామాకు చరిత్ర శీలా**
**తామంగనాం, ప్రేత ముఖీం త్యజామ'**

**స్కాందపురాణం**

పాప కార్యాలు చేయుట యందు ఏ స్త్రీ ఆసక్తి కనబరుస్తుందో, అబద్ధాలు చెప్పే స్వభావం కలదిగా వుంటుందో, ఎల్లప్పుడు భర్తను అవమానిస్తూ వుంటుందో, అట్టి స్త్రీలయందు నేను నివసింపను అని మహాలక్ష్మి చెప్తోంది. గనుక స్త్రీలు సాధు స్వభావముగలవారై, మంచి నడతగలిగి, నలుగురికి ఆదర్శ ప్రాయముగా మెలగవలసిన అవసరం ఎంతైనా వుంది. అట్టి స్త్రీ సంఘంలో గౌరవింపబడుతుంది.

*(ఆంధ్రభూమి)*

# త్యాగం

మన భారతదేశం పూర్వంనుంచి ఆధ్యాత్మిక, నైతిక విలువలు కలిగిన దేశం. దానగుణంలో ప్రపంచ దేశాలన్నింటికంటే భారతదేశమే గొప్పది.

ఇక్కడ పరిపాలించిన రాజులంతా ప్రజలను కన్నబిడ్డల్లా కాపాడుతూ, ప్రజల హృదయాలలో చెరగని ముద్రను వేసుకున్నారు. దీనులపైన, రోగాలతో బాధపడేవారిపై దాహంతో అలమటించే వారిపైన, ఆకలితో ఆర్తిగొన్నవారి ఆలనపాలన చూస్తూ ప్రజారంజకంగా పరిపాలించేవారు.

భారత చక్రవర్తులలో త్యాగగుణం ఎంతవున్నతమైనదో ఈ పద్యం ద్వారా తెలుసుకోవచ్చు.

**ఒక్కడు మాంసమిచ్చె మరియొక్కడు చర్మము కోసి ఇచ్చె,**
**వేరొక్కరుడస్థినిచ్చె, నికనొక్కడు ప్రాణములిచ్చె వీరిలో**
**నొక్కొక్కపట్టునన్ బ్రతుకనోపక ఇచ్చిరో, కీర్తి కిచ్చిరో**
**చక్కగా జూడు మంత్రి కులసంభవ రాయన మంత్రి భాస్కరా!**

శిబి చక్రవర్తి తనను శరణుకోరిన పావురాన్ని రక్షించడం కోసం తనను తరుముకుంటూ వచ్చిన డేగకు, పావురంతో సమాన తూకంగల తన తొడ మాంసాన్ని రక్తం కారుతున్న లక్ష్యపెట్టకుండా ఇచ్చిన మహాదాత.

ఇక ఇంద్రుడు పేద బ్రాహ్మణ రూపంలో కర్ణుని వద్దకు వచ్చి అతని సహజ కవచకుండలాలు ఇవ్వమని అడిగితే కొంచెం కూడా సందేహించకుండా, తాను పుట్టినప్పటి నుంచి రొమ్ము భాగంలో రక్షణగా వున్న కవచాన్ని, చెవులకు అలంకారంగా వున్న కుండలాల్ని, రక్తం స్రవిస్తున్నాకూడా సహిస్తూ అతనికి దానంగా ఇచ్చివేస్తాడు. ఇతని ధైర్యసాహసాలు వింటుంటే మనకు ఎంతో ఆశ్చర్యమవుతుంది. భూదానం, గోదానం, సువర్ణదానం అన్నీ ఒకెత్తు పుట్టినపుడే

శరీరాన్ని అంటిపెట్టుకునివున్న కవచ కుండలాలు దానం చేయడం మరో ఎత్తు. అందుకే దానకర్ణుడు అనే పేరు సార్థకం చేసుకున్నాడు.

అలాగే రాక్షసులను సంహరించడానికి, ఇంద్రునికి ఆయుధంగా, తన వెన్నెముకనే ఇచ్చాడు దధీచి మహర్షి.

రంతి దేవుడు తన భార్యతో సహా అడవులలో తినడానికి, తిండిలేక అల్లాడిపోతాడు. ఒకనాడు కొంచెం అన్నం, తాగడానికి నీరు దొరుకుతాయి. ఒక ముసలివాడు తనకు భరించలేని ఆకలి, అన్నం పెట్టమని అడుగుతాడు. తన దగ్గర వున్న అన్నమంతా పెట్టేస్తాడు. ఇంక నీరైనా త్రాగి తన ఆకలిని తీర్చుకుందామనుకుంటే, ముసలివాడు దాహంగా వుంది, నీళ్లు ఇచ్చి పుణ్యం కట్టుకొమ్మని వేడుకుంటాడు. "అన్నంలేదు, కొన్ని మధురాంబులున్నవి త్రాగుమ"నని తాను త్రాగాలనుకున్న నీరు కూడా దానం చేస్తాడు.

అలాగే హరిశ్చంద్రుడు సత్యమే దైవం అని భావించి, సత్యనిష్ఠతో అనేక కష్టాలుపడి, భార్యాబిడ్డలను పోగొట్టుకొని దైవ కృపవల్ల తన ప్రతిజ్ఞవల్ల, పూర్వ వైభవాన్ని పొందగలుగుతాడు.

భారతంలో ధర్మరాజు, విరటుని కొలువులో ఉద్యోగానికి కుదిరి ఎన్నో కష్టాలను ఎదుర్కొని తనకుతానే సాటి అనిపించుకుంటాడు. అలాగే బలిచక్రవర్తి, షట్చక్రవర్తులు తదితరులు ఎంతో కీర్తిప్రతిష్టలు పొందారు.

నోబెల్ బహుమతి పొందిన మదర్‌థెరిస్సా, ధార్మిక సేవా పరాయణురాలై, అందరిచేత ప్రస్తుతింపబడ్డారు.

ప్రపంచానికంతా ఎంతో సంఘసేవ, పరాయణురాలిగా కీర్తింపబడ్డారు. ఈ విధంగా పూర్వం నుంచి ధర్మాత్ములతో, త్యాగ పరాయణత్వంతో ప్రపంచానికంతా కూడా భారతదేశం మొదటి స్థానంలో పేర్కొనబడింది.

*(ఆంధ్రభూమి ఏప్రిల్ 9, 2003)*

# అష్టాక్షరి

భారతీయ సంప్రదాయాలు మనకు అందించే ముఖ్యమైన నిధులలో మంత్రాలు ముఖ్యమైనవి. మానవునిలో దాగియున్న మానసిక దౌర్బల్యాన్ని పోగొట్టి ధైర్యం, తేజస్సు, ఉత్సాహం కలుగజేస్తుంది. 'మననం చేస్తే రక్షించునది' మంత్రం అంటారు. ఎందరో మహనీయులు బీజాక్షరాల్ని స్మరిస్తూ, తపస్సంపన్నులుగా మారి, మనకు వాటి శక్తిని తెలియపరిచారు. దైవ సాన్నిధ్యం ఎలా పొందగల్గుతాం దానికి చేయవలసిన కృషి ఏమిటి? తరువాత తరాలవారికి అందజేశారు.

'ఓం నమో నారాయణాయ' అష్టాక్షరీ–ఎనిమిది బీజాక్షరాలతో కలిసి వుండడం వల్ల ఈ మంత్రం అతి శ్రేష్ఠంగా పేర్కొనబడింది. ఇది ధ్యానానికి చాలా సులభం, చాలా కాలంపట్టదు కూడాను. నారాయణ స్వరూపం అంతా ఇందులోనే ఇమిడి వుంది.

దీనిలో మొదటి అక్షరమైన ఓంకారం అకార, ఉకార, మకారాలతో కూడియున్న ఈ ఓంకారం వేదాలన్నిటిలో వ్యాపించి వుంది. ఈ ఓంకారానికి మించిన బీజాక్షరం మహిమతో కూడి యుండేది మరొకటి లేదని, సర్వ శుభాలను కలుగజేస్తుందని ఋషులు పురాణాలలో నిరూపించారు.

'ఓం నమః ప్రణవారార్ధ స్థూల సూక్ష్మక్షరాక్షరః
వ్యక్తా వ్యక్త కళాతీత ఓంకారాయ నమోనమః'

ధ్యానానికి కూర్చునపుడు ఒక్క ఓంకారం జపిస్తే చాలు. విశేషమైనటువంటి ప్రయోజనం మనకు కలుగుతుంది. 'సూక్ష్మంలో మోక్షం' అంటారు. అది ఈ ఓంకార సాధనవల్ల అలవడుతుంది. క్షరం, కానటువంటిది

అక్షరం. అటువంటి 'ఓం'కారానికి నమస్కారం అని పై శ్లోకం మనకు తెలియజేస్తోంది.

తరువాతి అక్షరం 'న'కారంతో ప్రారంభమౌతుంది.

**నమో దేవాది దేవాయా దేహ సంచారహేతువే**
**దైత్య సంఘ వినాశాయ నకారాయ నమో నమః**

అన్ని ప్రాణాలకు మూలం ఆ శ్రీహరే అని ఈ శరీరం ప్రాపంచిక సుఖాలనే కోరుకుంటుందనీ, మనంచేసే కర్మనిబట్టి జీవుడు పుడుతూ, గిడుతుంటాడనీ, పరమాత్ముడే అన్నిటికీ మూల కారణమని నకారం అంటే నాశనమనీ చెప్పబడింది. సాధువుల్ని హింసించే రాక్షసులందర్నీ సంహరించడం అని నకార బీజాక్షరం మనకు తెలియజేస్తుంది.

తరువాత అక్షరం 'మో'కారం. 'మో' అంటే మోహనరూపుడు. ఈశ్వరుడు, భక్తులను, ఋషులను, యోగులను తన దివ్యమైనటువంటి స్వరూపంతో, సమ్మోహన పరచే స్వభావం గలవాడు.

ఇంక మో అంటే మోహాన్ని ధ్వంసం చేసే స్వభావం కలవాడు అని అర్థం. జ్ఞానజ్యోతిని వెలిగించేవాడు. మళ్లీ మళ్లీ జన్మరాకుండా మోక్షాన్ని ప్రసాదించేవాడని, ఇహలోకాలలో వుండేమోహం వదలిపెట్టి పరలోక మోక్ష ప్రాప్తి కల్గించుకోమని బోధచేస్తోంది. 'మో' కారం – మనస్సు లగ్నం చేసి అర్చించమని అష్టాక్షరీ మంత్రం చెప్తోంది.

తర్వాత మంత్రాక్షరం 'నా' కారం – నారాయణ నవ్యాయ, నారసింహాయ నామినే నాదాయ నాదినే తుభ్యం నాకారాయ నమోనమః 'న' అంటే నారాయణుడు. మనకు సర్వ సుఖాల్ని ప్రసాదిస్తాడు. నవ్య మార్గంలో వాత్సల్యం కురిపిస్తాడు. 'న' అంటే నరసింహావతారం. దుష్టశిక్షణ శిష్ట రక్షణ గావించే శతృభయంకరుడు. అంతేకాకుండా నాదస్వరూపుడు, అట్టి నకార నారాయణ స్వరూప 'నా'కారం వివరిస్తోంది.

తరువాత బీజాక్షరం 'రా'కారం.

**'రామచంద్రం రఘుపతిం పిత్రాజ్ఞ పరిపాలకం**
**కౌసల్యా తనయం వందే రాకారాయ నమోనమః'**

'రా'కారమంటే రామచంద్రుడు. రమింపచేసేవాడు రామచంద్రుడు. తనను సేవించేవారిపై చల్లని వెన్నెల ప్రసరింపచేసేవాడు. రఘువంశంలో పుట్టి అందరకీ ఆదర్శప్రాయుడు. రఘుకుల తిలకుడు. రమ్య గుణధాముడు. తన వెంట వున్నవారిని అలరించే శాంతస్వరూపుడు.

'మాతృదేవోభవ, పితృదేవోభవ ఆచార్య దేవోభవ'

వినమ్రత కలిగిన విశ్వవినుతుడు రామచంద్రుడు. రమ్య స్వరూపం గుర్తుకు తెచ్చే 'రా' రాకారానికి నమస్కారం అని అష్టాక్షరీ తెలియపరుస్తోంది.

తర్వాత బీజాక్షరం 'య' కారం.

**'యజ్ఞాయ యజ్ఞ గమ్యాయ యజ్ఞ రక్ష కరాయచ**
**యజ్ఞాంగరూపిణే తుభ్యం యకారాయ నమోనమః'**

'య' కారం యజ్ఞానికి గుర్తు. శ్రీహరి యజ్ఞ స్వరూపుడు. యజ్ఞకార్యాలు చేయించేవాడు. యజ్ఞంచేసే వేద పండితుల నాలుకలపై వేద స్వరూపాన్ని పలికించేవాడు. దుష్టులబారి పడకుండా, విఘ్నాలు కలుగకుండా రక్షించేందుకు మూల కారణమైనవాడు. తానే యజ్ఞము. యజ్ఞము రక్షించే విధీ శ్రీహరి స్వరూపం స్పష్టం చేసే యకారానికి నమస్కారము.

తరువాత మంత్ర బీజాక్షరం 'ణా' కారం.

'ణా' కారం లోకవిఖ్యాతంనానాజన్మ ఫలప్రదం

**నానాభీష్ట ప్రదంవందే ణాకారాయ నమోనమః'**

అతి ప్రసిద్ధిగాంచిన ణాకార స్వరూపము అనేక కోర్కెలను నెరవేర్చే విశ్వవ్యాపకుడు శ్రీహరి స్వరూపం తెలుపుతోంది.

తరువాతి అక్షరం 'య' కారం.

**'యజ్ఞకర్త్రే యజ్ఞ భర్త్రే యజ్ఞ రూపాయతే నమః**
**సుజ్ఞాన గోచరాయాస్తు యకారాయ నమోనమః"**

యజ్ఞం చేస్తే కర్త వీరిలో పరమాత్మ నివసిస్తాడు. ఎందుకంటే అతను లోకహితాన్ని కోరుతాడు. యజ్ఞ ఫలాన్ని స్వీకరించేవాడు శ్రీ మహావిష్ణువు. అతడు యజ్ఞ భర్త. యజ్ఞ స్వరూపం శ్రీమన్నారాయణుడు. ఋషులు, యోగులకి మాత్రమే శ్రీహరి కనిపిస్తాడు. అటువంటి శ్రీహరి స్వరూపమే 'య'కారం తెల్పుతోంది.

మొదటగాని, చివరగాని ఓంకారంతో కూడియుండేట్లుగా స్తోత్రాలు స్తుతింపబడతాయని మన సంప్రదాయాలు చెప్తున్నాయి. అష్టాక్షరీ మంత్రంలో అక్షరాలు విడివిడిగా స్తోత్రం చేశాక, ప్రారంభంలో ఎలా ఓంకారంతో మొదలు పెడతామో చివర కూడా ఓంకారంతో స్వస్తి పలుకుతుంది.

**ఓంకార మంత్ర సంయుక్తం**
**నిత్యం ధ్యాయంతి యోగినః**
**కామదం మోక్షదం చైవ**
**ఓంకారాయ నమో నమః**

ప్రతిరోజు ఓంకారంతోకూడిన ప్రణవనాదాన్ని యోగులు అమిత భక్తి శ్రద్ధలతో పఠిస్తారు. పరమాత్మ ఓంకార స్వరూపుడు. కాబట్టి ఓంకారం జపిస్తే భగవంతుడు కరుణించి మోక్షాన్ని ప్రసాదిస్తాడు. ఓంకారం లేకుండా, భగవదనుబంధమైనదేదీ జరగదు. అంతటి మాహాత్మ్యం కలది ఓంకారం.

అష్టాక్షరీ మంత్రం ప్రతి అక్షరం స్తోత్రం చేస్తూ నారాయణుని మహిమలు కీర్తిస్తూ, స్తోత్రం చేసినందువల్ల అమిత పుణ్యప్రదమని ఋషులు భావిస్తున్నారు.

విష్ణుసాయుజ్యం పొందాలంటే, ఎందరో భక్తులు తమ స్తోత్రాలతో స్వామినికీర్తించారు. పాండిత్యం లేనివారు పామరజనులూ కూడ. మహావిష్ణువును ప్రసన్నం చేసుకోవడానికి, సులభమైన మార్గంలో రూపొందించి, ఈ జపం విధానం ఉపదేశించారు.

ఈ అష్టాక్షరీ మంత్రం జపిస్తే అందరూ సులభంగా స్వామికి ప్రీతిపాత్రులవుతారు. ఆధ్యాత్మిక చింతన కలిగి, నిగర్విగా వుండటం, మంచి లక్షణాలు అలవాటు చేసుకోవడం ముఖ్యం. ఇతిహాసాలు, స్తోత్రాలు బీజ మంత్రాలు వీటన్నిటినీ చదవడం వల్ల మానవులు జన్మసాఫల్యం పొందుతారు.

అజ్ఞానంతో కూడిన జీవనంగడిపేవారికి విష్ణునామం దివ్యౌషధం వంటిది. సంకీర్తనం ఎంతో పవిత్రమైనది. మనసారా ప్రార్థించడం, మళ్లీ మళ్లీ జన్మలనుంచి మనకు విముక్తి లభిస్తుంది.

*(ఆంధ్రభూమి)*

# నరకానికి ముఖద్వారం

మన ఆలోచనలు, ఉద్రేకాలు, మనస్సుపై వాటి ప్రభావాన్ని చూపుతాయి. ఈ ఆలోచనలు, ఆరోగ్యానికి, అనారోగ్యానికి దారితీస్తాయి. చెడ్డఆలోచనలు వ్యతిరేక ఫలితాలు మంచి ఆలోచనలు సత్ఫలితాలు కలిగిస్తాయి. శాశ్వతమైన భయం ఒత్తిడి దిగులు వీటివల్ల శరీర వ్యాధుల నుంచి కాపాడే తెల్లరక్త కణాలు తగ్గిపోతాయి.

ఆలోచనలు, సంతోషము, ఉల్లాసము, తెల్లరక్తకణాల్ని పెంచుతాయి. వ్యతిరేకధోరణి, నిరాశ, ఉద్రేకాలు మనసుకు హానికల్గిస్తాయి. ఆందోళన, భయం, అభద్రతాభావం, అసూయ, మారుతున్న పరిస్థితులకు అనుకూలంగా సర్దుకోలేక పోవడం వంటి కారణాలు బాధను కల్గిస్తాయి.

కోపంలోగాని, విషాదంలోగాని ఎక్కువకాలం వుండటం సాధ్యంకాదు. అలావుంటే తిరుగులేని హాని చేస్తుంది. ఈ హాని ప్రభావం మానవశరీరం ఎక్కువ సమయం, తట్టుకోలేదు. కొంతమంది తమ కోపాన్ని, అవమానాన్ని, బయటకి కనిపించనీయరు. చిరునవ్వుతో వాటిని భరిస్తారు. తమను గాయపరచినవారిమీద ద్వేషాన్ని పెంచుకోవచ్చు. ఈ విధంగా కోపం, పగ, మౌనంగా మనసులో వుంచుకోవడం చెరుపు చేస్తుంది.

ప్రతి మనిషి జీవితంలో ఏదోరకమైన బాధ, వత్తిడి అనుభవిస్తూనే వుంటారు. వాటిని ఎదుర్కొనే శక్తికూడా వుండి వుంటుంది. అయితే మనపూర్వీకులు అనుభవించిన ఓర్పును మనం గుర్తుచేసుకుంటూ వుండాలి. అది గనుక మనకు గుర్తుంటే మన జీవితంలో తొందరపాటు వత్తిడీ అదుపుచేయడం సులభమౌతుంది. పరిసరాలకు సర్దుకుపోయే శక్తి అలవాటు చేసుకోవాలి. కోపం, ద్వేషంవల్ల వచ్చే చెడు ఫలితాలు గ్రహించి, తన మనస్సును

నియంత్రించుకోవడానికి ప్రయత్నించాలి. ముందు మనిషి తనను తాను జయించడం నేర్చుకోవాలి.

కోపంవల్ల కలిగే ఫలితాలు అంతులేనన్ని వున్నాయి. భగవద్గీతలో కోపం నరకానికి ముఖద్వారం అని వర్ణించబడింది. పోట్లాటలు దెబ్బలాటలు చంపుకోటాలు కలుగజేస్తాయి. మహాభారతంలో కోపంలో మనుష్యులు తప్పుడు పనులు చేస్తారనీ, అది వినాశనానికి దారితీస్తాయని హెచ్చరించబడింది.

**'ఉత్తమే క్షణికోపస్యాత్ మధ్య మేఘటికాద్వయమ్**
**అధమేస్వా దహోరాత్రం పాపిష్టే మరణాంతకమ్'**

ఉత్తములైనవారి కోపం క్షణకాలమే వుంటుంది. మధ్యములలో రెండు గంటలసేపు వుంటుంది. అధములలో ఒకరోజంతా వుంటుంది. కాబట్టి కోపం ఎక్కువకాలం వుంచుకోకుండా జాగ్రత్తపడాలి.

ఒకసారి స్వామి వివేకానంద ఒక రైలుపెట్టెలో ఇంగ్లీషువారితో ప్రయాణం చేస్తున్నారు. స్వామి వేషం చూసి అతడొక నిరక్షరాస్యుడని, బిచ్చగాడనుకొని ఆంగ్ల భాషలో ఎగతాళి చేశారు. ఆ తర్వాత రైలుస్టేషన్‌లో స్వామి స్టేషన్ మాస్టరుతో అనర్గళంగా ఆంగ్లభాషలో సంభాషించడం చూసి సిగ్గుపడ్డారు. తాము అలా తెలివితక్కువగా హాస్యం చేస్తుంటే ఎందుకు అడ్డుచెప్పలేదని స్వామిని అడుగుతారు. స్వామి చిరునవ్వుతో 'నేను తెలివితక్కువ వారిని చూడటం ఇది మొదటిసారి కాదని' సమాధానం చెప్తాడు.

మన మానసిక దృక్పథం విశాలంగా మలచుకోవడం వల్ల మరింత గొప్ప స్థితిలో ఎదగగల్గుతాం. మొదట మన ఆలోచనలు సక్రమంగా మలచుకోవాలి. అప్పుడు యబటి విషయాలు తమకు తామే సవరించుకోవచ్చు. మనల్ని బంధించేది ముక్తిని కలిగించేది బయట వస్తువులుగావు. వున్నతోటి వారితో మన సంబంధ బాంధవ్యాలు మన నడవడిక ఎంతో ముఖ్యం.

సాధ్యమైనంతవరకు సత్యం మాట్లాడటం అలవాటు చేసుకోవాలి. ఎక్కువగా మాట్లాడకూడదు. మౌనంగా వుండాలి. నిజాయితీగా వుండాలంటే సజ్జన సాంగత్యం కలిగివుండాలి. ఈ రెండు లక్షణాలు పెంపొందించుకుంటే క్రమంగా మనకు ఆధ్యాత్మిక జ్ఞానం అలవాటవుతుంది. మంచి సంస్కారం ఏర్పడుతుంది. అంతేగాక మనకు తగిన శక్తి బలం వుండాలంటే ఒక్క శారీరక బలమేకాదు ఆధ్యాత్మికబలం మానసిక బలం వుండాలి. సంయమనం, ఇచ్ఛాశక్తి అలవాటు చేసుకుంటే అంతరంగశక్తి దానంతట అదే సమకూరుతుంది. ఇవన్నీ కాకుండా మరోశక్తి వుంది. అదే దివ్యశక్తి, దైవబలం.

'విద్యా వినయసంపన్నే బ్రాహ్మణే గవిహస్తిని
శునిచైవ శ్వపాకేచ పండితాః సమదర్శనః"

ఏనుగు శునకంకూడా ఈశ్వరుడు సృష్టించినవే. అయితే ఏనుగును చూచినట్లుగా శునకాన్ని చూడలేం. ఒకరి ఆహారం మరొకరికి, ఒకరి శాల మరొకరికి కేటాయించి సర్వసమానత్వం అనటం మన మూర్ఖత్వమే. హీనంగా దేనిని చూడరాదు. దీనినే దాని మర్యాదతో గౌరవించాలి. హింసించడంగాని, కించపర్చడంగాని చేయరాదు.

మనిషి పుడితే జన్మించాడని, మరణిస్తే కీర్తిశేషులయారనీ చెప్పడం జరుగుతుంది. 'జాతస్యహి మరణం ధృవం' పుట్టిన ప్రతి వ్యక్తికి మరణం తప్పదు. మృత్యువు మానవ జీవితంలో ఒక పరిణామము అయితే ఈ మృత్యువును ఆత్మహత్యలద్వారా కోరుకోకూడదు. దానంతట అదే సహజంగా రావాలి. వసంతంలో చెట్లు చిగురిస్తాయి. శిశిరంలో రాలిపోతాయి. ఆత్మహత్యల ద్వారా అకాల మరణం కోరుకోకూడదు. మనిషి వృద్ధాప్యం రాకముందే మరణిస్తే అయ్యో! ఇంకా జీవితం చూడనేలేదే అని అసంతృప్తి, దుఃఖం కల్గుతుంది. తృప్తిగా జీవించి, తృప్తిగానే మరణించాలి. మనిషి ఆశాజీవి.

**'కొన్నాళ్లు సుఖము, కష్టము**

**కొన్నాళ్లు భుజింపకున్న కొఱ కాదుసుమీ**

**పున్నమి దినముల వెన్నెల**

**యెన్నంగ సమానులందు నరులు కుమారీ'**

సుఖ దుఃఖాలు రెండు అవసరమేననీ కుమారీ శతకములో ఈ పద్యం గుర్తుకు తెస్తోంది. ఎంతటి సంపద వున్నా అధికారంలో వున్నా కొన్నాళ్లు సుఖాలు అనుభవిస్తే మరికొన్నాళ్లు దుఃఖాలు అనుభవించాలి తప్పదు. పున్నమినాడు లోకమంతా పండు వెన్నెల పరచుకుంటుంది. కానీ అమావాస్య రాగానే ఆ వెన్నెల వుండదు. అంతా చీకటి మయం. చీకటి వుంటేనే వెన్నెలకు ప్రాధాన్యం. అలాగే దుఃఖమున్నపుడే సుఖాలకు విలువ వుంటుంది. ఎప్పుడూ సుఖాలే వుండవు. ఎప్పుడూ కష్టాలే వుండవు.

ఎపుడూ మన జీవితంపై విరక్తి పుట్టకూడదు. సరియైన అవగాహన లేక, క్షణికోద్రేకాలకు లొంగి బ్రతుకును పూర్తిచేసుకోవాలనుకోకూడదు. అర్థంలేని ఆశలకు పరుగులు పెడుతూ ప్రశాంతత కోల్పోయి బ్రతుకు సంపదను పోగొట్టుకోకూడదు.

హనుమంతుడు ఎంతో ఆత్మవిశ్వాసంతో, ఆశతో, సీత జాడ తెలుసుకోవడానికి లంకలోకి ప్రవేశిస్తాడు. అంతా వెతుకుతాడు. కానీ సీతజాడ తెలీలేదు. అపుడు అతనిలో నిరాశ ప్రవేశిస్తుంది. నిస్పృహ కల్గుతుంది. ఏ సమాచారం లేకుండా వెళితే రాముడూ, సుగ్రీవుడూ మిగతా అందరూ దిగులు చెందుతారు. అందుకే వెనుకకు వెళ్లడంకన్నా ఇక్కడే ఆత్మహత్య చేసుకుంటే మంచిది అనుకుంటాడు. కానీ బుద్ధిమంతుడు క్రియాశీలుడు కనుక తక్షణం ఆ బలహీనత గురించి బయటపడ్తాడు, సక్రమంగా ఆలోచిస్తాడు.

'వినాశే బహవో దోషాఃజీవన్ భద్రాణి పశ్యతు'

(వాల్మీకి రామాయణం)

ప్రతివారు తమ హృదయాలలో పదిలపరచుకోవలసిన మాట. చనిపోతే చాలా దోషాలు సంభవిస్తాయి. జీవించివుంటే చాల సుఖాలు చూడవచ్చు. భవిష్యత్తు ఎలా వుంటుందో మనకు తెలీదు, తొందరపడి మృత్యువును ఆహ్వానించకూడదు, ఈ వాక్యంతో ఆత్మబలం పుంజుకొన్నహనుమ ఆశావాదం ఫలించింది. అశోకవనంలో సీత కన్పించింది. సీత జాడ తెలిసికొన్నాడు, ఆశావాదికున్న సత్ఫలం అది.

**పాంథశాల జగతి, బ్రతుకు తీర్థస్థలి**
**జన్మకాదు ఖైదు, జగతియందు**
**బ్రతుకు వరము, నీకు భగవంతుడొసగెను**
**కాదు చావు నీకు కడమ మెట్టు**

మనిషి పలాయనవాది కాకూడదు అని 'మాదాసు' చెప్పిన పద్యం ఇది.

ఈ లోకం వచ్చేపోయే బాటసారులకు నిలయం. మనమంతా బాటసారులం. మన జీవితం తీర్థస్థలం వంటిది. అంటే విలువైనది. ఈ జన్మకారాగారం అనుకోవడం ఉచితం కాదు. భగవంతుని కృపవల్ల ఈ 'జన్మ' అనే గొప్ప వరం లభించింది. దానిని మనం సద్వినియోగం చేసుకోవాలి. నిరాశ, నిస్పృహలతో ఆత్మహత్య చేసుకోవడం ఎంతమాత్రం పరిష్కారం కాదు. జీవితం నుంచి పారిపోకూడదు. బ్రతకటం నేర్చుకోవాలని కవి భావన. కోర్కెలను కూడ అదుపులో పెట్టుకుని సుఖజీవనం సాగించాలి.

**'కోర్కెతీరగానె కోర్కెలింకను పుట్టు**
**చెలములోన జలము చేరినట్లు**

కుదురుపడగలేదు కోర్కె లవంతముల్
విశ్వ ధర్మసూక్తి వినుము బాల!'

ఒక కోరిక తీరగానే తృప్తి చెందడం మరో కోర్కె పుడుతుంది. నీటికోసం గోయి త్రవ్వినపుడు జల ఊరుతూనే వుంటుంది. అలాగే కోర్కెలు ఒకదాని తర్వాత మరొకటి ఊరుతూనే వుంటాయి. ఆ కోరికవల్ల మనసు వికలమౌతుంది. ప్రశాంతత వుండదు. ఆ కోరిక తీరేవరకూ నిద్రపట్టదు, కోరికలు తీరడానికి అక్రమాలు కూడా చేయవచ్చు. కాబట్టి కోరికలకు హద్దుండాలి. వీటిని జయించ గలగాలి అని మంగాపురం బాలసుబ్రహ్మణ్యం పై పద్యంలో చెప్తున్నారు.

*(ఆంధ్రభూమి)*

# ఆచారం

ఆచారమంటే నియమితమైన పనిచేయడం లేక పాటించడం అనే అర్థం. వేదాలు, పురాణాలలో చెప్పినట్లుగా మంచపనులు ఆచరించడం చెడ్డ పనులు వదిలివేయడం ఒకవేళ అజ్ఞానంతో, కోపంతో చేయరాని పనులు గనుక చేస్తే, దానికి తగిన ప్రాయశ్చిత్తం చేసుకోవడం కూడా ఆచారం కిందికే వస్తుంది.

**'చతుర్ణామదివర్ణనా మాచారోధర్మపాలకః**
**ఆచార భ్రష్ట దేహోనాం, భవేద్ధర్మః పరాజ్ఞ్ముఖః' (పరాశరస్మృతి)**

అన్ని కులాలవారు, వారు పాటించే నియమాలేగాక, దయ, ధర్మం, వినయం మంచి గుణాలు యివన్నీ ధర్మపాలన కిందికే వస్తాయి.

'శరీరమాద్యంఖలు ధర్మసాధనమ్'అనే సామెత ప్రకారం ధర్మానికి ముఖ్య స్థానము మన శరీరమే.

**సర్వాగమనామా చారః ప్రథమం పరికల్ప్యతే**
**ఆచారప్రభవోధర్మః ధర్మస్య ప్రభు రచ్యుతః'**

అన్ని మంత్రాలలో కూడా ఆచారం ముఖ్యమనే చెప్పబడింది. ఆచారం నుండే ధర్మం పుట్టింది. ఈ ధర్మానికి ప్రభువు అచ్యుతుడు.

**'ఆచారల్లభతే, ధర్మ మాచారాల్లభతే ధనం**
**ఆచారల్లభతే సౌఖ్య ఆచారాన్మోక్ష మచ్యుతే'**

ఆచారం వల్ల ధర్మ సంస్కారంకల్గుతుంది. స్వర్గ, సౌఖ్యాలు కల్గుతాయి. ఆచారంవల్ల పరనింద లేకుండా ధనం లభిస్తుంది. ఇంక సుఖం పొందటమేకాకుండా మోక్షం కూడా లభిస్తుంది.

వేదం మనకు ఏది ఆచారం అని చెప్పిందో దానిని మనం సోమరితనం లేకుండా ఆచరించాలి. తన శక్తికొలదీ ప్రతిరోజూ ఆచారాన్ని పాటించే వ్యక్తి మోక్షాన్ని పొందడమే కాకుండా ఉత్తమ స్థానాన్ని కూడా అందుకోగల్గుతాడు.

గృహస్థుడైనవాడు 'ఇది చేయాలి, ఇది చేయకూడదు'అని శాస్త్రాలు చెప్పినప్పుడు దానినే చేయాలిగాని, వితండవాదం పనికిరాదు. 'అజ్ఞానం' అనేదానిని వదలిపెట్టి జ్ఞానవంతుడై, సత్పురుషులు, సాధువులు, యోగులు, వారు తెలిపేవిలువైన సూచనలు అనుసరిస్తూ తమ నడవడికలను రూపుదిద్దుకోవాలి.

**'యస్మిన్‌దేశే, పురేగ్రామే, త్రైవిద్య నగరే పివా**

**యోయత్ర విహితో ధర్మస్థం ధర్మం న విచాలయేత్'**

ఒక్కొక్క ప్రాంతం వారు ఒక్కొక్క వాతావరణ పరిస్థితిని బట్టి ఆచారాలు మార్చుకోవలసి వుంటుంది. అందుచేత ఏయే వ్యక్తులు ఏయే ప్రాంతాలలో పుట్టి జీవించుచున్నారో, ఆ వ్యక్తి ఆయా ఆచారవ్యవహారాలు కులధర్మాలు, అనుసరించి పాటించాలి.

మార్పులు, చేర్పులు తన యిష్టప్రకారం చేయకూడదని, ఒకవేళ అలా చేస్తే పాపానికి ఒడిగట్టిన వారవుతారని, సంఘద్రోహానికి పాల్పడిన వారవుతారని కూడా చెప్పబడింది. అంటే ప్రాంతీయ ఆచారం కూడా ముఖ్యమని మనకు తెలుస్తోంది.

మలినమైన మన శరీరాన్ని నీటితో స్నానంచేసి ఎలా పరిశుద్ధం చేసుకుంటామో, అలా మురికినీటితో నిండివుంటే నదికూడ వేగముగా ప్రవహిస్తే, శుద్ధి అవుతుంది. అదేవిధముగా మనమనస్సు కూడా సత్యముచే శుద్ధి పొందుతుంది.

అంతేగాక జీవాత్మ బ్రహ్మవిద్యతో మనస్సు తపస్సుతో శుద్ధి పొందుతుంది. మన బుద్ధి అనేది జ్ఞానంతో శుద్ధి పొందుతుంది. మంచి మనస్సు మంచి వాక్కునకు పవిత్రతలను కలిగిస్తుంది.

**'క్షాంత్యా శుద్ధ్యంతి, విద్వాంసో, దానేనా, కార్యకారణః**

**ప్రచ్ఛన్న పాపా జప్యేన తపసా వేద విత్తయాః'**

విద్వాంసులు ఓర్పుతో పరిశుద్ధులవుతారు. చేయకూడని పనులు చేసేవారు కూడా దానంతో శుద్ధిని పొందుతారు. అలాగే రహస్యంగా ఎవరికీ

తెలియకుండా పాపం చేసేవారు నియమిత మంత్రాన్ని శ్రద్ధతో అనుష్ఠించినందున శుద్ధిని పొందగల్గుతారు.

'నస్నానమాచరేద్భుక్త్వా, నాతురోమహానిశి
నవాసోభిః సహజస్రం నావిజ్ఞాతే జలాశయే'

భోజనం చేసిన తర్వాత స్నానం చేయరాదు. రోగంతో బాధపడేవారు కూడా స్నానం చేయరాదు. అలవాటు కాని చెరువులలో స్నానం ఎప్పటికీ చేయకూడదు.

'అగ్రా సర్వేషువేదేషు సర్వవైవచ నేషుచ
శ్రోత్రియాన్వ యజాశ్చైవ విజ్ఞేయాః పంక్తి పావనాః' (పరాశరస్మృతి)

ప్రవచనములలో శ్రేష్ఠులైనవారు, శ్రోత్రియ వంశంలో పుట్టినవారు, వేదాలను బాగా అధ్యయనం చేసినవారు, షడంగ వేత్త, బ్రహ్మ వివాహంవలన జన్మించివాడు, శతాయుస్సు కలవాడు, సహస్రగోదానం చేసినవాడు, యిలాంటివారు పంక్తిలో భుజిస్తే పావనం కల్గుతుంది.

అభీష్ట కార్యం నెరవేరటానికి గోరోచనం ధరించటం, గురుసేవ శ్రద్ధగా చేయడం, బాహ్య అభ్యంతరాలలో శుచి, ఇంద్రియ నిగ్రహము, గాయత్రి మంత్రము ఎప్పుడూ జపిస్తూ, శాస్త్రీయ పద్ధతిలో హోమం చేయడం ఈ ఆచారాలు చేసేవారికి ఎప్పుడూ కూడ పతనం కలగదు.

ఇలాంటి ఆచారాలు మనుస్మృతి ఇతర స్మృతులలో వున్నాయి, వీటిని పాటించడం వల్ల శుభప్రాప్తి కలుగుతుంది. అశుభం పరిహరింపబడ్తుంది.

ఈ సదాచారము, రజోగుణం, తమోగుణాన్ని తగ్గించి, సత్త్వగుణాన్ని వృద్ధిపొందేలా చేస్తుంది. వెంటనే ఫలితాలు కనపడకపోయినా, నిదానంగా అయినా ఫలితాలు పొందగల్గుతాము. ఆచారాలకు ఎంతో ప్రాముఖ్యత వుంది.

*(ఆంధ్రభూమి)*

# శ్రవణం

భగవంతుని గూర్చి శ్రవణము, కీర్తనము, పాదసేవనం, అర్చనం, వందనం, ధ్యానం, సఖ్యము, ఆత్మ నివేదనం అనే నవ విధ భక్తులు గురించి మనం వినే ఉన్నాము. కాని ఇందులో ముఖ్యమైనది 'శ్రవణభక్తి'. పూర్వము మహర్షులందరూ భగవత్సంబంధమైన జ్ఞానమును పరమాత్మని వలన శ్రవణం చేశారు. "చతుర్విధా భజంతేమాం జనాస్సుకృతినో అర్జున, ఆర్తో జిజ్ఞాసురర్థార్థీ, జ్ఞానీచ భరతర్షభ" అంటే అర్థం ఆర్తుడు, జిజ్ఞాసువు, అర్థార్థి, జ్ఞాని ఈ నాలుగు విధాల పుణ్యాత్ములు భక్తులని, పరమాత్ముడైన శ్రీకృష్ణుడు గీతోపదేశంలో తెలిపాడు.

సంసారము అనే సర్పముతో కాటువేయబడి చేష్టలుడిగి పడిపోయినవానికి తగిన మంత్రము నారాయణ మంత్రము వినటం. దానిని వినగానే మానవుడు ముక్తి పొందుతాడు, ఇదే నామశ్రవణము.

ఎప్పుడూ హరిని గురించి తెలిపే గ్రంథాలు వినాలి. దానిద్వారా భగవంతునిపై భక్తి విశ్వాసం వృద్ధి చెంది మానవుడు తన పురోభివృద్ధికి కారకుడౌతాడు. ఇందుకు మనకు నారదుడే సాక్షి. నారదుడు మొదట జన్మలో దాసీ పుత్రుడు. ఋషులకు సేవ చేస్తూ వారి వలన భగవంతుని కథలు విని తన అనుభవాలు ఇలా చెప్తాడు "భగవన్నామం విన్నందు వలన భక్తితో పారవశ్యం ఆనందంగా ఉంటుందని దాని రుచి ఆస్వాదిస్తే గాని తెలియదు" అంటాడు.

'భాగవతం' రుచిగల కథలు ఉన్నందువలనే పరీక్షిత్ మహారాజు కల్యాణాత్మకమైన "విష్ణుకథ లాకర్ణించుచున్ ముక్తి కైవల్యుండెవడు తృప్తుడౌ, నవి వినంగా క్రొత్త లౌచుండు" అని అతను తన ఆనందాన్ని అందరికీ పంచాడు.

భాగవత కథలు వినటం వలన భగవంతుడు భక్తులను ఎలా కరుణించాడు? భక్తులు, భగవత్ అనుగ్రహము సాధించటానికి చేయవలసిన

సాధన ఏమిటో మనకు తెలుస్తుంది. అంతేగాకుండా, మన నడవడిక సవరించుకొని జ్ఞానాన్ని సంపాదించుకొని విముక్తులౌతాము.

భాగవతము, రామాయణము, విష్ణు పురాణము, విష్ణు సహస్ర నామము, ఆదిత్య హృదయమును, నారాయణ కవచము, యోగవాశిష్టము, భారతము, భక్త విజయము, రామకృష్ణ పరమహంస జీవితము ఇలా భక్తుల జీవితాలు, ఉపన్యాసాలు, వారి విధులు, హితచర్యలు విని తెలుసుకోవాలి.

ఆళ్వారులలో పరమభక్తుడైన కులశేఖరాళ్వారు ముకుందమాల రచించిన పరమభక్తుడు. అంతేగాకుండా రాజుకూడాను. అతను రామాయణం వింటూ రామునితో రాక్షసులు తలపడి యుద్ధము జరుగుతోందని పురాణం వినిపించే, పండితుల ద్వారా విని, తన సేనాధిపతికి సైన్యాన్ని తరలించవలసిందిగా అజ్ఞాపిస్తాడు. రాముని పక్షము నుండి తాను రాక్షసులతో పోరాడుతానని పట్టుబడ్తారు. మంత్రి ఇతర నాయకులు ఎంత చెప్పినా వినిపించుకోడు. శ్రవణ మహిమ, భక్తిభావం, దేశ, కాలాల్ని గూడా మరుస్తాడు. తెలివిగల మంత్రివర్యుడు ఒక వార్తాహరునిచే శ్రీరాముడు గెలిచాడని, రాక్షసులందరూ కూడా మరణించారని చెప్పిన వెంటనే నమ్మి తన సేనతో రాజ ప్రాసాదానికి చేరుకుంటాడు. ఆనందంతో భగవద్భజన చేస్తాడు. శ్రవణ మహిమ అలాంటిది.

శ్రీ రామకృష్ణ పరమహంస, వివేకానంద, శారదాదేవి మొదలైన భక్తులు, అవతారమూర్తుల చరిత్రలు విని, జ్ఞాన, భక్తి వైరాగ్యం కలిగి అఖండ సాధనతో మైమరుస్తారు. మంచి భక్తి భావాన్ని కలిగించే కథలు విన్నందు వలన వైరాగ్యము, జ్ఞాన సముపార్జన భక్తి కలుగుతుంది.

సత్సాంగత్యము వలన తాను చేసిన పొరపాట్లకు పశ్చాత్తాపము ఏర్పడుతుంది. దానము, పరోపకార వృద్ధి హృదయంలో నిర్మలభావం, సన్మార్గము

ఈ లక్షణాలన్ని కలుగుతాయి. మోక్ష మార్గంలో నడవటానికి ప్రయత్నిస్తారు. ఇన్ని మార్గాలకు పునాది శ్రవణమే.

అంతేగాకుండా మనకు తెలియని ఎన్నో విషయాలు తెలుసుకోగల్గుతాము. విష్ణువు మూడు పాదాలుగల వానిగా ఋగ్వేదంలో చెప్పబడింది. సూర్యుని ఉదయ మధ్యాహ్న అస్తమయాలే ఈ మూడు పాదాలని, విమర్శకుల భావన, విష్ణు పాదాలలో రెండు పాదాలే మానవులకు కనిపిస్తాయని, మూడవది చీకటిమయమైన అధోలోకంలో ఉండటం వలన, నరులకు అదృశ్యమని భావిస్తారు. సూర్యుడు దక్షిణం నుంచి జనులకు కన్పించే కాలం రెండు పాదాలైతే తరువాత సూర్యుడు క్రిందికి దిగిపోయి దీర్ఘరాత్రి కల్పించినపుడు అదృశ్యమైన మూడవ పాదం ఏర్పడుతుందని పండితులు తెల్పిన విషయాలు, శ్రవణం ద్వారా తెలుసుకోగల్గి ఆశ్చర్యాన్ని పొందుతాము.

వామనుని మూడుపాదాలు విశ్వరూప, తైజసరూప, ప్రాజ్ఞరూప పాదాలని, తాత్త్వికుల భావన. ఇలాంటివి శ్రవణం ద్వారా తెలుస్తాయి.

*(ఆంధ్రభూమి జనవరి 6, 2007)*

# మోక్షసాధనం భక్తి

భగవంతుని యందలి ప్రేమ అన్ని భావాలకంటే కూడా మనస్సును ఎక్కువ ఆకర్షిస్తుంది. ఇటువంటి భావంతో కూడిన ప్రేమరసాన్ని ఎలా ఉపయోగించుకోవచ్చునో తెలిపేదే భక్తి. ప్రేమకు, భక్తికి రెండింటికీ కూడా, ఒకదానితో ఒకటి అవినాభావ సంబంధముంది. మోక్షానికి సాధనం - భక్తి, భక్తికి ప్రేమే ఆధారం.

**'యేతు సర్వాణి కర్మాణి మయి సన్న్య స్య మత్పరాః**
**అనన్యేనైవ యోగేన మాం ధ్యాయన్త ఉపాసతే'**
**తేషామహం సముద్ధర్తా మృత్యుసంసార సాగరాత్**
**భవామిన చిరాత్పార్థ మయ్యావేశిత చేతసామ్'**

**(భగవద్గీత 12వ అధ్యాయం)**

భగవద్గీత 6,7 శ్లోకాలు శ్రీకృష్ణుడు అర్జునకు బోధించాడు. అంటే ఎవరు సమస్త కర్మలు నాయందు సమర్పించి నన్నే ఎప్పుడూ తలుస్తూ, మనస్సులో నన్నే ధ్యానిస్తూ, ఉపాసిస్తారో అటువంటి మనోబుద్ధి గలవారికి, మృత్యువుతో సమానమైన, సంసార సాగరాన్ని అతి త్వరలో దాటించేవాడినని అర్థం. పై మాటల్నిబట్టి, మునిగిపోతున్న వాడికి, నావ ఎలాంటిదో, సంసార దుఃఖంలో మునిగిన బాధితుడికి కూడా భగవంతుడు అటువంటివాడు.

**'తల్లీ న చిత్తస్ప్రపు మాన్యా భక్తిః పరమమతా**
**దయాధర్మవరో నిత్యం విష్ణు ధర్మేషుతత్పరః'**

**(పద్మపురాణం-ఉత్తరఖండం)**

ఎవడు తాను చేస్తున్న పనిలో మనస్సును లగ్నం చేసుకుంటాడో, అదే భక్తి అనిపించుకుంటుంది. అతడు దయ, ధర్మం తెలుసుకున్నవాడై, విష్ణు ధర్మం యందు ఆసక్తి గలవాడుగా వుంటాడు. మనం నవవిధ భక్తి మార్గాలు వున్నాయని, అనేక చోట్ల చదివి తెలుసుకున్నాం. అవి శ్రవణం, కీర్తనం విష్ణోః

స్మరణం పాదసేవనమ్ అర్చనం, వందనం, దాస్యం, సఖ్య, మాత్మ నివేదనమ్'
శ్రవణం, కీర్తనం, స్మరణం, పాదసేవనం, అర్చనం, వందనం, దాస్యం, సఖ్యం ఆత్మనివేదనం అనేవి నవవిధ భక్తి మార్గాలతో భగవంతుని ఆరాధిస్తాం. కరుణా సముద్రుడైన స్వామి మనకు సర్వసుఖాలనిచ్చి అనుగ్రహిస్తాడు.

అయితే ఇందులో ఆరవదైన 'అర్చన'లో మనం రోజూ చేసే పూజ ముఖ్యమైనది. ఈ పూజలో కూడా మళ్లీ ఎనిమిది విధాలుగా ఆచరించాలని చెప్పబడింది.

అందులో మొదటిది దేవుని ఎదుట ముగ్గు, పద్మము, శంఖము, చక్రం ముగ్గుతో అలంకరించటం. రెండవది గంధము, మూడవది అక్షింతలు, నాల్గవది వివిధ రకాల పుష్పాలతో పూజించడం, ఐదవది ధూపం, స్వామికి అగరు వత్తులు వెలిగించటం, ఆరవది దీపం, వత్తులు నూనెలో తడిపి వెలిగించడం, ఏడు నైవేద్యం పండ్లు, పాలు శక్తికొద్దీ నైవేద్యం చేయటం, ఎనిమిది తాంబూలం.

పూజ సమయంలో ఈ ఎనిమిది ముఖ్యమైనవిగా చెప్పబడ్డాయి. భక్తి విశ్వాసాలతో దేవుని పూజించటం.

పోతన మహాభాగవతంలో భక్తిని గురించి ఇలా చెప్పారు –

**చిక్కడు వ్రతముల క్రతువుల**
**చిక్కడు దానము శౌచ, శీల తపముల్**
**చిక్కడు వృత్తిని భక్తిని,**
**చిక్కిన క్రియ నచ్యుతుండు సిద్ధముసుండీ –**

భక్తిద్వారానే అచ్యుతుడు, మనకు చిక్కుతాడు అని తెలుపుతున్నారు. పద్మపురాణంలోని ఈ శ్లోకం గనుక మనం గమనిస్తే భక్తికి, కులంతో పనిలేదని భక్తి గనుక వుంటే మోక్షం తప్పక లభిస్తుంది అని చెప్పబడింది.

**క్షత్రియోనాథా వైర్శ్వోవా శూద్రోనానురసత్తమే**
**భక్తింకుర్వ న్విశేషేణ ముక్తిం యాతి నసంశయః**

క్షత్రియుడైనా, వైశ్యుడైనా, శూద్రుడయినా, ఎవ్వరైనప్పటికీ విష్ణువు మీద భక్తియుండేవాడు ముక్తిని తప్పక పొందుతాడు.

**పత్రం పుష్పం ఫలం తోయం యోమే భక్త్యాప్రయచ్ఛతి**

**తదహం భక్త్యుపహృత మశ్నామి ప్రయతాత్మనః**

భగవద్గీతలోని ఈ శ్లోకం పత్రం, పుష్పం, ఫలం, తోయం భక్తితో ఆ దైవానికి సమర్పించి, దైవ అనుగ్రహాన్ని పొందుతున్నాం. మనందరి మనస్సులలో కూడా భక్తి నిండుకొని వుంటుంది. అయితే దానిలో కూడా కోరిక అనేది వుంటుంది, ఆ కోరిక గనుక నిర్మూలిస్తే, భక్తి దానంతట అదే వృద్ధి పొందుతుంది.

వివేకానందుని ప్రవచనం ఈ భక్తి అనేదే క్రమంగా, ఆరాధనా రూపం, స్తోత్రరూపంలో వ్యాప్తి చెందుతుంది అంటారు.

మన యిష్ట దేవతను పూజ చేయకపోతే మనకేదో హాని జరుగుతుందని, మన హృదయంలో నాటుకొని వుంటుంది. అలాంటి సమయాలలో కూడా భక్తితో, చిత్తశుద్ధితో పూజ జరుపుకుంటాం.

అన్నిటికంటే వేమన చెప్పినట్లు భక్తితోపాటు చిత్తశుద్ధి ముఖ్యం. ఇది ఆత్మ సాక్షాత్కారానికి చాలా ముఖ్యం. చివరగా ఆత్మశుద్ధి లేని ఆచారమదియేల, భాంఢ శుద్ధిలేని పాకమేల? చిత్తశుద్ధి లేని శివపూజ లేలరా? అన్నారు. కనుక భక్తితోపాటు చిత్తశుద్ధి అత్యావశ్యకం.

మనిషి చిత్తశుద్ధి కలిగినప్పుడే మోక్షానికి మార్గం సుగమం అయినట్టు భావించవచ్చు. మంచి మనసుతో దేవుని పూజిస్తే భగవంతుని దయా దృక్కులు మనపట్ల ఎల్లప్పుడూ ఉంటూనే ఉంటాయి.

దీనినే ఆత్మ సాక్షాత్కారంగా అనుకోవచ్చు. దయగలవాడు మనిషి, అకుంఠితమైన దీక్షతో, శ్రద్ధాభక్తులతో దేముని కొలిచిన వారికి మోక్షం కలుగుతుంది.

*(ఆంధ్రభూమి జులై 23, 2003)*

# తపస్సు

ఆది దేవుడైన బ్రహ్మ తన కమలాసనం మీద ఆలోచిస్తూ కూర్చున్నాడు. ఏమి చేయాలి, ఏమి చేయకూడదు, విచారిస్తూ అయోమయ స్థితిలో వుండగా, నోటిలో నుంచి 'తప తప'అనే ధ్వని వినిపించింది. ఈ శబ్దం ఎక్కడి నుండి వచ్చింది? ఎవరు చేశారు? కండ్లు మూసుకుని చింతన చేస్తూ వున్నాడు. అప్పుడు ఆయనకు ఇది పరమేశ్వరుని ఆదేశం, పరమేశ్వరుడే తపస్సు చేయవలసిందని ఆదేశించాడు. వెంటనే బ్రహ్మ తపస్సు చేయడం ప్రారంభించాడు. శ్రేష్టమైన తపస్వి అయినాడు.

ప్రాణాన్ని బిగించాడు. మనస్సు నిరోధించాడు. జ్ఞానేంద్రియాలు కర్మేంద్రియాలు స్వాధీనపరుచుకున్నాడు. ఇలా వేయి సంవత్సరాలు తపస్సు చేశాడు. ఆ తపః ప్రభావం వల్ల సమస్త లోకాలు వెలుగులోకి వచ్చాయి. విష్ణుమూర్తి ప్రత్యక్షమై తనలో కొన్ని చూపించాడు. ఆ విష్ణులోకంలో క్లేశం, భయం లేదు. జ్ఞాన సంపన్నులైన దేవతలంతా విష్ణుని స్తోత్రం చేస్తున్నారు. విష్ణువు ప్రసన్నుడై బ్రహ్మచేతిని తన చేతిలోకి తీసుకొని, చిరునవ్వుతో ఇలా అన్నాడు.

"చతుర్ముఖా, నీవు విన్నటువంటి తప తప శబ్దము నానుంచే వచ్చింది. నీ తపస్సుకు మెచ్చాను. నీవు నాకు ఎంతో ప్రియమైనవాడవు. తపస్సే నా హృదయం, నేనే తపస్సు. నాకు గల సామర్థ్యం నా సమస్త వైభవం తపస్సులోనే వున్నాయి. తపస్సుకున్న మహిమ అలాటిది. పురాణ పురుషులు ఎందరో యోగులు, రాజులు, సాధువులు, అందరూ ఎంతో కాలం తపస్సు చేశారు. ఆ తపో దీక్షవలనే వారంతా మహా పురుషులయ్యారు.

'తపస్సు' అంటే శరీరానికి బాధ కలిగించే ఉపవాసము ఇంద్రియములను, మనస్సును ఏకాగ్రతతో వుంచుకొనుట శీతోష్ణాదులను సహించుట. ఆకలి

అంటే 'క్షుత్పిపాస' అణచుకొనుట. తపము అంటే తపించుట. సువర్ణాన్ని బాగా కరగబెట్టిన తరువాతనే దానిని నగలుగా తయారు చేసుకోవచ్చు. అలాగే మన జీవితాన్ని ఏ రకంగా మలచుకోవాలో తపస్సు ఉపయోగపడ్తుంది. భగవద్గీతలో సాత్విక, రాజసిక, తామసిక, తపస్సులని వివరణ వుంది.

శరీర సుఖాన్ని గురించి చింత, అవగింజంతైనా భగవంతుడిని చేరాలనే సాధన సాత్విక తపస్సు. సర్వ ప్రాణులలో కూడా పరమేశ్వరుని దర్శింప చేసుకోవడం. సమాజ సేవకోసం; తన మనస్సును, బుద్ధిని స్వార్థం లేకుండా సమర్పించుకోవడం సాత్త్విక తపస్సు.

అధికారం, ధనం, కీర్తి వీటికోసం విద్యలను కళలను నేర్చుకునేందుకు ఎక్కువ కాలం సాధన చేయడం రాజసిక తపస్సు. ఇతరులను కష్టపెట్టడం, ఈర్ష్య, ద్వేషం, మనస్సులో పెట్టుకుని చేసే తపస్సు తామసిక తపస్సు. హిరణ్య కశిపుడు, రావణాసురుడు, ఇలాటి తపస్సు చేసినవారే. ఇంద్రియ తృప్తికై చేసే తపస్సు తామసిక తపస్సు అంటారు. సత్యము, జ్ఞానము అహింసా గుణము, విద్వాసులను సేవించడం, ఉత్తమశీలం ఈ గుణాలున్నవాడే శ్రేష్టుడు. తపస్సులో స్థిరపడిన యోగికి, ఇతర కర్తవ్యాలు వుండవు. మనస్సునూ, ఇంద్రియాలనూ ఏకాగ్రమొనర్చటమే తపస్సు. తపస్సుకు మించినది లేదు. తపస్సు ద్వారా సుఖశాంతులు లభిస్తాయి. తపస్సు వలన పొందరానిదంటూ లేదు. భగవంతుని మీద మనస్సు ఏకాగ్రం చేస్తే ముక్తి లభిస్తుంది. లౌకిక విషయాలపై ఏకాగ్రం చేస్తే లౌకికమైన విద్యలు, అర్థకామాలు లభిస్తాయి. తపో లక్షణాలైన క్షమ, అహింస, సత్యం, సమత్వం, ఇంద్రియ నిగ్రహం, శమము ఇవన్నీ ఊర్ధ్వ గతికి కారణాలు.

యక్ష ప్రశ్నలలో ధర్మరాజు యక్షునికి సమాధానం చెప్పేటపుడు తపస్సుతోనే మహిమను పొందుతాడని చెప్పాడు. క్లేశంతో ప్రాప్తమయ్యే ఏదైనాసరే దీర్ఘకాల పర్యంతము మహోగ్ర తపస్సు చేస్తేగాని లభించదు. మనోనిశ్చయం,

శారీరక, మానసిక బలం, స్థైర్యం వుండాలి. శరీరాన్ని కృశింపచేసేందుకు సంసిద్ధత కలిగి వుండాలి. బాల్యంలోనే దృఢనిశ్చయంతో తపస్సుచేసిన ధ్రువుడికి, అచల స్థితి లభించింది. విశ్వామిత్రునికి, బ్రహ్మర్షి పదవి లభించింది. వీరికి సృష్టికి ప్రతిసృష్టి చేసే శక్తి కూడా వచ్చింది. అగస్త్య మహర్షికి, వింధ్య పర్వతాన్ని కిందికి వంచేందుకు, సముద్రాన్ని ఔపోసన చేసేందుకు తపోబలం వల్లే అంతటి శక్తి వచ్చింది. తపస్సు వల్లనే పరమేశ్వర సాక్షాత్కారం లభించింది.

భగవాన్ రమణ మహర్షి తన పదిహేడవ వయస్సులో తిరవన్నామలై వచ్చినపుడు అరుణాచలం దేవాలయంలో పాతాళ లింగం వెనుక తపస్సమాధిలో మునిగి వుండేవారు. అలా దాదాపు ఇరవైనెలలు సాగింది. ఇట్టి మహోగ్ర తపస్సు నిర్వికల్ప సమాధి ఇరవయ్యవ శతాబ్దంలో మనం చూసిన అద్భుత దృశ్యం. స్వామి వివేకానందుడు కన్యాకుమారి నుంచి రెండు ఫర్లాంగుల దూరం సముద్రంలో వున్న శ్రీపాద శిలవద్దకు ఈదుకుంటూ వెళ్లి ఆ పవిత్రస్థలంలో రెండురోజులపాటు జీవ సమాధిలో, ధ్యానంలో లీనమయ్యాడు. ఆ పవిత్ర స్థలంలో, సమాధిలో కన్యాకుమారి గౌరీమా కోసం తపస్సు చేసింది. ఆ స్థలంలోనే నాకు సర్వస్వమూ లభించింది. నా జీవిత లక్ష్యం సిద్ధించింది అంటాడు.

నిరతరం అదే ధ్యాసలో వుండటం, అధ్యయనం చేయటం, దైనందిన వ్యవహారాలు కూడా పరధ్యానంగా చేయడం అహోరాత్రులు తను చేసే పనిమీదే మనస్సు లగ్నం చేయడం కూడా తపస్సే.

*(ఆంధ్రభూమి అక్టోబర్ 29, 2005)*

# గోవిందనామం

కృతయుగంలో ధ్యానం చేస్తే ఇష్టసిద్ధి కల్గుతుంది అనేవారు. త్రేతాయుగంలో యజ్ఞ యాగాలు చేయాలి అన్నారు. ద్వాపరయుగంలో అర్చన చేస్తే మంచిదనేవారు. ఈ కలియుగంలో మాత్రం నామ సంకీర్తన చేస్తే చాలు. ఆ సంకీర్తన చేయడానికి 'గోవింద నామం' ఎంతో పవిత్ర నామం అన్నారు శంకరాచార్యులవారు. గో-వింది అనే రెండు పదాలు కలిసి గోవింద పదం ఏర్పడింది. 'గోభిరేవయతో వాచ్యో గోవిందస్య ఉదాహృతః' వేద ప్రతిపాద్యుడు కాబట్టి ఆయనకు గోవిందుడు అని పేరు. భగవంతునికి శతకోటి నామాలున్నా కూడా నారాయణ నామం అతి ప్రధానమైనది. అలాగే 'గోవింద నామం' కూడా పరమ పవిత్రమైనది. పరమాత్ముని అనుగ్రహం పొందటానికి ప్రధానమైన మార్గం ధ్యానం, యజ్ఞం, అర్చన, కీర్తనం అందుకే ఇతర యుగాలకంటే కూడా కలియుగం మంచిది.

గోవింద పదానికి ఇంకొక అర్ధం వరాహస్వామి అని. ఇంకా సోమకాసురుడు అను రాక్షసుడు, చతుర్వేదములు దొంగిలించి, సముద్రం అడుగు భాగాన దాచివుంచాడు. అపుడు మహావిష్ణువు మత్స్యావతారమెత్తి ఆ రాక్షసుని సంహరించి గోవులు అంటే వేదాలను తెచ్చి బ్రహ్మకిచ్చాడని ఈ పదం తెల్పుతోంది.

శ్రీకృష్ణ పరమాత్మను 'గోవిందుడు' అనే అంటారు. గోవులను పొందినవాడు అంటే ఉపదేశాన్ని కలిగించే వాక్కును పొందినవాడు అని అర్ధం. శ్రీకృష్ణుని యందు మనం గుర్తించవలసిన అంశాలు రెండు. ఒకటి గీతాచార్యత్వం. రెండు గోపాలకత్వం.

అవతారానికి శబ్దం అర్ధం పైనుంచి కిందికి దిగిరావడం 'గొల్లవారితో కలిసిమెలిసి వుండటం. తానెంతవాడైనా కూడా అత్యల్పులతో కూడా సంపూర్ణంగా కలిసిపోవడం, ఇటు గొల్లపిల్లవాని మాదిరిగా కపటం లేకుండా వుండడం,

అందరికీ అందుబాటులో వుండడం. ఆబాల గోపాలం అనే పలుకుబడి మనం వింటూవుంటాం. దీనివలన 'గోపాల' శబ్దం విలువ తెలుస్తుంది.

'గో' శబ్దానికి మరో అర్థం 'స్వర్యతే స్తూయతే ఇతిస్వం' అంటే స్తుతింపబడేది అని అర్థం. జనన, మరణ కూపంలో పడి కొట్టుమిట్టాడకుండా వైకుంఠం చేరడం, ఆ లోకం శాశ్వత ఆనందమైనది. అలాంటి లోకాన్ని వాసస్థలం చేసికొన్నవాడు గోవిందుడు. భగవంతుని కృపాదృష్టితో సంపాదించబడేది అది వైకుంఠం-గోవింద శబ్దానికి పరంధాముడు శ్రీహరే.

'గోవింద' కన్నులు పొందినవాడు. అత్యంత మనోహరమైన కన్నులు కలవాడని అర్థం. మరొక అర్థం గో శబ్దానికి కేశములు అని అర్థం. ప్రశస్తమైనటువంటి, నల్లని శరోజములు గలవాడని అర్థం. వినీల కుటిల కుంతల కమనీయం , కుంతలములు గలవాడని అర్థం. కేశములు గలవాడు కేశవుడు. హరి నామాలలో 'కేశవ' నామానికి ప్రసిద్ధ స్థానముంది. కనుక గోవిందుడు అంటే కేశవుడే.

'అచ్యుతానంద గోవింద నామోచ్చారణ భేషజత్ నశ్యంతి సకల రోగాః' అచ్యుత, అనంత, గోవింద నామాలు పలికితే ఎటువంటి మొండి రోగాలైనా నయమైపోతాయి. ఇందులో గోవింద అనే నామం పరమోత్తమమైనది. శ్రీకృష్ణునికి ఈ గోవింద నామం చాలా ప్రీతికరమైనది. కౌరవసభలో దుశ్శాసనుడు ద్రౌపదీ వస్త్రాపహరణం చేసేటపుడు ద్రౌపది, ఇంక తనను ఇతరులెవ్వరూ రక్షించలేరని తెలుసుకొని ఆర్తితో - గోడు గోడున విలపిస్తూ -

**"శంఖచక్ర గదాపాణీ ద్వారకా నిలయా**
**అచ్యుత గోవింద పుండరీకాక్ష**
**రక్షమాం శరణం గతాం"**

అని కీర్తిస్తూ కృష్ణుని శరణు వేడుకుంటుంది. అది ఫలిస్తుంది.

శ్రీకృష్ణుడు, ద్రౌపది భక్తితత్వాన్ని ఇలా వర్ణిస్తాడు.

**'గోవిందేతి యదాక్రందత్, కృష్ణామాం దూరవాసినామ్,**
**ఋణంప్రవృద్ధ మివమే హృదయాన్నాప సర్పతి."**

దుర్మార్గులైన కౌరవులు ద్రౌపదిని మానభంగం చేయతలపడ్డారు. భర్తలు శక్తిగలవారై వుండి కూడా అసమర్థులయ్యారు, సభలో పెద్దలందరూ సాక్షులుగా వుండిపోయారు. అప్పుడు పతివ్రత అయిన ద్రౌపది నన్ను శరణువేడింది. వెంటనే వెళ్లి రక్షింపలేని దూర ప్రాంతంలో వున్న నన్ను 'గోవిందా' రక్షించు అని ఆక్రోశించింది. ఆమెకు నాపై ఎంత విశ్వాసం. ఆ ఆక్రోశానికి, ఆవిడకు నాపైవున్న భక్తి విశ్వాసం తగినంత ఉపకారం నేను చేయలేకపోయాను. ఆవిడ ఋణం తీర్చలేకపోయాను. వడ్డీతో పెరిగిన ఆ ఋణం శాశ్వతంగా, నా హృదయంలో తిష్ట వేసుకుంది. చేయవలసిన ఉపకారం చేసి కూడా ఇంకా పరమాత్మ వాపోతాడు. ఇది ఆయనకు భక్తులపై వుండే వాత్సల్యము. ఇక్కడ ద్రౌపది శంఖచక్ర గదాపాణీ, ద్వారకానిలయా, అచ్యుతా, పుండరీకాక్షా ఇలా చాలా పేర్లతో పిలిచినా ఆ పేర్లు ఆయన్ను ఆకర్షించలేదు. ఒక్క కృతజ్ఞతతో కూడిన అనేక గుణాలకు గోవింద అనే పేరే ఆయనను ఆకర్షించింది. అంటే పరమాత్మకు 'గోవింద'పదం అతి సంతోషమైనదని దానితో పరవశుడైనాడని మనకు తెలుస్తోంది. ఇలా 'గోవింద' నామం పరమ పవిత్రమైనది, ఉత్కృష్టమైనది, సిరులను అందించేది, మోక్షాన్ని కలిగించేది అని మనం తెలుసుకోవలసి వుంది.

*(ఆంధ్రభూమి డిసెంబరు 6, 2005)*

# ఆముక్తమాల్యద

గోదాదేవి ప్రసిద్ధికెక్కిన భక్తురాలు. గోదై, ఆండాళ్, శూడికుడుత్తి అని తమిళ నామాలతో పిలువబడింది. ఈమె కథను కృష్ణదేవరాయలు 'ఆముక్తమాల్యద' అనేపేరున ప్రబంధంగా రచించాడు. విష్ణుచిత్తునకు తులసివనంలో – ఒక బాలిక లభించింది. అతడు ఆ బిడ్డను ప్రేమతో పెంచాడు. ఆమెకు బాల్యంలోనే 'గోపాల మంత్రము' ఉపదేశించాడు. పూర్వజన్మ సంస్కారం, భక్తిభావం ఆమె మనసులో వయసుతోపాటు అభివృద్ధి చెందిది.

గోదకు తల్లిదండ్రులంటే ఎంతో వినయం, ప్రేమ, అభిమానాలుండేవి. యౌవనవతియైన గోదకు, ధనుర్మాస ఆరంభమున, కృష్ణుని మధుర స్పర్శ పొందింది. ఆ స్పర్శ ఆమెలో మధుర భక్తిభావ తరంగాలు స్పందింపచేస్తాయి. అవే తమిళంలో పాశురాలుగా వెలిశాయి. ప్రాతఃకాలములో, తండ్రి విష్ణుచిత్తునితో గోద ప్రతిరోజూ దేవాలయానికి వెళ్ళేది. కృష్ణుని ముద్దులమోము, పద్మనయనాలవంటి కన్నులు, చంద్రునిలా ప్రకాశించు రూపము తన సర్వసమై కనిపించేది.

గోదకు శ్రీవిల్లిపుత్తూరు వ్రేపల్లెలా, తన స్నేహితులంతా గోపికలుగా ప్రకాశించేటట్లు భావించి పరవశించేది. ఒకరోజు మిత్రురాలు హేమ తాను కన్న స్వప్నము గోదకు వివరిస్తుంది. అది ఏమిటంటే – తాను సత్యభామ అని ఒక పూలమాలను కృష్ణునికి అర్పించబోతే – కృష్ణుడే ఆ మాలను సత్యభామ మెడలో వేసినట్లు, ఎన్ని జన్మలకైనా ఆమె ధరించిన మాలే తనకు ఇష్టమని కోరినట్లుగా – కల వచ్చినట్లు తెలుపుతుంది. హేమ స్వప్నము, కృష్ణుడు సత్యభామ చెప్పిన విషయం 'కుసుమ మైత్రి' అంటారు. గోదాదేవి – పూర్వజన్మ నుంచి స్వామిః కోర్కె ప్రకారము పూలదండలు గుచ్చి, ముందు తాను అలంకరించుకొని తిరిగి కృష్ణునికి సమర్పించేది.

ఒక సందర్భమున విష్ణుచిత్తుడు దండను స్వామికి అర్పించునపుడు గోద తల వెంట్రుక మాలలో కనిపించింది. దానిని అపచారముగా భావించి విష్ణుచిత్తుడు మరొక మాలను తయారుచేసి అర్పించి, తాను చేసిన అపచారానికి క్షమించమని ప్రార్థిస్తాడు. కృష్ణుడు దానికి సమాధానము పూర్వము సత్యకు చెప్పిన సమాధానమే అని తెలియపరుస్తాడు.

*'గోద కట్టిన దండలె కొందునేను*

*గోద దాల్చిన దండలె కొందు నేను'*

ఇచట స్వామి దృష్టిలో – స్త్రీలకు – పూలకు పోలిక వుంది. గోద తల వెంట్రుక, తన నియమ, నిష్టలకంటే ఎంతో ఎక్కువ అని, గోద తండ్రి ఆళ్వారు తెలుసుకొని పొంగిపోతాడు.

గోద, కృష్ణునికి తనను అర్పించుకుంటుంది. ఆ స్వామి ఆమెను తన హృదయంలో చేర్చుకుంటాడు. గోద శిరమును కృష్ణుడు తన కుడిచేతితో నిమిరినట్లు, అనుభూతిని పొందుతుంది. తళుకుమనే వుంగరాల వ్రేళ్ళు, నీలమేఘ శ్యామలమైన దేహము, మకర కుండలాల వెలుగు చూచి గోద తనెవరో చెప్పి, తన ప్రాణాలు కాపాడుమని వేడుకుంటుంది. అపుడా దివ్యమూర్తి తనలో తప్పక నిలుపుకుంటానని, సందేహపడవద్దని – అభయహస్త మందిస్తాడు. శ్రీకృష్ణుడి ఆజ్ఞ ప్రకారము విష్ణుచిత్తుడు గోదను రంగనాథ యాత్రకు తీసుకుని వెళతాడు. అక్కడ రంగనాథుని దివ్యరూపము దర్శించిన గోద అతని వెలుగులో మునిగి, ఒళ్ళు మరచి, ఆనందానుభవాన్ని పొందుతుంది. ఆ రాత్రి రంగని సన్నిధిలో స్వామిని తలుస్తూ నిద్రపోతుంది. ఆ మర్నాడు – ఎంతో భక్తిశ్రద్ధలతో గుడికి నడిచి వస్తుంది. తన శరీరంలో ఏదో కాంతి నిండినట్టై, గర్భగుడిలోకి మెల్లగా నడిచి వెళ్తుంది. ఆమె మనసంతా కూడా మాధుర్యంతో నిండిపోతుంది. ఆమె ముందుకు నడచి వెళ్తుంటే, కొత్తకొత్త లోకాలు ఆమెకు దారి ఇస్తాయి. ఆమెకు

బంగారు గోపురాలతో వెలుగుతున్న వైకుంఠం కనిపిస్తుంది. గుప్త ప్రాకారాలతో నిండియున్న జ్ఞానమనే చిగుళ్ళు, భక్తి అనే పువ్వులుగల చెట్లతో నిండి వున్నట్లు ఇంకా ముందుకుపోగా – ఒక చక్కని పాన్పుపై పీతాంబరములు ధరించిన రంగనాథుడు శయనించినట్లుగా కనిపించి ఆయన రూపంలో తాను ఐక్యమవుతుంది.

కుమార్తె కనిపించకపోవడంతో విష్ణుచిత్తుడు స్వామిని నిందించబోతాడు. అపుడు గోద తండ్రితో తన తత్త్వము తెలుపుతుంది. సంక్రాంతి పుణ్యదినము. గోద రంగనాథుని వివాహమాడింది. లక్ష్మీదేవి ఆమెను ఆప్యాయంగా ఆహ్వానించింది. మిక్కిలి ఆనందాన్ని గోద పొందగలిగింది. స్వామి ముఖంలో పదహారు కళలు వెలుగొందుతాయి. గోద చెక్కిళ్ళల్లో వెలుగులు నిండి ప్రకాశిస్తాయి. అయోనిజ అయిన గోదాదేవి జన్మ సంస్కార విశేషం వలననే భగవంతుని పతిగా పొందింది. భగవంతుని సంకల్పము కూడా తోడై ఆమె కోరిక నెరవేరింది.

ఈ ధనుర్మాసంలో గ్రామాలలో కన్యలు వేకువజామునే లేచి ఇంటి ముందర పేడతో అలికి ముగ్గులు పెట్టి వాటిమధ్య పేడతో గొబ్బెమ్మలు చేసి వాటిని గుమ్మడి, బంతిపూలతో అలంకరిస్తారు. బాలికలు వీటిచుట్టూ తిరుగుతూ, చేతులు తడుతూ పాటలు పాడుతారు. గోపికలు కృష్ణుని చుట్టూ చేరి ఆనందంతో పాడిన పాటలకు గుర్తు ఈ గొబ్బిళ్ళు.

ధనుర్మాసవ్రతం 30 రోజులు చేస్తారు. రోజుకు ఒక పాశురం చొప్పున శ్రీవైష్ణవ ఆలయాలలో చదువబడుతుంది. ఈ వ్రతం మూడు దశలు. మొదటి దశ – అభిముఖ్య దశ. అంటే మొదటి ఐదురోజులు వ్రతం కోసం సిద్ధం కావడం, అందరినీ ఆహ్వానించడం, సామూహికంగా వ్రతం చేసి కోరికలు తీర్చుకోవడం. ఈ వ్రతం వలన దేశమంతా సౌభాగ్య సంపదలు సమృద్ధిగా

వుండాలని కోరుకుంటుంది. రెండవ దశ - ఆశ్రయణ దశ. 6-15 పాశురాలు వున్నాయి. భగవత్ ప్రాప్తికి, ఆత్మ పొందవలసిన గుణాలు తెల్పబడుతుంది. మూడవ దశ - అనుభవ దశ. గోపికలు, నందగోపుని భవనానికి వెళ్ళటం. ద్వారపాలకుని మేల్కొల్పడం, తలుపులు తెరవమని కోరటం, నీళాదేవిని మేలుకొల్పటం జరుగుతుంది. 21వ పాశురంలో కృష్ణపరమాత్మా! నీకు నిద్ర తగదు. నీ పాదాలకు మంగళం పాడటానికి వచ్చామని, తమను కరుణతో కూడిన చూపులు ప్రసరింపమని ప్రార్థిస్తారు. ప్రహ్లాదుని కరుణించినట్లు తమను కరుణించమని కోరతారు. నారాయణుని ఔదార్య గుణాలు, అవతార తత్త్వాలు స్తుతిస్తూ కృష్ణునికి మంగళం పాడతారు. 30వ పాశురంలో నిరంతర సేవ, కర్మఫల త్యాగం శరణాగతి కోరతారు.

*(ఆంధ్రభూమి జనవరి 8, 2005)*

# మానవుల కర్తవ్యం

సాధారణంగా మానవునికి గౌరవం కలిగించేవి ఐదు. అందులో ముఖ్యమైనది విద్య. ఆ తర్వాత కర్మ ఆచరణము అంటే చేసే మంచి పనులు, తరువాత వయస్సు, బంధువులు, ధనము.

*విత్తం బంధుర్వయః కర్మ విద్యాభవతి పంచమీ*
*ఏతాని మాన్యస్థానాని, గరీయో, యద్యదుత్తరమ్*

గొప్ప కుటుంబం అంటే – 'ధనం' అధికంగా సంపాదించిన కుటుంబం అనుకుంటారు చాలామంది. మనువు, ఉన్నత కుటుంబం అంటే మరొక నిర్వచనం చెప్పాడు. అదేమంటే పారమార్థిక విజ్ఞానము, మంత్రి అనుష్ఠానం కలిగి, ధర్మాన్ని పాటించే కుటుంబమే గొప్ప కుటుంబమని నిర్వచించాడు.

ఇంకా, మనం వెళ్ళే మార్గంలో, రోగి అనారోగ్యంతో బాధపడే మనిషి, ఎదురువస్తే, అతడు పూజ్యుడు కాకపోయినా దారి ఇచ్చి పక్కకు తప్పుకోమంటాడు. వయోవృద్ధునకు, అధికంగా బరువును మోయుచున్న వానికి, స్త్రీకి, సాదరంగా దారి ఈయవలసి ఉంటుంది అన్నాడు.

తనకు సంబంధములేని, ఇతరులు మాట్లాడుకునే రహస్యములు వినటం కాని, కాళ్ళు అధికంగా ఊపటం, అధిక ప్రసంగం, ఇతరులకు అపకారం చేసే పనులు తలపెట్టడం వంటివి చేయకూడదు.

మానవుడు జీవించటానికి పది విధములైన పద్ధతులు మనువు అంగీకరించాడు.

*విద్యాశిల్పం భృతిః సేవా గోరక్ష్యం విఫణిః కృషిః*
*ధృతిర్ భైక్ష్యం కుసీదం చ దశజీవన హేతవః*

వైద్యవిద్య వలన బ్రతకవచ్చును. శిల్పాలు చెక్కి జీవించవచ్చు. మరొకరివద్ద జీతమునకు కుదరవచ్చు. సేవచేసి బ్రతుకవచ్చు. పశువులను

మేపుకొని బ్రతుకవచ్చు. వ్యవసాయం చేసి జీవించవచ్చు. సంతోషము వలన కూడా జీవించవచ్చు. ఆదాయం తక్కువగా ఉన్నా కూడా సంతోషంగా ఉండాలి. బ్రాహ్మణుడు, క్షత్రియుడు వడ్డీ వ్యాపారము చేయకూడదు. ఒకవేళ డబ్బు ఇబ్బందితో బాధపడుతున్న వానికి, సహాయం చేయాలనుకుంటే తనకు తోచినంత సహాయం తప్పకుండా చేయాలి.

వైశ్యుడు అనగా వ్యాపారం చేసే అతను, తక్కువ వడ్డీతో ధనసహాయం చేయవచ్చు. రాజు వడ్డీని నిర్ణయించి, అంతట ఆ కాలంలో ధనానికి ఎంత విలువ ఉందో ఎంత వడ్డీ న్యాయమైనదో తెలిసికొని, దానిప్రకారం నిర్ణయించవలసి ఉంటుంది. ఆయా దేశాలు తిరుగుతూ - పరిస్థితులు తెలిసికొని, ఆ ప్రకారంగా, నడచుకోవలసి ఉంటుంది.

***సముద్ర యాన కుశలా దేశకాలార్థ దర్శినః***
***స్థాపయన్తితుయాం-వృద్ధిం-సా-తత్రాధి గమంప్రతీ (8-157)***

ఇంటికి వచ్చిన అతిథికి పాదప్రక్షాళనము అంటే కాళ్ళు కడుగుకొనుటకు నీళ్ళను చెంబుతో అందించి, ఆసనము మీద కూర్చుండబెట్టి, శాస్త్రోక్తంగా పూజించి, భోజనం పెట్టాలి.

***తృణాని భూమి రుదకం వాక్చతుర్థీ చసూనృతా***
***ఏతాన్య వినతాంగేహే నోచ్ఛిద్యం తేకదాచన***

సత్పురుషుల ఇండ్లలో, అతిథులకు విశ్రాంతి స్థానము దొరకకుండా పోదు. ఉదకము, శయ్య (నీరు, పడుకునే స్థలం) లభించకుండా ఉండదు. తీయని ప్రసంగము కూడా చెవిని పడకపోవు.

ఒకరి ఇంటికి అతిథిగా వెళ్ళి భుజించుటయే హాయి అని తలచే గృహస్థుడు, పరాన్న భోజనమునకు ఆశపడరాదు. అది మిక్కిలి నింద్యము - అంటే చేయరానిది. అతడు తరువాత అన్నదాత ఇంట్లో పశువుగా జన్మిస్తాడు.

ఎవ్వరినీ బాధపెట్టకుండా, హింస చేయకుండా బ్రాహ్మణుడు ధనము సంపాదించవలెను. శరీరాన్ని పోషించుకోవడం కోసం, కుటుంబాన్ని

నిలుపుకోవటం కోసం, ధనం సంపాదించవచ్చు. భోగములకోసం అతిగా సంపాదించకూడదు. న్యాయసమ్మతమైన పనులుచేసి, అతడు ధనము సంపాదించవచ్చును. అట్లే తన శరీరాన్ని కూడా ఎక్కువగా బాధపెట్టుకోగూడదు.

వక్రమార్గము, ఆడంబరాలకు ఎప్పటికీ పోగూడదు. తనకు లేని సద్గుణములు ఉన్నట్లుగా, హెచ్చులకు పోకూడదు. స్వచ్ఛమైన బ్రాహ్మణ జీవనము చేయవలసి ఉంటుంది.

*సంతోషం పరమాస్థాయ సుఖార్థీ సంయతో భవేత్*

*సంతోష మూలం హిసుఖం, దుఃఖమూలం, విపర్యయః (4-12)*

కుటుంబాన్ని పోషించటంకోసం పంచమహా యజ్ఞాలు, నిత్యకర్మలు అవసరమైనంత మటుకు చేయవలెను. ఆ వచ్చే ధనముతో, బ్రాహ్మణుడు సంతోషపడి, నిగ్రహము కలిగి ఉండవలెను. అలా సంతోషపడకుండా, అధిక ధనం కోసం ప్రయత్నిస్తే పాపము చేయవలసి వస్తుంది. దానివలన, నరకప్రాప్తి కలుగుతుంది.

*యత్ర నార్యస్తు పూజ్యన్తే రమన్తే తత్ర దేవతాః*

*యత్రై తాస్తు న పూజ్యన్తే సర్వాస్తత్రాకా ఫలాఃక్రియాః*

స్త్రీలెక్కడ పూజింపబడతారో దేవతలక్కడ నివసిస్తారు. స్త్రీలెక్కడ పూజింపబడరో, అక్కడ ఎన్ని మంచి పనులు చేసినా అవన్నీ వ్యర్థములే.

అంతేకాకుండా, బ్రాహ్మణుడు, ధర్మానుష్ఠానం చేసుకుంటూ తన ఆధీనంలో ఉన్నవారికి ధర్మాన్ని ఉపదేశిస్తూ విజ్ఞానాన్ని ఇతరులకు అందిస్తూ, అన్ని ప్రాణులయందు స్నేహభావము కలిగి ఉండాలి. అలా ఉండే బ్రాహ్మణుడు గురించి ఇతరులు కఠినంగా మాట్లాడకూడదు. అంతేగాకుండా తన తోబుట్టువులను అంటే అక్కా చెల్లెండ్లను గౌరవించి ఆదరించాలి, చేతనైనంత సహాయం చేయాలి.

*(ఆంధ్రభూమి మే 24, 2006)*

# గురుకృప - 1

భారతదేశాన్ని అక్బరు పాదుషా పరిపాలించే రోజులు... ఢిల్లీ సమీపంలో ఒక కుగ్రామం. ఆ గ్రామంలో ఒక గొప్ప సాధువు. అతని పేరు 'భిక్కు'. ఇతనికి చాలామంది శిష్యులు వున్నారు. వారిలో ఒకరు పొరుగునవున్న ఒక పట్టణంవైపు నడచి వెళ్తున్నాడు. గురువుగారి నామాన్ని మనసులో స్మరించుకుంటూ వెళ్తున్నాడు. ఒక మత గురువు అతడిని ఆపి, నీవెవరవు నాయనా? అని ప్రశ్నించాడు. 'నేను భిక్కును' అన్నాడు శిష్యుడు. నీ గురువెవరు? 'భిక్కు' - నీ దేవుడెవరు? 'భిక్కు'. ఆ సమాధానాలు విని మత గురువు మండిపడ్డాడు. మరికొంతమంది అక్కడకు చేరారు. అందరూ కలిసి ప్రార్ధనా మందిరానికి శిష్యుడిని తీసుకుని వెళ్ళి ప్రశ్నలు అడిగారు. అన్నిటికీ శిష్యుడు అదే సమాధానం ఇచ్చాడు. ఇతడు నాస్తికుడిలా ఉన్నాడు, ఇతడిని ఉరితీయవలసిందే అని అందరూ అతడిని ఢిల్లీకి పిల్చుకుని వెళ్ళి అక్బరు ముందు నిలబెట్టారు. అక్బరు అవే ప్రశ్నలు అడిగాడు. మహారాజా! నేను పూర్తిగా భిక్కుకు అంకితమయ్యాను. ఆయన లేనిదే నేను లేను అన్నాడు. సంస్కారవంతుడైన అక్బరుకు ఇతని 'గురుభక్తి' అర్ధమైంది. అయితే భిక్కు నీ గురువన్నమాట.

రాజ్యమంతా దుర్భిక్షం తాండవిస్తోంది. పైర్లు అన్నీ ఎండిపోయాయి. నీ గురువుగారు వర్షం కురిపించగలరా? ప్రశ్నించాడు అక్బరు.

'నేను వెళ్ళి అడుగుతాను' అన్నాడు శిష్యుడు వినయంగా. వెళ్ళి కనుక్కో అన్నాడు అక్బరు. శిష్యుడు తన గ్రామానికి వెళ్ళాడు. మరునాడు కుంభవృష్టి. రాజ్యమంతా ఏరులై పారింది. శిష్యుడు పట్టరాని ఆనందంతో అక్బరును దర్శించుకొని మహాత్మా! ఎంత వర్షం పడిందో అన్నాడు.

అక్బరు కృతజ్ఞతతో మంచి వర్షం పడింది. పంటలు కోలుకున్నాయి. మీ గురువుగారికి సంతోషంతో ఇరవై గ్రామాలు ఇనాముగా ఇస్తున్నాను. గురువుగారికి సమర్పించు అన్నాడు.

శిష్యుడు అక్బరుతో క్షమించండి మహారాజా! మా గురువుగారి దృష్టిలో ఈ ఇనాముకు ఎలాటి విలువలేదు. వారి దృష్టిలో 'సంపద' అనేది క్షణ భంగురం. నేనీ ఇనాము వారికి ఇవ్వటానికి అంగీకరించను అంటూ గ్రామంవైపు సాగిపోయాడు.

తన పాదాలకు నమస్కరిస్తున్న శిష్యుని గురువు అడిగాడు. నువ్వు నన్ను వర్షం కురిపించమని అడిగిన సమయంలో నేను ఆ పరమాత్మతో లీనమైయున్నాను. ఆ సమయంలో నీవు ఏమి కోరినా లభించేది – ఎందుకు అడుగలేదు అన్నాడు. గురుదేవా! మీ దయ చాలు. నాకింక ఏం కావాలి? వాటిని ఏం చేసుకోను? అన్నాడు వినయంగా. గురువు ప్రేమతో మందహాసం చేశాడు.

*(ఆంధ్రభూమి ఫిబ్రవరి 10, 2007)*

# సమానత్వం నినాదాలకే పరిమితమా?

స్త్రీ స్వాతంత్ర్యంపైనే దేశ ఔన్నత్యం, గౌరవం ఆధారపడి ఉంది అంటాడు గొప్ప శాస్త్రవేత్త అరిస్టాటిల్. 'కలకంఠి కంట కన్నీరొలికిన సిరి ఇంటనుండనొల్లదు' అంటూ వినటానికి సొంపైన సూక్తులలో ఎన్నో పద్యాలు చదివాం కూడాను. అయితే మనవాళ్ళు ఎన్ని చెప్పినా స్త్రీ పురుష సమానత్వం, పుస్తకాలకు, నినాదాలకే పరిమితం తప్ప ఆచరణలో మాత్రం శూన్యం అనే చెప్పవచ్చు. మహిళల పట్ల విచక్షణ ప్రదర్శించటం అన్నిచోట్లా అన్ని విషయాలలో జరుగుతూనే ఉంది. ప్రాచీన కాలం సంగతేమో గాని, తర్వాత కాలంలో మాత్రం వనితల స్వేచ్ఛకు సంకెళ్ళు బిగించడమే ఎక్కువవుతోంది. సమాజంలో ఆడవారికి ద్వితీయ స్థానమే. మగవారు ఆడవారికంటే అన్ని విధాలా అధికులం అనే భావం ప్రబలి, వ్రేళ్ళూనుకుని ఊడలు కూడ దించుకుంది. చివరకు స్త్రీలకు పురుషుల చాటు బ్రతుకే అయింది.

మధ్యయుగం ఫ్యూడల్ వ్యవస్థలో స్త్రీని కేవలం పురుషుల ఆస్తిగా, విలాస వస్తువుగా పరిగణించడం జరిగింది. స్త్రీలపై తమ పెత్తనానికి ఆటంకం ఎక్కడ కలుగుతుందో అని. మతాన్ని సంప్రదాయాల్ని అడ్డం పెట్టుకుని ఆడవారిపై ఎన్నో ఆంక్షలు విధించారు. నీతి శతకాలు కూడ వ్రాయించారు.

ఒకదశలో స్త్రీలకు చదువే అక్కర్లేదని, చదువుకుంటే ఆడవారు చెడిపోతారని ప్రచారం చేశారు. కొంతమంది ఆడవారిపై దౌర్జన్యాలు చేయటం ప్రారంభించారు. తల్లి దండన, తండ్రి దండన, పురుషుని దండన కావాలి నాకు అని కోరుకుంటూ స్త్రీలతో నోములు నోయించారు. ఆడవారిపై మగవాళ్ళ దాష్టీకం ఏమాదిరి పరాకాష్టకు చేరిందో ఊహించుకోవచ్చు. ఈ పరిస్థితులు తట్టుకోలేక, ఎందుకొచ్చిన బ్రతుకు అనే నిరాశ ఆడవారిలో ప్రబలిపోవడం కూడా జరిగింది. 'ఆడదై పుట్టడంకంటే అడవిలో మానై పుట్టడం మేలు' అని

మహిళలు ఏడ్చిన రోజులు ఉన్నాయి. 'ఆడదాని చేతి అద్దమూ, మగవాని చేతిలోని బిడ్డా నిలవవు' అనే సామెతలు పుట్టుకొచ్చాయి. ఈ ప్రయత్నాలన్నీ ఆడదాన్ని అదుపులో ఉంచటానికి పురుషలోకం పన్నిన పన్నాగాలే. తల్లికి తెలియకుండానే కూతురి పెళ్ళి నిశ్చయ పరుచుకొస్తాడు. అగ్నిహోత్రావధానులు కన్యాశుల్కంలో నాతో చెప్పకుండానే అని వెంకమ్మ అంటే 'ఆడవాళ్ళతోనా ఆలోచన' అని తీసిపారేస్తాడు. మరో సందర్భంలో నన్ను ఆక్షేపణ చేస్తావుటే - నీ అన్న ఉన్నాడని ఊరుకునేది లేదు అంటూ ఆమెను కొట్టబోతాడు. స్త్రీలపై పురుషుల దౌర్జన్యాలు పూర్వం నుంచి సాగిపోతూనే ఉన్నాయి. కాలం మారుతున్నా సమాజంలో మహిళల తీరుతెన్నులు మీరటంలేదు. ఇంటా బయటా వివక్ష ఎదుర్కొంటున్నారు గృహ హింసకు గురి అవుతున్నారు. వివాహమైన ఆడపిల్లల్లో ప్రతి ఐదుమందిలో ఒకరు గృహ హింసకు గురవుతున్నారు. ఒకశాతం ఫిర్యాదు కూడా పోలీసులకు అందడం లేదు. స్త్రీల సహనశీలత ఎక్కువగా ఉండటంవలన ఇంటి విషయాలు రచ్చకెక్కకూడదు అన్న ధోరణిలో, గృహహింసకు సంబంధించిన విషయాలు గుట్టుగా ఉంటున్నాయి. దోషులను కఠినంగా శిక్షిస్తేగాని, గృహహింసకు కళ్ళెం వేయటం జరగదు. ఎవరెన్ని చెప్పినా, మనుషులలో వారి మనస్తత్త్వాలలో మార్పు వచ్చి, స్త్రీల పట్ల సానుకూల దృక్పథం ఏర్పడాలి. సంబంధింత అధికారులు గృహహింస అరికట్టడానికి చర్యలు తీసుకోవాలి.

*(ఆంధ్రభూమి)*

# కన్యాదానం

వివాహబంధం అనేది చాలా పవిత్రమైన బంధం. పూర్వకాలంలో ఐదురోజుల పెళ్ళిళ్ళు, మూడురోజుల పెళ్ళిళ్ళు చేసేవారు. ఇప్పుడు ఒక్కరోజు పెళ్ళికే ఎంతో ప్రయాస పడుతున్నారు. ఒక్క గంటలో అన్ని తతంగాలు జరిపేస్తున్నారు. పురోహితుడు చెప్పే హిందూ వివాహ మంత్రాలలో ఎంతో అర్థం దాగి ఉంది.

ముఖ్యంగా కన్యాదాన సమయంలో, కన్యాదాత వరునితో "కన్యాం కనక సంపన్నాం కనకాభరణభూషితాం దాస్యామి విష్ణవేతుభ్యం బ్రహ్మలోక జిగీషియా' అంటాడు. దానికర్థం ఏమంటే - నేను బ్రహ్మలోకం సాధించడం కోసం, సువర్ణ ఆభరణములచే అలంకరింపబడ్డది అయిన కన్యను, విష్ణు స్వరూపుడైన నీకు ఇస్తున్నాను అని. ఇంకనూ "విశ్వంభరః సర్వభూతాః కన్యాం ఇమాం ప్రదాస్యామి పిత్రూణా తారణాయవై" దీనిభావం ఏమంటే- నా పితరులు తరించుటకు ఈ కన్యను దానము చేస్తున్నాను. పంచభూతాలు, సమస్త దేవతలు, ఇందుకు సాక్షులు అంటూ "కన్యాం సాలంకృతాం సాధ్వీం సుశీలాయ సుధీమతే, ప్రయత్నాహం ప్రయచ్ఛామి ధర్మకామార్థ సిద్ధయే" అలంకారాలతో కూడి సాధుశీలవతి అయిన ఈ కన్యను, ధర్మ కామార్థ సిద్ధికొరకై సుశీలుడు, బుద్ధిమంతుడు అగు నీకు దానము చేయుచున్నాను అంటూ వధువు, వరుల మూత్తాతలనుండి వాళ్ళ గోత్రాలతో ప్రవర చెప్తారు. వరుని చేతిలో నీటిని ధారగా వదలుతూ, కన్యని వరుని చేతిలో ఉంచి మంత్రాలు వల్లిస్తారు. వరుడు నాతి చరామి అంటాడు. అనగా ఈమె మాటను నేను అతిక్రమించను అని అర్థం.

సంస్కృత భాషలో ఎంతో అర్థాలను పొదగబడిన ఈ వివాహబంధం విడాకుల వరకు వెళ్తున్నాయంటే మనకు ఎంతో ఆశ్చర్యమనిపిస్తుంది. ఈ బంధాన్ని ఎప్పటికీ, నిర్లక్ష్యం చేయకూడదు.

దంపతులిద్దరూ కూడా ఒకరినొకరు క్షమించుకుంటూ విశాలదృక్పథం కలిగి ఉండాలి. భర్త తన అనురాగం భార్యకు పంచాలి. అదేవిధంగా భార్య కూడా తన ప్రేమను భర్తకు అందిస్తూ కష్టసుఖాలు పంచుకుంటూ, క్షణిక ఉద్రేకాలకు లోనుగాకుండా, పరస్పర అవగాహనతో మసలుకోవాలి. నా మనసునిండా నీవే ఉన్నావు సుమా అని భర్త భార్యతో అంటే, ఆమె ఎంతో సంతోషించి తృప్తిగా తన సంతోషాన్ని తెలుపుతుంది. ఇటు తల్లి దండ్రులకు గాని, అటు అత్తమామలకుగాని ఎంతో ఆనందాన్ని పంచగలుగుతారు.

*(ఆంధ్రభూమి ఆగస్టు 6, 2003)*

# దీర్ఘాయువు

శ్రీరామచంద్రుని ముందుతరం అయిన రాజ్యవర్ధనుడు ధర్మంగా పరిపాలిస్తూ పేరు ప్రఖ్యాతులు సంపాదించుకున్నాడు. ఆయన రాజ్యంలో ప్రజలంతా సుఖశాంతులతో గడిపేవారు, ధర్మంగా జీవించేవారు. పేదవారికి దానం చేయటం, లోకహితం కోసం యజ్ఞాలు చేయటం వారి ప్రతిదిన కార్యక్రమం. రాజుకు తన ప్రజలను పాలించుటకు ఎక్కువ సమయం గడిచిపోయేది.

రాజుగారి ధర్మపత్ని ఆయనకు తలస్నానం చేయిస్తూ తలమీద తెల్లవెంట్రుక చూసి కళ్ళనీరు పెట్టింది. అది చూసి రాజుగారు ఆ కన్నీటికి కారణమేమి అంటాడు. 'నాథా! మీ శిరస్సుపైన కనబడిన ఈ తెల్ల వెంట్రుకలు నా దుఃఖానికి కారణం' అంటుంది. అప్పుడు రాజు 'కల్యాణీ! నేను నా కర్తవ్యాలను నిర్వహించాను. నాకిప్పుడు చింతించాల్సిన విషయం లేదు. జన్మించిన ప్రతి వ్యక్తికీ మరణం నిశ్చయం. అందువల్ల నేను అడవులకు వెళ్ళి తపస్సు చేసుకోవాలి' అంటాడు.

రాజు వనాలకు వెళ్ళాలనుకుంటున్న వార్త విని ప్రజలు దుఃఖించ సాగారు. రాజుగారి పాలనవలన కృతజ్ఞులై ఆయనతో ఇలా అంటారు "అయ్యా! మా ప్రార్థన మన్నించి మరికొన్ని సంవత్సరాలు మమ్మ పరిపాలించండి" అని. ఆ తర్వాత రాజుగారికి దీర్ఘాయువు లభించాలని ప్రజలందరూ సూర్యుని ఆరాధించారు. కొంతమంది సూర్యునికి అర్ఘ్య ప్రదానం చేసారు. సూర్య సూక్తాన్ని పఠించారు. వేదమంత్రాలు, జపం, ఉపాసనతో సూర్యుని ప్రసన్నుని చేసుకున్నారు. అందరి కోరిక ఒకటే. రాజుకు దీర్ఘాయువు లభించాలని, చివరికి సూర్యుడు ప్రసన్నుడై ప్రజల కోర్కె మన్నించి, రాజుకు దీర్ఘాయువు ప్రసాదించాడు. ఈ విషయం రాజ్యవర్ధనునికి తెలియగానే సంతోషానికి బదులు దుఃఖించాడు.

నాకు దీర్ఘాయువు కలిగినా నా కుటుంబానికి, నా ప్రజలకు లభించదు గదా! అని బాధతో - కామరూప పర్వతాలకు వెళ్ళి దివాకరుని గురించి తపస్సు చేయసాగాడు. అతనితోపాటు ఆయన రాణి కూడా ఉపాసనతో సూర్య భగవానునికి పూజలు చేయటం మొదలుపెట్టింది. చివరికి సూర్య భగవానునికి రాజుపై కృప కలిగింది. భగవానుడు ప్రత్యక్షమై రాజు కోరిక ప్రకారం వారి పరివారం అందరికీ రాజుతో సమానంగా దీర్ఘాయువును ప్రసాదించాడు. సూర్యనారాయణుని కృపతో రాజ్యవర్ధనుడు, ఆయన ప్రజలు సుఖశాంతులతో ఎంతోకాలం జీవించారు.

*(ఆంధ్రభూమి ఏప్రిల్ 7, 2007)*

# ఆయుక్షీణానికి ఏది కారణం?

ఒక సమయంలో ధృతరాష్ట్ర మహారాజు విదురుని ఈవిధంగా ప్రశ్నిస్తాడు – అన్ని వేదాలలో గూడ పురుషుని శతాయువు అని చెప్పబడింది గదా! అంటే నూరు సంవత్సరాలు జీవించగలడని తెలుపబడ్డది గదా! అయినా మానవుడు నూరు సంవత్సరములు బ్రతుకుటలేదెందుకు? అని అడిగితే విదురుడు ఈవిధంగా జవాబిస్తాడు. "అతిమానో అతివాదశ్చ తథా, త్యాగో, నరాధిప, క్రోధశ్చాత్మ విధిత్యాచ, మిత్రద్రోహశ్చ తానిషట్, ఏతఏవాస యస్తీక్షాః కృస్తానాం యూంషి దేహినామ్, ఏతానిమాన వాన్ఘ్నంతి, సమృత్యుర్భద్రమస్తుతే".

అత్యంత అభిమానం, అంటే నేనే గొప్ప వాడిననే అహంకారము, అతివాగుడు, త్యాగరాహిత్యము, విపరీత కోపము, స్వార్థచింతన అంటే ఎప్పుడూ తనను గూర్చే ఆలోచించుకుంటూ, ఇతరులను పట్టించుకోకుండా ఉండటం, మిత్రద్రోహము, ఈ ఆరు లక్షణాలు ప్రతి మనిషి ఆయువును తగ్గిస్తాయి. ఈ గుణాలవల్లనే మనుషుల ఆయువు క్షీణిస్తుంది గాని మృత్యువు చంపటం లేదు.

మొట్టమొదటి దోషము ఆత్మాభిమానము. ఈ ఆత్మాభిమానము అందరికీ వుంటుంది. ఈ ఆత్మాభిమానము లేనివాడు సమాజానికి ఎందుకూ పనికిరాడు. ఈ ఆత్మాభిమానము దురభిమానం మాత్రం కాకూడదు.

ఇంక ఇతరులు తనను పొగడవలెనని కోరుకోవడం, ఎక్కువ ధనవంతుడనని, తనవలననే గొప్ప కార్యాలు జరుగుచున్నాయని గర్వపడటం, ఇతరుల తప్పులు ఎప్పుడూ వెతకడం, తనే బలవంతుడు, విద్వాంసుడు, త్యాగి అని అనుకోవడం ఈ లక్షణాలన్నీ దురభిమానం క్రిందే చెప్పవచ్చు.

ఈ దురభిమానం వల్లనే మానవుడు తన స్థితి నుండి పతనమవుతాడు. ఈతడు భగవంతుని భక్తితో శరణువేడలేడు. దేవుని కూడ తనతో సమానంగా

చూస్తాడు. తనలో వుండే దోషాలు పోగొట్టుకోలేడు. శ్రేష్ఠులైన వారిని కూడా తక్కువ భావంతో చూస్తాడు.

దురభిమానం అనేది లేకపోతే ఉన్నతస్థితి పొందగల్గుతాడు. ప్రకృతిలో ఉండే సమస్త సంపదలు పరమేశ్వరుని లీలే అని, తెలిసికొని శారీరకంగా, మానసికంగా ఇతరుల సేవ చేయుచూ ఇతరుల మంచి గుణాలు తెలుసుకొనుచు జీవిస్తే ఈ దురభిమానం దూరమవుతుంది. ఇక రెండవది అధిక వాచాలత. అధిక వాగుడువల్ల అర్థంలేని మాటలు, సత్యం మరుగున పడటం, ఇతరులకు విసుగు కలగటం మొదలైన లక్షణాలు కలిగి అందరికీ లోకువైపోతాడు. వాక్కును మనం ఎప్పుడూ సంయమనంతో వుంచుకోవాలి. భగవద్గీతలో వాక్కును ఒక తపస్సుగా తెలుపుతాడు.

*అనుద్వేగకరం వాక్కు - సత్యం ప్రియహితంచయత్*

*స్వాధ్యాయాభ్యసనం చైద - వాఙ్మయం తప ఉద్యతే*

ఏ వాక్యాలు ప్రాణులకు దుఃఖం కలిగింపదో - సత్యం, యథార్థం ప్రియకరం, హితము అవుతుందో అట్టి వాక్యము వేదశాస్త్ర అభ్యాసం, వాఙ్మయ తపస్సు అంటారు. ఈ అతివాగుడు అరికడితే ఆయువు వృద్ధి అవుతుందని భగవద్గీతలో చెప్పాడు.

ఇక మూడవది త్యాగశీలం లేకపోవడం - ఈ గుణాలవల్లనే రావణుడు, దుర్యోధనుడు పతనమైనారు. సంసార సుఖభోగములు ఆయువును తగ్గించును. త్యాగ గుణం అనేది ఆయువును పెంచుతుంది.

*శ్రేయోహి జ్ఞానమభ్యాసాత్ - జ్ఞానాధ్యానం విశిష్యతే*

*ధ్యానాత్ కర్మ ఫల త్యాగః - త్యాగాచ్ఛాన్తి రనన్తరమ్*

ధ్యానం కంటే కూడా కర్మ ఫలత్యాగమే శ్రేష్ఠమన్నాడు. త్యాగం వలన పరమశాంతి లభిస్తుంది.

ఈ శరీరం మనకు దేవుని కృపతో లభించిందేగాని, సుఖాలు అనుభవించడానికి కాదని త్యాగ గుణంవల్ల తెలుస్తోంది.

ఇక నాల్గవది క్రోధం – క్రోధం అరిషడ్వర్గాలలో రెండవది. క్రోధానికి వశుడైనవాడు ఏది మంచి, ఏది చెడు తెలుసుకోలేడు. పరుషమైనది, తీక్ష్ణమైనది క్రోధం. క్రోధం విచక్షణా జ్ఞానాన్ని నశింపచేస్తుంది. సజ్జనులు కోపాన్ని మింగుతారు. దుర్జనులు మింగలేరు. క్రోధం నరకానికి ద్వారం వంటిది.

ఇక అయిదవది స్వార్థ చింతనం – ఇది సమస్త అనర్థాలకు మూలం. మానవునకు స్వార్థం చేసే అపకారం ఇక ఏ ఇతర జీవి కూడా చేయదు. స్వార్థం వల్ల మానవుడు సిగ్గు, మానాభిమానం వదిలివేస్తాడు. స్వార్థపరుడు ఎటువంటి హింస అయినా చేయడానికి ఆలోచించడు. ఈ స్వార్థం అనేది లేకపోతే మానవుడు లోక కల్యాణానికి కారకుడవుతాడు. మహాత్ముడౌతాడు.

ఇక ఆరవది మిత్ర ద్రోహం. మిత్ర ద్రోహి అయిన మానవుని అందరూ నిందిస్తారు. మంచి మిత్రుడు మానవునికి శక్తిలాంటివాడు.

కష్టకాలంలో మిత్రుడు సహాయపడినట్లు బంధువులు కూడా సహాయపడరు. మిత్రునికి ద్రోహం చేసే వానికంటే అధముడు మానవ సమాజంలో ఉండడు. మిత్ర ద్రోహం వలన మహాపాపం సంభవిస్తుంది.

భారతంలో ఆయువు క్షీణించడానికి ఈ ఆరు దోషాలు విదురుడు తెలిపాడు. ఈ ఆరు దోషాలను అందరూ దూరంగా వెడలగొడితే శతాయుష్కుడుగా జీవింప గలుగుతాడు. ఆయువు కూడా వృద్ధి అవుతుంది.

*(ఆంధ్రభూమి ఆగస్టు 19, 2002)*

# సత్యము

సత్యము మన భారతీయ సంస్కృతిలో ఒక ధర్మం. 'సత్యము' అంటే ఉన్నది ఉన్నట్లుగా చెప్పటం. సత్యానికి మించిన మంచి గుణం మరొకటి లేదు. సత్యం దైవ స్వరూపం. సత్యాన్ని పలికేవాడిని అందరూ గౌరవిస్తారు. అతనిపై విశ్వాసం, పూజ్యభావం ఏర్పడుతుంది. సత్యాన్ని పలకమని శాస్త్రాలు ఘోషిస్తున్నాయి.

సత్యమంటే భగవంతుడే. సత్యంలోనే ధర్మం ప్రతిష్ఠించబడి వుంది. రాజ్యం కోల్పోయినా, భార్యాపుత్రులు దూరమైనా సత్యమార్గంలో ఉండబట్టే సత్య హరిశ్చంద్రుడయ్యాడు. వేదాలన్నీ కూడా సత్యస్వరూపమైనవే. సత్యం వలననే వీరలోకాలు సిద్ధిస్తాయి.

*"సత్యమేవ జయతే నానృతం*
*సత్యే నపంథా వితతో దేవయానః"*

జయించేది సత్యమే. సత్యం వల్లనే దేవ మార్గం విస్తరించి ఉంది. మహర్షులు సత్యంవల్లనే ప్రాప్తకాములై ఈశ్వరుని పొందుతున్నారు.

*"సత్యమేవ పదబ్రహ్మ*
*సత్యేధర్మ ప్రతిష్ఠతః*
*సత్యమే వాక్షయావేదా*
*సత్యనై వార్యతే వరమ్"*

విదురనీతిలో వృద్ధులు లేనిదే సభకాదని, ధర్మం చెప్పకపోతే వారు వృద్ధులే కారని, ఎందులో అసత్యం నిండి వుంటుందో అది ధర్మం కాదని నిరూపింపబడింది. అందువల్ల సత్య స్వరూపాన్ని బాగా తెలుసుకొని, దానినే ఆచరించాలి. సత్య రహితమైన ఏ పనీ కూడా వ్యర్థమే.

సత్యంలో ధర్మసూక్ష్మం యిమిడి ఉంది. అది పరులకు ఉపయోగపడేదిగా ఉండాలి. యితరులకు నష్టం కలిగిస్తే అది అసత్య ఫలాన్నిస్తుంది అని ధర్మశాస్త్రాలు చెప్తున్నాయి. రామాయణంలో శ్రీరాముడు అరణ్యవాసానికి రథానెక్కి సీతాలక్ష్మణ సమేతుడై వెళ్తుంటాడు. సుమంతుడు రథాన్ని నడుపుతూ వుంటాడు. ఆ సమయంలో దశరథుడు శ్రీరాముని వియోగం భరించలేక కైకేయి వుంటే అంతః పురం నుంచి బయటకు వచ్చి దుఃఖంతో "రామా ఆగు" అంటాడు. అపుడు శ్రీరాముడు 'ఆపవద్దు. రథాన్ని పోనీయమంటాడు'. నేను రాజునకు ఏమని సమాధానమిచ్చేది? అని సుమంతుడు ఆలోచిస్తూ ఉంటే శ్రీరాముడు యిలా అంటాడు "నాశ్రౌషమితి రాజా! సముపాలో లబ్ధోపి వక్షపి' అని సుమంతుని చెప్పమంటాడు. అంటే మాట వినపడికూడా వినపడలేదని చెప్పటం ఇది అసత్యం కాదా! రాముడు అలా చెప్పటం దోషం కదా! అని మనకు అనిపిస్తుంది. కాని యిందులో ధర్మసూక్ష్మం యిమిడి వుంది. దశరథుని మాటలు విని రాముడు వెనక్కు వెళితే అక్కడ దశరథుడు రాముడిని పుత్రప్రేమచే అడవులకు వెళ్ళవద్దని చెప్తాడు. అలాగైతే దశరథునికి అసత్య దోషం కలుగుతుంది. రాముడు ఆగిపోయి అరణ్యానికి వెళ్ళకపోతే రామునికి కూడా అసత్యదోషం కలుగుతుంది. ఇక్కడ ధర్మసూక్ష్మం ఏమంటే, సుమంతుడు రథ శబ్దంలో దశరథుని మాటలు వివపడలేదని చెప్తే, అసత్య దోషం ఏమంత పెద్దది కాదు. దీనివల్ల ఉపకారమే కలుగుతుంది. ప్రియమైన అసత్యమే మేలని రాముడు భావించాడు. దశరథుని హితమే శ్రీరామునికి ముఖ్యం. భాగవతంలో బలిచక్రవర్తితో రాక్షస గురువైన శుక్రాచార్యుడు యిలా అంటాడు.

*వారిజాక్షులందు వైవాహికములందు*
*ప్రాణ విత్త మానభంగమందు*
*చకిత గోకులాగ్ర జన్మరక్షణమందు*
*బొంకవచ్చు నఘము బొంద దధిప*

ఆడవాళ్ళయందు, పెండి కార్యములందు, ప్రాణాపాయమందు, మానభంగం కలుగు సందర్భమున భయపడి పరుగెత్తు గోవుల యందు, బ్రాహ్మణుల కాపాడుటయందు అబద్ధం చెప్పినా పాపం లేదు. ఏ ధర్మము ఆచరిస్తే మనసుకు సంతృప్తి కలుగుతుందో ఆ ధర్మం ఆచరించాలేకాని మనశ్శాంతిని కలిగించని ధర్మము ఆచరించాల్సిన పనిలేదని 'మనుస్మృతి' చెప్తోంది. యిలా సత్యంలో వుండే ధర్మ సూక్ష్మం తెలుసుకుని లోక కల్యాణం కోసం పాటుపడాల్సి వుంది. మహాభారతంలో అష్టవిధ ధర్మాలలో సత్యం ఒకటని చెప్పబడింది.

*"ఇజ్యాధ్యయన దానాని*
*తపస్సత్యం ధృతిఃక్షమా*
*అలోభ ఇతి మార్గోయం*
*ధర్మస్యా అష్టవిధ స్మృతః"*

యజ్ఞము, అధ్యయనము, దానము, తపము, ధైర్యము, క్షమ, లోభము అను ఎనిమిది భాగాలు. ఇందులో సత్యం ఒకటి అని చెప్పబడింది.

ఎఱ్ఱన మహాకవి సత్యం గురించి యిలా చెప్పాడు -

*"సత్యంబు నరులకు సంక్షిప్తమగు సత్య*
*హాని నాయువు గను నతిగిపోవు*
*ఆయువు తరిగిన అల్పంబగు విద్య*
*అల్పవిద్యల, విమోహంబు మిగులు"* (మ.భా. అ.ప. 288 పద్యం)

గనుక సత్యాన్ని అందరం పాటించాలి.

(ఆంధ్రభూమి)

# మార్గశిరం

మాసాలకు పేర్లు పౌర్ణమినాడు వుండే నక్షత్రాన్ని బట్టే వస్తుంది. ఆలా మృగశిర నక్షత్రంతో కూడివుండే పౌర్ణమికే మార్గశిర మాసమని పేరు. 'మాసానాం-మార్గశీర్షోహం' అని భగవద్గీత చెప్తోంది. మార్గము అంటే భగవంతుని చేరుటకు దారి. వేర్వేరు దశలలో ఇవి మనకు ఉపదేశిస్తాయి.

నిష్కామ కర్మ, ఆత్మజ్ఞానం, భగవద్భక్తి ఈ మూడింటి ప్రధానమైనటువంటి ఉపాయమే మార్గశీర్ష వ్రతమని కూడా అంటారు. భగవంతుడే ఉపాయము. ఇంక ఇతరమేదీ లేదు – అనే విశ్వాసం ప్రతి ఒక్కరు కలిగి వుండాలని మార్గశీర్షం చెప్తోంది.

సత్త్వగుణము ఎక్కువగా ఉండే బ్రహ్మీ ముహూర్తము, రజోగుణం పుట్టే కాలం సంధ్యాకాలం, తమోగుణం ఉద్భవించేకాలం తెల్లవారుజామున అని పురాణాలు చెపుతున్నాయి. సగం చీకటి, సగం వెలుగు సమంగా వుండి ఒక వస్తువు మనకు వున్నట్లు కనపడ్డా కూడా రజోగుణ ప్రభావంతో వాని స్వరూప విషయంలో సందేహం కలుగుతుంది. తమోగుణం ఏర్పడే రాత్రికాలం నిత్యమైన పరమాత్మ గురించి తెలుసుకోలేక నశించిపోయే దేహమే శాశ్వతమని నమ్మి మోసపోతాడు.

సత్త్వగుణం ఉద్భవించే తెల్లవారుజామున, కాలము ప్రశాంతంగా ఉంటుంది. యథార్ధ జ్ఞానం అంటే ఏమిటో మనకు తెలుస్తుంది. తాను చాలా అల్పుడనని, తనను రక్షించమని భగవంతుని కోరుకుంటాడు. ఇట్టి సత్త్వగుణ మహిమగల కాలమే మార్గశీర్ష మాసం.

వాల్మీకి శ్రీరామ పట్టాభిషేకం చేయాలని తలపెట్టినపుడు 'చైత్ర శ్రీమాన్ అయః-మాస-పుణ్యా-పుష్పిత కాననః' అని చైత్రమాసాన్ని ప్రశంసించాడు.

అలాగే ఆండాళ్ మార్గశిరమాసాన్ని స్మరించింది. ధనుర్మాసం 'ధనుస్సు' అంటే ఉపనిషత్ భాషలో ప్రణవము. ఓంకారము. అదే భగవానుని గురించి తెలియచెప్పే శబ్దము.

పరమాత్మను చేరటానికి 'ఓమ్' అనే శబ్దంతోనే ధ్యానం చేయాలి. ధర్మసంస్థాపన కొరకు సర్వేశ్వరుడైన భగవంతుడు శ్రీకృష్ణపరమాత్మ అవతారమెత్తాడు. తొంభై సంవత్సరాలు కృషిచేసి అర్జునుని ద్వారా మానవులు తరించడానికి గీతోపదేశం చేసాడు. గీతా జయంతి ఈ మాసంలోనే చేసుకుంటాము. లక్ష్మీదేవి శ్రీవిల్లిపుత్తూరులో ఆండాళ్‌గా అవతరించి, వర్ణభేదం లేకుండా అందరితో ధనుర్మాస వ్రతం ఆచరింపచేసి, తానూ ఆచరించింది. 'తిరుప్పావై' అనే ప్రబంధం మనకందించింది కూడా ఈ మాసంలోనే. ధనుర్మాసం బృహస్పతికి క్షేత్రం కూడాను.

శ్రీవిల్లిపుత్తూరులో – విష్ణుచిత్తునకు తులసి వనంలో పాదులు చేస్తున్నప్పుడు గోదాదేవి లభించింది. ముందే అతనికి సంతానం లేనందున, అల్లారుముద్దుగా పెంచుకుంటాడు. ఆమె సౌందర్యానికి తగినట్టుగా "కోద్లై" అనే పేరుతో పిలుస్తాడు. కోద్లై అంటే పూలదండ. బాల్యం నుంచే గోదా భక్తి, వైరాగ్యాలు కలిగి ఉంటుంది. 'జిహ్వే శ్రీకృష్ణమంత్రం జప తప సతతం జన్మసాఫల్య మంత్రం' అని గోదాదేవి, గోపికలు ప్రాతఃకాలమే స్నానం చేసి వ్రతం చేస్తారు. వెన్నెలతో నిండిన శుక్లపక్షం సత్త్వగుణం ఎక్కువ. సత్పురుషుడిలో చేరాలనే కోరిక కలుగుతుంది. ఆ కోరికతోనే ఆచార్యులను ఆశ్రయిస్తారు. ఆండాళ్ స్నేహం వల్ల గోపికలకు ఆధ్యాత్మజ్ఞానం కలుగుతుంది. దాని ద్వారా భగవదనుగ్రహ ప్రాప్తి కలుగుతుంది. ఈ క్రమమే మార్గశీర్షము.

ఆచార్యుడు చంద్రుడు. దాని నుంచి ప్రసరించే ఆధ్యాత్మ జ్ఞానమే వెన్నెల. సూర్యుని తేజస్సు ఎలాగో – అలా భగవంతుని అనుగ్రహం మనల్ని తపింపచేస్తుంది. ఆ తేజస్సే చంద్రునిపైబడి మనపై ప్రసరిస్తుంది. అపుడు మనకు సంతోషం కలుగుతుంది. అంతేకాకుండా, మార్గశిరమాసం భూమిపై సస్యశ్యామలంగా పంటలుపండి వెన్నుభారంగా వొంగి, మనోహరంగా వుండే

కాలం. ఈ మాసంలో మనకు ఏమైనా కోర్కెలుంటే అవి ఫలిస్తాయి. ఆత్మ స్వరూప జ్ఞానం మనకు అందించే శుభ సమయమే మార్గశిరమాసం.

ఈ మాసంలోనే అష్టమి నుంచి పౌర్ణమి వరకు 'దత్త జయంతి' వేడుకలు జరుపుకుంటాం. హరిహర పుత్రుడు అయ్యప్ప దీక్ష, శబరిమలై యాత్ర కూడా ప్రారంభమయ్యేది ఈ మాసంలోనే. కార్తికేయుడుగా అవతరించిన కుమారస్వామి శ్రీ సుబ్రహ్మణ్యరూపం ధరించి పూజలందుకునే రోజు మార్గశిరంలోనే.

అత్రి మహాముని తపః ఫలితంగా త్రిమూర్తులు దత్తమయ్యారు గనుక దత్త భగవాన్ అయ్యాడు. అత్రి కుమారుడు గనుక 'ఆత్రేయుడు' అని కూడా అంటారు. దత్తాత్రేయులు అవతరించింది మార్గశిరమాసం శుద్ధ పౌర్ణమి అని పురాణాలు చెబుతున్నాయి.

చెడును అణచడం, మంచిని పోషించడం, రాగద్వేషాలు, తప్పొప్పులు, శత్రుమిత్రభేదాలు, వీటన్నిటికీ ఇక్కడ చోటు లేదు. బద్ధశత్రువులైన పరశురాముడు, కార్త్యవీర్యుడు దత్తాత్రేయులవారి శిష్యులై వారి అనుగ్రహం పొందుతారు. శిరిడీ సాయిబాబా కూడా దత్త అవతారమేనని చాలామంది విశ్వాసం. పరబ్రహ్మలో మనస్సు లీనంచేసి ఉన్నది దైవం ఒక్కటే మరేది లేదని, శరీరంమీద స్పృహ లేకుండా దిగంబరంగా, స్వతంత్రంగా తిరిగేవారినే అవధూతలంటారు. వీరు అతి శక్తిమంతులు. వీరికి జాతి, మత, కులభేదాలుండవు. కర్మకాండలు కూడా ఉండవు. వీరిది నిరంతరం అవతారం. మన మధ్యే వీరు తిరుగుతుంటారని నమ్మకం. శ్రీపాద శ్రీవల్లభుల వారు దత్త అవతారంగానే భావిస్తారు.

శ్రీదత్తాత్రేయులవారు తమ భక్తులను తామే ఎంచుకుంటారని తమ ప్రభావంలోకి వారిని రప్పించుకుంటారని పురాణాలలో వర్ణింపబడింది. స్మరణ మాత్రంతోనే అనుగ్రహించే దైవమే దత్తాత్రేయుడు 'దత్త' అనే రెండు అక్షరాల మంత్రం జపిస్తే దత్త అనుగ్రహం తప్పక లభిస్తుంది.

*(ఆంధ్రభూమి డిసెంబర్ 13, 2004)*

# పితృదేవోభవ

భారతీయ సంస్కృతిలో తండ్రికి వున్న స్థానం ఎంతో ఉన్నతమైంది. 'పితృదేవోభవ' అని తైత్తరీయ ఉపనిషత్ వాక్యం. అంటే తండ్రే దేవుడిగా కలవాడని అర్థం. పితృదేవతలను - ప్రత్యక్షంగా సేవించటమే కాకుండా, వారు స్వర్గస్థులైనప్పటి నుంచి తర్పణము, శ్రాద్ధము చేయాలని, వారిని సంతృప్తులను చేయాలని వేదం శాసిస్తోంది. మనం పంచయజ్ఞాలని అంటుంటామే అందులో పితృతర్పణం కూడా ఒకటి.

తండ్రి జీవించియున్నపుడు వారు ఆజ్ఞను పాటించడం వారు స్వర్గస్థులైతే శ్రాద్ధం పెట్టడమే కాకుండా గయలో పితృతృప్తికై పిండప్రదానం చేయడం, ఈ పనులవలననే పుత్రుడు అనబడతాడు. ఆదికావ్యం రామాయణంలో వాల్మీకి మహర్షి పితృవాక్య పాలన ఎలాంటిదో నిరూపించాడు. ఇది అనన్య సామాన్యం.

**సహ్యాతో ధర్మచరణం**
**కించి దస్తి మహత్తరమ్**
**యథా పితరి శుశ్రూషా**
**తన్యవా వచనక్రియా**

తండ్రికి సేవ చేయడం, అతని మాట పాలించడం, వీటికంటే ఉత్కృష్టమైనదేదీ లేదు. ఇదే మహత్తరమైన ధర్మం అని శ్లోకం భావం. విద్య తండ్రిలాగా హితాన్ని తెలియచేస్తుంది. హితాన్ని చెప్పడం తండ్రి లక్షణం.

తల్లి శిరస్సును ఖండించాడు పరశురాముడు. అందుకు తండ్రి ఆజ్ఞయే కారణం. పితృ ఆజ్ఞ నెరవేర్చినందుకు జమదగ్ని పరశురాముడిని వరం కోరుకొమ్మంటాడు. తిరిగి తల్లిని బ్రతికించవలసిందిగా వరం కోరుతాడు. పితృవాక్యపాలన చేసిన జమదగ్ని కూడా జగద్వంద్యుడే. మన ధర్మశాస్త్రంలో పితృ ప్రాముఖ్యాన్ని గురించి ఇలా చెప్తాడు.

'యం మాతా పితరౌక్లేశం

సహేతే సంభవౌన్రుణాం

న తస్య నిష్కృతిశ్చ క్యా

కర్తుం వర్ష సథై రపి'

ఎవరి జీవనం, ప్రవర్తన వలన తండ్రి మనఃక్లేశాన్ని పొందుతాడో వాని పాపం నూరు సంవత్సరాలైనా పోదు. ఇక పితృశ్రాద్ధాన్ని మహాలయా పక్షాలలో పెడితే ఎంతో ప్రభావం వుంటుంది. శ్రాద్ధంకోసం పితృదేవతలు ఎదురుచూస్తూ వుంటారు. అందుకు ప్రమాణం ఇలా వుంది. పితృశ్రాద్ధాదులు అవశ్యం చేయవలసినవి. తైత్తరీయోపనిషత్తు కూడా ఇదే విషయం చెబుతోంది. దేవతాసేవ – పితృకార్యాలను ఎప్పటికీ మానకూడదు.

జన్మను అందించిన తండ్రేగాకుండా, ఇతర తండ్రులు వున్నారు. వారెవరంటే – కన్నతండ్రి, అన్నదాత, భయాన్ని పోగొట్టినవాడు, విద్యను అందించినవాడు అంటే గురువు, ఉపనయనం చేసినవాడు ఈ ఐదుమంది తండ్రులు. వీరిలో కూడా పితృత్వాన్నే చూడాలి.

భారతంలో నూరు యజ్ఞాలకంటే ధర్మం ఆచరించే పుత్రుడు మేలు అని చెప్పబడింది. పితృత్వానికి వ్యతిరేకంగా వుండేవారిని ఎలా చూడాలి అనే ప్రశ్న కూడా కలుగుతుంది. కొందరితో వాదోపవాదాలు కూడదని శాస్త్రం చెప్తోంది. వారిలో కూడా వున్నారు. అందరికంటే ఇంట్లో పెద్ద కుమారుడు తండ్రితో సమానం.

అనర్హుల విషయం ఏం చేయాలో రామాయణం చెప్తోంది. విభీషణుడు పితృ సమానుడైన అన్న రావణుని అధర్మపరుడుగా గుర్తించి త్యజించాడు. సతీదేవి అధర్మపరుడైన తన తండ్రి దక్షుని విడచిపెట్టింది.

పితృ ప్రాముఖ్యం గుర్తించే - తండ్రిని సేవించాడు శ్రీరామచంద్రుడు. జటాయువు అనే పక్షిని తండ్రివలె గౌరవించాడు. అంత్యక్రియలు కూడా చేశాడు.

నచికేతుని కథ అందరికీ తెలిసిందే. అతని తండ్రి వాజశ్రవుడు విశ్వజిత్ యాగం చేయటానికి, ఏర్పాట్లు చేస్తున్నాడు. వృద్ధమునులు వాజశ్రవుని, నీవు ఉచ్చరించే ప్రతిపదం ఆచరణలో చేసి చూపించాలి. లేకపోతే నీ ప్రయత్నం వ్యర్థం అంటారు. దాన సమయ కార్యక్రమం జరగబోతోంది. తనకిష్టమైన ప్రీతిపాత్రమైన వస్తువులే దానమివ్వాలి. తండ్రి యోగక్షేమాలు, నచికేతుడి మనస్సులో ఉన్నతంగా వున్నాయి. అపుడే అది యాగమవుతుంది. తండ్రీ - నన్ను ఎవరికి దానమిస్తారు? మళ్లీ స్వరం పెంచి తండ్రీ - నన్ను ఎవరికి దానమివ్వాలనుకున్నారు? వాజశ్రవుడు తనను తాను అదుపు చేసుకోలేక, ఇక్కడ నుంచిపో నిన్ను మృత్యువుకు దానమిస్తాను' అని పెద్దగా అరిచాడు.

వాజశ్రవుడు తన కోపం వలన పొరపాటు గ్రహించాడు. నా కోపావేశం లేకపోతే అలాటి మాటలు ఉచ్చరించేవాడిని కాదు. ఇప్పుడెంత కష్టం వచ్చింది? శూన్య మనస్సు - బరువెక్కిన హృదయం. ఒక మూల దుఃఖిస్తూ కూర్చున్నాడు.

నచికేతుడు - తండ్రి అంగీకారంతో, యమధర్మరాజుని ప్రార్థించి బాహ్య ప్రపంచాన్ని మరచాడు. మూడు రాత్రులు యమపురిలో వుండి యముని వలన వరాలు కోరుకున్నాడు. పితృభక్తి అంటే అలాంటిది.

*(ఆంధ్రభూమి ఏప్రిల్ 1, 2007)*

# భక్తి - లత క్షితిరుహం

మన భక్తిని గురించి చాలచోట్ల చదివాం, విన్నాం, చూశాం. అయితే ఆదిశంకరులవారు భక్తిని గురించి ఇలా విశ్లేషించారు - ఒక లత భూమిపై చక్కగా పాకి, ఆధారంకోసం ఒక వృక్షాన్ని ఆశ్రయించి, చెట్టునుంచి విడదీయలేని విధంగా పెనవేసుకునిపోతుంది. అలాగే భగవంతుని చేయూత, పోషణ లేకుంటే మనం విషాదానికి గురవుతాం. తీగను బలవంతంగా చెట్టునుంచి విడదీస్తే, చెట్టుపైన ఒక చారలాంటి గుర్తు మనకు కనబడుతుంది. మనం కూడ తీగమాదిరిగా, భగవంతునికి అనుసంధింపబడతాము. ఆయన రక్షణలో మన జీవితాల్ని సాగించుకుంటాము. ఆయన సన్నిధినుంచి విడిపోయినప్పుడు మనం అష్టకష్టాలకు లోనవుతాము.

అంతేకాకుండా భగవంతుడు కూడా మనపై సానుభూతితో చింతాక్రాంతుడవుతాడు. లత తన అస్తిత్వం కోసం వృక్షం ఆలంబనాన్ని ఎలా అపేక్షిస్తుందో మానవులం కూడా భగవంతుని చేయూతను, ఆధారాన్ని ఆశ్రయించుకొని మనుగడ సాగించాలి. మనం పరమాత్మద్వారానే ఈ ప్రపంచంలోకి వస్తాం. తిరిగి ఆయన సాన్నిధ్యానికే చేరుకుంటాం. తీగను బలవంతంగా విడదీస్తే తప్ప తనకై తాను వృక్షాన్నించి విడిపోనట్లే మనం కూడా మూడవ వ్యక్తి భగవానుని నుంచి దూరం చేస్తే తప్ప మనకై మనం ఆయన నుంచి దూరం కాలేము.

ప్రతి వ్యక్తి జీవితంలో కష్టాల్ని, దైన్యాన్ని అనుభవిస్తాడు. ఈ విషయంలో గొప్ప మహాత్ములుకూడా అనుభవించక తప్పలేదు. వీటి నివృత్తికోసం భగవంతుని ఆశ్రయమొక్కటే శరణ్యం. వృక్షాన్ని ఆశ్రయించిన లతను విడదీస్తే ఎలా జీవించలేదో - అలాగే జీవాత్మ పరమాత్మకు దూరమై తన అస్తిత్వాన్ని నిలబెట్టుకోలేదు.

ఆదిశంకరులవారి వచనంలో 'సింధుః సరిద్వల్లభం'అన్నారు. పవిత్ర భారత భూమిపై గంగా, గోదావరి, కృష్ణ అనేక నదులు ప్రవహిస్తున్నాయి. ఇవన్నీ వివిధ మార్గాలలో వివిధ ప్రాంతాలలో ప్రవాహరూపంలో, సెలయేళ్లుగా గర్జన ధ్వనులతో ప్రవహిస్తాయి. వీటి రుచి, రంగు కూడా భిన్నంగా వుంటాయి. ఉదాహరణగా కృష్ణా జలం రంగు నల్లగానూ, గంగాజలం తెల్లగా వుండటం గమనిస్తాము. అన్ని నదులు సముద్రంలో కలిసి వాటివాటి ప్రత్యేకనామాన్ని రంగు రుచి కోల్పోతాయి. సముద్రంలో కలిసిపోయాక, ఆ జలాల రుచి మొత్తం ఉప్పదనం మాత్రమే, రంగు సముద్రజలాల రంగు మాత్రమే. అంటే సాగర సంగమం తర్వాత, తమ ప్రత్యేక గుణాల్ని కోల్పోయి, సాగరంగానే మారతాయి.

అలా నదులు సాగరంలో సంగమించినట్లు, మనం కూడా భగవస్సాన్నిధ్యం చేరే లక్ష్యంతో వివిధ మార్గాలు అనుసరించి, వివిధ రూపాలలో అవతరించిన పరమాత్ముని ధ్యానించే ప్రయత్నాలు సాగిస్తాం. భక్తులు అనుసరించే మార్గం వేరైనా, భగవస్సాన్నిధ్యం చేరటమనే గమ్యం ఒక్కటే. రామభక్తి, కృష్ణభక్తి, శివభక్తి ఇలా భక్తి మార్గాలెన్ని వున్నా అవి పరమాత్మకు అనుసంధింపబడి వున్నంత వరకు, అన్నీ సారూప్యమే. ఒక దేవాలయం చేరటానికి అనేక త్రోవలు వుంటాయి అన్నింటి గమ్యం ఆలయానికే.

పరమాత్మను చేరడానికి భక్తి మార్గం, జ్ఞానమార్గం, కర్మమార్గం, యోగమార్గం, ఆత్మ విచారమార్గం ఇవి ముఖ్యమైనవి. ఈ మార్గాలనన్నిటికీ పరమాత్మునిలో ఐక్యమవటమనే లక్ష్యం ఒక్కటే. మనమందరం బ్రహ్మ పదార్థంలో కలిసినప్పుడు మన ప్రత్యేక వ్యక్తిత్వం పూర్తిగా మాయమై మనం అందరం ఆనంద స్వరూపులమవుతాం. అందరి అంతిమ లక్ష్యం భగవదనుగ్రహం పొందటమే.

భగవద్గీతలో చెప్పినట్లుగా – "యే యథామాం ప్రపద్యంతే తాం స్తథైవ భజామ్యహం" మానవుడు ఏ మార్గాన్ని అనుసరించినా, ఆ మార్గంద్వారానే వారికి భగవానుడు తను అనుగ్రహాన్ని లభింపచేస్తాడు. భగవంతుని గురించిన జ్ఞానంతో,

మనం ఆయనలో ఐక్యం కాగలిగితే మన దుఃఖాలు, కష్టాలు అన్నీ మాయమవుతాయి. భక్తి మార్గంలో భగవంతునితో అనుసంధింపబడాలంటే మనం అనుసరించవలసిన మార్గం గురించి ఆదిశంకరుడు ఇలా అన్నారు - "ప్రాప్నోతీహి యథాతథా పశుపతేః పాదారవింద ద్వయం' - 'మనస్సు ఈశ్వరపాద పంకజాలపై నిలపాలి, అలా చేస్తే భక్తి సార్థకమౌతుంది.' దీనికి ఉదాహరణ తల్లికోతి ఒక చెట్టునుంచి, మరొక చెట్టుమీదకు ఎగురుతుంది. తల్లికోతి ఎగురుతున్నంతసేపు దాని పిల్ల తల్లి పొట్టను గట్టిగా కరచుకొని, పడకుండా సురక్షితంగావుంటుంది. తన రక్షణ బాధ్యతను మర్కట కిశోర న్యాయమంటారు. అలాగే మనం పరమాత్మునికి దగ్గరగా వుంటే ప్రపంచంలో ఎక్కడ విహరించినా కష్టాలకు గురికాము.

మన మనస్సు కూడా మర్కటంవలే ఒకవిషయం నుంచి మరొక విషయంవైపు విహరిస్తూ వుంటుంది. అలాకాక మనస్సును నియంత్రించి పరమేశ్వరుని పాదాలపై స్థిరీకరించ గలిగితే అది నిలకడస్థితిని పొందుతుంది. గీతలో మరొక ఉదాహరణ 'తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహం' మనం దేవదేవుని పాదపద్మాల్ని ఆశ్రయించి వదలకుండా పట్టుకుంటే మనకు సంభవించే కష్టనష్టాలు ధైర్యంగా ఎదుర్కొని శ్రేయస్సు పొందగలుగుతాం. అలాగే పిల్లి పిల్లలను కని అమిత జాగ్రత్తగా రక్షిస్తుంది. ఎవరినీ కూడా దాని పిల్లల దగ్గరకు రానీయదు. అలాగే భగవంతుడు తన భక్తుల్ని అమిత శ్రద్ధతో సంరక్షిస్తాడు. వారికి ఎవరి వల్లననూ హాని జరగకుండా కాపాడతాడు. ఈ విషయం మనం గుర్తుంచుకోవలసిన వుంటుంది.

*(ఆంధ్రభూమి సెప్టెంబర్ 13, 2007)*

# ధర్మము

**'ఉపాధ్యాయాన్ దశాచార్య ఆచార్యాణాంశతం పితా**

**సహస్రంతు పిత్రాన్ మాతాగౌరవేణాతి రిచ్యతే'**

పదిమంది ఉపాధ్యాయులకన్న, ఒక ఆచార్యుడు, నూరుగురు ఆచార్యులకంటె ఒక తండ్రి, వేయిమంది తండ్రులకంటె ఒక తల్లి గౌరవముచేత గొప్పదవుతుంది. గనుక శ్రేయస్సు కావాలనుకునేవారు, శ్రద్ధ, భక్తితో, తల్లిదండ్రులసేవ చేయవలెను. మహాభారతం పంచపాండవులలో పెద్దవాడైన ధర్మరాజు చరిత్రగనుక మనం వింటే ఆతడు ఎంత సదాచార పరాయణుడు, సద్గుణశాలి, భగవద్భక్తుడు, ధర్మాత్ముడు అని తెలుస్తోంది. ఆతని మంచి గుణాలు ఎవరూ కూడా వర్ణింపలేరు. అంతటి మహానుభావుడు. తల్లిదండ్రుల మీద ఎంతో భక్తి కలిగియుండేవాడు. ఆతని పెద్దతండ్రి ధృతరాష్ట్రుడు, పెద్ద తల్లి గాంధారి అంటే ఎక్కువ భక్తి, శ్రద్ధలు చూపించేవాడు. వారు తనకు చేయరాని పనులు ఏమైనా ఆజ్ఞాపించినా సందేహించక దానిని పాటిస్తూ, పరమ ధర్మంగా భావించేవాడు.

ధృతరాష్ట్రుడు పాండవులను దహనం చేయాలనే కోరికతో వారణావతమున ఒక లక్క ఇల్లు కట్టించి వారిని పిలిచి, నాయనలారా! మీరు మీ అమ్మతోవెళ్లి, ఆ లక్క యింట్లో నివసించమని ఆజ్ఞాపించాడు. ధృతరాష్ట్రుని మోసం తెలుసుకొని కూడా ఆతని ఆజ్ఞను పాటించి లక్క ఇంటికి వెళ్లి నివాసమున్నాడు. అయినా కూడా వారికి ఎలాంటి అపాయము కలుగలేదు. ధర్మమే వారికి అండగా నిలిచి రక్షిస్తుంది. ఎవరు ధర్మం పాటిస్తారో, వారిని ఆ ధర్మమే కాపాడుతుంది. కాని ధర్మాన్నే అందరు విడిచిపెడ్తున్నారు. 'స్వధర్మే నిధనం శ్రేయః పరధర్మో భయావహః' ధర్మాన్ని పాటిస్తూ మరణించినా, ఆ ధర్మం యుగ యుగాలుగా మనల్ని కాపాడుతుంది. "ఆచార ప్రభావో ధర్మః,

ధర్మస్య ప్రభురచ్యుతః", ఆచారం నుండే ధర్మం పుడుతుంది. ఆ ధర్మానికి ప్రభువు అచ్యుతుడు. విష్ణు సహస్రనామంలోని ఈ శ్లోకం భీష్ముడు ధర్మసూక్ష్మాన్ని గురించి అందరికీ తెల్పుతాడు. కురుక్షేత్ర యుద్ధంలో పాండవులు గెలిచినపుడు కూడ, తనకు అన్యాయం చేసిన, గాంధారీ, ధృతరాష్ట్రుల వద్దకు వెళ్లి నిత్యం నమస్కారం చేసి వారిని సేవించేవాడు. చివరలో ధృతరాష్ట్రుడు, వనవాసం వెళ్లేటపుడు ముందుగా యుద్ధంలో మరణించిన తన బంధువులకు, పుత్రులకు శాంతి కలగడానికి, అధిక ధనం, బ్రాహ్మణులకు దానం చేయమని, ధర్మరాజు ఆజ్ఞాపిస్తాడు. అప్పుడు ధర్మరాజు, తండ్రి! ఇది నాదియనేది ఏమీలేదు. అంతామీదే! ఈనా శరీరం కూడా మీదే! అందుకని, మీరు ఏది చెప్తే అది చేయడానికి సిద్ధంగా వున్నాను అంటాడు. తనపై ద్వేషం పెంచుకొని, ఎప్పుడూ తన ప్రాణం తీయాలని, ప్రయత్నించిన వారితో కూడా ధర్మంగా, ఉదారబుద్ధితో వ్యవహరిస్తాడు ధర్మరాజు. ధర్మపాలన అనే ప్రభావం వలననే ఆతడు బొందితోనే స్వర్గాన్ని చేరుకుంటాడు. మనపై ద్వేషం గలవారిపట్ల కూడా శ్రద్ధ, భక్తులు సరళ స్వభావంతో సేవలుచేయాలి అని తెలుస్తోంది.

**"తనయందు తల్లిదండ్రులు పనిచిన పని సేయదేని, పలుకెడతో చేకొనదేని, వాడు తనయుండన బడునే పితృ ధనమున కర్హుండగానే"** నన్నయ్య భారతంలోని ఈ పద్యం అందరు గుర్తుంచుకోవలసి వుంటుంది. కొడుకు, తల్లిదండ్రులు చెప్పిన పనిని చేయకుండా నిర్లక్ష్యంగా ప్రవర్తిస్తాడో, వాడు తల్లిదండ్రులు సంపాదించిన ఆస్తికి కూడా అర్హుడు కాదు, తల్లిదండ్రులను సేవించుటకంటే మించిన ధర్మం ఇంకొకటి లేదు.

**'ఏక ఏవ సుహృద్ధర్మో - నిధన్యేణప్యనుమా తియః**

**శరీరేణ సమం నాశం - సర్వమన్యద్ధి గచ్ఛతి'**

ఈ సంపదలన్నీ శరీరంతో అంతమవుతాయి. మరణం తర్వాత కూడా వెంట వచ్చే మంచి స్నేహితుడు ధర్మం మాత్రమే.

**పుణ్యస్యఫల మిచ్ఛంతి - పుణ్యం నేచ్ఛంతి మానవాః**

**న పాప ఫలమిచ్ఛంతి - పాపం కుర్వంతి యత్నతః**

మనిషి పుణ్య ఫలాన్ని కోరుకుంటాడు. పుణ్యకార్యాలు మాత్రం చేయడు. పాప ఫలం వద్దంటాడు, కాని తెలిసి పాపమే చేస్తాడు. కనుక ఎల్లప్పుడూ ధర్మాన్ని పాటించాలి.

*(ఆంధ్రభూమి ఏప్రిల్ 3, 2003)*

# రిటైర్‌మెంట్ తర్వాత

ప్రభుత్వ ఉద్యోగస్తులు ఎప్పుడో ఒకరోజు పదవీ విరమణ చేయటం తప్పనిసరి. బాధ్యత కలిగిన పనులనుంచి విముక్తి కలిగి విశ్రాంతి కరమైన జీవితంలో అడుగు పెట్టాల్సి వుంటుంది. పనులలో మునిగి దానిద్వారానే ఆనందం పొందే వ్యక్తులకు ఈ పరిస్థితి బాధాకరంగానే వుంటుంది. అయితే ఈ పదవీ విరమణ హుందాగా స్వీకరించకపోతే జీవితం సంతృప్తికరంగా సాగదు. తిరిగి ఏదో పనిని కల్పించుకోవాలి.

కొంతమంది ఉద్యోగస్తులు 'ఇన్‌ఫీరియారిటీ' కాంప్లెక్స్‌తో బాధపడతారు. భార్య ఉద్యోగస్తురాలైతే అతని పరిస్థితి అధ్వాన్నంగా వుంటుంది. ఒక్కొక్కప్పుడూ అసూయ కూడా కలుగుతుంటుంది. తాను కుటుంబంలో నిర్లక్ష్యం చేయబడుతున్నాననే భావన కూడా ఏర్పడుతుంది. ఫలితంగా మనోరుగ్మతలు కూడా ఏర్పడతాయి. దీనికి సరైన మందు ఇంటివద్ద పూలచెట్లు వుంటే వాటికి నీరుపోయటం పిల్లలతో హోమ్‌వర్క్ చేయించడం, కొద్దిసేపు ధ్యానానికి కూర్చోవడం, సద్గ్రంధాలు పఠించడం, మిత్రులతో పిచ్చాపాటీ పలకరించడం, భార్యవంటింట్లో శ్రమపడుతుంటే చిన్నచిన్న పనులలో సహాయం చేయడం, సాయంకాలం అలా భార్యతో వ్యాహ్యాళికి వెళ్లడం, స్వామీజీ ఉపన్యాసాలకు వెళ్లడం – ఇలా తమ పనులను కేటాయించుకుంటే బాగుంటుంది.

పదవీ విరమణ తర్వాత విశ్రాంతి ఒక వరంలా భావించాలి. భార్య, పిల్లలతో ఎక్కువకాలం గడపవచ్చుగదా అని ఆనందించాలి. పురుషులైతే సరదాగా వంటపనిలో మీ ప్రతిభను చూపించండి. పాతస్మృతులు నెమరువేసుకుంటూ కబుర్లాడండి. నిజమైన దాంపత్యం ఇప్పుడే ప్రారంభమవుతుంది. వృద్ధాశ్రమాలు దర్శించి వారికి కావలసిన సహాయాలు అందించవచ్చు. దగ్గరలో వుంటే విహారయాత్రలకు, భార్యను పిల్చుకుని వెళ్లిరావచ్చు. సరదాగా ఆమెను

సంతోషపరచి, మీరు సంతోషాన్ని పంచుకోండి. చమత్కార స్వభావంకల్గి వుంటే మీ భాగస్వామి కూడా ఎంతో ఆనందిస్తుంది.

ఇంతమంచి భర్త తనకు దొరికినందుకు ఆమె ఎంతో సంతోషిస్తుంది. ఎట్టి పరిస్థితులలో కూడా మీ భార్య మీకంటే తక్కువ అనే భావన రానీయకూడదు. ఆమె అభిప్రాయాలను కూడా గౌరవించండి.

ఆర్థికంగా ఆమె మీమీద ఆధారపడి వుంటే ఆమెను చులకనగా చూడకుండా కావలసినవి, సంతోషంగా ఉన్నంతమటుకు అందిస్తూ, ఆమె ప్రేమను ఆస్వాదించండి.

ఆమె పుట్టినరోజు పండుగ, గుర్తువుంచుకుని, ఆమెకు ఏమైనా చిన్న బహుమతిని ఆమె ఆశ్చర్యపోయేట్లుగా ప్రజెంటు చేయండి. ఆమె శారీరకంగా, అలసిపోయినపుడు స్నేహితునిగా లాలించి, విశ్రాంతి నివ్వండి.

గతంలో ఆమె కోపంతో ఏమైనా విసుక్కుని ఉంటే పట్టించుకోకుండా ఆమె మాటలు మరచిపోండి. ఆమె సీజన్‌లో మామిడికాయ ఆవకాయ కలుపుతుంటే మీరు పక్కన వుండి సహకరించండి. పని పూర్తయిన తర్వాత హాయిగా థియేటర్‌లో మంచి సినిమా వుంటే పిల్చుకుని వెళ్ళండి.

ఇలా భార్యాభర్తలు అన్యోన్యంగా సంసారం సాగిస్తూవుంటే చూచేవారికి కూడా ఎంతో ఆనందంగా వుంటుంది. ఆకాశవాణిలో మంచి సంగీతం వినడం అలవాటు చేసుకోండి. మిత్రుల క్షేమ సమాచారాలు, కార్డువ్రాసి తెలుసుకోండి. మీకు సంగీతం నేర్చుకోవాలనే ఆసక్తివుంటే గురువువద్ద అభ్యాసం చేయవచ్చు. నేర్చుకోవాలనే అభిలాష వుంటే వయసుతో పనిలేదు. మీరేమంటారు?

*(ఆంధ్రభూమి)*

# ఋణానుబంధం

ఈ లోకంలో జనుల కలయిక అంతాగూడ మూణ్ణాళ్ల ముచ్చటవంటిది. జీవులు ఈ ప్రపంచంలో కొంతకాలం కలుసుకొని కర్మబంధం పూర్తి అవగానే తమ తమ గమ్యాలకు చేరుకుంటారు. దీనికి ఎవరికి ఎవరు బంధువులు కాదు, శత్రువులు కారు అనిపిస్తుంది.

కుటుంబంలో బంధువుల కలయిక కూడా నదిలో పుల్లల కలయిక మాదిరే. చెట్టుపైన పక్షులన్నీ వచ్చి వాలుతాయి. తర్వాత దేనిపాటికి అవి ఎగిరిపోతాయి. కనుక దృశ్య వస్తువులపై మమకారం పెంచుకోకూడదు. ఆత్మే తాను అని భావిస్తూ ప్రశాంతంగా జీవించాల్సి వుంటుంది. దీనికి ఉదాహరణగా ఒక చిన్న కథ మనం గుర్తుంచుకోవాల్సి వుంటుంది. చాలాకాలం క్రిందట ఒక రాజ్యంలో రాజు ధర్మంగా పరిపాలిస్తూ తేజస్సు, బలం, ధనం సంపదతో వుండేవాడు. ఆ రాజు రాజ వ్యవహారాలు చూసుకోవడమే కాకుండా, కొంతకాలం క్రితం భగవంతుని కథలు వింటూ సాధకులను పిలిచించి ఆధ్యాత్మిక ప్రసంగాలు చేస్తుండేవాడు.

ఒకరోజు రాజు ఆస్తానానికి ఒక సాధువు విచ్చేశాడు. అతను గొప్ప తపశ్శాలి, జ్ఞాననిధి. రాజు ఆ మహానుభావునకు నమస్కరించి ఎదురుగా వెళ్లి అర్ఘ్యపాద్యాదులు ఇచ్చి ఉన్నత ఆసనం మీద కూర్చుండజేశాడు. ఆ రాజు చేసిన సేవ, వినయము చూసి, ముని ఎంతో సంతోషించి "రాజా! మీ ఆదరము అభిమానం నాకెంతో సంతోషంకలిగించింది. మీ క్షేమ సమాచారాలు తెలుసుకోవటానికే నేను మీ రాజ్యానికి వచ్చాను" అంటాడు.

రాజు వినయంగా మహానుభావా! మీ దర్శనం వలన నా జన్మఎంతో ధన్యమైంది. తమ అనుగ్రహం వలన మా రాజ్యం ఎంతో సుభిక్షంగా వుంది.

కాని ఒక్క చింతే నన్ను మనశ్శాంతి లేకుండా చేస్తోంది. ఎంత కాలమైనా సంతానం కలుగలేదు. తమరు నాపై దయవుంచి ఒక పుత్రుడిని ప్రసాదించండి – అలా ఆశీర్వదించాల్సిందిగా కోరతాడు.

రాజు కోర్కెను విన్న ముని రాజా! దైవలీలలు విచిత్రంగా వుంటాయి. భగవంతుని అనుగ్రహం వలన నీకు ఒక కుమారుడు కలుగుతాడు. కాని అతని వలన నీకు సుఖము, దుఃఖము రెండూ సంభవిస్తాయి. ఆ రెండింటిని నీవు సమానంగా ఓర్చుకోవాలి"అని చెప్పి వెళ్లిపోతాడు.

కొద్దికాలంలో తనకు పుత్ర సంతానం కలుగుతుందని రాజు ఎంతో సంతోషిస్తాడు. ఆ రాజుకు చాలామంది భార్యలు వున్నారు. కాని వాళ్లలో ఎవరికి సంతానం కలుగలేదు. ముని ఆశీర్వాద బలం వలన పట్టపురాణికి మగశిశువు కలుగుతాడు. ఆ కుమారుడు అల్లారుముద్దుగా, అందంగా ఉండి ప్రజలందరికీ సంతోషం కలుగజేస్తాడు. రాజు బాలుడిని చూచి ఎంతో సంతోషిస్తాడు.

కొడుకు ముద్దు ముచ్చట్లు చూస్తూ రాజు పట్టపురాణి అంతఃపురంలోనే ఎక్కువ కాలం గడిపేవారు. ఇది చూచి తక్కిన రాణులకు అసూయ కలుగుతుంది. రాజు తమ వద్దకు రాకపోవాడనికి కారణం ఆ బాలుడే అని బావించి వానిని లేకుండా చేస్తే రాజు తమ దగ్గరకు వస్తాడని, ఆ శిశువుకు రహస్యంగా విష ప్రయోగం చేసి విగతజీవుని చేస్తారు.

ఈ విపరీత సంఘటన చూచి రాజుకు మతిపోతుంది. పుట్టిన బిడ్డ వలన నీకు సుఖ దుఃఖాలు ఏర్పడుతాయని ముని చెప్పిన వాక్యాలు రాజుకు గుర్తుకు రాలేదు. రాజు కుమారుడ్నే తలచుకుంటూ దుఃఖిస్తూ రాణివాసంలోనే కాలం గడుపుతూ వుంటాడు.

అది తెలుసుకుని ముందు వచ్చిన ముని మళ్లీ రాజ్యానికి వచ్చి రాజును పలకరించడానికి వస్తాడు. దుఃఖ సముద్రంలో వున్న రాజును చూసి ఓ రాజా! మీరు దుఃఖించవద్దు. ఈ శరీరాలు పుడుతుంటాయి, పోతుంటాయి. పుట్టిన ప్రతివాడు ఎప్పుడో ఒకప్పుడు మరణించక తప్పదు. మరణించినవారు మళ్లీ జన్మించక తప్పదు జనన మరణాలు అజ్ఞానులైన వారికేగాని జ్ఞానులకు ఎంతమాత్రము కాదు. ఎందుకంటే జ్ఞానులు ఆత్మ సత్యమని, శరీరం అశాశ్వతమని, తాము ఆత్మ స్వరూపులమని బాగా తెలుసుకొంటారు. అందుకనే వారికి దుఃఖం అనేది అసలు వుండదు. రాజా! మీరు కూడా ఈ సత్యం తెలుసుకొని మరణించిన వాడిని గురించి దుఃఖపడవద్దని ఓదారుస్తాడు.

కర్మానుబంధాలవల్ల జీవులు ఒకరినొకరు కలుసుకొని ఋణానుబంధం తీరగానే ఎవరిదారిని వారు వెళ్తారు. కావాలంటే మీకు ఈ విషయంపై ప్రత్యక్షంగా చూపిస్తాను అని తెలిపి తన దివ్య శక్తివలన ఆ మరణించిన కుమారుని జీవాత్మను అక్కడకు రప్పించి ఓ జీవుడా! నీ కోసం నీ తల్లిదండ్రులు, బంధుమిత్రులు, దుఃఖిస్తున్నారు. అందుకని నీవు మళ్లీ నీ శరీరంలోకి ప్రవేశించి, నీ బంధువులను తల్లిదండ్రులను సంతోషింపచేయి, రాజకుమారుడవై సమస్త రాజభోగాలు అనుభవించు అంటాడు.

మహర్షి పలుకులు విన్న ఆ జీవాత్మ – 'మహాత్మా! సర్వజ్ఞులైన మీరే మరల నశ్వరమైన దేహంలో ప్రవేశించమంటారా! జరిగిపోయిన కాలంలో నేను ఎందరో తల్లిదండ్రులను, బంధువులను కలిగి యున్నాను. ఈరోజు వారెవరూ లేరు. ఎవరికి ఎవరు బంధువులు? ఎవరికి ఎవరు తల్లిదండ్రులు? ఆత్మతత్త్వం తెలుసుకోలేక భార్య, పుత్ర, బంధువులే ఎప్పుడూ తనవారని, తలచుకునే దానికంటే అజ్ఞానం ఇంకొకటి లేదు. జన్మమృత్యు, జర, వ్యాధులకు నిలయంగా వుండే ఈ దేహంలో నేనింక ప్రవేశించను. శాశ్వత ఆనందాన్ని నన్ను అనుభవింపనియ్యండి' అని చెప్పి మాయమౌతాడు.

ఈ ప్రపంచం ధర్మ సత్రమని - బంధు పుత్రుల కలయిక కూడా ఋణానుబంధమని, కర్మబంధము పూర్తయిన వెంటనే ఎవరిదారిన వారు నిష్క్రమిస్తారని - ఈ సత్యం తెలుసుకుని జనులు, బంధుమిత్రులు, పుత్రుల వలన ఎక్కువ మమకారం పెంచుకోకుండా, ధర్మజీవనం గడుపుతూ, భగవంతుని మీద భక్తి భావాలు పెంచుకుని, శాంతి, సౌఖ్యాలతో జీవించాలని, ముని రాజుకు నీతి వాక్యాలు చెప్పి తమ ఆశ్రమానికి వెళ్లిపోతాడు.

రాజు దుఃఖం వదలిపెట్టి రాజకార్యాలలో ఆధ్యాత్మిక ప్రసంగాలతో తన జీవనం గడుపుతాడు.

*(ఆంధ్రభూమి, ఫిబ్రవరి 16, 2006)*

# మనశ్శాంతి - మార్గాలు

మనస్సుపై 'త్రి తాపాల' ప్రభావం అందరికీ ఉంటుంది. త్రితాపాలు అంటే మూడు తాపాలు ఒకటి ఆధ్యాత్మిక తాపం మనిషికి తన శరీరం మనస్సు, ఇతర ఇంద్రియాల నుంచి కలిగే కష్టాలు. రెండవది ఆది భౌతిక తాపం, భార్య, బిడ్డలవల్ల, విషజంతువులు, క్రూరమృగాల వలన కలిగే ఆపదలు. మూడవది ఆధి దైవిక తాపం – అతివృష్టి, అనావృష్టి, తుపాన్, భూకంపాలు మొదలైన ప్రకృతి వైపరీత్యాల వలన కలిగే కష్టాలు.

పూర్వం ఋషులు, అరణ్యాలలో నివసించేవారు. వారికి క్రూర మృగాలవల్ల, విషజంతువుల వలన ఎలాంటి ఆపదలు వస్తాయో తెలీదు. ఆ కారణంగా ఆది భౌతిక తాపం, ఉపశమనానికి, శాంతి ప్రార్ధన చేసేవారు. ఈరోజులలో కారడవులు కనుమరుగై ఆకాశాన్ని అంటే అంతస్తులు వెలిశాయి. ఈ రోజులలో మనిషి మనస్సే ఘోర అరణ్యంగా మారింది. కామక్రోధాలు, మనిషి మనసులో సంచరించే మృగాలు. రెండవది ఆది దైవిక తాపం, ఎవరైనా మనల్ని ప్రశంసిస్తే ఆనందం కలిగి ఆకాశంలో నాట్యం చేస్తాం. మనల్ని నిందిస్తే దుఃఖంతో కృంగిపోతాం. పని ఒత్తిడి, ఆశించినట్లుగా ఫలితం రాకపోతే మనస్సులో అలజడి, నిస్పృహ చెలరేగుతాయి.

ఒక ప్రకృతేకాదు, మనిషి మనస్సులోనే ఆది భౌతిక, ఆధి దైవిక తపాలు వున్నాయి. ఇవికాక మూడవది ఆధ్యాత్మిక తాపం. అదుపులో లేని మనస్సు, ఇంద్రియాలవలన, అల్లకల్లోలం. ఈ మూడు ఆధునిక మానవుని మనస్సులోనే ఉద్భవిస్తాయి. దాని వలన తీవ్రమైన అశాంతికి గురవుతాయి.

నేడు మనం ఎదుర్కొంటున్న సమస్యలకూ, దుఃఖాలకూ ముఖ్య కారణం అదుపులేని మనస్సు. అవసరం లేనివాటికై ఆరాటపడడం మనస్సును అశాంతికి గురిచేస్తుంది. ఎడతెగని కోరికలే మన అశాంతికి కారణం. మనిషి కోర్కెలు

లేకుండా జీవించగలడా! కోరికలు లేని జీవితం ఒక జీవితమేనా? అనే సందేహం కూడా కలుగుతోంది. ఆధ్యాత్మిక కోణంలో కనుక దీనిని పరిశీలిస్తే, జనన, మరణ చక్ర భ్రమణానికి కోరికలే కారణం, జన్మ రాహిత్యం పొందాలంటే కోరికలు సమూలంగా నాశనం కావాలి. ఇదొక్కటే మనశ్శాంతికి మార్గం. భగవంతుడిని పొందాలనే కోరికే నిజమైన కోరిక. మిగిలిన కోర్కెలన్నీ కూడా దుఃఖానికి కారణాలు. ప్రాపంచిక భోగాలవలన కలిగే సుఖాన్ని కనుక పోల్చిచూస్తే కోరికలను త్యజించటం వలన లభించే సుఖంలో పదహారవ వంతైనా వుండదని యోగి పుంగవుల అభిప్రాయం అంటే పూర్తిగా కోర్కెలను జయించాలి.

ఆధ్యాత్మిక మార్గంలో మనశ్శాంతిని పొందాలంటే మనకన్నా ఆధ్యాత్మిక మార్గంలో ఉన్నతి పొందినవారిని మనం ఆదర్శంగా తీసుకొని వారిమాదిరి ఆధ్యాత్మికంగా అభివృద్ధి చెందడానికి ప్రయత్నించాలి. దురాశలకు పోకుండా వున్నదానితో సంతృప్తి చెందుతూ జీవితాన్ని శాంతి మార్గంలో చేరుకోవడం ఉత్తమం.

దీనికి ఉదాహరణ ఒక గ్రామంలో ఒక శిల్పి వుండేవాడు. వృత్తి పరంగా ఎప్పుడూ తృప్తిగా వుండేవాడు కాదు, ఒకరోజు ధనవంతుడైన ఒక వ్యాపారి తన సేవకులతో, అటువైపు వెళుతూ వుండడం చూసి నేను కూడా ఆ వ్యాపారిలా ధనవంతుడిని అయితే ఎంత బాగుంటుంది అనుకున్నాడు. అలా ఊహించగానే శిల్పి వ్యాపారి అయ్యాడు. ఈ లోకంలో ఇక తనకంటే శక్తిగలవాడు లేడు అనుకుంటాడు. ఇంకొకరోజు ఒకరాజు తన పరివారంతో వెళ్తున్నాడు. ప్రజలంతా రాజుకు నమస్కరిస్తున్నారు. నేను కూడా రాజునైతే బాగుండును అనుకోగానే రాజు అయ్యాడు. ఉదయం నదిలో స్నానం చేస్తూ వున్న ఒక బ్రాహ్మణుడు సూర్యుడికి నమస్కరించడంచూశాడు శిల్పి. రాజుకంటే శక్తి కలవాడు సూర్యుడు అని తలచుకొని సూర్యుడయ్యాడు శిల్పి. ఇక సూర్యునికి అడ్డమొచ్చిన మేఘాలు చూచి, సూర్యుడిని మరుగుపరిచే ఈ మేఘం చాలా

గొప్పది నేను మేఘుడిని అవుతా అనుకున్నాడు. ఇంతలో పెనుగాలి వీచింది. మేఘాలన్నీ చెల్లాచెదురయ్యాయి. ఆ గాలికి చెట్లు చేమలు, ఇళ్లు కూలాయి. ఒక బండరాయి మాత్రం కదలలేదు. తాను బండరాయిలా వున్నా బాగుండు అనుకోగా బండరాయిగా మారాడు. అమ్మయ్య ఈ లోకంలో నా అంతటి శక్తి మంతుడు వేరెవ్వరూ వుండనే వుండరు అని సంతోషంతో ఒకసారి కిందికి చూసాడు. బండరాతిని బద్దలు కొట్టడానికి ఒక శిల్పి సిద్ధంగా వున్నాడు. అప్పుడు శిల్పికి అర్ధమైంది. తనమీద తనకు సంతృప్తి లేకుండా ఊహాలోకంలో చిక్కుకుని తన పూర్వ వృత్తే శ్రేష్టమైనదని తెలుసుకున్నాడు. అదే మంచి మార్గమని నిర్ణయించుకున్నాడు.

అందుకే మన జీవన యాత్రలో మన బుద్ధిని ఉపయోగించి, మనకు ఏది తృప్తిని ఇస్తుంది, ఏది ఇవ్వదు అనేది నిర్ణయించుకోవాలి. మనకన్నా తక్కువ స్థాయిలో వుంటూ సుఖంగా, సంతోషంగా జీవిస్తున్న వారిన ఆదర్శంగా తీసుకోవాలి. అంతేకాకుండా అలవిమాలిన కోరికలను పెంచుకోకుండా జాగ్రత్తపడాలి. మనం జరిగిపోయిన దానిని గురించిగానీ, జరగబోయేదాని గురించిగానీ చింతించకుండా దానిబదులు వర్తమానంలో జీవించడం నేర్చుకోవాలి. కాబట్టి మనశ్శాంతి, భౌతిక సుఖాలు ఈ రెండూ కూడా చీకటి వెలుగుల్లా కలిసివుండవని తెలుసుకోవాలి.

ప్రాపంచిక వాంఛలను తృప్తిపరచాలంటే అగ్నిలో ఆజ్యం పోయడం లాంటిది. అంటే మండే అగ్నిలో నెయ్యి వేస్తే ఇంకా మండుతుందేగాని చల్లారదు. ఈ సూత్రాలన్ని మనం గుర్తు చేసుకోవలసి వుంటుంది. ఇది గనుక ఆచరణలో వుంచుకుంటే ఆధ్యాత్మిక తాపం వలన కలిగే సమస్యలన్నీ కూడా పరిష్కరించుకుని శాశ్వతమైన సుఖాన్ని పొందవచ్చు. ఈ దిశవైపుగానే మనం ప్రయాణం చేయవలసి వుంటుంది.

*(ఆంధ్రభూమి నవంబర్ 11, 2006)*

# గురుభక్తి - 2

గురువు అనుగ్రహం అనేది సూర్యుని వెలుతురు వంటిది. వెలుతురు చుట్టుప్రక్కలంతా వ్యాపిస్తుంది. జీవులందరూ గూడా తమ తమ అవసరాన్ని బట్టి ఆ వెలుతురును తమకు కావలసిన విధంగా ఉపయోగించుకుంటూ లోకానికి కూడా ఉపయోగపడేట్లు చేసుకుంటారు. గురువులు తమ శిష్యులందరి మీద, సమానమైన ప్రేమనే చూపిస్తూ ఉంటారు. శిష్యులు తమ తెలివితేటల్ని బట్టి దానిని గ్రహించి వృద్ధిపొందుతూ ఉంటారు.

వేదపండితులైన ఋషులు, సనాతన భారతదేశంలో ఎందరో ఉన్నారు. వారు ఆదర్శంగా జీవిస్తూ శిష్యులను తమంతటివారిగా తీర్చిదిద్దుతూ ఉండేవారు. ఆ ఋషుల శిక్షణా పద్ధతులు ఒక్కొక్కరిది ఒక్కోవిధంగా ఉండి, శిష్యుల ఆత్మశక్తిని పైకి తెచ్చేవిగా ఉంటాయి.

ఆశ్రమంలో ధౌమ్యుడనే ఋషి పుంగవుడు ఉండేవారు. ఆయన సకల విద్యాపారంగతుడు. మహాజ్ఞాని, ఆయన దగ్గర గురుకులంలో, విద్యను అభ్యసించటానికి, ఎక్కడెక్కడి నుంచో జ్ఞానాన్ని పొందటానికి చాలామంది వస్తూ ఉండేవారు. ఆయన వారిని ఎన్నో విధాలుగా పరీక్షించి, శిష్యులుగా చేర్చుకొనేవాడు. ఆయన క్రమశిక్షణను, నియమ నిష్ఠలకు తట్టుకోలేక చాలామంది శిష్యులు ఆశ్రమం వదలి వెళ్లిపోయేవారు. ఆయన శిక్షణ విధానం చూచితోటి ఋషులందరూ కూడా పరిహాసంగా మాట్లాడుకునేవారు. ఆయన చండశాసనుడు అయిన గురువు అని, ఆయన దగ్గర తట్టుకుని, నిలబడగల్గిన శిష్యుని మహానుభావుడుగా పరిగణింప దగినవాడనటంలో ఎలాంటి సందేహం లేదు. ధౌమ్య మహర్షి వద్ద శిక్షణ పొందినవారిలో, ఆరణి, ఉపమన్యుడు, బైదుడు అనే వారు ముఖ్యులు. వీరిలో ఉపమన్యుడు పొందిన శిక్షణ విలక్షణమైనది.

ఉపమన్యుడు తమ గురువును భక్తిశ్రద్ధలతో సేవించేవాడు. గురువు చెప్పినట్లు చేయటమేగాని, ఎదురు ప్రశ్న వేసేవాడు కాదు. గురువుగారి శక్తి సామర్థ్యాలు, ప్రేమ, అనురాగాలు, బాగా అర్థం చేసుకున్నాడు ధౌమ్యుడు. ఆయన యందు వినయము, అపారమైన భక్తి భావము కురిపిస్తూ ఉండేవాడు. ఒకరోజు ధౌమ్యమహర్షి ఉపమన్యుని పిలిచి, ఆశ్రమంలో నీవు ఏమి భుజిస్తున్నావు? అని అడుగుతాడు. భిక్షాన్నం. గురుదేవా! అని వినయంగా సమాధానం చెప్తాడు ఉపమన్యుడు. భిక్షాన్నమైతే మాత్రం గురువుకు సమర్పించకుండా తినడమేనా? అని గుడ్లు ఎర్రగా జేసి చూశాడు గురువు. పొరపాటైతే మన్నించండి అని ప్రార్థించి మరుసటి రోజు భిక్షాన్నమంతా గురువుగారి ముందుంచాడు శిష్యుడు. ఆ ఉన్నదంతా గురువుగారికి సరిపోయింది. తలవంచుకుని వెళ్ళిపోయాడు ఉపమన్యుడు. కొన్ని రోజులు గడిచాయి. ఒకనాడు గురువు - నువ్వేమి భుజిస్తున్నావు? మొదటిసారి తెచ్చిన భిక్షను తమకు సమర్పించి రెండవసారి తెచ్చిన భిక్షను నేను తింటున్నాను గురువర్యా! అంటాడు ఉపమన్యుడు. అది మంచి పద్ధతి కాదని మందలించి, ఆరోజు నుంచి గోవులను మేపుకునివచ్చే పనిని అతనికి అప్పగిస్తాడు గురువు. ఉపమన్యుడు ఉదయమే గోవులను మేపుకుని రావడానికి అడవికి వెళ్ళి సాయంత్రం తిరిగి వచ్చేవాడు.

ఒకనాడు గురువు ఉపమన్యుని పిలిచి ఈ రోజు ఏమి భుజించావు? అంటాడు. ఉపమన్యుడు వినయంగా, గోక్షీరం (ఆవుపాలు) గురువర్యా! అంటాడు. ఆ గోవులు మనవి కావు గ్రామస్థులవి. గనుక, వాటి పాలు త్రాగటం సరైన పద్ధతి కాదు అన్నాడు ధౌమ్యుడు. సరే! అన్నాడు శిష్యుడు. దినాలు గడిచిపోతున్నాయి. మళ్ళీ అదే ప్రశ్న. దూడలు పాలు త్రాగేటపుడు కారే నురుగుతో కడుపు నింపుకుంటున్నానన్నాడు ఉపమన్యుడు. అదికూడా సరికాదన్నాడు ధౌమ్యుడు. ఎలా బ్రతికేది ఆహారం లేకుండా అని శిష్యుడు అడగలేదు. ఎలా జీవించాలో ఆ గురువు చెప్పనూలేదు. మరునాడు ధౌమ్యుడు

ఆశ్రమానికి తిరిగి రాలేదు. గురువు శిష్యుని వెదుకుతూ అడవుల వెంట తిరుగసాగాడు నాయనా ఉపమన్యా! అంటూ.

గురువర్యా! ఇక్కడ, ఇక్కడ, అంటు విన్పించింది ఉపమన్యుని గొంతు. వెదకి చూస్తే ఒక పాడుపడ్డ నూతిలో పడి ఉన్నాడు. అయ్యో! ఇదెలా జరిగింది అని విచారించాడు గురువు. ఆకలిని ఓర్చుకోలేక, ఆకులు తింటూ ఉంటే జిల్లేడుపాలు కంట్లోపడి చూపుపోయింది గురువర్యా! తడుముకుంటు వస్తుంటే నూతిలో పడిపోయాను అన్నాడు ఉపమన్యుడు. బాధపడకు బాబూ అశ్వనీ దేవతలను గురించి ప్రార్థించు, నీకు వారి వలన చూపురావటమే గాకుండా అమృతత్త్వం సిద్ధిస్తుంది అన్నాడు గురువు. శిష్యుడు గురువును మనస్సులో ధ్యానించి, అశ్వనీదేవతలను స్తుతించటం మొదలు పెట్టాడు. భక్తితో సాగిన స్తోత్రం విని అశ్వనీ దేవతలు ప్రత్యక్షమయ్యారు. అమృతముతో సమానమైన ఒక పదార్థాన్ని అతనికి ఇచ్చి భుజించమన్నారు. అతడు దానిని కూడా గురువుకు సమర్పించాడు. గురువు ప్రీతితో దానిని ఉపమన్యునికే ఇచ్చి తినమన్నాడు. ఉపమన్యుడు ఆ ప్రసాదాన్ని తినిన వెంటనే కంటిచూపు వచ్చింది. ఆ చూపు బయటి ప్రపంచాన్ని చూడటమే గాకుండా అంతర్‌లోకాలను కూడా చూడగలిగాడు. మహత్తరమైన దివ్యదృష్టిని పొందగలిగిగాడు శిష్యుడు.

సంస్కృత మహాభారతంలో, ఆదిపర్వంలో ఈ కథ – అశ్వనీ స్తోత్రమూ రచింపబడ్డాయి. నియమంగా ఈ స్తోత్రం గనుక చదివితే సమస్త వ్యాధులూ పోయి ఆయురారోగ్య, ఐశ్వర్యాలు, సుఖశాంతులు గలుగుతాయని చెప్పబడింది.

ఇటువంటి మహత్తరమైన స్తోత్రాన్ని, లోకానికి అందించిన ఉపమన్యునికి, గురువైన ధౌమ్యులవారు మానవాళికి మహోన్నతగురువులు, వారికి శిష్యులపై వాత్సల్యం, అనుగ్రహం, ఎంతో ఉన్నతమైనది, మహత్తరమైనది కూడాను.

*(ఆంధ్రభూమి, ఫిబ్రవరి 21, 2006)*

# అష్టావక్రుడు

సాధారణంగా మనం తండ్రి, కుమారులను పోల్చేటప్పుడు ఈతడు తండ్రికి మించిన కొడుకని అభిప్రాయపడుతుంటాం. విద్యా గంధం లేనివాడికి, మంచి పండితుడు, బలపరాక్రమముగలవాడు పుట్టవచ్చు. 'పండిత పుత్రః పరమ శుంఠః' పండితునికి తెలివిహీనుడు కలుగవచ్చు. ఒక వ్యక్తి ఆకారము, రూపురేఖలు, వయస్సు, ఇవన్నీ చూసి అతని పెద్దరికాన్ని అంచనా వేయటం కూడా పొరపాటే.

పాండవులు అరణ్యవాసంలో ఉన్నప్పుడు తీర్థయాత్రలు చేస్తున్నారు. వారు ఒకసారి ఉద్దాలక మహర్షి ఆశ్రమం చేరుకున్నారు. వేదాంతం ఉపదేశించగల పెద్దలతో గట్టివాడు ఉద్దాలకుడు. ఆ మహాముని వద్ద కహోలుడనే శిష్యుడుండేవాడు. ఆతడు భక్తిశ్రద్ధలతో గురువుని సేవించేవాడు. కానీ అతడు విద్య నేర్చుకునే విషయంలో మాత్రం స్థిర బుద్ధి, వినయంచూసి తన కుమార్తె సుజాతను అతనికిచ్చి వివాహం చేశాడు.

కహోలుడికి సుజాతకు ఒక కుమారుడు కలిగాడు. అయితేతల్లి గర్భంలో ఉన్నప్పుడే శిశువు ఉద్దాలకుడి వద్ద ప్రహ్లాదుడి మాదిరి వేదాలన్నీ గ్రహించాడు. కహోలుడు వేదాలు వల్లెవేసేటప్పుడు ఎన్నో దోషాలు దొర్లేవి. ఆదోషాలు వినలేక శిశువు తల్లి గర్భంలో, వంకర టింకరగా ముడుచుకుని పోయేవాడు. ఆ వంకరలు, తల్లి శరీరంలో అలాగే నిలబడి పోయాయి. ఆ శిశువు అష్టవంకరలతో జన్మించినందున అతనికి 'అష్టావక్రుడు' అని పిలిచేవారు.

బాల్యంలోనే అష్టావక్రుడు గొప్ప విద్వాంసుడయ్యాడు. పన్నెండు సంవత్సరాలు వచ్చేటప్పటికీ, వేద వేదాంగాలన్నీ క్షుణ్ణంగా అభ్యసించాడు. ఒకనాడు మిథిలా నగరంలో జనక మహారాజు గొప్ప యాగం తలపెట్టాడు. అక్కడికి గొప్పగొప్ప విద్వాంసులందరినీ రప్పించి వారిచేత చర్చాగోష్ఠి జరిపిస్తున్నాడు. ఈ విషయం అష్టావక్రుడికి తెలిసింది. తన అక్క కుమారుడైన సువేద కౌతువుతో ప్రయాణమౌతాడు.

అలా ఇద్దరు మిథిలకు చేరుకుంటారు. అక్కడ రాజభటులు, ఈ బాలురను లోనికి వెళ్లనీయకుండా అడ్డగిస్తారు. అప్పుడు రాజభటులతో సేవకులారా! గ్రుడ్డివారినీ, అంగహీనులనూ, స్త్రీలనూ, రాజు తప్పుకొని దారి ఇవ్వాలి. వేదం చెప్పే విద్వాంసులను ఆదరించాలి. అంతేగాని, నిరాదరించకూడదు ఈ మాటలు విని రాజభటులు ఆశ్చర్యపోతారు. రాజుకు ఈ విషయం తెలియజేస్తారు. నిజమే. అగ్ని చిన్నదైనా కాలుతుంది, ప్రజ్వరిల్లుతుంది. ఈ బాలురు గంభీరంగా ఉన్నారని లోనికి రావటానికి అనుమతిస్తారు.

అష్టావక్రుడు, నరకేతువు యజ్ఞశాలలోని కి ప్రవేశించబోతారు. అక్కడ మళ్ళీ, మరో ద్వారపాలకుడు అడ్డగిస్తాడు. 'ఇక్కడ వేదం చదివిన వృద్ధులే ప్రవేశానికి అర్హులు. మీరు బాలకులు పనికిరారు"అని అడ్డుపడ్డారు.

అష్టావక్రుడు "మేము బాలురం కాదు. వేదాలన్నీ నియమ, నిష్టలతో అభ్యసించాడు. మేము చిన్నవారని మీరు భ్రమపడుతున్నారు. మాకు అడ్డు తొలగండి' లోపలికి వెళ్లనీయండి అని ప్రాధేయపడతారు.

ఇంత చిన్న వయస్సులో వేదం ఉపనిషత్తులు అందులో సారం తెలుసుకోవటానికి మీకెలా సాధ్యం? అని తిరిగి భటులు నిరాకరిస్తారు. అప్పుడు అష్టావక్రుడు వేద విద్యలు నేర్చుకోవటానికి వయస్సుతో పనిలేదు. ఆకారం బట్టి పాండిత్యం వస్తుంది అనేది కూడా అబద్ధమే. విజ్ఞానం అనే దానికి, శరీర దారుఢ్యం, వయస్సుతో పనిలేదు. పెద్దరికం అనేది ముసలితనం వల్లే వస్తుందనుకోవటం పొరపాటు. అఖండ తెలివి గలవారు, వయస్సు ముదరకపోయినా జ్ఞానే. అందుకని ఆలస్యం చేయకుండా దారి ఇవ్వవలసిందిగా కోరుతాడు. "చిన్న బుడతడవి - ఎందుకు ఇలా పెద్దరికపు కబుర్లు? వెళ్లమంటారు ద్వారపాలకులు.

రాజుగారి ఆస్థాన విద్వాంసులతో వాదానికి వచ్చాను. వేద, వేదాంగాలు, ఉపనిషత్తులు చదివి అందులో సారం గ్రహించాను., ఈ విషయం జనకమహారాజుకు తెలియజేయండి అంటాడు అష్టావక్రుడు. ఇలా వాదిస్తున్న

సమయంలో రాజు అక్కడకు వస్తాడు. ఓహో ఈ బాలుని గురించి ముందు విన్నాను. ఇతడిని లోపలికి ప్రవేశపెట్టమని అనుమతిస్తాడు.

జనకుడు అష్టావక్రుడితో మా పండితులందరూ మహా విద్వాంసులు. వారు వేదం ప్రారంభిస్తే ఒక జ్ఞానసముద్రంలో మునిగి తేలుతున్నట్లు ఉంటుంది. అటువంటి వారితో వాదించాలనే కోరిక నీకెందుకు? నీవు కనుక ఓడితే నిన్ను సముద్రంలోకి తోస్తారు అందుకు నీవు సిద్ధమా! అని ప్రశ్నిస్తారు.

మహారాజా! మీ విద్వాంసులు, పండితులైనాకూడా నా వంటి వేదం తెలిసినవారితో వాదించలేరు. వారు పండితులనీ, అన్నీ తెలిసినవారమనే అహంభావంలో వున్నారు. వాళ్ళు మా తండ్రిగారిని అవమానిస్తే మీరు సముద్రంలోదూకి మరణించారని మా అమ్మ చెప్పింది. ఆ రుణం నేను తీర్చుకుంటాను. ఓడిపోతే నేనూ సముద్రంలో దూకుతాను. నన్ను లోనికి రానిచ్చి వారితో వాదనకు అంగీకరించండి అని కోరుతాడు. జనక మహారాజు సమ్మతిస్తాడు.

సభలో అష్టావక్రుడు తన వాదంమొదలు పెడ్తారు. అక్కడ మహా విద్వాంసులందరూ సమాధానం చెప్పలేకపోతారు. పండితులలో పెద్ద అయిన ఒక వృద్ధుడు తాము ఓడిపోయినట్లు అష్టావక్రుడు గెలిచినట్లుగా ప్రకటిస్తాడు. సభలో ఈ విషయం పండితులందరికీ దిగ్భ్రాంతి కలిగిస్తుంది. అష్టావక్రుడిపై అందరూ ప్రశంసల వర్షం కురిపిస్తారు.

పందెం ప్రకారం ఓడిపోయిన పండితులందరూ సముద్రంలో దూకబోతారు. అష్టావక్రుడు వారిని వారిస్తాడు. తండ్రి కహలుడి ఆత్మ కుమారుని గెలుపు తెలుసుకొని ఆనందపడుతుంది, ఇలా అష్టావక్రుడు తన పాండిత్యంచే అందరి మన్ననలు పొందుతాడు.

*(ఆంధ్రభూమి)*

# జరామరణాలు

ధర్మరాజు కురుక్షేత్ర యుద్ధంలో తన బంధువులందరూ మరణించేవారే అని బాధపుడుతుంటే వ్యాసులవారు ఇలా చెప్తారు. మనిషి జన్మ ఎత్తాక ఇష్ట జనులతో కలిసి వుంటాం, ఒక్కొక్కప్పుడు దూరం కావటమూ తప్పదు. అలాగే ఒకప్పుడు ధనంరావడం, మరో సమయంలో పోవటమూ తప్పదు. ఏది జరిగినా కూడా దానిని ఉదాసీనంగా అనుభవించటమే మన కర్తవ్యం.

జరామరణాలు తోడేళ్ల వంటివి. ఇవి బలవంతులనూ దుర్బలులనీ, కొద్దివారినీ, గొప్పవారినీ కబళిస్తూ వుంటాయి. సముద్రం అంతం వరకూ ఈ భూమిని అంతా కూడా జయించిన వాడైనాసరే ఏ మానవుడూ జరామరణాలను జయించలేడు. బాల్యంలోగాని, వృద్ధాప్యంలోగానీ ఎలా కోరుకుంటున్నా కూడా జరామరణాలు తప్పవు.

ధర్మరాజా, విధివిలాసం విచిత్రమైంది. మంచి వంశంలో పుట్టడం, పరాక్రమం ఆరోగ్యము, రూపం సౌభాగ్యం, సుఖం అన్నీ కూడా విధిని అనుసరించే వస్తాయి. త్రిమూర్తులకూ కర్మలు తప్పవు. ప్రత్యక్ష భగవానుడు సూర్యుడు కూడా వున్నచోట వుండకుండా, నిత్యం ఆకాశంలో కర్మవలననే తిరుగుతున్నాడు. కనుక కర్మకు ఒక నమస్కారం అనక తప్పదు. మరి మంచితనానికి లక్షణం ఏమిటి సజ్జనులు దానం చేయకుండా వుండలేరు. ఆ చేసే దానం కూడా కుడిచేతితో చేస్తూ ఎడమచేతికి తెలియకుండా చేస్తారు. ఎవరైనా ఆతిథ్యానికి వస్తే తొట్రుపడుతూ ఆదరిస్తారు. ఎవరికైనా సహాయం చేస్తే ఆ సంగతి ఇతరులకెవ్వరికీ చెప్పరు. అదే చిన్నమెత్తు ఉపకారం తనకు ఎవరైనా చేస్తే అదే మహా మేరువుగా భావించి, సభలలో కూడా బహిరంగంగా వెల్లడిచేస్తారు. ఇతరుల గురించి, మాట్లాడేటప్పుడు ఎన్నడూ తిరస్కారభావంగానీ, అవమానకరమైన పల్కులుకాని వారి నోటరాదు. నిజానికి ఇది కత్తిమీద సామువంటిది. సజ్జనులకు

ఈ నియమాలన్నీ కూడా సహజంగా వచ్చినవే. మిన్ను విరిగి మీదపడ్డా ధైర్యం కోల్పోరు.

ఎంతో పుణ్యాత్ముడైనటువంటి జనక మహారాజు ఒక పాప కారణంగా నరకం చూడవలసి వచ్చిందట. అతని శరీరం మీద నుంచి వచ్చే గాలి, నరకవాసులకు ఎంతో సుఖం కలిగిస్తోందిట. వారు అతనిని కొంచెం సేపు ఆగవలసిందిగా ప్రార్థించారట. అది విని రాజు ఆర్తిలో వున్న ప్రాణులకు ఆనందం కలిగించటమే నిజమైనటువంటి సుఖం, దానితో సమానమైనటువంటి సుఖం స్వర్గలోకంలో గాని, బ్రహ్మలోకంలోగాని లభించదు. నేను ఇక్కడ వున్నందువలన వీరికి, నరకబాధ తొలిగేటట్లయితే నేను ఇక్కడ నుంచి కదలను. ఇక్కడ స్థిరంగా నిలబడతాను అన్నాడట. అపుడు తోడుగా వున్న యమభటులు రాజుతో ఎవరి కర్మవారు అనుభవించాలి. నీ పుణ్యం వలన నీవు సంపాదించుకున్న స్వర్గ భోగాలు నీవు అనుభవించాలి. వారి పాపం వల్ల వారు సంపాదించుకున్న నరకయాతనలు వారు అనుభవించాలి అంటారు. అపుడు జనకమహారాజు నిజమే. కాని వారిని ఆర్తినుంచి తొలగించమని వారు నన్ను ప్రార్థిస్తున్నారు కదా అంటాడు.

ఆర్తిలో వున్నవాడు పగవాడు అయినా కూడా శరణు శరణు రక్షించు అన్నాక తప్పక రక్షించాలికదా! యజ్ఞాలు గొప్పవి. దానాలు కూడా శ్రేష్టమైనవే. తపస్సంపదా అంత కంటే గొప్పదే కాని, ఆర్తులను కాపాడాలి అని ఎవని మనస్సుకు తట్టదో వానికి ఆ యజ్ఞ, దాన, తపస్సు వలన ఇహలోకంలోగాని పరలోకంలోగాని ఒరిగేదేమీ వుండదు. బాలురు, వృద్ధులు, రోగంతో బాధపడేవారు తమ బాధ తాము తొలగించుకునే శక్తి లేనివారు గనుక అట్టివారిపై మనిషి అన్నవాడు జాలికలిగి వుండాలి. అలా జాలిలేని రాతి గుండెగలవాడు మనిషేకాదు, వాడు రాక్షసుడు. ఈ జనం నరకవేడికి మాడిపోతున్నారు. ఆకలి దప్పిక వలన వీరు మూర్ఛపోతున్నారు. వీరి ఈ బాధలన్నీ కూడా నేను ఇక్కడ

నిలిచినందువల్ల కొద్దిసేపు పోతున్నాయంటే, అదే నాకు సుఖం. అంతేకాకుండా ఇంకొక సత్యం కూడా వుంది. నాకు ఇక్కడ వున్నందువల్ల దుఃఖం కలిగితే కలగనీ, చాలా మందికి సుఖం కలిగే పక్షంలో ఇంక నాకు లభించనిదంటూ ఏమీ లేదు. నీవింక ఎక్కువగా మాట్లాడవద్ద అంటాడు యమభటులతో –

సత్కర్మ ప్రభావం నేనేం చేశాను? అని గుర్తుచేసే యమభటులు, నీవు ముందు పితృదేవతలకూ, అన్నం, నివేదన చేసేవాడివి ఆ తర్వాత దేవతలకు, ఆ తర్వాత అతిథులకు తర్వాత ఇంటిలో పనివారికి పెట్టి నీవు భుజించేవాడివి. అలాంటి ఆహారంతోనే నీకు పుష్టి కలిగింది. నీ శరీరం మీద నుంచి వచ్చే గాలి వారికి తగిలేటప్పటికి వారికి నరక బాధ లేకుండా పోవటమేకాక వారికి ఆహ్లాదం కలుగుతోంది. స్వధర్మానుష్ఠానం అన్నిటికంటే శ్రేయస్సు. నీవు స్వధర్మమైన అశ్వమేధయాగాలు, యథావిధిగా నిర్వర్తించావు. ఇలా చేయడం వల్ల తాము ఆపదల నుండి రక్షణ పొందడం కాకుండా తమ సాన్నిధ్యంతో ఇతరుల బాధలు తీర్చ గలుగుతారని దీనివలన తెలుస్తోంది. అంతేకాకుండా తనపై ప్రేమ గలవారిని ఎంతమాత్రం విడిచిపెట్టకూడదు. విడిస్తే ఇహంలో సుఖం లేదు పరంలోనూ సుఖంలేదు అంటారు వ్యాసులవారు.

*(ఆంధ్రభూమి డిసెంబరు 19, 2006)*

# నైమిశారణ్యం

మన భారతదేశంలోని అన్ని తీర్థాలలో ఎంతో పవిత్రమైనది పరమశివునికి ఎంతో ప్రీతికరమైనది నైమిశ క్షేత్రం. ఈ నైమిశ క్షేత్రములో బ్రహ్మ, విష్ణువు, ఈశ్వరుడు, ఇంద్రుడు, దేవతలు, మునులు నివసించి లోకాన్ని రక్షిస్తూ వుంటారు. 'నిమిషాః - అనిమిషాః యత్ర స్వస్తినః సఃనైమిషః' - అనిమిషులు అంటే రెప్పపాటు లేనివారు దేవతలు ఇక్కడ నివసించటం వలన 'నైమిషం' అని పేరు వచ్చింది. 'నేమి' అంటే అంచు. చక్రము అంచు ఆగినచోటు నైమిషము ఈ నైమిశారణ్యం ఉత్తరప్రదేశ్ రాష్ట్రం సీతాపూర్ జిల్లాలో వుంది. దేవీ భాగవతము, వాయుపురాణము, శివపురాణములో ఈ క్షేత్రమహిమ గురించి చాలా విశేషాలున్నాయి.

మొదట ఈ ప్రాంతమంతా కీకారణ్యము ద్వాపర యుగ చివరిరోజులలో ఋషులు 88,000 మంది పరబ్రహ్మ వద్దకు వెళ్లి కలియుగము మొదలౌతున్నది. కలి పురుషుడు ప్రవేశించని పవిత్ర ప్రదేశము చూపమని కోరతారు. తమ తపస్సు ఏ ఆటంకం లేకుండా సాగటానికి తగిన ప్రదేశము చూపమని వేడుకుంటారు. అచటనే వుండి తమ జీవితాలను సార్ధకం చేసుకుంటామని ప్రార్థిస్తారు. ఆ ఋషుల ప్రార్ధనను అంగీకరించి, పరబ్రహ్మ, చక్రము సృష్టించి, ఆ చక్రము వారికి తగినటువంటి ప్రదేశము చూపుతుందని తెలుపుతారు. ఆ చక్రము 14 లోకాలు చుట్టివచ్చి భూలోకంలో నైమిశ ప్రాంతానికి వచ్చి అదే భూలోకానికి కేంద్ర స్థానమని, అక్కడే ఆగిపోయింది. ఆ ప్రదేశము పుణ్య కార్యాలు చేయటానికి, యజ్ఞయాగాలు చేయటానికి అనుకూల ప్రదేశమని చెప్పి ఆ చక్రము భూలోకానికి చొచ్చుకొనిపోయి, పాతాళాలు ఛేదించి కొంచెం మిగిలివుంటే మహాఋషులు, భయభ్రాంతులై మళ్లీ బ్రహ్మదేవుని ప్రార్థిస్తారు. అపుడు ఆ పరబ్రహ్మ ఆదిశక్తిని, ఆ చక్రభ్రమణమును ఆపవలసిందిగా ఆజ్ఞాపిస్తాడు.

ఆమె భూలోకంలో ఉద్భవించినటువంటి చక్రభ్రమణాన్ని నిరోధిస్తుంది. అలా ఉద్భవించిన ఆదిశక్తి రూపమే లలితాదేవి రూపము. ఇది పరమాత్మకు మూలమైనటువంటి జ్యోతి రూపమని, సర్వ ప్రపంచ ప్రకాశానికి మూలమైనటువంటి జ్యోతి రూపమని వివరించబడింది. ప్రపంచంలో వుండే సర్వ తీర్థాలు, నదులు, సముద్రాలు ఈ నైమిశారణ్యంలో చక్రతీర్థంలో ఒక నిమిషకాలముండి సర్వశక్తులు సంపాదించుకుని పోతుందని యోగినీ తంత్ర అనే గ్రంథములో వివరించబడింది. ఇక్కడ స్నానము, దానము, పూజలు చేసినవారికి సర్వశుభాలు లభిస్తాయని పితృమాతృ పక్షాలవారు పాపవిముక్తులై పుణ్యలోకాలకు చేరతారని కూడా వివరించబడింది. ఋష్యశృంగుడు, పిప్పలాది మహాఋషులు చేసిన స్తోత్రాలకు సంతృప్తి చెందిన లలితామాత ఇక్కడ పూజలు, యజ్ఞయాగాదులు చేసినవారికి, వారి జీవితంలో ఏ లోటు లేకుండా తమ కోర్కెలు నెరవేరతాయని అభయమిచ్చింది.

దుర్గాసప్తశతి స్తోత్రం హోమము చేసి 108 పూసలు వుండే తులసిమాలతో జపిస్తే అమ్మవారి అనుగ్రహం తప్పక లభిస్తుందని పురాణాలు ఘోషిస్తున్నాయి. పరమశివుడు పార్వతితో ఈ చక్రతీర్థంలో స్నానము, గ్రహణ కాలంలో కురుక్షేత్రంలో స్నానం చేసినంత ఫలమని పురాణాలు వెల్లడించాయి. నైమిశారణ్యంలో చేసిన దానము ఇతర ప్రదేశాలలో చేసిన లక్ష దానాలు ఫలితాన్ని ఇస్తాయని కూడా పేర్కొన్నాయి.

గయుడనే రాక్షసుడు ఘోర తపస్సుచేసి విష్ణు సాక్షాత్కారం పొందాడు. దర్శనమిచ్చిన విష్ణువు గయునితో ఏదైనా వరము కోరమని అడుగుతాడు గయుడు, తానే విష్ణువుకు వరమిస్తానని కోరుకొమ్మని అంటాడు. ఎవరికీ లొంగని గయుని అంతమొందించటానికి అదే మంచి అవకాశమని విష్ణువు గయుని నీచావు నా చేతిలో వుండాలని కోరుతాడు. అందుకు అంగీకరించాడు. మహావిష్ణువు వానిని మూడు భాగాలుగా నరికివేశాడు. చరణగయుని గయక్షేత్రంలో, నాభిగయుని

నైమిశారణ్యంలో, కపాలగయుని బదరీక్షేత్రంలో వుంచుతాడు. అందువల్లనే పితృశ్రాద్ధాలు పెట్టడానికి ముందు గయక్షేత్రంలో తర్పణాలు విడిచి, యధాశక్తి దానాలు చేసి పుణ్యలోక ప్రాప్తి కలిగి వారు తృప్తితో దీవిస్తారని పురాణ కథలు వివరిస్తున్నాయి. సత్సంతాన ప్రాప్తి కొరకు ఇక్కడ పూజలు చేస్తే తప్పక సత్పుత్రులు కలుగుతారని ఆస్తికుల విశ్వాసం.

ఆషాఢ శుక్లపక్ష పూర్ణిమరోజున సత్యవతి పరాశరుడికి విష్ణువే వ్యాసుడుగా జన్మిస్తాడు. వేదాలు నాలుగు బాగాలుగా విభజిస్తే వేదవ్యాసుడుగా పిలువబడ్డాడు. అట్టి వ్యాసుడు తపస్సు చేసినచోటు కూడా నైమిశారణ్యమే. అంతేకాకుండా ఆరు శాస్త్రాలు, పద్దెనిమిది పురాణాలు, 18 ఉపపురాణాలు రచించినది కూడా ఈ క్షేత్రములోనే. ఇన్ని రచించినా కూడా వ్యాసులవారికి మనోవ్యాకులతగా వుంటే వారివద్దకు నారద మహర్షి వచ్చి భాగవతము రచించమని చెప్తాడు. ఈ ప్రదేశములోనే కృష్ణ ద్వైపాయనుడని పిలువపడే వేదవ్యాసులు, ఫలపుష్పాలతో పూజించి, భాగవత సప్తాహము జరిపారు.

శౌనకాది మహామునులు ఈ నైమిశారణ్య క్షేత్రములో మహావిష్ణువును తృప్తి పరచుటకై యజ్ఞయాగాదులు చేయుట ప్రారంభించారు. ఈ కలియుగంలో మానవులు అల్పాయుష్కులు, వేదవిద్యయందు శ్రద్ధ లేనివారు. జ్ఞానహీనులై వుంటారు. వారికి తరించే మార్గమేది అని సూతుడు, శౌనక మహామునులను ప్రశ్నిస్తారు.

అపుడు శౌనక మహర్షి అశ్వత్థామ చేసిన బ్రహ్మాస్త్రము ఉత్తర గర్భము ఛేదించకుండా శ్రీకృష్ణుడు నివారిస్తాడు. ఆ గర్భాన పుట్టిన పరీక్షిత్తుకు, శుకమహర్షి భాగవత కథ బోధిస్తాడు. మొదట ఈ భాగవత కథ వ్యాసుడు శుకమహర్షికి చెప్తాడు. అట్లు చెప్పుచుండగా విని ఆ కథ నేను మీకు చెప్తాను అని ఆ భాగవత కథ చెప్పిన ప్రదేశంకూడా ఇదే. పరీక్షిత్తుకు శుకుడు చెప్పినచోట ఢిల్లీకు నూరు కి.మీ. దూరంలో వున్న శుకస్థల్ ప్రదేశము.

నైమిశారణ్యము ఎనభై నాలుగు క్రోసుల విస్తీర్ణము కలిగి వుంది. ఇక్కడ ఫాల్గుణ శుద్ధ పాడ్యమినుంచి పౌర్ణమివరకు ఉత్సవాలు జరుపుతారు. దధీచి వెన్నెముకను ఇంద్రునికి దానమిచ్చిన స్థలము ఈ నైమిశారణ్యమే. ఇక్కడ మిశ్రి అనే తటాక భూమిపై ఎనిమిది వైకుంఠాలున్నాయని అంటారు. ఎనిమిదవ వైకుంఠమే నైమిశారణ్యము. ప్రతి దినము బ్రహ్మ, ఇంద్రుడు, దేవతలు ఇక్కడ వుండే దధీచి కుండు దగ్గరకు వస్తారని, అక్కడ ప్రదక్షిణలు చేస్తారని ప్రతీతి. ఈ ప్రదక్షిణము అనంతఫలాలలను అందిస్తుందని దేవతల వాక్కు. పరశురాముడు, నరనారాయణులు, దేవేంద్రుడు, శ్రీరామచంద్రుడు తపస్సుచేసిన పవిత్ర స్థలము నైమిశారణ్యము. ద్రౌపదికి సూర్యుడు అక్షయపాత్రను ప్రసాదించినది కూడా ఇక్కడే. శ్రీరామచంద్రుడు బంగారు సీత ప్రతిమను ప్రక్కన బెట్టుకుని అశ్వమేధ యాగము చేసింది కూడా ఈనైమిశారణ్య క్షేత్రంలోనే. ఈ విధంగా ఈ క్షేత్రము ఎంతో పవిత్రమైనది.

*(ఆంధ్రభూమి జూన్ 24, 2007)*

# సజ్జన సాంగత్యం

సమాజంలో మనం చూస్తున్న, వింటున్న అరాచకాలు, అవకతవకలు, అశాంతి వీటన్నిటికీ మూలకారణం మానవ ధర్మాన్ని మరచి జీవించటం వలననే కల్గుతుంది. తన మేధాసంపత్తి వలన మానవుడు మంచి ఫలితాలు పొందుతున్నా కూడా మానసికంగా ఆవేదన, అశాంతికి గురవుతున్నాడు. మానవత్వం అనేది మరచిపోయి దానవత్వం కల్గించే సన్నివేశాలు చూస్తుంటాము.

అలా కష్టపరిస్థితులలో మనల్ని మనం ఉద్ధరించుకోవాలంటే సజ్జనులు ఏ విధంగా నడచుకున్నారో అలాగే మనం నడుచుకోక తప్పదు. సజ్జన సాంగత్యం వలన ఇది ఉచితం, అనుచితం అనే వివేచన కల్గుతుంది. వర్షపు చినుకులకు పచ్చదనం భూమి నుండి పొడుచుకు వచ్చినట్లు సజ్జన సాంగత్యం వలన సజ్జన గోష్ఠి వలన సత్ఫలితాలు కలుగుతాయి. బలహీనుడికి బలం భయపడేవానికి నిర్భయం దుఃఖపడేవారికి సంతోషం, లోభివానికి త్యాగబుద్ధి, దేశద్రోహికి దేశంపై అభిమానం, స్వార్థపరునికి పరోపకారబుద్ధి ఇవన్నీ సజ్జన సహవాసంతో సమకూరుతాయి.

అరణ్యపర్వంలో ఆదికవి నన్నయ్య సుజనుల సహవాసం వల్ల చెడ్డవారు మంచివారుగా మారగలరని, ధర్మాధర్మము తెలిసినవారికి సేవచేసి శుభాచారుడు కావలెనని తెలిపాడు. 'సంతత, సుజన, పూజనము వలయు' అని ఎట్టిన ప్రబోధించాడు. ఉత్తమ జ్ఞానుల సాంగత్యం వలన అజ్ఞాని కూడా జ్ఞాన సంపన్నుడవుతాడు. ఎలా అనగా మేరుపర్వతముపై చెట్లు, లతలు, పూలు మేరుపర్వత కాంతిని ప్రతిఫలిస్తూ బంగారు రంగుతో విరాజిల్లుతూ వుంటాయి. పరమ భాగవతోత్తముడైన పోతన, సత్పురుషునితో స్నేహము సద్గతికి కారణమౌతుందని, సత్పురుషుని దర్శనమువలన మనం పావనులమవుతామని వివరించాడు.

కళాపూర్ణోదయంలో పింగళి సూరన సజ్జనులతో గోష్ఠి ఇహ, పర సాధనమని తెలిపాడు. ఉత్తర రామ చరిత్రలో కంకంటి పాపరాజు ఎంతటి తామస గుణము కలవారైనా సజ్జనుల మైత్రివలన వారి భావములు ప్రభావితం చేస్తాయని తెలిపాడు.

సజ్జనుల సాంగత్యము లేనివారికి, హాని, భయము సంభవించునని, ఎంతటి వారికైనా అది వాస్తవమని, 'విశిష్టులైనవారి మైత్రి పొందకున్నచో వారికి సౌఖ్యము అబ్బునా' అని పాండురంగ మహాత్మ్యంలో తెనాలి రామకృష్ణుడు ప్రబోధిస్తాడు.

వాగ్గేయకారుడైన త్యాగరాజు క్షితితో సత్సంగతి సౌఖ్యమని చెప్పగా తాళ్లపాక అన్నమయ్య – 'వింతైన జనులతోడి వినోదము నిష్ఫలము, చెంత సజ్జన సంగతి, చేరిన నాదాయము' అని ఆలపించాడు.

ఇక వేమన – సజ్జన సాంగత్యము గురించి వెలిబుచ్చిన భావాలు చాలా ఉత్కృష్టమైనవి 'పాలలో గలిసిన నీరు పానయోగ్యమైనట్లు సాధు సజ్జనుల సాంగత్యముతో మూర్ఖుడు గూడ మోక్షమును పొందగలడు' అని చెప్పారు.

ఒకచోట రామకృష్ణ పరమహంస ఇలా అంటారు – చెడ్డ సహవాసముతో మనసుకు చెడు తలంపులు కలుగుతాయి. అదే సజ్జనుల సాంగత్యము కనుక వుంటే భగవంతుని తప్ప మరి దేని గురించి చింతింపదు. సద్వివేకం, సద్విచారణ, సజ్జన సాంగత్యం, ధర్మనిష్ఠ ఇవన్నీ మానవునిలో పెంచుకోవాలంటే సజ్జనుల సాంగత్యమే మంచిదని, అనుభవజ్ఞులు చెప్పిన సారాంశం అంటాడు.

అంతేగాక ఇతరులు మనపై క్రోధం చూపినపుడు, అపకారం చేసినపుడు మనము ఇతరులలోని ఆత్మను భావించాలేగాని క్రోధము చూపకూడదు. మహాభారతంలో దుర్యోధనుడు తన లోభగుణం వలన పాండవులకు భాగం పంచిపెట్టకుండా అపకీర్తిపాలై చివరికి మరణం పొందాడు.

పురందరదాసు మొదటి లోభి అయినా, భార్య త్యాగగుణంతో తాను కూడా త్యాగిగా మారి పరమభక్తుడు, మహాత్యాగి అయ్యాడు.

మహాభాగవతంలో పోతన కోరతాడిలా – 'నీ పాదార్చకులతోటి నెయ్యము' అంటే భక్తులతోటి స్నేహము వలన అప్రయత్నముగానే మనకు భక్తి సిద్ధిస్తుంది. ఎవరితో ఎక్కువ కలిసిమెలసి వుంటే వారి ప్రభావం అంత ఎక్కువగా వుంటుంది. జీవన్ముక్తికి సత్సాంగత్యమే మూలమని ఆదిశంకరులు ఒకచోట తెలిపారు.

భక్తుడున్నచోటనే భగవంతుడుంటాడు. భక్తుల సాన్నిధ్యం భగవత్ సాన్నిధ్యమే. అందువలన తనకు కలిగిన భక్తి కుదురుగా వుండే వాతావారణాన్నే కోరుకుంటాడు భక్తుడు.

చరాచర జీవకోటికి శ్రీమన్నారాయణుడే లయకారుడని భావించి ఆ పరమాత్మ స్వరూపాన్ని నిత్యం హృదయంలో వుంచుకుని, సన్మార్గంతో, సజ్జన సాంగత్యంతో సాత్త్విక జీవనం గడపటం ద్వారా మన జన్మను ధన్యం చేసుకోవచ్చు. దీనిని సాధించిన భాగవతోత్తములు పై విధంగా సేవించి మనకు మార్గదర్శకులయ్యారు. పుణ్యపురుషుల్ని అనుసరించటం మనందరి కర్తవ్యం కూడా. ఆ కర్తవ్య నిర్వహణ వలన మనచుట్టూ వున్నలోకం శుభాన్ని కలిగిస్తుంది.

(ఆంధ్రభూమి)

# ఓంకార సాధన

ఆధ్యాత్మిక సాధన అనేది చెప్పడం తేలిక. చేయడం చాలా కష్టం. నేను, నా దేహం నా బంధువులు అనే ఆలోచనలు విడిచిపెడితే నీకంటే భిన్నమైనది ఈ ప్రపంచంలో ఏదీ వుండదంటుంది ఆధ్యాత్మికత. విశ్వమంతా అన్ని జీవులలో అన్ని పదార్థాలలో వ్యాపించిన బ్రహ్మము లేక ఆత్మ 'నేను' నేను, నాది అనే భావం వున్నంతకాలం చావు పుట్టుకలు తప్పవు. ఆ భ్రమనుంచి బయటపడటమే అమరత్వం. నాది అనే భావం విడచిపెట్టి స్వార్ధాన్ని విడిచి అందరిపై ప్రేమను వికసింపచేసి పరోపకారానికి సిద్ధమవటమే ముఖ్యము.

ఆధ్యాత్మికత ఈ లోకానికి సంబంధించినది కాదని దీనివలన సమాజానికి ఎలాంటి ఉపయోగం వుండదని ఎప్పటికీ అనుకోకూడదు. మనిషిలోని మంచినీ, మానవత్వాన్నీ మేలు కొలిపే శక్తి ఆధ్యాత్మికతలోనే వుంది. ఆధ్యాత్మిక సాధన ఏ కొందరికో పరిమితమైనది కాదు. ఇందులో కులమత భేదాలకు ఎలాంటి తావులేదు. వేదాంతము, ఆధ్యాత్మికత అంటే ముక్కు మూసుకుని కూర్చోవడం కాదు.

జనకమహర్షి లక్షలకొద్దీ ప్రజల మంచిచెడ్డలు చూస్తూ రాజుగా తన బాధ్యతలు నెరవేరుస్తూ వేదాంత చింతనలోవుంటూ కర్మయోగి, రాజఋషి అనిపించుకున్నాడు. జ్ఞానం ఆర్జించుటలో ఎక్కువ కాలం తక్కువ కాలం అనే తేడాకు చోటులేదు. శుకదేవుడు అనే ఋషి కుమారుడు జనకుని ఆశ్రయించి బ్రహ్మవిద్యలో తనకు గల సందేహాలన్నీ తీర్చుకున్నాడు. వేదాంత సాధనలో ముఖ్యమైనది ఓంకారజపం వేదాల సారమంతా ఒక్క 'ఓం'కారంలోనే వుంది. బ్రహ్మకు మరొక పేరు ఓంకారం, నిత్యం ఓంకారం జపిస్తూ వుంటే అహం, గర్వం, మోహం, స్వార్థం, అసూయ ఇలాంటి దుర్గుణాలన్నీ అంతరించిపోయి అనంతజ్ఞానం కలుగుతుంది. తద్వారా అనంత శాంతి, ఆనందం లభ్యమవుతాయి.

ఓంకారం నుంచే అన్ని శబ్దాలూ పుట్టాయి. ఓంకారంలో నుంచే అకార, ఉకార మకారాలు న్నాయి. అకారం భౌతిక జగత్తును సూచిస్తుంది. మకారం గాఢ సుషుప్తికీ మన మేధస్సుకూ అందని అతీత, అజ్ఞాన విషయాలను సూచిస్తుంది. కనుక ఓంకారానికి బయట ఏమీ లేదు. మనం ధ్యానానికి కూర్చున్నపుడు మొదట బిగ్గరగా మూడునుంచి పన్నెండుసార్లు ఓంకారాన్ని ఉచ్చరించాలి. అప్పుడు మన మనస్సు ప్రాపంచికమైన ఆలోచనలనుంచి పారిపోవడం ద్వారా ఏకాగ్రత లభిస్తుంది. ఆ తర్వాత మానసికంగా ఓంకారం జపించుకోవాలి.

త్రిశంకుడు తన శరీరంతోనే స్వర్గానికి వెళ్లాలనుకున్నాడు. విశ్వామిత్రుని ఆశ్రయించాడు. విశ్వామిత్ర మహర్షి తన తపస్సు ధారపోసి త్రిశంకుని శరీరంతో స్వర్గానికి పంపాడు. ఇంద్రుడు వెంటనే అతని క్రిందికి తోసేశాడు. అప్పుడు విశ్వామిత్రుడు ప్రత్యేకంగా ఒక స్వర్గాన్ని త్రిశంకునికోసం సృష్టించాడు. ఇలాంటి శక్తులు అందరికీ అనుభవంలో వుండవు. నమ్మటం కష్టం. కానీ ఆధ్యాత్మిక సాధనలో తలపండిన పెద్దలు తగిన సాధనచేస్తే ఎవరికైనా సాధ్యమే అంటారు.

*(ఆంధ్రభూమి మార్చి 4, 2007)*

# కర్తవ్యం

బుద్ధిబలం శరీరబలంకన్నా గొప్పది. బుద్ధిబలం కన్నా ఆత్మబలం గొప్పది. ఆత్మబలం తీర్చిదిద్దాలంటే మంచి సంస్కారం పునాది వుండాలి. భారతీయులమైన మనమందరం గర్వించేరీతిలో ఎన్నో సంస్కారం గల రత్నరాసులు పూర్వులు మనకు సమకూర్చారు. ఆ సంస్కృతిలో విశాల దృక్పథం, ఉదాత్తమైన భావన మనకు గోచరిస్తుంది.

భగవద్గీతలో మూడవ అధ్యాయం ఎనిమిదవ శ్లోకం ఇలా చెప్తోంది.

**'నియతం కురుకర్మత్వం కర్మజ్యాయో హ్యాకర్మణః**
**శరీరయాత్రా పిచ తే న ప్రసిద్ధ్యే ద కర్మణ్యః'**

పార్ధసారధి, పార్ధునకు చేసిన ఉపదేశం – "నాకేం పనిలేదు అని చేతులు ముడుచుకుని కూర్చునే ప్రతి వాడికి కనువిప్పు కల్గిస్తుంది. ఏ పని చేయకుండా, సోమరిగా కూర్చునేవాడు, మానసికంగా ఉత్సాహంగా వుండలేడు. మానసిక ఆరోగ్యవంతుడుగా కాలేడు.

కర్మస్వభావం తెలీనివాళ్లు ఫలాపేక్షతో అనేక పనులు చేస్తారు. కాని వివేకం గలవారు నేను జ్ఞానిని కదా, నేను ఏ పనీ చేయను అని భీష్మించుకుని కూర్చోకూడదు. కర్మస్వభావంతో చేస్తుండాలి. అలా అతడు చేయడం వల్ల ఇతరులు కూడా అతడిని చూసి, వాళ్ళ వాళ్ల పనులు చేస్తారు. మొత్తం మీద ఫలాపేక్ష లేనివాడు లోక సంగ్రహం కోసం పనులు చేయవలసిందేనని భగవానుడు ఉపదేశిస్తాడు. కర్తవ్యపాలన లేని మానవుడు ఈ లోకంలో ఏ పనీ సాధింపలేడు. కర్తవ్య భావంతో మాత్రమే పనులు చేయాలి. చివరికి తమ ప్రాణాలు పోయే పరిస్థితి వచ్చినా తన కర్తవ్యాన్ని తను ఆచరించి తీరుతాడు. పోయే ప్రాణం నిలుపుకోవటానికని, కాని పని మాత్రం ఎన్నడూ చేయకూడదు. పెద్దలు అందుకే ఇలా చెప్తారు –

**"కర్తవ్యయేన కర్తవ్యం ప్రాణైః కంఠగతైరపి**

**అకర్తవ్యం న కర్తవ్యం ప్రాణైః కంఠగతైరపి॥"**

ఎంతటి కఠిన పరీక్షలలోనైన నెగ్గి, జటిలమైన సమస్యలెన్నో మన పూర్వీకులు పరిష్కరించుకున్నారు. కర్తవ్య పరిపాలనలో ప్రతివాడికి దృఢమైన దీక్ష వుండాలి. ఫలితం ఎలా వున్నాసరే, మన బాధ్యతలను సక్రమంగా నిర్వహించాలి. ఎన్ని ఆటంకాలొచ్చినా మనల్ని ఇతరులు ఎంత నిరుత్సాహ పరచినా మనం వెనుకడుగు వేయకూడదు.

అంతేకాకుండా, మానవుడు తన ప్రవర్తననుబట్టే, ఇహలోకంలో గౌరవానికి అర్హుడవుతాడు. ప్రవర్తన సరిగాలేనివాడిని, అతను ఎంత నిపుణుడైనా, సమాజం గౌరవించదు. పొరపాటున గౌరవించినా, తన తప్పు తాను తెలుసుకుంటుంది. అందువల్ల సత్ప్రవర్తన తనకు, తన చుట్టూవున్న సమాజానికి మంచిని కల్గిస్తుంది. సంస్కృతి సాహిత్యం తరతరాలనుంచి ఇదే మనకు ఉపదేశిస్తున్నది.

**"మాతృ పితృ కృతాభ్యాసో గుణితామేతి బాలకః**

**నగర్భ చ్యుతిమాత్రేణ పుత్రో భవతి పండితః॥"**

చిన్న పిల్లల్లో ఏదైనా దోషం ఏర్పడితే అది వారి తప్పు కాదు వాళ్లను పెంచిన తల్లిదండ్రులదే తప్పు. ఎవడూ పుడుతూనే పండితుడు కాలేడు. తల్లిదండ్రుల పెంపకాన్ని బట్టే వాడిలో సత్ప్రవర్తనగాని, దుష్ప్రవర్తనగాని ఏర్పడుతుంది. అందుకనే పిల్లల పొరపాట్లను లెక్కవేసే ముందు వారిని అలా పెంచిన తల్లిదండ్రులను తప్పుపడుతూ వుంటారు.

ఇంకా ఈ విషయం కూడా మనం గుర్తించాల్సి వుంటుంది. ఆరంభశూరత్వం మనందరిలోనూ వుంటుంది. ఒక పనిని జాగ్రత్తగా చేపడితే దానికి ఎన్ని అవాంతరాలొచ్చినా భయపడకుండా పూర్తి చేయటం కొందరు

మాత్రమే చేయగలరు. దానికి తగిన దీక్ష, పట్టుదల కావాలి. దానికి సంబంధించిన మంచి, చెడులను జాగ్రత్తగా పరిశీలించి ఒక నిర్ణయానికి రావాలి. దీనిని భర్తృహరి సుభాషితాలలో ఇలా ప్రబోధిస్తారు.

అంతంతమాత్రపు వాళ్లు ఏ పని మొదలుపెడితే ఏ విఘ్నమొస్తుందో అని భయపడి ఏ పనీ చేయరు. కొంతమంది ఆరంభశూరులు పనులు మొదలుపెట్టి, ఆటంకం వస్తే అస్త్ర సన్యాసం చేసి పారిపోతారు. ఉత్తమగుణం గల ధీరోదాత్తులు ఎన్నిసార్లు, ఎన్ని విఘ్నాలొచ్చినా మొదలు పెట్టిన పని పూర్తయ్యే వరకు ఓర్పు నేర్పుతో తట్టుకుని నిలబడతారు. అంతిమ విజయాన్ని సాధించగలుగుతారు. అలాంటి పట్టుదల, కార్యదీక్ష గురించి చెప్పుకునేటపుడు కొందరు మహనీయులు గుర్తుకొస్తారు. భగీరథుడు, హరిశ్చంద్రుడు మొదలగువారు. వారి బాటలో పయనించి, చేపట్టిన పని పూర్తిచేయమని మనసాహిత్యం బోధిస్తోంది.

*( ఆంధ్రభూమి జులై10, 2005)*

# ఇంద్రియాలు

'ఇంతకుముందు నీ ఇంద్రియాలను నీవు జయించావు. ముల్లోకాలు నీచే జయింపబడ్డాయి. ఆ వైరాన్ని ఇంద్రియాలు గుర్తించుకున్నట్లున్నాయి. వాటితోనే ఇప్పుడు నీవు ఓడింపబడ్డావు. యుద్ధరంగంలో, రావణుని మృతదేహం మీదబడి దేవేంద్రుడే నీ దెబ్బకు భయపడుతాడే. యమధర్మరాజే నీవు ఎదురుపడితే గడగడలాడిపోతాడే - ముల్లోకాలను నీవు అవలీలగా జయించావే. నీకు మరణమేమిటి?' అని నైరాశ్యంతో విలపించే మండోదరి మాటలు ఇవి.

మనిషికి కళ్లు, చెవులు, ముక్కు, నాలుక ఇవి జ్ఞానేంద్రియాలు. ఏది ఏమిటో సృష్టిలో తెలుసుకోవడానికి ఉపయోగపడే సాధనాలు. అలాగే కాళ్లు, చేతులు కర్మేంద్రియాలు కోరుకున్నదాని కోసం కృషి చేసే గొప్ప పరికరాలు.

కంటికి అందం, చెవికి మృదుమధురమైన సంగీతం, నాసికకు మంచి వాసన ఇష్టం. కాళ్లు మనం వెళ్లవలసిన చోటికి వెళ్తాయి. చేతులు మనం చెప్పిన పని చేస్తాయి. శ్రావ్యమైన సంగీతం వినడం తప్పుకాదు. పరిమళాల్ని ఆఘ్రాణించడం తప్పుకాదు. అయితే ఈ ఆనందానుభవం ఔచిత్యాన్ని మీరకూడదు. పరిమితిని దాటకూడదు. ధర్మాన్ని ఉల్లంఘించకూడదు. అలా వుండాలంటే ఇంద్రియాలు అదుపులో వుండాలి.

ఇంద్రియాల్ని అదుపులో వుంచడం అంటే మనిషి తన మనస్సును, తాను అదుపులో వుంచడం ఇంద్రియాల్ని జయించడం అంటే తాను తన మనస్సును జయించడం, మనస్సును జయించడం అంటే ఈ ప్రపంచాన్నే జయించడం.

మన మనస్సు మహా చిత్రమైంది. గాలిలా వీస్తుంది. నీరులా ప్రవహిస్తుంది. కాంతిలా ప్రవర్తిస్తుంది. వాసనలా సర్వత్రా వ్యాపిస్తుంది.

గాలిని బంధించవచ్చు. నీటిని నిరోధించవచ్చు. కాంతిని అడ్డుకోవచ్చు. అలాగే వాసనలను కప్పివేయవచ్చు. కాని మనిషి మనసు మాత్రం కదలకుండా చెయ్యలేం. అది ఆకర్షించిన ప్రతిదానిని అనుభవించాలని ఆరాటపడుతుంది. పరుగులు తీస్తుంది. ధర్మాన్ని తప్పి ఒక్కోసారి పతనమైపోవడం కూడా జరుగుతుంది.

రావణాసురుడు జీవితంలో మహోగ్రమైన, ఘోరమైన తపస్సు చేశాడు. ఇంద్రియాల్ని జయించాడు. అపారశక్తిని ఆర్జించాడు. అన్ని లోకాలు జయించాడు. అతనిపేరు చెబితే దేవేంద్రుడు భయపడినమాట కూడా నిజమే. కాని రావణుడు తన ఇంద్రియాల్ని మాత్రం పూర్తిగా జయించలేక పోయాడు. ఇంద్రియాలకు వశమయ్యే స్వభావం ఆతనిలో ఇంకా మిగిలివుంది. అందుకే సీతాదేవి సౌందర్యం గూర్చి వినగానే అతని చెవులు అదుపు తప్పాయి. ధర్మాన్ని తృణీకరించాయి. ఆ మహాసాధ్వి సౌందర్యం చూడగానే అతని మనస్సు అదుపు తప్పింది. ధర్మాన్ని కాలదన్నాయి. ఫలితం జీవితంలో ఘోర పతనం, దారుణ మరణం.

అందుకే మండోదరి భర్త మృతదేహంపై పడి రోధిస్తూ –

'ముల్లోకాలను జయించావు. ఇంద్రియాలకు వశమై ఇప్పుడు మరణించావు' అంటూ రోధిస్తుంది. మండోదరి మాటలు ఒక రావణునికే కాదు ప్రతి మనిషికి అన్వయిస్తాయి. మార్గదర్శకంగా నిలుస్తాయి. మనస్సును జయిస్తే మనిషి మహాత్ముడౌతాడు. మనసుకు వశమైతే అతను పతనమౌతాడు.

*(ఆంధ్రభూమి)*

# మంచితనం

మంచితనానికి లక్షణం ఏమిటి?

తాము ఎవరికైనా మేలుచేస్తే ఆ సంగతి ఎవ్వరికీ చెప్పరు, తెలియనివ్వరు కూడా. కుడిచేత్తో చేసే దానం ఎడమచేతికి తెలియకుండా చేస్తారు. తమకు ఎవరైనా చిన్న ఉపకారం చేసినా అది మహామేరువుగా భావించి, ఆ విషయం బహిరంగంగా సంతోషంగా పదిమందికీ తెలుపుతారు. ఎంత సంపదవున్నా నిరాడంబరంగా వుంటారు.

అంతేకాకుండా ఇతరుల గురించి ప్రసంగించేటపుడు ఎప్పుడూ తిరస్కారభావంగానీ, అవమానకరమైన పలుకులుగాని వారినోట రావు, పేదలకు దానం చేయకుండా వుండలేరు. సజ్జనులు ఏదైనా చిన్న పనిచేస్తే అది ఇతరులకు ప్రియంగ న్యాయసమ్మతంగా వుంటుంది. వారు తమ అంతిమ సమయంలో కూడా ఓర్పును దయను వదలరు.

తమకు ఎంత గడవకపోయినాసరే ఎప్పుడూ అయోగ్యులను యాచించరు. మిన్ను విరిగి మీదపడ్డా ధైర్యాన్ని వదలరు. మహాత్ములపట్లా, జ్ఞానులపట్లా, అమితమైన వినయ విధేయతలతో మెలగుతుంటారు. ఇది తప్పక **అసిధారావ్రతమే**. ఇది వారికి సహజ లక్షణం కూడాను.

దుర్జనుడికి దూరంగా వుండాలి వాడు ఎంత విద్యావంతుడైనా సరే పాము తలమీద విలువైన మాణిక్యం వుంటుంది. అలాగని దాని దగ్గరగా వెళ్లంగదా! దానిని చూస్తేనే భయపడతాము. అలాగే దుర్జనుని చూచి కూడా దూరంగా తొలగిపోవాలి. సజ్జనునితో స్నేహానికి తొందరపడాలి.

పాండవులు అరణ్యావాసానికి వెళ్లినపుడు ద్రౌపది అధికమైన శ్రమపడుతున్న ధర్మరాజునుచూసి – 'నీవు, నీ శత్రువులపై చాలా ఓర్పు కలిగి

వుంటున్నావు. ఇది ఎంతమాత్రం తగదు' అని చెప్తుంది. మృదువుగా వుండే సమయాలేవో కూడా సూచిస్తుంది. తగిన సమయంలో మెత్తగానూ, కొన్ని సమయాలలో భయంకరంగానూ వుండాలని, అలా వుంటేనే ఈ లోకంలోగాని పై లోకంలోగాని సుఖపడగలవని ప్రహ్లాదుడు చెప్పినట్లుగా తెలియపరుస్తుంది.

**'పూర్వపకారీయస్తే స్యాదపరాధే గరీయసి**
**ఉపకారేణ తత్తస్య క్షంత వ్యయపరాధినః'**

చేసిన పొరపాటు పెద్దదైనా, అతడు ఇంతకు ముందు మనకు ఉపకారం చేసినవాడైతే ఆ అపరాధం క్షమించాల్సి వుంటుంది. ఒకప్పుడు ఉపకారం చేసినవాడు కాకపోవచ్చు. అలాంటివానిపై కూడా మెత్తగానే వ్యవహరించాల్సి వుంటుంది.

**అబుద్ధి మాశ్రితానాంతు క్షంతవ్య మపరాధినా**
**నహి సర్వత్ర పాండిత్యం సులభం పురుషేణ వై**

చేసిన తప్పు బుద్ధిపూర్వకంగా చేసినది కాకపోతే క్షమించాలి. దానికి కారణం కూడా చెప్తున్నాడు. అందరికీ అన్ని విషయాలు క్షుణ్ణంగా తెలియవుగదా! గనుక తెలియక చేసిన తప్పును క్షమించాల్సి వుంటుంది.

ఇతను ఉపకారా, అపకారా అని ఆలోచించకుండా ఎవరినైనాసరే మొదటి తప్పును క్షమించాల్సివుంటుంది. అదేగనుక మళ్లీ చేస్తే చిన్నదైనా తప్పక శిక్షించాల్సి వుంటుంది.

ఏ పని చేయడానికైనా దేశ కాలాలు పరిశీలించాల్సి వుంటుంది. వాటితోపాటు తమ బలం కూడా చూచుకోవలసి వుంటుంది. దేశం, కాలం అనుకూలంగా లేకపోతే ఏ పనీకూడా నెరవేరదు. అపరాధిని శిక్షించేముందు లోకాభిప్రాయం కూడా గమనించాల్సివుంది.

ఇలా మెత్తగా, ఓరిమి పట్టవలసిన సమయమేదో చెప్పి వీటికి వ్యతిరేకంగా వుండేవారిపై కఠినంగా ప్రవర్తించాల్సి వుంటుంది అని చెప్తుంది ద్రౌపది. మరొక సమయంలో ధర్మరాజు భీష్మ పితామహుడిని ఇలా ప్రశ్నిస్తాడు.

జీవితంలో అనేక కష్టాలు, ఎప్పుడో ఒకప్పుడు రావచ్చు. ఇష్టమైన బంధువులు దూరం కావచ్చు. సంపదలు తరలిపోవచ్చు. చేతినుంచి అధికారం దూరం కావచ్చు. మనిషి ఎలా ప్రవర్తించాల్సివుంటుంది? భీష్ముడు ఇలా సమాధానమిస్తాడు -

**'పుత్ర దారైః సుఖైశ్చైవ విముక్తస్య ధనేన, వా**
**మగ్నస్య వ్యసన కృచ్ఛే ధృతిః శ్రేయస్కరీ నృప'**

కన్నవారు మననుండి దూరం కావచ్చు. అలాగే కట్టుకున్నవారు దూరం కావచ్చు. మన కష్టార్జితం మనకు కాకుండా పోవచ్చు. కష్టాలెన్నో మనల్ని ముంచుకు రావచ్చు. అయినా ఎంత బాధపడవలసిన పరిస్థితులోనైనా ధైర్యం అనేది వదల కుండావుంటే శ్రేయస్సు దానంతటదే కల్గుతుంది. ఈ ధైర్యం వల్ల ప్రయోజనం ఏమిటి? ధర్మరాజు తిరిగి ప్రశ్నిస్తాడు.

**'ధైర్యేణ యుక్తం సతతం శరీరం న విశీర్యతే**
**విశోకతా సుఖం దత్తే చారోగ్య ముత్తమమ్'**

ధైర్యం అనేది ఎప్పుడూ వదలకుండా వుంటే, ముందు ఆరోగ్యం పాడుకాకుండా వుంటుంది. ఇది అతిముఖ్యం. ఇంకా శోకం అనేది రాకుండా వుంటుంది. సుఖం వదలదు. శరీరం ఆరోగ్యంగా వున్నప్పుడు మళ్లీ సిరీ, సంపదా వాటంతటవే వస్తాయి. అసలు మనిషి జ్ఞానుడై, సాత్త్విక ప్రవృత్తిలో కనుక వుంటే, అతనికి ఐశ్వర్యమూ, ధైర్యమూ చేయవలసిన పనివల్ల నిశ్చయబుద్ధి వాటంతటవే కల్గుతాయి.

గనుక ముందుగా మనకు వుండవలసింది సాత్త్విక ప్రవృత్తి. అదివుంటే ఆత్మవిశ్వాసము, చేయవలసిన పనిపట్ల శ్రద్ధ ఏర్పడుతుంది.

**"నా తప్త తపసో లోకే ప్రాప్నువంతి మహా సుఖం**

**సుఖ దుఃఖేహి పురుషః పర్యాయేణో పసేవతే"**

**(మహాభారతం -113 అధ్యాయం)**

తపస్సు చేయనివారికి సుఖం కలుగదు. సుఖం తరువాత దుఃఖము, దుఃఖం తర్వాత సుఖము వస్తూనే వుంటాయి. ఎవరికీ అంతులేని సౌఖ్యము అంటూవుండదు. ప్రజ్ఞగల పురుషుడు మంచి మేధావి అయినవాడూ, బ్రహ్మవిద్య బాగా తెలిసినవాడు మాత్రమే ప్రపంచం ఎలా పుడ్తుంది, ఎలా పోతున్నది, ఎరిగినవాడు మాత్రమే పొంగిపోకుండా, క్రుంగిపోకుండా వుంటాడు. అయితే అతడు తనకు లభించిన సుఖం తృప్తిగా అనుభవిస్తాడు, వచ్చిన దుఃఖాన్ని భరిస్తాడు. తపస్సు వల్ల జ్ఞానం వలన బ్రహ్మజ్ఞానం లభిస్తుంది. తపస్సుకి అసాధ్యమైనది ఏదీ లేదు.

*(ఆంధ్రభూమి)*

# భగవన్నామ మహాత్మ్యం

భగవంతుని నామాలు జపించడానికి నియమాలు అంటు ఏమైనా వున్నాయేమో అని చాలామంది అనుకుంటూవుంటారు. కాని, నామస్మరణకు, నియమాలు అంటూ ఏవీలేవు. ఎన్నో రోజుల నుంచి అనారోగ్యంతో మంచంలో బాధపడే వ్యక్తి – "అయ్యో! నేను స్నానం చేయలేదే, నేను జపానికి, స్మరణకు, అర్హుడినవునో కాదో అని బాధపడవలసిన పనిలేదు." మరణం సమీపించినపుడు స్నానానికి ఆతనికి ఓపిక ఎక్కడుంటుంది? గనుక వీటన్నిటిని మరచి, నామ స్మరణలో లీనమవ్వాల్సి వుంటుంది. లేనియెడల సమీపబంధువు చెవిలో భగవన్నామం వినిపించడంగాని, భగవద్గీత, రామాయణం లాంటి గ్రంథాలు చదివి వినిపించవచ్చు. ఆ వినికిడిశక్తి వుంటే విని కొంతయినా శరీరబాధలు మరచి, ఆనందం పొందగల్గుతారు.

ఇంక మనం చేయకూడని పనులు కూడా విశదపరిచారు. సత్పురుషులను నిందించడం మహాపరాధం. కొంతమంది తెలిసి తెలియక నిందిస్తూ వుంటారు. అది ఎంతమాత్రం మంచిదికాదు. శివుడు, విష్ణువు వీరిరువురిని భేదభావంతో పూజించరాదు. శివుడు–విష్ణువు ఒక్కరే అని గ్రహించి భక్తి ప్రపత్తులను చూపాలి.

గురునింద మహాపరాధం. గురువును ఎప్పుడు కూడా చులకన భావంతో మాట్లాడడం, దూషించడం భావ్యంకాదు. తరువాత శ్రుతులను, శాస్త్రాలను, వేదాలనుగాని, వేద పఠనంగాని నిందించడం మహాపరాధం. కొంతమంది వేదాలు, శాస్త్రాలను బూటకమని వితండవాదం చేస్తుంటారు.

అది ఎప్పటికీ మంచిది కాదు. నీకు నమ్మకం లేకపోతే మౌనంగా వుండటం ఎంతో శ్రేయస్కరం. నామ మహిమ అంతా అసత్యమని వాదించడం, యవ్వనబలం, కామబలంతో, దుష్టపు పనులు చేయడం, చేసేవారిని ఇంకా

ప్రోత్సహించడం ఇవన్నీ కూడా నిషేధించాల్సిన విషయాలు. నాస్తికుడు, దైవం అంటే భక్తి, శ్రద్ధ, భయం లేనివారి ఎదుట నామ మహిమ గురించి చెప్పటం అవివేకం. వారి ఎదుట స్తోత్ర పాఠాలు తెలపడం నేరమే అవుతుంది.

అహంకారం, గర్వం, డంబం, మానవత్వం మరచిపోయి ప్రవర్తించడం, సంప్రదాయాలను ధిక్కరించడం, తాత్త్విక చింతన లేకపోవడం, తనకు మేలు చేసిన వారిని మరువటం, ఈ గుణాలన్నీ వున్నవారి నుంచి మనం దూరంగా తొలగిపోవడమే శ్రేయస్కరం.

భక్తుడు తన జీవితాన్ని ఒక క్రమశిక్షణలో పెట్టుకోవలసి వుంటుంది. ప్రవర్తన, నిర్దుష్టంగా వుండటం, అన్ని ఐహిక వాంఛలనూ దూరం చేసుకోవడం, నిర్మలత్వం, స్వచ్ఛత, సాటి మానవుల యందు ప్రేమ, భగవత్ సంకీర్తనలయందు ఆసక్తి, హరిదాసుల యందు వినయ, విధేయతలు, పురాణాలు, శాస్త్రాలు తెలుసుకోవాలనే ఆసక్తి ఇవన్నీ సద్గతికి, దారిచూపే సోపానాలు అని మనం గుర్తుంచుకోవాలి.

మనం నిత్యం ఇంటివద్ద పూజలో గంటను ఉపయోగిస్తాం. అలాగే ప్రసిద్ధ దేవాలయాలలో కూడా పైగంట వ్రేలాడగట్టి వుండటం, వాటిని మనం భక్తితో మ్రోగించటం తెలిసిన విషయమే. పూజాద్రవ్యాలతో పూలు, పండ్లు, అగరువత్తులు, నైవేద్యం, పసుపుకుంకుమ, తాంబూలం, కొబ్బరికాయ యిలాఅన్నీ ఎంత ముఖ్యమో పూజకు గంట కూడా అంతే ముఖ్యం.

గంటను తయారు చేయడంలో కంచు మూడు భాగాలు, ఒక భాగం ఇత్తడి కరిగించి మూసపోసి ఉపయోగిస్తారట. 16 అంగుళాల ఎత్తు, 16 అంగుళాల చుట్టుకొలత కడ్డీ లాంటి 3 అంగుళాలు వుండాలని పాంచరాత్ర సంహిత గ్రంథంలో తెలుపబడివుంది.

ఏయే సమయంలో గంటను ఉపయోగించాలి అనేది కూడా ఈ గ్రంథంలో తెలుపబడియుంది. "ఆవాహనేచ, పూజస్తే, పూజారంభే, విసర్జనే అర్ఘ్యే విలేపేన, స్నానే, దీపే, గన్ధాభిషేచనే, అభిషేకేచ, ధూపేచ నైవేద్యే, బలికర్మణీ, అన్యేషు సర్వకాలేషు మహా ఘంటాం, ప్రతాడయేత్" కారణాగమము పటలం.

దేవుని నిత్య పూజలో ఆవాహన సమయంలో పూజ మొదలయ్యేటపుడు, పూజముగించేటపుడు, అర్ఘ్యం ఇచ్చేటపుడు, గంధం అర్పించేటపుడు, స్నానం చేయించేటపుడు, అభిషేకం, నైవేద్యం చేసేటపుడు, బలిహరణం చేసే సమయంలో ముఖ్య ఉపచారాలు హారతి చేసేటపుడు గంటను తప్పకుండా ఉపయోగించాలి.

ఇక దేవాలయంలో తలుపులు తీసేటపుడు, అర్చన, ఆవాహన, అర్ఘ్యం స్నానం, అభిషేకం, పూలు, ధూపం, సమర్పించేటపుడు తెరదేవుని ముందరిది తీసేటప్పుడు, బలిహరణం అంటే దేవాలయం చుట్టూ బలికి నైవేద్యం అర్పించేటపుడు, జపం, సోమం మొదలైన కార్యక్రమాలు ప్రారంభించి సమాప్తమయ్యేటపుడు ఫలసిద్ధి కొరకు గంట మ్రోగించవలసి వుంది.

(ఆంధ్రభూమి మార్చి *11, 2004*

# మన హృదయం ఒక దేవాలయం

భక్తుని హృదయం - భగవంతుడు ఆసీనమయ్యే చావడి, ఆంజనేయ స్వామి తన వక్షస్థలాన్ని చీల్చి చూపితే రామచంద్రమూర్తి దర్శనం. ఈ సత్యం నిరూపించే ఎందరో భక్తులు మనకు దర్శనమిస్తుంటారు.

'పూశలార్' బసవేశ్వరుని భక్తుడు. ఎప్పుడూ శివధ్యానం చేస్తూ శివభక్తుల పరిచర్యలో మునిగి వుండేవాడు. అతనికి తన గ్రామంలో ఒక దేవాలయం నిర్మించాలని సంకల్పం కలిగింది. ఊర్లో అందర్నీ అర్థించాడు. తన కార్యంకాదు. దైవకార్యం అని గ్రామానికంతటికి మంగళకర కార్యమనీ, ఎంతో వినయంగా విన్నవించుకున్నాడు. అయితే ఎవరూ ముందుకు రాలేదు. పైగా చేతగానిపని మొదలు పెట్టడం దేనికి? అందర్నీ యాచించడం దేనికి? అని అతడిని ఈసడించారు. పుశలారుకి అంతులేని వేదన ముంచుకొచ్చింది.

దైవకార్యానికి గ్రామ ప్రజలు సహకరించటంలేదని చింతించాడు. తన సంకల్పం నేరవేరదా? దేవాలయ నిర్మాణం వృథా కావలసిందేనా అని మదనపడ్డాడు. ఈ అంతర్మథనంలో అతని జ్ఞాననేత్రం తెరచుకుంది. వివేకం మేల్కొన్నది. స్వార్థపరుల సహాయం రాతితో జడమైన దేవాలయాన్ని నిర్మించటం కన్నా తన దేహాన్నే హృదయంలో ప్రతిష్ఠించుకోవాలనుకున్నాడు. ప్రాకారం, కల్యాణ మండపం, గోపురం అన్నీ తనకు నచ్చిన రూపంలో ఆవాహనచేసి ప్రాణప్రతిష్ఠ చేయాలనుకున్నాడు.

అదే సమయంలో ఆ రాజ్యానికి చెందిన రాజుకు బ్రహ్మాండమైన దేవాలయం కట్టాలన్న ఆలోచన కలిగింది. వెంటనే కార్యరూపం దాల్చాడు. లింగ ప్రతిష్ఠకు వేదపండితులు సుముహూర్తం నిర్ణయించారు. అన్ని ఏర్పాట్లు పూర్తయినాయి. అదేరోజు రాత్రి ఒక అద్భుతం జరిగింది. స్వప్నంలో శివుడు రాజుకు దర్శనమిచ్చి నాయనా! ఎంతో శ్రద్ధతో ఆలయం నిర్మిస్తున్నావు. ఇది

నీ భక్తి భావాన్ని తెలుపుతోంది. చాలా సంతోషం. అయితే నా ప్రాణ ప్రతిష్ఠ అనేది కుదరదు. ఇదే ముహూర్తానికి నా భక్తుడు పుశలారు నిర్మించిన అపూర్వ ఆలయానికి వెళ్ళాలి. అతని అనితర సాధ్యమైన భక్తి, తత్త్వసూక్ష్మం చూచి నేను అతనిని ఆశీర్వదించాలి. ఆ ముహూర్తానికి నేను అక్కడ వుండి తీరాలి. అయితే నా ఆశీస్సులు నీ గుడికి తోడుగా వుంటాయి. స్వప్నంలో శివుని దర్శనం భ్రమ అని అనుకునే అవివేకి కాదు రాజు. శివుని మాటలు విని ఆశ్చర్యపోయాడు. ఎవరీ భక్తుడు? సాక్షాత్తు పరమేశ్వరునే బంధించగలిగిన, అంతటి శ్రద్ధాభక్తులా? అతనికి. సాక్షాత్తు పరమశివుడినే తనవద్దకు రప్పించుకుంటున్న ఆ అద్భుత దేవాలయాన్ని ఏవిధంగా నిర్మించాడు? లోకంలో వున్నటువంటి శ్రేష్ఠమైన శిలల్ని నిపుణులైన శిల్పుల్ని రప్పించి ఎంత ఖర్చుకైనా వెనుకాడకుండా నిర్మించిన తన దేవాలయానికి రాకుండా ఆ దేవాలయానికి వెళ్ళాలని నిర్ణయించుకోవటానికి గల మర్మం ఏమిటి? వెళ్ళి కళ్ళారా చూడవలసిందే అని రాజు నిశ్చయించుకున్నాడు.

అన్ని అనుష్ఠానాలు పూర్తి చేసుకుని భక్తుడు వున్న ఊరికి ప్రయాణమయ్యాడు రాజు. గ్రామస్తులు గౌరవంతో రాజుకు స్వాగతం పలికారు. మహారాజుకు ఆశ్చర్యం కల్గింది. దేవాలయ ప్రతిష్ఠ అంటే సందడిగా వుండాలి. ప్రజలందరూ భక్తితో ఎదురుచూడాలి. అలాటిది ఆ గుర్తులేమీ కనిపించడంలేదు. రాజుకు అనుమానం కల్గింది. మహాభక్తుడు పూశలారు ఉండే గ్రామం ఇదేనా? ప్రశ్నించిన రాజును గ్రామస్థులు ఆశ్చర్యంగా చూశారు. అదక్క అదక్క ఆ పిచ్చివాడి గురించి అడుగుతాడేమిటి? అని ఆశ్చర్యపోయారు. ఆయన కట్టించిన శివాలయం ఎక్కడో చూపండి అన్నాడు రాజు. గ్రామస్థులు ఇంకా నిర్ఘాంతపోయారు. చిల్లిగవ్వలేని బికారి వాడు - ఆలయం కట్టడమేమిటి మహారాజా! రాజుకు మతిపోయింది. మరి పరమేశ్వరుడే తనకు చెప్పాడు - భ్రమనా? అనుకున్నాడు. తనను ఆ భక్తుడి ఇంటికి తీసుకెళ్ళమన్నాడు.

శివారాధన తత్పరుడు పూశలారు పూజ మందిరంలో దివ్య వర్చస్సుతో ప్రకాశిస్తున్నాడు. విభూతి రేఖలతో అపర శివుడిలా కూర్చుని భక్తితో అర్చన చేస్తున్నాడు. రాజుకు అతడిని చూడగానే గౌరవాభిమానాలు కలిగాయి. గ్రామస్థులకు కూడా శ్రద్ధాభక్తులు కలిగాయి. పూజ సమాప్తి అయ్యాక రాజును చూశాడు భక్తుడు. నా కుటీరం పావనం చేసినందుకు ధన్యుడిని మహారాజా! గ్రామస్థులంతా రావటం అయోమయంగా ఉంది స్వామీ!

ఆశ్చర్యం నుంచి తేరుకొని మహారాజు భక్తుడికి నమస్కరిస్తూ మహాత్మా! గతరాత్రి పరమేశ్వరుడ్ని స్వప్నంలో దర్శించాను. తాము మహాభక్తులని, అపూర్వ శివాలయం నిర్మించారని, ఆలయ గర్భగుహలో ఈనాడే ప్రాణప్రతిష్ఠ అని తెలిపారు. తాము ఇక్కడ ప్రతిష్ఠింపబడుతున్నా నన్నారు. నేను కట్టించే ఆలయంలో తాను వుండటం కుదరదన్నాడు. అ పరమశివుడే స్వయంగా వచ్చి చేరే మీ దేవాలయం దర్శించటానికి వచ్చాను అన్నాడు రాజు. ఎక్కడ ఆ దేవాలయం? ఊరికి దూరంగా వుందా? ప్రశ్నించాడు రాజు. శివభక్తుడు కళ్ళు మూసుకొని పరమశివుని ధ్యానిస్తూ తిరిగి కళ్ళు తెరచి 'ఎంత అమాయకులు రాజా మీరు! నా హృదయ కుహరంలో అపూర్వ కాంతితో వెలిగిపోతున్న ఆ చిన్మయమూర్తిని ఏకాగ్రతతో దర్శించండి స్వామీ! అన్నాడు ఆనందంగా.

రాజుకు, అక్కడ చేరిన ప్రజలకు జ్ఞానోదయమైంది. చూస్తుండగానే ఆ భక్తుడి హృదయపద్మంలో జ్యోతిరూపంగా దర్శనమిచ్చాడు పరమశివుడు. నందితోసహా ఆలయంలో వుండేవన్నీ కళ్ళకు కనిపించాయి. విశ్వకర్మ నిర్మించిన అమరావతి మీదికి సొగసులన్నీ ప్రత్యక్షమయ్యాయి. భక్తుడి హృదయంకన్నా ప్రేమతో నిండిన చైతన్యంతోకన్నా పరమేశ్వరునికి ప్రియమైన గది మరోటి లేదని తెలుసుకున్నారు. భక్తులకు కులమత లింగ భేదాలు లేవు. అందరి హృదయాలలో స్వామి గుడి కట్టుకొని వున్నాడు అని గ్రామ ప్రజలు, రాజు తెలుసుకుని ఆ మహాభక్తుడికి నమస్కరించి సెలవు తీసుకున్నారు.

*(ఆంధ్రభూమి ఏప్రిల్ 8, 2006)*

# కాంతివృత్తం

తెలుగువారందరూ జరుపుకునే పండుగ - సంబరాల సంక్రాంతి. సబ్దానినబట్టి 'సంక్రాంతి' అనే పదానికి ఉజ్జ్వలమైన వెలుగు 'మార్పు' అని అర్థాలున్నాయి. కాంతితో కూడుకున్న ఈ పండుగను సంక్రాంతి అంటారు. ఈ పండుగకు జ్యోతిషశాస్త్రానికి కూడా దగ్గర సంబంధం వుంది. రెండు నెలలకు ఒక ఋతువు చొప్పున వసంత, గ్రీష్మ, వర్ష, హేమంత, శిశిర, శరదృతువు ప్రకృతిలో, వాతావరణంలో వచ్చే మార్పులను బట్టి నిర్ణయించబడి వుంటుంది. ఏ ఋతువుధర్మం ఆ ఋతువుదే ప్రకృతికి సంబంధించిన దేవతలను ఆరాధించడం ఆర్యుల కాలంనుంచీ కూడా మనకు ఆచారంగా వస్తోంది.

భూమి తన అక్షంపై తన చుట్టూ తాను తిరుగుతూ సూర్యునిచుట్టూ తిరుగుతోంది. ఈ కారణంవల్ల సూర్యుడు ఉదయించడం, క్రమంగా ఆకాశంలో పయనించడం తర్వాత అస్తమించడం చూస్తాము. ఈ చలనం వల్లనే రాత్రింబవళ్లు ఏర్పడుతున్నాయి. సూర్యుడు ఆకాశంలో ప్రయాణంచేసే వలయాకార మార్గానికి 'కాంతివృత్తం' అని పేరు. ఈ మార్గంలోనే నక్షత్రాలతో కూడిన రాశి చక్రం వుంది. ఈ రాశి చక్రాన్ని తమకు అనుకూలంగా, మేషం, వృషభం మొదలైన పన్నెండు రాశులుగా శాస్త్రవేత్తలు ఏర్పరిచారు. ఖగోళశాస్త్ర ప్రకారం సూర్యుడు తన చలనంలో ఒక రాశి నుంచి మరో రాశిలోకి ప్రవేశించడమే 'సంక్రమణం'. ఇలా సూర్యుడు క్రమంగా మేష వృషభ రాశులలో సంచరిస్తూ పూర్వరాశి నుంచి ఉత్తరాభిముఖుడైనపుడు మకర సంక్రమణం వస్తోంది.

పల్లె సీమల్లో రైతులు, తమకు పొలాల్లో పండిన కొత్త ధాన్యాన్ని ఇంటికి తెచ్చుకొని గాదెలు నింపుకొని, సంక్రమణం రోజున ధాన్యలక్ష్మి పూజను జరుపుకుంటారు.

సూర్యుడి గమనంలో పెద్ద మార్పు సంక్రాంతిరోజే ప్రారంభమవుతుంది. పితృదేవతలకు శాస్త్రప్రకారంగా తర్పణం విడుస్తారు. అలా చేస్తే పెద్దలకు సద్గతులు కల్గుతాయని శాస్త్రాలలో పేర్కొనబడింది. ఆబాల గోపాలం ఆనందించే సంక్రాంతి పండుగ పూర్వంనుంచి జరుపబడుతోందని పురాణాలలో పేర్కొన్నారు. మనందరం సంక్రాంతి పండుగకు స్వాగతం పలుకుదాం.

# సంపూర్ణ శరణాగతి

భగవద్గీతలో శ్రీకృష్ణ భగవానుడు సర్వ ధర్మాన్ పరిత్యజ్య - మామేకం శరణం వ్రజ - అహంత్వా సర్వ పాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః సమస్త ధర్మాలు విడిచిపెట్టి నన్నొక్కని మాత్రమే శరణుపొంది. నేను సమస్త పాపాలనుండి నిన్ను విముక్తిడిని చేస్తాను. దీనినే సంపూర్ణ శరణాగతి అంటారు. దీనినే, జాతి, మత, కుల, భేదాలు లేకుండా విశిష్ట అద్వైత మతాన్ని స్థాపించిన వారు రామానుజాచార్యులు. ఇతని గురువు యామునాచార్యుడు. శ్రీవైష్ణవ ధర్మంలో భగవంతుని సేవకన్నా, గురువు సేవే గొప్పది. ఇతడు బాల్యంలోనే కాశీకి వెళ్ళి, వ్యాసులవారు రచించిన బ్రహ్మ సూత్రాలకు వ్యాఖ్యానం రచించారు. దీనినే శ్రీభాష్యం అంటారు. ఇవేగాక, వేదార్ధ సంగ్రహం, వేదాంతసారం, శరణాగతి గద్య, శ్రీరంగ గద్య ఇంకా చాలాచాలా గ్రంథాలు వ్రాశారు.

వీరు ఆ కాలంలోనే అంటే 1098 లోనే మహాత్మాగాంధీ మాదిరి అంటరానితనాన్ని నిషేధించారు. దైవభక్తులందరూ ఆలయ ప్రవేశానికి అర్హులే అని అందరికి దేవాలయ ప్రవేశం చేయించారు. తిరునారాయణస్వామి అనే ఉత్సవ విగ్రహం ఢిల్లీ సుల్తానులు దోచుకొని వెళ్ళారు. మాలదాసరుల సహాయంతో ఆ విగ్రహాన్ని శ్రీ రామానుజులవారు ఢిల్లీ నుంచి తెప్పించారు. వారు సహాయం చేసినందుకుగాను, బ్రహ్మోత్సవాలలో వారికి ప్రత్యేక దర్శనం కల్పించారు. విష్ణుచిత్తుని కుమార్తె గోదాదేవి, రంగనాధుని ప్రేమించి ఎలా వివాహమాడిందో, ముస్లిం రాజ కుమార్తె బీబీ నాచ్చియార్ ప్రేమ కూడా అలాటిదేనని, ప్రేమకు, కులమతాల తేడా లేదని నాచ్చియార్ విగ్రహాన్ని శ్రీరంగం లోని రంగనాధ దేవాలయంలో ప్రతిష్ఠింప జేశాడు. కులంకంటే గుణం ప్రధానం అన్న వీరి నమ్మకంతో గొల్లవాని భుజాన్ని ఆసరా చేసుకొని మెట్లు ఎక్కి వచ్చేవాడు.

ఒక చాకలివాడు శ్రీరంగనాథ స్వామిని అలంకరంచే పట్టు పంచెలు, వైష్ణవ పూజారులు ధరించే వస్త్రాలు, చక్కగా ఉతికి ఇస్త్రీ చేసి తెచ్చేవాడు. శ్రీరామానుజులవారు ఇతని సేవ, శ్రద్ధ చూసి ఆనందించి శ్రీరంగనాథుని ఆలయానికి తీసుకొనివెళ్ళి దైవ అనుగ్రహాన్ని కల్పించారు. వయసుతో, కులంతో పనిలేని, శ్రద్ధ, భక్తి ముఖ్యమని, అందరికీ చాటిచెప్పి, అందరినీ భగవత్ కృపకు పాత్రుని చేసేవారు. ఇతరులు దుఃఖంలో ఉంటే, వారి దుఃఖాన్ని పోగొట్టడానికి శాయశక్తులా పాటుపడేవారు. సరళస్వభావం, ఆమోఘమైన తపశ్శక్తి నిర్మల మనస్తత్వం, విశిష్టమైన వ్యక్తిత్వం వీరిని అందరూ తమ గురువుగా భావించేవారు.

వీరు ప్రతి దేవాలయంలో సుప్రభాతసేవ మొదలుకొని, రాత్రి పరుండే ఏకాంత సేవ వరకు దేవునికి చేయవలసిన పూజలు, నైవేద్యాలు, ఉత్సవాలు బ్రహ్మోత్సవాలు అర్చక స్వాములదే, ఎలా ఎలా జరుపబడాలి, అన్నీ నిర్దుష్టంగా తెలియపరిచి, ఆ కాలంలోనే డెబ్బై ఎనిమిది పీఠాలను ఏర్పాటుచేసి తన శిష్యులను, ఆయా పీఠాలకు అధిపతులుగా నియమించారు. ఈయన, లోక కల్యాణం కోసం, దేవాలయ గోపురంపైకెక్కి అష్టాక్షరీ మంత్రాన్ని అందరికీ ఉపదేశించాడు. ఈ పనిని గురువు యామునాచార్యులు మంత్రరహస్యం అందరికీ చెప్పకూడదు అని అభ్యంతరం తెలిపారు. అయినా వీరు లెక్కచేయకుండా దుఃఖంతో తపిస్తున్న ప్రజలకు మోక్షంవస్తే అంతేచాలు, నాకు ఒక్కడికి నరకం వచ్చినా ఫరవాలేదు అంటాడు.

గురువు యామునాచార్యులు తన తప్పిదం తెలుసుకొని నా క తెరిపించావు అని రామానుజార్యుల విశాల హృదయాన్ని చూసి మెచ్చుకొని, ఆలింగనం చేసుకొని కంటనీరు పెడ్తాడు. నా జీవితమే నా సందేశం అని భీష్మాచార్యుల మాదిరి వీరికి స్వచ్ఛంద మరణమా అనేట్లుగా నూట ఇరవై సంవత్సరాలు జీవించి, తాను చేసే పనులన్నీ పూర్తి చేసుకొని 1,127 సం॥

పరమపదం చేరుకొన్నారు. ఈనాటికీ రామానుజాచార్యులు ఏర్పాటుచేసిన నిత్యపూజలు అందరు అర్చకులు ఆలయాలలో ఆచరిస్తున్నారు.

**రామానుజాచార్య దివ్యాజ్ఞా**
**ప్రతివానర యుజ్జ్వలా**
**దిగంత వ్యాపినీ భూయాత్**
**సాహి లోక హితైషిణీ -**

ఇలా వీరు లోకహితం కోసం ఎన్నో కార్యాలు చేపట్టి ప్రసిద్ధి పొందారు. భక్తులందరిదీ ఒకే కులం అనేదే వీరి మతం.

*(ఆంధ్రభూమి)*

# గురుకృప - 3

అమరావతి నగరంలో దేవేంద్రుడు సమస్త దేవగణాలతో కొలువుతీరి వున్నాడు. అప్సరసలు చేసే నాట్యాన్ని చూసి ఆనందిస్తూ వున్నాడు. ఆ సమయంలో ఇంద్రుని ప్రక్కన శచీదేవి కూడా వుంది. ఆ సందర్భంలో దేవతల గురువైన బృహస్పతి ఆ కొలువులోకి ప్రవేశించాడు. ఇంద్రుడు ఆయనను చూసి కూడా చూడనట్లు, అతిథికి చేయవలసిన సత్కార్యాలు చేయకుండా నిర్లక్ష్యం వహిస్తాడు. పదవీ వ్యామోహం, దానివలన కలిగినటువంటి గర్వము, అహంకారము, ఆడంబరము మానవులకు సహజమే. కాని దేవేంద్రునికి ఇది తగని పని. బృహస్పతి తక్షణమే వెనుకకు తిరిగి తన నివాసానికి వెళ్ళిపోయాడు.

రంభ, ఊర్వశి, తిలోత్తమ తదితర అప్సరసలు తమ నాట్యం పూర్తయిన తర్వాత ఇంద్రుడు ఈ లోకానికి వచ్చాడు. తాను చేసిన తప్పు తెలుసుకున్నాడు. వెంటనే గురువు పాదాలమీద పడి క్షమాపణ కోరి ఆయనను ప్రసన్నుడిని చేసుకోవాలనే ఆలోచనతో గబగబ బయలుదేరాడు. ఇది తెలుసుకున్న బృహస్పతి తన యోగ ప్రభావంతో మాయమయ్యాడు. గురు నివాసానికి వెళ్ళి ఆయనను దర్శించుకోలేక ఇంద్రుడు సిగ్గుతో విచారంతో తిరిగి వస్తాడు.

ఈ విషయం రాక్షసులకు తెలిసింది. శిష్యుల మంచి చెడ్డలకు గురువే బాధ్యుడు. గురువు అనుగ్రహం పొందితే లోకంలో అసాధ్యమనేది ఏదీ లేదు. బృహస్పతి అనుగ్రహం వల్లనే ఇంతకాలమూ, రాక్షసులను ఇంద్రుడు జయిస్తూ వచ్చాడు. అయితే ఇంద్రునిలో ఐశ్వర్య మదం పెరిగి గురువు తమపై చూపుతున్న దయ, వాత్సల్యము విస్మరించి ఇంద్రునికి గుణపాఠం చెప్పాలనే బృహస్పతి అంతర్ధానమయ్యాడు.

గురువు అనుగ్రహానికి దేవతలు దూరమయ్యారని గ్రహించి మరుక్షణమే దానవులు అమరావతిని ముట్టడించారు. అతి సునాయాసంగా దేవతలను

ఓడించారు. ఎప్పుడైతే దేవతలు దానవుల చేతిలో ఓడిపోయారో అప్పుడు వారు బ్రహ్మదేవుని శరణుజొచ్చారు.

బ్రహ్మ దేవతలకు అభయమిస్తూ – సున్నితంగా మందలించాడు. మీరు పుట్టినప్పటి నుంచి పెంచి, పెద్దచేసి మూడు లోకాలకు ఇంద్రుని రాజును చేసి ఆనందించిన కృపామూర్తిని, బ్రహ్మవేత్త అయినటువంటి బృహస్పతిని అవమానించి, నిర్లక్ష్యం చేశారు. అతి బలవంతులైనటువంటి మిమ్మలను దానవులు జయించటం, వారి గురువు శుక్రాచార్యుని ఆరాధించి, ఆయన అనుగ్రహానికి పాత్రులు కావడంతోనే ఇప్పుడు మీరు ప్రజాపతి కుమారుడైన విశ్వరూపుని గురువుగా పూజించండి. మీ కోర్కె నెరవేరుతుంది. ఆయనను భక్తితో సేవించండి అని సలహా ఇస్తాడు. విశ్వరూపుడు వారి కోర్కెను మన్నించి వారికి గురువుగా వుండటానికి సమ్మతించాడు.

ఈ విశ్వరూపునికి మూడు శిరస్సులు. ఒక శిరస్సుతో సురాపానము, రెండవ శిరస్సుతో సోమపానము, మూడవ శిరస్సుతో అన్నపానాలు చేస్తూ వుండేవాడు. 'రచన' అనే రాక్షస వనిత ఈ విశ్వరూపుని తల్లి. మాతృపక్షం అంటే తల్లివైపు వారైన రాక్షసులపై ఈతనికి అభిమానం ఉన్నప్పటికీ కూడా త[illegible]వచ్చి గురువుగా అర్థించిన దేవతలకు అతడు మేలు చేయడానికే స[illegible]ాడు. దేవేంద్రునికి 'నారాయణ కవచము' అనే మహా మంత్రాన్ని ఉ[illegible] డు. శత్రువులను సంహరింపచేసే ఆ మహామంత్ర ప్రభావం వలన ఇంద్రుడు దానవులపై దండెత్తి విజయం సాధించాడు.

అధ్యాపకుడు అయిన గురువు బృహస్పతి కూడా దయతలచి సహాయపడి తిరిగి ఇంద్రునికి రాజ్యాధిపత్యం వహింపచేశాడు. 'గు' అంటే అంధకారాన్ని, 'రు' అంటే నిరోధించేవాడు – కాబట్టి అంధకారాన్ని తొలగించి, మనకు జ్ఞానదీపాన్ని వెలిగించేవాడే నిజమైన గురువు. ప్రతి ఒక్కరి జీవితంలో గురువుకు ప్రత్యేకమైన స్థానం వుంటుంది. తల్లి, తండ్రి, గురువు వీరి ముగ్గురిని గౌరవించి

పూజించాలి. అంతేకాకుండా గురువుకు 'తిరోధాన' అనుగ్రహ శక్తి అనేది వుంటుంది. తిరోధానం అంటే శిష్యులందరిలో సమంగా వ్యాపించి వుండటం. అనుగ్రహం అంటే ఇది తప్పు - ఇది ఒప్పు అని, కులమత, ధనికపేద సంబంధం లేకుండా తనను ఆశ్రయించిన వారినందరినీ సమానంగా చూడటం. ఈ గుణాలన్నీ పరిపూర్ణంగా మూర్తీభవించిన గురువే దైవ సమానుడు, పూజనీయుడు.

**శరీరం సురూపం తథా వా కళత్రం**

**ధనం మేరుతుల్యం, యశశ్చారు చిత్రం**

**గురో రంఘ్రి పద్మే మనశ్చేర్న లగ్నం**

**తతఃకిం, తతఃకిం తతఃకిం తతఃకిం**

ఆదిశంకరులవారు చెప్పినట్లు గురువులేని జీవితం వ్యర్థం.

*(ఆంధ్రభూమి ఆగష్టు 7, 2006)*

# సత్యపాలన

భారతీయ సంస్కృతిలో సత్యం అనేది ఒక ధర్మం. 'సత్యము' అంటే ఏమిటి? ఉన్నది ఉన్నట్లుగా చెప్పడం. సత్యానికి మించిన మంచి గుణం మరోటి లేదు. సత్యం దైవ స్వరూపం. సత్యం పలికేవారిని ప్రజలంతా గౌరవిస్తారు. అతనిపై పూజ్యభావం, విశ్వాసం కలుగుతుంది. సత్యాన్ని పలకమని వేదశాస్త్రాలు ఘోషిస్తున్నాయి.

రామాయణంలో వాల్మీకి అందించిన ఈ శ్లోకంలో -

**'సత్యమేక పదం - బ్రహ్మ - సత్యేధర్మః ప్రతిష్ఠతః**
**సత్యమేవా క్షయావేద - స్యత్యేనైవాక్ స్యత్యేపరమ్'**

సత్యమంటే భగవంతుడు. సత్యములోనే ధర్మం ప్రతిష్ఠింపబడి వుంది. వేదరాశి అక్షయమైన సత్యస్వరూపమైనది. సత్యము వల్లనే పరలోకాలు సిద్ధిస్తాయి. గనుక సత్యాన్ని ఆరాధించండని రామాయణం స్పష్టం చేస్తోంది.

విదుర నీతిలో - వృద్ధులు లేనిదే సభ కాదని ధర్మం చెప్పకపోతే వాళ్ళు వృద్ధులే కాదని, ఎందులో సత్యం వుండదో అది ధర్మం కాదని ఎంతో బలంతో అంగీకరింపబడింది.

సత్య స్వరూపాన్ని బాగా తెలుసుకొని పరిపాలించాలి. సత్యరహితమైన ఏ పనైనా వ్యర్థమే అవుతుంది. సత్యం యొక్క ధర్మసూక్ష్మము పరోపకారానికి సంబంధించినదై వుండాలి. ఇతరులకు నష్టం కలిగించేదైతే అది అసత్య ఫలాన్నిస్తుందని ధర్మశాస్త్రం చెబుతోంది.

సత్యం పల్కటం శ్రేయస్కరం. దానికంటే ఇతరుల హితమే ఇంకా శ్రేష్టమైనది.

రామాయణంలో అయోధ్యకాండలో శ్రీరాముడు రథంపై సీతాలక్ష్మణ సమేతంగా వెళ్తుంటాడు. సుమంతుడు రథాన్ని నడుపుతూ వుంటాడు. ఆ సమయంలో - దశరథుడు రామ వియోగాన్ని భరించలేక, కైకేయి వుండే అంతః

పురం నుంచి తాను బయటకువచ్చి, దుఃఖముతో 'రామా! ఆగు, ఆగు' అంటాడు. అపుడు సుమంతుడు రథాన్ని అపడానికి ప్రయత్నిస్తాడు. శ్రీరాముడు వెంటనే 'ఆపవద్దు పోనీ' అంటాడు సుమంతుడు, నేను రాజుకు ఏమి సమాధానం ఇచ్చేది అని ఆలోచిస్తుండగా శ్రీరాముడు ఇలా అంటాడు.

"నా శ్రౌషమితి రాజా సముపాలబ్ధోపి వక్షపి" అని సుమంతునితో చెప్పమంటాడు. అంటే మాట వినపడినా కూడ వినపడలేదని చెప్పడం అని అర్ధం. ఇది అసత్యం కాదా - రాముడు ఆవిధంగా చెప్పటం దోషం కాదా అంటే ఇందులో మహత్తర ధర్మసూక్ష్మం ఇమిడి వుంది. అదేమంటే దశరథుని పల్కులు విని, రాముడు - వెనుకకు మరలి వెళ్ళాడనుకుంటే - దశరథుడు రామునిపైగల పుత్ర ప్రేమచే అరణ్యానికి వెళ్ళవద్దని చెప్తాడు. అట్లయితే దశరథునికి అసత్య దోషం వస్తుంది. రాముడు ఆయన మాట విని వెళ్ళకపోతే కూడ అసత్య దోషం వస్తుంది. అప్పుడు ఇద్దరికీ అసత్య దోషాలు చుట్టుకుంటాయి. ఈవిధంగా సూక్ష్మం గనుక గ్రహిస్తే సుమంతునికి రథ శబ్దంలో దశరథుని మాటలు వినపడలేదని చెప్తే అసత్య దోషం రాదు. శ్రీరామునికి, దశరథునికి వచ్చు దోషముకన్నా ఈ అసత్య దోషము పెద్దదికాదు. దీనివల్ల ఉపకారమే జరిగింది అని రాముడు భావిస్తాడు. శ్రీరామునికి ఇక్కడ పరహితం ముఖ్యం అని భావించాలి.

మరొక ఉదాహరణ - సీతాదేవిని రావణుడు అపహరించుకొని పోయినప్పుడు, ఆమెను వెదుకుతూ హనుమంతుడు లంకకు వెళ్ళి, సీతాదేవితో సంభాషిస్తాడు. అశోకవనాన్ని ధ్వంసం చేస్తాడు. అపుడు కావలివున్న రాక్షస వనితలు - సీతతో "నీతో మాట్లాడిన ఆ వానరుడు ఎవరు?" అని ప్రశ్నిస్తారు. అప్పుడు సీత వారితో "భయంకరమైన మాయరూపములు మార్చే రాక్షసుల గురించి నాకేమి తెలుసు? రాక్షసుల మాయలు రాక్షసులకే తెలియాలి' అని జవాబిస్తుంది. ఇక్కడ ధర్మసూక్ష్మం ఏమిటంటే - తాను నిజం గనుక చెప్తే హనుమంతుడు రామదూతగా వచ్చాడని రావణుడు తెలుసుకొని ఆంజనేయునికి అపకారం చేస్తాడనుకొని, ఆ వచ్చిన వాడెవడో తనకు తెలియదని చెప్తుంది. ఇందులో అసత్య దోష లేదు. ఇతరుల హితము ఇక్కడ ముఖ్యమని మనం గ్రహించాల్సి ఉంటుంది.

సత్యంలో ధర్మం ప్రతిష్ఠించబడి ఉంది. భాగవతంలో బలిచక్రవర్తితో రాక్షస గురువైన శుక్రాచార్యుడు ఇలా చెప్తాడు -

**వారిజాక్షులందు, వైవాహికములందు**
**ప్రాణ విత్తమాన భంగమందు**
**జలిత గోకులాగ్ర జన్మ రక్షణమంది**
**బొంకవచ్చు నఘము బొంద దధిప (భాగవతం)**

ఆడవారియందు, పెండ్లి కార్యాలందు, ప్రాణాపాయమందు, మానభంగము కల్గు సమయంలో, భయపడిన గో సమూహమును, బ్రాహ్మణులను కాపాడుటయందు బొంకిన పాపము లేదని అర్ధం.

**యత్కర్మ కుర్వతో సస్యాత్**
**పరితోషోస్త రాత్మనః**
**తత్ర్పయత్నేన కుర్వీత**
**విదరీతంతు - వర్జయేత్ (మనుస్మృతి)**

ఏ ధర్మము ఆచరించుటచే మనస్సుకు తృప్తి కలుగుతుందో - ఆ ధర్మాన్ని ఆచరించాలిగాని, మనశ్శాంతిని కల్గించని ధర్మము ఆచరించ అవసరం లేదని మనుస్మృతి చెప్తోంది. కాబట్టి సత్యములో వుండే ఈ ధర్మసూత్రాన్ని గ్రహించి, లోక కల్యాణం కొరకు ప్రతి ఒక్కరూ పాటుపడాలి.

*(ఆంధ్రభూమి దిన పత్రిక)*

# పినాకం-కోదండం-గాండీవం-మురళి

ఒకనాడు బ్రహ్మదేవుడు తన హంస వాహనంపై మేరుపర్వతం మీదుగా ప్రయాణిస్తున్నాడు. అప్పుడే సూర్యోదయమవుతోంది. సంధ్య వార్చే సమయం. తన హంస వాహనం క్రిందకు దిగమని, చేతితో దాని రెక్కలు నిమిరాడు. ఆయన భావం అర్థం చేసుకున్న రాజహంస తగిన ప్రదేశం చూసుకుని మెల్లగా దిగింది.

చక్కని సెలయేరు. అల్లుకుపోయిన చెట్లు. మీదుగా లతలు. చాలా సుందరంగా ఉంది. తన హంస వాహనం దిగి కమండలం ఒడ్డున ఉంచి స్నానం కోసం సెలయేటిలో దిగాడు.

సరిగ్గా ఆ సమయంలో – ఆ ప్రాంతంలోనే తిరుగుతున్న 'కిమ్మీరుడు' అనే రాక్షసుడు బ్రహ్మదేవుడిని ఒడ్డున ఉన్న హంసని, నీరెండలో మెరుస్తున్న బంగారు కమండలాన్ని చూశాడు. నెమ్మదిగా చప్పుడు చేయకుండా వెనుకవైపు నుంచి వచ్చి దండ కమండలాన్ని సంగ్రహించి పారిపోయాడు. అది చూచిన రాజహంస అరవటం మొదలుపెట్టింది. సూర్యుడికి అర్ఘ్యం ఇస్తున్న బ్రహ్మకు ధ్యానభంగం అయింది. ఆయనకు పరుగెత్తుకుంటూ పోతున్న రాక్షసుడు కనిపించాడు. త్వరత్వరగా ఒడ్డుకువచ్చి హంసను అధిరోహించి ఆ రాక్షసుని తరమటం మొదలుపెట్టాడు. ఈలోగా హంస వాడిని సమీపించి, తన పాదాల్లో ముందుకు తోసింది. ఆ తోపుకు రాక్షసుడు క్రిందపడ్డాడు. వెంటనే బ్రహ్మ క్రిందికి దిగి కిమ్మీరుడి జుట్టు పట్టుకొని క్రింద పడవేశాడు. క్రిందపడ్డ వాడి ఛాతీపై తన కుడిచేతితో నోట్లో నుంచి రక్తం వచ్చేలా అదిమాడు. రాక్షసుని నోట్లో నుంచి రక్తం ధారగా కారింది. ప్రాణభయంతో రాక్షసుడు బ్రహ్మకు నమస్కరిస్తూ – 'బ్రహ్మదేవా! బుద్ధి చపలతతో నేను చేసిన మహా అపరాధాన్ని మన్నించండి. ఈ సృష్టిలో అన్ని ప్రాణులకు కర్తవైన మీరు నాకు తండ్రితో సమానం. ఏ తండ్రైనా తన పిల్లలు చేసే తెలివిమాలిన పనులను క్షమిస్తాడు. దయచేసి నన్ను క్షమించండి' అని అనేకవిధాల స్తోత్రం చేస్తూ – బ్రహ్మ పాదాలకు

నమస్కరిస్తాడు. దయా హృదయంగల బ్రహ్మ వాడి ప్రార్థనకు శాంతించి, శపించకుండా వదలిపెట్టాడు. రాక్షసుడు భూమిలో త్రవ్వి దాచిపెట్టిన దండ, కమండలాన్ని వదిలిపెట్టేసి వెళ్ళిపోయాడు. బ్రతుకుజీవుడా అని రాక్షసుడు అక్కడనుంచి పాతాళానికి పారిపోయాడు. అయితే బ్రహ్మ తన సృష్టి కార్యక్రమంలో పడి దండ, కమండలం మాటే మరచిపోయాడు.

రాక్షసుడు దండ, కమండలం పాతినచోట ఒక వెదురు మొక్క, దానిప్రక్కనే ఒక తీగ పెరగడం మొదలుపెట్టింది. రెండు మొక్కలు బంగారు రంగులో మెరిసిపోతూ పొడుగ్గా పెరగసాగాయి. అవి రోజురోజుకు విపరీతంగా పెరిగిపోతుంటే సూర్య భగవానునికి ఆశ్చర్యమేసింది. దివ్యదృష్టితో చూశాడు. అవి బ్రహ్మ దండ, కమండలం అని తెలుసుకుని అటువంటి పవిత్ర వస్తువులు వృథా కారాదని, ఆ విషయం బ్రహ్మదేవునికి గుర్తు చేశాడు.

బ్రహ్మ వెంటనే వచ్చి చూసి నిశితంగా ఆలోచించి దేవశిల్పి విశ్వకర్మను పిలిపించాడు. విశ్వకర్మ బ్రహ్మదేవుని ఎదుట నిలబడి నమస్కరించాడు. బ్రహ్మ 'విశ్వకర్మా! ఈ లతా వృక్షాలు రెండు కూడా ఎంతో మహిమగల నా దండ, కమండలాలకు ప్రతి రూపాలు. వీటిని లోకకల్యాణానికి ఉపయోగపడేలా, నీకు తోచిన వస్తువుల్ని తయారుచెయ్యి' అని అజ్ఞాపిస్తాడు. విశ్వకర్మ మూడు ధనుస్సులు, మూడు అమ్ములపొదలు తయారుచేశాడు. లతను ధనుస్సులకు నారగా అమరుస్తాడు. కొంచెం ముక్క మిగిలితే ఒక మురళిని తయారుచేస్తాడు. అవి బ్రహ్మకు సమర్పిస్తాడు. బ్రహ్మ అగ్నిదేవుని స్తోత్రిస్తాడు. అగ్ని ఎదురుగా వచ్చి బ్రహ్మకు నమస్కరిస్తాడు. అతనికి బ్రహ్మ గాండీవాన్ని, అక్షయ తూణీరాల అమ్ములపొదిని అందజేశాడు. 'ఓ అగ్ని దేవా! ద్వాపరయుగంలో నరనారాయణులు, కృష్ణార్జునులుగా అవతరించి లోక కళ్యాణం కోసం దుష్టులను సంహరిస్తారు. అర్జునునికి గాండీవాన్ని, అక్షయ తూణీరాన్ని అందియ్యి. నీకు శుభం కల్గుతుంది' అని ఆశీర్వదిస్తాడు. స్వాహాప్రియుడు సమ్మతించి అంతర్ధానమయ్యాడు. ఖాండవ దహన సమయంలో తనకు సహాయపడినందుకు కృతజ్ఞతగా అగ్ని, గాండీవాన్ని, అక్షయ తూణీరాన్ని అర్జునునకు కానుకగా అందజేశాడు. వాటని స్వీకరించి అర్జునుడు గాండీవి అయ్యాడు.

విశ్వకర్మ నిర్మించిన మొదయి ధనుస్సు 'పినాకము'. దానిని ఈశ్వరునికి కానుకగా అమ్ములపొదితో సహా అందించాడు. ఈశ్వరుడు దానిని ఆనందంగా స్వీకరించి బ్రహ్మను గాఢాలింగనం చేసుకున్నాడు. ఆరోజు నుంచి పశుపతి 'పినాకపాణి' అయ్యాడు.

విశ్వకర్మ నిర్మించిన మరొక వస్తువు 'కోదండం' అనే పేరుగల ధనుస్సు. బ్రహ్మ దేవేంద్రుని తలచుకున్నాడు. దేవేంద్రుడు రాగానే 'ఇంద్రా! ఈ దివ్య ధనుస్సు త్రేతాయుగంలో, రాక్షస సంహారంకోసం శ్రీమన్నారాయణుడు, భూలోకంలో రామచంద్రునిగా అవతరిస్తాడు. ఆ పురాణ పురుషునికి ఈ కోదండం అందజెయ్యి' అంటాడు. ఇంద్రుడు ధనుర్బాణాలతో అంతర్ధానమవుతాడు. బ్రహ్మ ఆజ్ఞ ప్రకారం - ఇంద్రుడు నారాయణుడు రామావతారం దాల్చినపుడు సీతాలక్ష్మణులతో వనవాసానికి వెళ్ళినపుడు అగస్త్య మహర్షి ఆశ్రమాన్ని దర్శించిన సమయం ఇంద్రుడు వృద్ధ బ్రాహ్మణుని వేషంలో వచ్చి కోదండాన్ని, అమ్ములపొదిని అందజేస్తాడు. దానిని స్వీకరించి శ్రీరాముడు 'కోదండపాణి' అయ్యాడు.

ఇక మురళి మాత్రం మిగిలింది. కృష్ణుడు బృందావనంలో గోపబాలురతో ఆలమంద మేపుతున్నాడు. బ్రహ్మ వినోదంకోసం కొండగుహలో వారిని దాచాడు. కృష్ణుడు ఇది బ్రహ్మ మాయ అని తెలుసుకొని ఏమీ తెలియనివాడిలా ఆలమందను, గోపబాలురను ప్రతిసృష్టిచేసి తనతో తీసుకొని వెళ్తాడు. బ్రహ్మ పదిహేను రోజులు కొండగుహలో ఆలమందలను, గోపబాలురను దాచాడు. అయినా కృష్ణుడు లొంగలేదు. బ్రహ్మ కృష్ణుని శక్తి తెలుసుకొని అతని ముందు ప్రత్యక్షమై తన తప్పు క్షమించమని ప్రార్థిస్తాడు. బ్రహ్మ కృతజ్ఞతగా తన వద్దనున్న దివ్య మురళిని శ్రీకృష్ణునికి కానుకగా అందజేస్తాడు. కృష్ణుడు ప్రీతితో దానిని స్వీకరించి మురళీకృష్ణుడు అయ్యాడు. ఇలా వారివారి పేర్లు ఆ వస్తువుల ద్వారా కీర్తిని పొందాయి.

*(ఆంధ్రభూమి దిన పత్రిక)*

# ప్రమద్వర

భృగుమహాముని మనుమడు ప్రమతి. అతడు సద్గుణాలు కలవాడు. అతడి కుమారుడు రురుడు. ఈతను గొప్ప తపశాలి, సత్యవ్రతుడు. అనుకున్నది సాధించిగాని నిద్రపోడు.

అతడు ఒకరోజున తన ఆశ్రమానికి కొద్దిదూరంలో వుండే స్థూలకేశ మహాముని ఆశ్రమానికి వెళ్ళాడు. అక్కడ ఆశ్రమంలో అతడు ఒక యువతిని చూసి, ఆమె అందానికి ఆశ్చర్యపోయాడు. అప్సరసలను మించి వుంది ఆమె రూపం. ఆమెను చూచిన తక్షణమే - ఈమెనే వివాహమాడాలని తలంచాడు. కాని ఈ విషయం తల్లిదండ్రులతో చెప్పలేదు. చెబితే వారు ఏమైనా అభ్యంతరం చెప్తారేమోనని భయపడ్డాడు.

రురుడు విచారంగా ఉండటం గమనించి, అతని తల్లిదండ్రులు కారణం అడిగారు. రురుడు చాలాసేపటికి కారణం చెప్పలేదు. కాని చెప్పకపోతే ఎలా అని భావించి తండ్రితో 'తండ్రీ! నేను స్థూలకేశముని ఆశ్రమంలో ఒక యువతిని చూశాను. ఆమెనే వివాహం చేసుకోవాలని వుంది. అదే నా విచారానికి కారణం' అని తెలిపాడు.

అతని తండ్రి కుమారుని నిర్ణయం విని 'అలాగే నాయనా! నేను వెళ్ళి స్థూలకేశుడితో మాట్లాడి వస్తాన'ని తెలిపాడు. తనమాట కాదనకపోవడం సంతోషమైంది. ఇంతకీ ఆ యువతి ఎవరో మనం తెలుసుకునే అవకాశం వుంది. మేనక అనే అప్సరస విశ్వావసువు అనే గంధర్వుడిని ప్రేమించింది. వెంటనే గర్భవతి అయింది. మేనక స్థూలకేశుడి ఆశ్రమానికి దగ్గరలో వున్న నది దగ్గర ప్రసవించగా ఒక బాలిక జన్మించింది. మేనక ఆ బాలికను విడిచి వెళ్ళిపోయింది. ఆ బాలికే 'ప్రమద్వర'. ఆ బాలిక ఏడుపు విని స్థూలకేశుడు దగ్గరకు వెళ్ళి చూశాడు. ఎవరో వదలి వెళ్ళారని నిర్ణయానికి వచ్చి తన ఆశ్రమానికి తెచ్చి పెంచాడు. రురుడు వివాహం చేసుకోదలచిన కన్య ప్రమద్వర - మేనకకు జన్మించిన ఆమె అపూర్వ అందంతో మెరిసే ఆ కన్య అందరినీ ఆశ్చర్యపరచింది.

ప్రమతి వెళ్ళి స్థూలకేశుడిని కలుసుకుని, ప్రమద్వరను రురుడికిచ్చి వివాహం చేయమని కోరాడు. స్థూలకేశుడు ఎంతో సంతోషపడి తప్పక వివాహం చేద్దామని సమ్మతించాడు. ఇరుపక్షాలవారి నిర్ణయం జరిగిపోయింది. ముహూర్త నిర్ణయం కూడా జరిగింది. ఇక కొద్దిరోజులలో వివాహం జరగబోతోంది.

ఒకరోజు ప్రమద్వర ఆశ్రమ వాకిట నిద్రిస్తున్న సర్పాన్ని చూడకుండా తొక్కింది. ఆ సర్పం కోపంతో బుస్సుమంటూ ప్రమద్వరను కాటేసింది. ఆ పాము విషం తిరుగులేనిది అవడంతో ప్రమద్వర వెంటనే మరణించింది. ఆమె అకాల మరణానికి అక్కడ స్థూలకేశుడు మిగతా మునులు అందరూ దుఃఖించ సాగారు. పెద్దగా ఏడవటం కూడా మొదలుపెట్టారు. ఆ ఏడ్పుల రోదన విని, రురుడు అక్కడకు పరుగెత్తుకొచ్చాడు. ప్రమద్వర మరణవార్త విని నిలువునా కూలిపోయాడు. తన భార్యగా ఆమెను ఊహించుకుంటూ కలలుగనే రురుడు ఆమె మరణవార్త విని భరించలేకపోయాడు. ఆమెను చూచి ఆనందం పొందే రురుడు, అతని ఆశలు ఒక్కసారి నిరాశ చెందడంతో భరించలేని శోకం అనుభవించాడు. తాను కూడా ఆమెతోపాటుగా మరణించాలనుకున్నాడు. కాని తాను చనిపోయినంత మాత్రాన ఆమె బ్రతుకలేదుకదా! తాను ఆమెను చేరలేడు కదా! ఇలా ఆలోచించి, ఒక నిర్ణయానికి వచ్చి నదివైపు కదిలాడు. స్నానం చేసి, ఆచమనం చేసి చేతిలో నీరుపట్టుకొని దేవతలను స్మరిస్తూ ఇలా అన్నాడు "నేను నిత్యం దేవతార్చన మొదలగు పుణ్యకార్యాలు చేసి వుంటే, నా కాబోయే ప్రియురాలు ప్రమద్వర బ్రతకాలి, లేకపోతే నేను మరణిస్తాను" అంటూ చేతిలో వున్న నీరు నేలమీద పోశాడు.

మరుక్షణమే ఒక దేవదూత ప్రత్యక్షమయ్యాడు. అతడు 'మునికుమారా! నీ విచారం అర్థం లేనిది. ప్రపంచంలో ప్రతివాడికి చావు పుట్టుకలు సహజం! అలాగే ఆమె ఆయుష్షు తీరడంతో మరణించింది. ఆమె మరణానికి నీవు దుఃఖ పడవద్దు. నీకింకా వివాహం జరగలేదుకదా! నీవు వెళ్ళి మరో కన్యను శాస్త్రసమ్మతంగా వివాహం చేసుకొని సుఖపడు' అని చెప్పాడు. కాని ఆమెను ఎంతో ప్రేమించిన రురుడికి దేవదూత మాటలు నచ్చలేదు. 'మీరు చెప్పినంత సులభంగా నేను మరొక కన్యను వివాహమాడలేను. దయచేసి వేరే ఏ మార్గమైనా చెప్పి ప్రమద్వరను బ్రతికించండి, లేకపోతే నేను మరణిస్తాను' అంటాడు రురుడు

వినయంగా. దేవదూత రురుడి పట్టుదలలో మార్పులేకపోవడం గమనించాడు. ఇతను అన్నంతపనీ చేసేరకం అనుకొని చివరకు ఇలా అన్నాడు 'ముని కుమారా! నేనొక ఉపాయం చెప్తాను విను. ఇది ఇంతకు ముందు దేవతలు ఉపదేశించిన ఉపాయం. నీవు నీ ఆయుష్షులో సగం ఆమెకు ధారపోస్తే ఆమె తప్పక బ్రతుకుతుంది, ఆలోచించి నిర్ణయం తీసుకో' అంటాడు.

రురుడు ఆయన మాటలకు సంతోషపడుతూ 'దేవా! మీరు చెప్పిన పద్ధతికి నేను అంగీకరించాను. నా ప్రాణానికి ప్రాణం అనుకుంటున్న ప్రమద్వర బ్రతకటమే నాకు కావాలి' అంటాడు.

ఆ దేవదూత యమధర్మరాజు వద్దకు వెళ్ళి రురుడి నిర్ణయం వివరిస్తాడు. అంతే, మరుక్షణమే ఆమె నిద్రనుంచి లేచినట్లు లేచింది. అతడి సంతోషం అంతులేనిదయింది.

ఆ తర్వాత వివాహం చేసుకుని సుఖసంతోషాలు అనుభవించారు. పూర్వం పద్ధతులు ఎంత నీతిమంతంగా వున్నాయో ఆమెను వివాహం చేసుకోకముందే ఆమెను భార్యగా భావించి సగం ఆయువును ఆమెకు ధారపోసి ప్రాణప్రతిష్ఠ చేసాడు రురుడు.

కాని ఈ నాగరిక సమాజంలో – పెళ్ళి చేసుకుని కట్నానికి ఆశపడి, తాముకోరిన వస్తువులు ఇవ్వలేదని, ఎంతోమంది తమ భార్యలను హింసించడం, గొడ్డళ్ళతో నరకటం, బాధించటం, విడాకులు ఇవ్వటం, కిరసనాయిలు పోసి కాల్చటం మనం చూస్తున్నాం. హిందూ ధర్మంలో వివాహం అతి పవిత్రమైనది. అగ్నిసాక్షిగా తాళి కట్టిన భార్యను వదలకూడదు. సహధర్మచారిణిగా ఆదరించి దంపతులిద్దరూ అన్యోన్యంగా మెలగాలి.

*(ఆంధ్రభూమి)*

# వైరాగ్యం

**"ఏనింక సమరమొల్లను -**
**హే నాయక నీక యుర్విని చ్చితి శాంతిం**
**గానీ కుజని వల్కల పరిధానుడనై**
**తపమొనర్చెదను మునులకడన్"**

మహాభారతంలో ఈ మాటలన్నది ఎవరో కాదు దుర్యోధనుడు - ధర్మరాజుతో అంతకుముందు పదిహేను రోజుల క్రిందట రారాజుగా కౌరవసభలో 'వాడి సూది మొనయించుక మోపిన యంతమాత్రమున్ భూమి యొనర్చి పాండునృప కిత్తునె' అన్న దుర్యోధనుడు ఈ దినం మడుగులో తలదాచుకుని తనను బైటికి రమ్మన్న ధర్మరాజుతో ఈ మాటలు అంటాడు.

తనకు యుద్ధం వద్దని, రాజ్యం అంతా ధర్మరాజుకే ఇచ్చేస్తానంటాడు. శాంతికోసం అడవులకు వెళ్లి నారచీరలు కట్టుకొని మునులతోపాటు తపస్సు చేసుకుంటూ కాలం గడుతానంటాడు. ఈ వైరాగ్యం వెయ్యవవంతైనా పదిహేను రోజుల క్రిందట వుంటే అంత మారణహోమం కురుక్షేత్ర యుద్ధం జరిగేది కాదుగదా!

మనిషి వ్యక్తిత్వం పక్వమై జీవిత తత్త్వం తెలుసుకున్న తర్వాత వచ్చే వైరాగ్యం వేరు. విషమ పరిస్థితులలో చిక్కుకొని దిక్కుతోచకుండా నిస్సహాయ స్థితిలో వచ్చే వైరాగ్యం వేరు. తాత్కాలిక వైరాగ్యాలు చాలా వున్నాయి. పురాణ వైరాగ్యం-ఇది పురాణం వింటున్నంతసేపే. స్మశాన వైరాగ్యం కాలే శవాన్ని చూస్తున్నంత సేపే. ప్రసూతి వైరాగ్యం-ఇది పురుటి నొప్పులు పడుతున్నంత సేపే.

బైరాగుల వేషాలు, కాషాయ వస్త్రాలు, మెడలో రుద్రాక్షమాలలు పైకే, కాని వీరికి అధికారంమీద మమకారం తగ్గదు ఇలాంటివారినే మహాకవి వేమన - "తలలు బోడులైన తలపులు బోడులౌనా?" అంటాడు.

తాత్కాలిక వైరాగ్యం వలన ప్రయోజనమేమీ వుండదు. ఇది పరమార్థ సాధనకు ఉపయోగపడేవి కాదు. ఆత్మవంచనకు ఉదాహరణలు మాత్రమే. వ్యక్తి సమాజ శ్రేయస్సు, తన శ్రేయస్సు చూచుకుంటూ పరార్థ భావాన్ని పెంచుకుంటూ కల్యాణ భావనలో తన మనస్సు లీనం చేయటం ఒకవిధంగా వైరాగ్య భావమే. జీవితం పరిమితం. అనుబంధాలు కల్పితాలు. మనస్సును విషయవాంఛల నుంచి దూరం చేయటం వైరాగ్యం. తనలో తాను లీనం కావటం వైరాగ్యం. ఇది ప్రతివ్యక్తి జీవితంలో ఎంతో సాధనచేసి సంపాదించు కోవలసిన ఉన్నత మానసిక స్థితి. ఇలా వుంటే మన జీవితం ప్రశాంతితో శోభిస్తుంది. రామాయణంలో శ్రీరామచంద్రుడు భరతుడికి ఇలా ఉపదేశిస్తాడు.

**"సర్వేక్షయాంతాః నిచయాః పతనాంతాః సముచ్ఛ్రయాః**
**సంయోగా విప్ర యోగంతా మరణాంతంచ జీవితమ్"**

***(రామాయణం అ-105, 16 శ్లో.)***

ఈ ధనరాశులన్నీ ఒకే రోజున నశిస్తాయి. ఈ అభ్యుదయాలు ఏదో ఒకరోజు పతనమై పోతాయి. ఈ కలయికలు శాశ్వతాలు కావు. జీవితం ఎప్పుడూ కూడ మరణంతో సమాప్తమౌతుంది. అశాశ్వతమైన ఈ లౌకిక విషయాలకోసం ఎక్కువగా మనసు పాడుచేసుకో కూడదు. ఓర్పునూ, ఓపికను పెంచుకుని, వైరాగ్యభావంతో జీవితం సుఖమయం చేసుకోవాలనేది పెద్దలమాట.

మనం ఎంత సంతోషంగా కాలం గడుపుతున్నా, ఒకమాట మనం ఎప్పుడూ గుర్తుంచుకోవాలి. భోజనం చేయటం, తినటం, త్రాగడం, మెలకువలో వుండటం, నిద్ర పోవడం, ఎన్నో పనులతో కాలం గడిచిపోతుంది. కాని ఈ దేహంతో మనుకండే సంబంధం కొద్ది కాలమేనని, అది ఎప్పుడైనా నశించి పోతుంది అనే విషయం మరువకూడదు. నీలకంఠ దీక్షితులు తన వైరాగ్య శతకంలో ఈ విషయమే హెచ్చరించాడు.

**"సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణంవ్రజ**
**అహంతా సర్వపాపేభ్యో మోక్షష్యామి మాశుచః"**

ఏది ధర్మము, ఏది అధర్మము తెలుసుకోవడం చాలా కష్టం. కనుక అన్ని ధర్మాలను తనకే వదలి, తనను శరణువేడటం సులభమైన మార్గమని, పార్ధసారధి మనకు ఉపదేశిస్తున్నాడు. అన్ని పాపాలనుంచి మనల్ని రక్షించి, మోక్షమిస్తానంటాడు.

ఆదర్శ జీవితం ఎందుకు గడపాలి? పదిమంది మన జీవితాల్ని అనుకరిస్తారు కాబట్టి - పొరపాట్లు లేకుండా జాగ్రత్తగా మెలగాలని, భగవాన్ మనకు ఉపదేశిస్తున్నాడు. ఉత్తముడు ఎలా జీవితం గడుపుతాడో చూచి, మిగతా వారంతా అలాగే నడచుకుంటాడు. అతడు దేనిని ప్రమాణంగా తీసుకుంటాడో లోకం కూడా దాన్నే అనుసరిస్తుంది. అందుకే పదిమందికీ ఆదర్శంగా జీవితం గడపటానికి ప్రయత్నించాలి.

శీతోష్ణ సుఖదుఃఖాలు, చీకటి వెలుగులు, ఇవన్నీ ద్వంద్వాలు. అంటే జంటలు కొన్ని రోజులు దానివలన సుఖం - ఇంకొన్ని రోజులు ఇంకోదానివల్ల దుఃఖం ఇవన్నీ శాశ్వతంగా అలాగే వుండవు కాబట్టి వీటి ప్రభావం మన మనస్సుపై పడకుండా, ఓర్పుని పెంచుకుని ప్రయత్నించాలి. సహనం ఎంతో పెరిగితే వాటి బాధ అంత తగ్గుతుంది. మనో నిగ్రహం ఒక్కటే సాధనకు మార్గం.

రెండు ప్రవాహాల నుంచి కొట్టుకొచ్చిన రెండు కట్టెలు, సముద్రంలో కొంతదూరం కలిసి ప్రయాణిస్తాయి. కొంత కాలానికి విడిపోతాయి. అలాగే భార్యా పుత్రులు, ధనధాన్యాలు, దాయాదులు మనతో కొంతకాలం వుంటారు. మళ్ళీ కొంత కాలానికి ఎవరి దోవన వాళ్ళు పోతారు. ఏ జీవికి ఆ జీవి విడిగా వుండటమే శాశ్వతమైన సత్యం. కలసి వుండటం తాత్కాలికం మాత్రమే. బంధాలు ఎక్కువగా పెంచుకుంటే భవిష్యత్తులో బాధపడాల్సి వస్తుంది.

# ఆచార వ్యవహారాలు

భీష్మ పితామహుడు అంపశయ్యపై పరుండినపుడు ధర్మరాజు ప్రతిరోజూ వెళ్ళి ధర్మ విషయాలు అడిగి తెలుసుకుంటూ వుండేవాడు. భీష్ముడు కూడా ఎంతో ఆప్యాయంగా సమాధానాలిస్తూ ఉండేవాడు. ధర్మరాజు ఒకరోజు భీష్ముడితో 'మానవుని ప్రవర్తన ఎలా వుండాలి? చాలామందికి తెలియని విషయాలు మీద్వారా తెలుసుకుని వారికి తెలియచెప్పాలని వుంది' అని ప్రార్థిస్తాడు.

అప్పుడు గాంగేయుడు "ధర్మరాజా! సదాచారమే మానవుని ఆయుష్షును పెంచుతుంది. దానివలన సంపద, కీర్తి కూడా కల్గుతాయి. దురాచారం గలవాడు ఆయువును పెంచుకోలేడు. అతడు అందరితో తిరస్కరించబడతాడు. సత్పురుషులు ఏ మార్గాన్ని అనుసరిస్తారో ఆ మార్గమే ఇతరులు కూడా అనుసరించాలి. ఈ సదాచారం వలననే వర్ణాశ్రమ ధర్మాలు చక్కగా నడుస్తాయి.

గురువు మాటలను లక్ష్యపెట్టక పోవడం, గోళ్ళు త్రుంచడం, గోళ్ళు ఎప్పుడూ కొరుక్కోవడం, ఉదయం, అస్తమయం సమయాలలో సూర్యబింబాన్ని చూడటం వలన ఆయుఃక్షీణం కలుగుతుంది. కోపంలేకుండా వుండడం, అహింస, సత్యాన్ని పలకడం, సూర్యారాధన, నిత్య దేవతార్చన వీటి వలన ఆయుష్షు పెరుగుతుంది.

దేవాలయాల దగ్గర, వీధిలో పశువుల శాలలో, రచ్చబండ వద్ద, పైరులలో మూత్ర విసర్జనగాని, మల విసర్జనగాని చేయకూడదు. భోజనంచేసే ముందర కాళ్ళు శుభ్రంగా కడుక్కుని తూర్పుముఖంగా కూర్చుని భోజనం చేయాలి. నిలుచుని భుజించరాదు. అలాగే మూత్రవిసర్జన కూడా నిల్చుని చేయరాదు. ఇలా చేయడంవలన అనేక పాపాలు సంభవిస్తాయని పెద్దలు తెలియపరచారు.

అగ్నిని, గోవును, బ్రాహ్మణులను ఎంగిలి చేతులతో ముట్టుకోకూడదు. మనం కూర్చునే పీట, కంచు పాత్రలు విరిగిపోయిన వాటిని ఉపయోగించ

కూడదు. చదివేటపుడు నెత్తి అంటుకోవడం, అపరిశుభ్రంగా నిద్రించడం, రెండు చేతులతో తల గోక్కోవడం, శిరసుకు ఉన్న నూనె శరీరానికి పూయడం చేయకూడదు. గురువుతో శత్రుత్వం పెట్టుకోకూడదు. అతనికి కోపం వస్తే వినయ విధేయతలతో, వారి కోపాన్ని పోగొట్టాలి. గురువుతో అసత్యమాడటం మంచిది కాదు. బ్రాహ్మణులు, గర్భిణీ స్త్రీలు దైన్యస్థితిలో వున్నప్పుడు వారికి తగిన సహాయం చేయాలి.

ఒక కాలితో మరొక కాలిని అంటే పాదాన్ని రుద్దకూడదు. కఠినంగా దుర్భాషలాడటం, ఎవరితోను గొడవ మంచిది కాదు. అంగవైకల్యంగలవారిని, గ్రుడ్డివారిని, కురూపిని ఎప్పటికీ ఎగతాళి చేయకూడదు. దైవనింద చేయడం కూడా మంచిది కాదు. నాస్తికత్వం, దేవుడు లేడని అనవసరపు ప్రసంగాలు కూడదు.

దంత ధావనం - అంటే పండ్లు తోమేటప్పుడు, మలమూత్ర విసర్జన సమయాలలో మౌనంగా వుంటాలి కాని మాట్లాడకూడదు. సూర్యోదయం తర్వాత, అస్తమించే కాలంలో నిద్రించకూడదు. నిత్యం దైవపూజ చేసిన తర్వాతనే మిగతా కార్యాలు ప్రారంభించాలి.

ఉత్తర దిశ, పడమర తల వుంచి నిద్రించ కూడదు. మంచం విరిగివుంటే దానిపై నిద్రించరాదు. చక్కగా, శుచిగా, స్నానం చేయడం వలన పాపాలు తొలగిపోతాయి. పవిత్రుడౌతాడు. అలాగే తడి వస్త్రాన్ని పొరపాటుగా కూడా ధరించకూడదు. అలాగే మాసిన వస్త్రాన్ని మడతమార్చి కట్టుకోకూడదు. మేక, నెమలి, ఆవు వీటి మాంసం ఎప్పటికీ భుజించకూడదు.

ఇతరులు వాసన చూచిన ఆహారపదార్థాల్ని తినకూడదు. అన్య మనస్కంగా భోజనం చేయరాదు. ఇతరుల చేతి నుంచి ఉప్పు తీసుకోకూడదు. పొత్తులో తినటం పాపము. రాత్రిపూట పెరుగు, తేనె ఆహారంలో

ఉపయోగించకూడదు. ఒకరు చూసిన పదార్థం వారికి పెట్టకుండా తినకూడదు. మన పంక్తిలో కూర్చున్నవారికి ఒకవిధంగా, మరొక పంక్తిలో కూర్చున్న వారికి ఒకవిధంగా పెట్టకూడదు. అంటే పంక్తిలో భేదభావం చూపకూడదు. నెయ్యి, పేలపిండి, పెరుగు, పాయసం, మంచినీరు ఎంగిలి చేసినవి ఇతరులకు ఇవ్వకూడదు.

తుమ్మినపుడు తుంపరులను వేరే వ్యక్తిపై పడనివ్వకూడదు. తన సోదరి, గురువు, మిత్రుడు, విద్వాంసుడు పేదరికంతో బాధపడుతున్నపుడు వారిని తన ఇంటికి పిల్చుకుని వచ్చి తగినవిధంగా వారిని పోషించడం వలన మనకు ఆయుష్షు, సంపదలు అభివృద్ధి అవుతాయి. పావురం, చిలుక, గోరువంక వీటిని పెంచితే ఇంటికి శుభం కలుగుతుంది. పితృకార్యాలను ఏమరకుండా చేయాలి. రజస్వల అయిన స్త్రీని ముట్టుకోకూడదు".

ఇలా విలువైన మంచి వాక్కులు ధర్మరాజుకు వినిపించి – ఓ ధర్మరాజా, ప్రతివారు ఆచారాన్ని పాటించాలి. అది ధర్మానికి మూలం. ధర్మంవలన ఆయుష్షు, సంపద, కీర్తి పెరుగుతాయి. అన్ని కులాలవారు ఈ ఆచారాలు పాటించాల్సి వుంటుంది. ఈ ఆచారాలు విని కొన్నయినా ఆచరిస్తే మంచిది.

భీష్ముడు ఆజన్మ బ్రహ్మచారి అయినా కూడా ఆరోగ్య సూత్రాలు, మానవుడు పాటించవలసిన నిత్య జీవిత వ్యవహారాలు, లోకజ్ఞానం బాగా తెలిసినవాడు. ఈ విషయాలన్నీ కూడా ధర్మరాజుకు తెలియపరచి వారిద్వారా మనకు అందజేశాడు. ఇవన్నీ కూడా సర్వకాల సర్వావస్థలలోను చేయవలసిన కార్యాలు.

*(ఆంధ్రభూమి)*

# అఖండ కీర్తివంతుడు పృధు చక్రవర్తి

మనం భాగవతంలో పృదు చక్రవర్తి గొప్పరాజు అనే పేరు విన్నాం. కానీ, వారిని గురించి చదివితే చాలా విషయాలు మనల్ని ఆశ్చర్య చకితుల్ని చేస్తాయి.

ధ్రువుని తర్వాత అతని వంశంలో పృధువే గొప్ప ప్రసిద్ధిగాంచిన రాజు. ఒకప్పుడు భూలోకంలో రాజు అనేవాడు లేనందున దొంగల భయం ఎక్కువగా ఉండేది. ఆ సమయంలోనే వేనుడనే రాజు, దుష్టకార్యాలు చేస్తూ, మునులను బాధించడం, యజ్ఞ యాగాదులను ధ్వంసం చేయడం లాంటి వాటికి పాల్పడేవాడు. భూమిపై అధర్మం ఎక్కువైంది. ధర్మాన్ని ఉద్ధరించమని వేనుడిని ప్రజలు వేడుకున్నారు. రాజు ఆ మాటలను పెడచెవిన పెట్టాడు. మునులకు ఆగ్రహం కలిగి, పుత్ర సంతానం లేకుండా చావాలంటూ వేనుడిని శపించారు. వేనుడు సంతానం లేకనే మరణించాడు. రాజ్యానికి రాజు లేకుండా పోయాడు.

మృతుడైన వేనుడి తొడభాగాన్ని మునులు మధించారు. దాంట్లోనుండి ఓ వికృత ఆకారం పుట్టుకొచ్చింది. అతడే బాహుకుడు. అతడు రాజ్యానికి అనర్హుడు, తిరిగి వేమనుడిని బాహువులు మధించారు. అప్పుడు ఒక దివ్య పురుషుడు, ఒక స్త్రీ జన్మించారు. వారు దివ్య తేజస్సుతో వెలిగిపోతున్నాడు. ఆ పురుషుడే పృధువు. ఆ స్త్రీ అర్చి. పృధువు ఆమెను వివాహమాడాడు.

పృధువు నారాయణ అంశతో జన్మించినవాడు. అర్చి లక్ష్మీదేవి అంశ. వారు భార్య భర్తలు అయినందున ఆకాశంలో గంధర్వులు గానం చేశారు. మునులు, దేవతలు వారిని కీర్తించారు.

అఖండ కీర్తిని పొందినవారిలో – పృధువే ప్రథముడు. రాజ్యంలో ప్రజలు పంటలు లేక, అన్నంలేక అలమటిస్తున్నారు. వారు రాజుని తమకు అన్నంపెట్టి కాపాడమని ప్రార్థించారు.

పంటలు లేకపోవడానికి కారణం – ఓషధులను భూమి హరించి వేయడం వల్లేనని అతడు తెలుసుకుని భూమిని సంహరించడానికి రాజు ధనుస్సును ఎక్కుపెడతాడు. అపుడు భూదేవి భయంతో వణుకుతూ గోరూపాన్ని ధరించి పరుగెత్తింది. పృథువు కూడా కోపంతో గోవును తరుముకుంటూ వెళ్ళాడు. భూదేవి, సమస్తలోకాల్లో తిరిగి పృథువు తనవెనకే వస్తున్నాడని తెలుసుకొని తనను చంపవద్దని ప్రార్థించింది.

అపుడు పృథువు 'నా ఆజ్ఞమీరి ప్రవర్తించావు. ఓషధులన్నీ నీ గర్భంలో దాచుకుని, ప్రజలకు ధాన్యం యివ్వకుండా బాధించావు. నా ప్రజలకు జీవనాధారం చూపాలి. లేకపోతే నిన్ను తప్పక సంహరిస్తాను' అన్నాడు.

అందుకు భూదేవి 'రాజా! ఒక ఉపాయం చెప్తాను. నేను ఇపుడు గోరూపంలో ఉన్నాను. నాకు ఒక దూడను, పాల పాత్రనూ, పాలు పిండేందుకు ఒక మనిషిని సృష్టించు. నేను క్షీరరూపంలో, సమస్త ఓషధులనూ ఇస్తాను. పర్వతాలవల్ల హెచ్చు తగ్గులున్న నన్ను చదును చెయ్యి. అలా చేస్తే వర్షంవల్ల అన్ని స్థలాలలో నీరు వుంటుంది. పంటలు పండటానికి అవకాశం వుంటుంది' అని చెప్పింది.

పృథువు స్వయంభువు మనువును దూడగా, తన చేతులు పాలపాత్రగా చేసి తానే పాలు పితుకువాడై, గోరూపం దాల్చిన భూమి పొదుగునుంచి పాలు పిండాడు. ఆ క్షీరాన్ని భూమి అంతటా చల్లాడు. అప్పుడు ఓషధులు మొలిచాయి. పృథువు వశమైన గోవునుంచి దేవతలు, మునులు పాలను పితికి తమకు కావలసిన వస్తువులను పొందారు.

వశిష్ఠుడు మొదలగు మునులు, బృహస్పతిని దూడగా, ఇంద్రియాలను పాత్రగా చేసి, ఛందోమయమైన పాలను పిండారు. గంధర్వులు విశ్వావసువును వత్సంగా చేసి, పద్మం అనే పాత్రలో వాఙ్మాధుర్యం ఇచ్చే పాలను పిండారు. పితృదేవతలు, సూర్యుడిని దూడగాచేసి మట్టి పాత్రలో అన్నం ఇచ్చే పాలు పిండారు.

యక్ష, రాక్షస, భూత పిశాచాలు, రుద్రుని దూడగా, కపాలం పాత్రగా చేసి మత్తు కలిగించే, రక్తం ఇచ్చే పాలను పిండారు. పశువువు శివుని వాహనం నందిని దూడగా చేసి అరణ్యం అనే పాత్రలో తృణాదులు ఇచ్చే పాలను పిండారు. పర్వతాలు హిమవంతుని దూడగా చేసి, సానువులు అనే పాత్రలో గౌరవాది ధాతువులను ఇచ్చే పాలను గ్రహించారు.

అపుడు పృధువు ఎంతో సంతోషించి భూదేవిని తన కుమార్తెగా భావించి, ప్రేమతో ఆదరించాడు. ప్రజలు ఎగుడు దిగుడు ప్రదేశాలను చదునుచేసి పంటలు పండించుకున్నారు.

గ్రామాలు, పట్టణాలను నిర్మించుకున్నారు. ·పృధువు ప్రజలకు ఏ కొరత లేకుండా, ధర్మపరిపాలన చేశాడు. రాజు బ్రహ్మావర్తమనే ప్రదేశంలో తొంభై తొమ్మిది అశ్వమేధ యాగాలు చేసి, సమస్త దేవతలనూ తృప్తి పరచాడు. శ్రీమహావిష్ణువు పృధువుకు ప్రత్యక్షమై, తత్త్వజ్ఞానాన్ని బోధించాడు. సనకసనందన, సనత్కుమారులు పృధువుకు మోక్షప్రాప్తిని కలిగించారు. అలా పృధు చక్రవర్తి అఖండ కీర్తిని పొందాడు.

*(ఆంధ్రభూమి దినపత్రిక – మార్చి 24, 2004)*

# అన్నదానం

అన్నం మనిషి జీవించడానికి ఆధారం. ఒక్క మనిషే కాదు ప్రతి జీవికీ ఆహారం అవసరం. అన్నాద్భవతి భూతాని అని భగవద్గీతలో శ్రీకృష్ణపరమాత్మ చెప్పాడు. ఆహారం వల్ల మనిషి పుష్టిగా, ఆరోగ్యంగా గొప్ప వ్యక్తిత్వం కలిగి కనిపిస్తాడు. అన్ని ఇంద్రియాలు మనస్సు, బుద్ధి అన్నీ కూడ అన్నంతోనే గట్టిపడ్తాయి.

'లక్షాధికారైన లవణ మన్నమెగాని, కొంగుబంగారం మ్రింగబోడు' అని అనటం మనం వింటుంటాం. అన్ని దానాలలో అన్నదానం గొప్పది అంటారు. అన్నం ఆత్మను తృప్తి పరుస్తుంది. అన్నదాతా సుఖీభవ అన్నారు పెద్దలు. పరులకు పెట్టి తాను తిన్నది భగవత్ అర్పణం అవుతుంది. అన్నం తినేముందు, భగవంతునికి నైవేద్యంచేసి తినాలి. అలా భగవంతుడికి అర్పించి, తిన్నందువల్ల భగవంతునికి ప్రీతి కలుగుతుంది. ఎవరు తమకు తాము ముందే తింటారో, అట్టివారు పాపాత్ములవుతారని, గీతలో శ్రీకృష్ణభగవానుడు తెలిపాడు. కలియుగంలో అన్నదానం, భగవన్నామ స్మరణ గొప్ప ఫలితాలు కలుగజేస్తాయని శాస్త్రాలు చెపుతున్నాయి. దైవము అందరిలోను ఉండి, వారు తినే నాలుగు రకాల అన్నం, (భక్ష్య, భోజ్య, చోష్య, లేహ్య) జఠరాగ్ని రూపంలో వుండి జీర్ణం చేస్తాయి. ***'అహం వైశ్వానరో భూత్వా'*** అని మనకు భగవద్గీతలో తెలిపారు.

***'సర్వేజనా స్సుఖినోభవంతు లోకాసమస్తా సుఖినోభవన్తు'*** అనే సూక్తుల వల్ల, పరులకు అన్నదానం చేయడంవల్ల ఆత్మ తృప్తి కలుగుతుంది. ఎన్ని దానాలుచేసినా, అన్నదానంతో సరికావు. పెట్టినవాడికి పట్టెడే సాక్షియని, అన్నం పెడితే మళ్ళీ మనకు పుడుతుంది అంటారు. అలాగే ద్రౌపది అక్షయపాత్ర ద్వారా ఋషుల ఆకలిని తీర్చింది. భాగవత కథలో - కుచేలుడు నుండి పిడికెడు అటుకులు తిని, అతనికి అపారమైన సంపదలిచ్చాడు శ్రీకృష్ణుడు.

సంపద వున్నవాడు తనకున్న దానిలో, దాపరికం లేకుండా ఇతరులకు ఇచ్చేదే త్యాగం అన్నారు. **'భోక్తారాం యజ్ఞతపసా, సర్వలోకమహేశ్వరం'** - యజ్ఞం, తపస్సు యొక్క భోక్త తానే అని, సమస్త ప్రాణుల హితకారిగ ఈశ్వరుడుగా, తనను ఎరిగిన మనుష్యుడు శాంతి పొందుతాడని భగవద్గీత శ్లోకాలు తెలుపుతున్నాయి. మనమే కాకుండా అన్ని ప్రాణులు, సుఖశాంతులతో తృప్తిపరచాలి. అన్నదానం చేసినవారి దేహానికి, దేవతల ఆశీస్సులు, ఆత్మకు బ్రహ్మలోక ప్రాప్తి కలుగుతుంది. దీనిని గురించి ఒక చిన్న కథ మనం గుర్తుంచుకోవాలి.

ధర్మరాజు పట్టాభిషిక్తుడై దానధర్మాలు చేస్తున్న సమయంలో సగం శరీరం బంగారు వర్ణంతో నిండిన ఒక ముంగిస దానధర్మాలు చేసే చోటికి వచ్చి పొర్లాడి వాసన చూడటం మొదలుపెట్టింది. ఈ వింత చేష్టలకు అక్కడి వారంతా ఆశ్చర్యపడ్డారు. అప్పుడు ముంగిస మనుష్య భాషలో, 'ఓ రాజా! పూర్వం సక్తుప్రస్థుడనే బ్రాహ్మణుడు చేసిన అన్నదానం ముందు మీ దానధర్మాలు ఎందుకు పనికివస్తాయి? సక్తుప్రస్థుడనే బీద బ్రాహ్మణుడు తన పొలంలో వున్న గింజలను ఏరుకొని, తను, తన భార్య కొడుకు, కోడలు తింటూ నియమనిష్ఠలతో జీవనం గడిపేవాడు. తాము తినగా, మిగిలిన ధాన్యాన్ని ఇంటికి వచ్చిన అతిథులకు, ఆత్మార్పణగా సమర్పించేవాడు. ఇలా వుండగా ఒకసారి ఆ ప్రాంతంలో, భయంకరమైన కరువు వచ్చింది. తిండిలేక ప్రజలు మలమల మాడిపోతున్నారు. ఒకరోజు వృద్ధ బ్రాహ్మణుడు ధాన్య్య ఏరుకొని, దానిని పిండిచేసి నాలుగు భాగాలు చేసుకొని తినబోగా, ఒక ముసలి బ్రాహ్మణుడు తనకు బాగా ఆకలి అవుతున్నది అన్నం పెట్టమని ప్రార్థిస్తాడు. మానవుడే మాధవుడు అని తలచి బ్రాహ్మణుడు తనకున్నదంతా వచ్చిన బ్రాహ్మణునికి సమర్పిస్తాడు. ఆ వచ్చిన ముదుసలి తృప్తిపడి ధర్మదేవత రూపంలో ప్రత్యక్షమై అతనికి సకల సంపదలు ఇచ్చి, చివరకు మోక్షప్రాప్తి కలుగజేస్తాడు. ఆ ముంగిస ఆ గృహస్థు దానంచేసిన చోటులో క్రిందపడిన పేలపిండి వాసన చూడగానే ఆ శిరస్సంతా బంగారు

వర్ణంగా మారిపోయింది. ఆ పిండిధూళిలోపడి దొర్లగా సగం భాగం బంగారుగా మారింది. ఇక సగభాగం మార్చగల మహానుభావులు ఎవరాని ఎదురుచూస్తూ ఇక్కడికి వచ్చాను. నా మిగతా శరీరం బంగారం చేసుకోవాలని, ఆశతో ఇక్కడ ఇలా చేశాను. కాని ఫలితం కనపడటం లేదు అన్నది ముంగిస. మీరు చాల రాజ్యాలు గెలుచుకొని వచ్చి, ఆ ధనంతో భూదానం, గోదానం చేయటం గొప్పా? తాను తినబోయే ధాన్యం గింజల్ని, భగవంతుని ప్రీతిగా, ఆత్మ తృప్తితో పేదవారికి అన్నదానం చేయటం గొప్పా? అప్పుడు దేవతలందరు ముంగిసను ప్రశంసించి, మిగతా భాగం సువర్ణమయ్యేట్లుగా మార్చి, చివరికి దానికి ముక్తి కలిగేటట్లుగా వరం ఇచ్చాడు. ప్రసిద్ధ పుణ్యక్షేత్రాలు, తిరుపతి, శ్రీశైలం, భద్రాచలం, మంత్రాలయం, ద్రాక్షారామం, కాశి మొదలైన చోట్ల యాత్రికులకు నిత్యం అన్నదానం జరుగుతోంది. ప్రజలు దైవదర్శనం చేసుకుని తృప్తిగా భోంచేసి వెళ్తున్నారు. ఇలా అన్నదానం ప్రతిచోట ఆదరణను పొందుతున్నది.

*(ఆంధ్రభూమి దినపత్రిక - ఏప్రిల్ 27, 2003)*

# గోమాత

లోకంలో మంగళప్రదమైనవి ఎనిమిది. అందులో గోవు రెండవ స్థానం వహిస్తుంది. బ్రహ్మ ముఖం నుంచి సృష్టి ప్రారంభంలో ఒక తేజస్సు పుట్టింది. ఆ తేజస్సు నుంచి వేదాలు, అగ్ని, గోవు, బ్రాహ్మణుడు పుట్టారు. భూదేవతే గోరూపం అంటారు. గోవు ప్రజలను కష్టాల నుంచి కాపాడుతుంది. దీని పేడ, మూత్రం, క్షీరం, ఆజ్యం, దధి పంచగవ్యం అంటారు. అన్ని దానాలలోకి గోదానం శ్రేష్ఠం.

గోవు ప్రతి అంగం ఎంతో పూజనీయమైనది. గోవు ముఖములో ఆరు అంగాలు కూడిన వేదాలకు నిలయము. శీర్షమున బ్రహ్మ, కొమ్ములందు హరిహరులు, లలాటం అంటే నొసటి భాగాన వృషధ్వజుడు, అశ్వనీ దేవతలు చెవులయందు, నేత్రములయందు సూర్యచంద్రులు, దంతములయందు గరుడుడు, నాలుకయందు సరస్వతి, ఉదరభాగమున స్కందుడు, రోమకూపములలో మహర్షులు, ఉదర పూర్వభాగములో యముడు, పశ్చిమాన అగ్ని, దక్షిణాన వరుణ, కుబేరులు, ఎడమవైపున యక్షులు, ఉదర మధ్య భాగాన గంధర్వులు, నాసాగ్రమున కిన్నరులు, గిట్టల పశ్చిమ భాగాన అప్సరసలు, అపానమున అన్ని నదులు, ప్రసావంబున గంగ, గోమయాన లక్ష్మి, పాదాల ముందుభాగాన ఖేచరులు, రొమ్ము భాగాన నాలుగు సముద్రములు నివసిస్తాయని శాస్త్రాలు చెపుతున్నాయి. ఆవును స్పృశించిన, నమస్కరించిన అందరి దేవతలకు సేవచేసిన భాగ్యం కలుగుతుంది. నూతన గృహ ప్రవేశంలో ముందు గోవును ఇంటిలోపలికి ప్రవేశింపజేసి తదుపరి ఇంటి యజమాని, భార్య, పిల్లలు, బంధుమిత్రులు ప్రవేశిస్తారు. శ్రాద్ధ కర్మలలో గోదానం నిర్వహిస్తే పితృదేవతలకు ఎన్నో పుణ్యఫలాలు కలుగుతాయంటారు. గోమాతను గురించి స్తుతించడానికి, ఆదిశేషువుకు కూడా తరంకాదు. గోమాత హిందువులకు ప్రత్యక్ష దైవం.

సంక్రాంతి, కనుమ తదితర పర్వదినాలలో గోవు కొమ్ములకు రంగులు పూసి, అలంకరించి, పసుపు కుంకుమ పెట్టి పూజించి అరటిపండ్లు, బెల్లం, ధాన్యం తినిపిస్తే ఎంతో ఆప్యాయంగా తిని, తలను ఊపుతుంది. గోవు ఐశ్వర్య లక్ష్మి. పుణ్యవచనం అంటే శిశువు పుట్టిన పదకొండవ రోజు. గృహం పరిశుద్ధం కావడానికి గోమూత్రం తెచ్చి ఒక కలశంలో పోసి మామిడి ఆకులో ప్రోక్షిస్తూ, మంత్రాలను వల్లిస్తూ ఇంటి నాలుగు మూలలూ చల్లితే ఎంతో పవిత్రత సంతరించుకుంటుందని పూర్వుల నమ్మకం. అలాగే ఇంట్లో పెద్దలు ఎవరైనా మరణిస్తే కూడ పదమూడవరోజు గోమూత్రం తెచ్చి ఇల్లంతా చల్లి, మంత్రాలను వల్లిస్తూ ప్రోక్షిస్తే అశుచి తొలగిపోతుందని అంటారు.

వేములవాడ రాజరాజేశ్వరి దేవాలయంలో గోవులను ఎన్నింటినో ఆలయాలచుట్టూ ప్రదక్షిణం చేయిస్తూ స్వామి ఆశీర్వాదం పొందటానికి రైతులు వస్తుంటారు. భూప్రదక్షిణం చేసి రమ్మని పార్వతీ పరమేశ్వరులు గణపతిని, కుమారస్వామిని ఆజ్ఞాపించగా గణపతి ముందుగా గోవు ఈనే సమయంలో గోవు చుట్టూ ప్రదక్షిణంచేసి కుమారస్వామి కంటే ముందుగా ఆది దంపతుల వద్దకు వచ్చి తాను భూప్రదక్షిణం చేసి వచ్చినట్లు చెప్తాడు. పార్వతీ పరమేశ్వరులు అందుకు సమ్మతిస్తారు. అలా విఘ్నేశ్వరుడు తొలిపూజలు అందుకోడానికి అర్హుడవుతాడు.

పోతన భాగవతంలో గోవులను గురించి చక్కగా వివరిస్తారు. అలాగే గోవులకు, గోపికలకు కృష్ణుడంటే ఎనలేని ప్రేమ. గోవిందుని వేణుగానం విని గోవులు మేత తినడం మానివేసి, కళ్ళు, చెవులు అప్పగించి రోజుల తరబడి వుండిపోయేవట. కృష్ణుడు వ్రేపల్లెని విడిచి వెళితే గోవులు ఎక్కువ దుఃఖించాయట. అవి మూగజీవులనీ, సాధు జంతువులనీ అన్నిటికంటే ఎంతో ప్రేమగా జూచుకునేవాడట. సముద్ర మథనంలో రాక్షసులు, దేవతలు కవ్వం ద్వారా

చిలుకుతుంటే కామధేనువు, కల్పవృక్షం, లక్ష్మీ చంద్రుడు మొ॥వారు పుట్టారు. కామధేనువు అలాంటిదే. కృష్ణుని తల్లి యశోద ఒకనాడు కృష్ణునితో "నాయనా! ఎండలో మందను అడవికి తోలుకెళుతున్నావు. కాళ్లు కాల్తాయి. ముళ్ళు గుచ్చుకుంటాయి. పాదరక్షలు వేసుకుని వెళ్ళు" అంటుంది. ఆ మాటలకు కృష్ణుడు 'అమ్మా! ఆవులమంద అడవిలో పాదరక్షలు లేకుండానే తిరుగుతాయి. నేను మాత్రం పాదరక్షలు ధరించి తిరగలేను. వాటికిలేని సుఖం నాకొద్దు' అంటాడు. దీనినిబట్టి కృష్ణుడికి గోవులపై ఎంత ప్రేమో తెలుస్తోంది. అలాగే గోమాత ఎంతో పూజనీయమైనదని గ్రహించవచ్చు.

*(ఆంధ్రభూమి దినపత్రిక - ఏప్రిల్ 27, 2003)*

# మహాత్ముల గుణాలు

ప్రాచీన భారతీయుల చరిత్ర తెలుసుకోవాలంటే సంస్కృత సాహిత్యం తప్పక చదవాలి. మానవజాతి మనుగడ అందులో మనకు కనిపిస్తుంది. సంస్కరించబడిన భాష సంస్కారవంతుల భాష సంస్కృతం. భారతీయ భాషలన్నింటికి కూడా ఇది మూల భాష. మానవత్వపు విలువలు, మానవుడిని పరిపూర్ణమైన వ్యక్తిగా తీర్చిదిద్దబడేది సాహిత్యం. ఆదర్శమైన వ్యక్తి ఎలా వుండాలి? సమస్యలు ఎదురైనపుడు వాటిని ఎలా ఎదుర్కోవాలి? లక్ష్యసిద్ధి ఎలా కలుగుతుంది? ఇలాంటి అంశాలకు సంస్కృత సాహిత్యం పరిష్కారం అందిస్తుంది.

సమాజంలో ఒకరినొకరు గౌరవించుకోవడం ఒకరి క్షేమాన్ని మరొకరు కోరుకోవడం, చేతనైన సేవ చేయడం వ్యక్తిగతంగానే కాకుండా, సామాజికంగా సుఖశాంతితో జీవితం గడపటం, దానికి కావలసిన సాధన – సంస్కృత సాహిత్యం మనకు అందిస్తుంది. ఇహలోక సుఖాలు ధర్మంగా ఎలా అనుభవించాలి? తరతరాలుగా, వారసత్వంగా, మానవజాతికి ఈ సాహిత్యం ద్వారానే రూపకల్పన జరిగింది.

మనిషి తన ప్రవర్తననుబట్టే సమాజంలో గౌరవించబడతాడు. ప్రవర్తన సవ్యంగా లేకపోతే, ఎంత నైపుణ్యం వున్నవాడినైనా సమాజం గౌరవించదు, సత్ప్రవర్తన తనను తనచుట్టూ వున్న సమాజానికి మంచిని కల్గిస్తుందని, సంస్కృత సాహిత్యం మనకు ఉపదేశిస్తోంది.

బాల్యంలో పిల్లలు ఏమైనా దోషాలు చేస్తే అది వారి పొరపాటుకాదు. వాళ్ళను అలా పెంచిన తల్లిదండ్రులదే పొరపాటు అంటాం. ఎవడూ పుడుతూనే పండితుడు కాలేడు. తల్లిదండ్రుల పెంపకం బాగుంటే వాడు అలా తయారయ్యేవాడు కాదు అని కూడా అంటూంటాం. తమలో వున్న ఆత్మ గుణాల్ని, సంస్కారాన్ని పెంచుకుంటూ పవిత్రమైన జీవితం గడిపేవారు కొద్దిమందే

వుంటారు. వాటి స్వరూప స్వభావాలు, సూక్ష్మంగా తెలుసుకోవలసి ఉంది. మహాత్ములలో ఈ గుణం ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. మొదటి గుణం సాటి మానవులపై దయ.

మహాభారతంలో ఆదికవి నన్నయ్య దయను గురించి మానవులకు యిలా తెలియపరిచాడు - తన తోటివారి విషయంలో దయతో మెలగాలి. ఈ లోకంలో ధర్మమేమిటని యక్షుడు ప్రశ్నించినపుడు ధర్మరాజు 'దయ' అని సమాధానం ఇచ్చాడు.

మనసారా ఇతరులపై దయ చూడకపోతే అతడు ఎన్ని ధర్మాలు చేసినా, అవన్నీ బూడిదలో పోసిన పన్నీరే అని, సాటి మనుషులపై ఎప్పుడూ దయతో ప్రవర్తించడం, మహాత్ముల మొదటి లక్షణం అనీ అందుకే దయగల హృదయమే దైవమందిరమని పెద్దలు అంటూంటారు.

మహాత్ములలో వుండే రెండవ గుణం - ఓర్పు, క్షమ. ఆకలిదప్పులు, సుఖదుఃఖాలు, శీతోష్ణాలు ఇవన్నీ సహించి ఉండటమే 'క్షమ' అంటారు. ఓర్చుకోలేనివాడు సమాజానికి బరువు అవుతాడు. యక్షుడికి ధర్మరాజు చెప్పిన సమాధానాలలో ఈ 'క్షమ' అనే విషయం కూడ గమనించవలసి ఉంటుంది.

"తపః స్వధర్మ వర్తిత్వం మనసో దమనం దమః
క్షమాద్వంద్వ సహిష్ణుత్వం హ్రీర కార్య నివర్తనమ్"
- మహాభారతం వన. 313-42)

ఆయా కాలాలలో వచ్చే సుఖదుఃఖాలను ఓర్చుకోవటమే క్షమ. ఎంతమంది దుష్టులు మనల్ని చుట్టుముట్టినా 'క్షమ' అనే ఖడ్గం ధరించినవాడిని ఎవరూ ఏమీ చేయలేరు. మహాత్ముల మూడవ గుణం - అనసూయత్వ. అంటే అసూయ లేకుండుట. ఇతరులకు ఏమైనా మంచి కలిగితే అది తనకు

కలిగిందని భావించి సంతోషపడటం అసూయ లేనివాని గుణం. ఎలాటి అసంతృప్తి లేకుండా ఎప్పుడూ ఆనందంగా ప్రకాశిస్తూ ఉంటాడు.

విదురనీతి - మూడవ అధ్యాయం - 64వ శ్లోకం ఇలా చెప్తోంది.

**"అనసూయ కృతప్రజ్ఞః శోభనా న్యాచరన్సదా**
**న కృచ్ఛ్రం మహదాప్నోతి - సర్వత్రచ విరోచతే"**

అసూయపడకుండా వుండటం, మహాత్ములలో కనపడే అటువంటి అపురూపమైన గుణం. దీనిని ఎంతో ప్రయత్నం చేసి అందరూ సాధించుకోవాల్సి వుంది.

మహాత్ముల నాల్గవ గుణం - మంగళ కామనః - అంటే జీవులందరూ సుఖంగా వుండాలని కోరుకుంటూ అందరూ ఆరోగ్యంగా ఆనందంగా వుండాలి. ఎవ్వరూ కూడా దుఃఖపడకూడదు. అందరి మంచిని కోరటం. భారతీయుల ప్రత్యేకమైనటువంటి గుణం అది. మన తరతరాల వారసత్వం.

**"సర్వత్ర సుఖినస్సన్తు - సర్వేతంతు నిరామయాః**
**సర్వే భద్రాణి పశ్యన్తుమా కశ్చి, ద్దుఃఖ బాగ్భవేత్"**

తన చుట్టూ వుండే సమాజం ఎప్పుడూ బాగుండాలి. ఈవిధంగా లోక కల్యాణాన్ని కోరుకోవడం మహాత్ముల లక్షణం. కోరికలే దుఃఖానికి కారణం. కోరికలు ఎంత తగ్గించుకుంటే అంత మనస్సుకు శాంతి లభిస్తుంది. లభించినదానితో తృప్తిపడటం, సమాజానికి ఉపయోగపడే జీవనం గడుపమని భగవద్గీత మనకు ఉపదేశిస్తుంది. మహాత్ముల ఐదవ గుణం. మత సహనం, మానవుల అభిరుచులు వేరువేరుగా వున్నట్లే, మతాలు కూడా వేర్వేరుగా వుంటాయి. మన మతమే గొప్పది. ఇతరుల మతం తక్కువైందని కొంతమంది అనవసరంగా వాదిస్తూ వుంటారు. మతాలు ఎన్నున్నా భగవంతుడు ఒక్కడే. అందుకే 'భిన్నత్వంలో ఏకత్వం' భారతీయ ధర్మం బోధిస్తోంది.

"ఆకాశా త్పతితం తోయం యథాగచ్ఛతి సాగరం
సర్వదేవ నమస్కారః కేశవం ప్రతిగచ్ఛతి"

ఆకాశం నుంచి కురిసే వర్షం పొలాలపైన, చెట్లపైన, నేలపైన, నదులలో పడుతున్నట్లు మనం చూస్తాం. కాని వర్షం నీరంతా చివరగా సముద్రంలోనే చేరిపోతుంది. అలాగే మనం ఏయే దేవతను పూజించినా, ఆ పూజలన్నీ కూడా భగవంతునికే చేరుతాయి. కనుక మత సహనం ప్రతి వారికీ ఎంతో అవసరం. మతసహనం ఉన్నప్పుడు కలహాలకు ఎప్పుడూ చోటుండదు.

మహాత్ముల ఆరవ గుణం – పరోపకారం. వేదాలు, శాస్త్రాలు. మనకు ఎన్నో ధర్మాలు బోధించాయి. వాటి సారమంతా కూడా చేతనైనంత ఇతరులకు సాయపడటమే.

నీకు ఉపకారం చేయటానికి చేతకాకపోతే చేయలేనని చెప్పాలి. ఎప్పుడూ అపకారం మాత్రం చేయకూడదు. పరోపకారం చేసేవారిని సమాజం ఎప్పుడూ గౌరవిస్తుంది. నీకు అపకారం చేసిన వ్యక్తిని కూడ క్షమించి, అతనికి ఉపకారం చేయడానికే ఎప్పుడూ సిద్ధపడాలి. మనకు ఈ శరీరం పరోపకారం చేయటానికే భగవంతుడు ప్రసాదించాడు. అంతేకాని, హింసించడానికి మాత్రం కాదు. 'అపకారికి ఉపకారం నెపమెన్నక సేయువాడె నేర్పరి సుమతి' పద్యం మనం వినే ఉన్నాం.

"పరోపకారాయ ఫలన్తి వృక్షాః
పరోపకారాయ వహన్తి నద్యః
పరోపకారాయ చరన్తి గావః
పరోపకారార్థా మిదం శరీరమ్"

చెట్లు ఇతరుల కోసమే ఫలాల్ని ఇస్తున్నాయి. ఒక్క పండు కూడ అవి తినవు. నదులు ఇతరులకోసమే ప్రవహిస్తున్నాయి. ఆవులు ఇతరులకోసమే

పాలను యిస్తున్నాయి. అలాగే ఈ శరీరం కూడ ఇతరులకు ఉపకారం చేయడం కోసమే సృష్టించబడింది. ఈ విషయం ప్రతి మానవుడు గుర్తుంచుకోవలసిన అవసరం ఎంతైనా ఉంది.

మహాత్ముల ఏడవ గుణం – ప్రియ భాషణం. కఠినంగా మాటాడటం ఎప్పటికీ పనికిరాదు. ప్రియభాషణంతో ఇతరులకు చెప్పగలగడం మహాత్ముల లక్షణం. ప్రియంగా మాట్లాడితే అందరూ కూడ సంతోషిస్తారు.

చంద్రుడు, చల్లని నీరు, చందనం, చల్లని నీడ మానవుల్ని ఆనంద పరుస్తుంది. అలాగే మహాత్ముల మధురభాషణ కూడా మన బాధలన్నీ మరచిపోయి, మైమరపింప చేస్తుంది. మృదుమధురంగా సంభాషించమని సుభాషితాలు బోధిస్తున్నాయి.

కఠినంగా మాట్లాడి ఇతరుల మనస్సు బాధపెట్టడంకంటె హితంగా, ప్రియంగా, మితంగా మాట్లాడటంలో ఎంతో ఆనందం వుంది. ఇది అందరినీ సంతోషపరుస్తుంది కూడాను.

ఇలా మహాత్ముల గుణాలు ఏ కొన్ని ఐనా మనం ఆచరించగలిగితే మానవ అభ్యుదయము తప్పక కల్గుతుంది. వారి పరిచయం పెంచుకుని, వారిని అనుసరించి నడచుకోవడం చాలా అవసరం. ఇది పెద్దల అభిప్రాయం కూడాను.

*(ఆంధ్రభూమి దినపత్రిక – నవంబర్ 10, 2004)*

# సంకల్పబలం

మానవుడు ఏ పని మొదలుపెట్టాలన్నా మనస్సులో ఒక సంకల్పమనేది వుండాలి. శాస్త్రాలు ఏవిధంగా చెప్పాయో ఆవిధంగా నడచుకోవడం ధర్మం. ధర్మం ఆచరిస్తే శ్రేయస్సు కలుగుతుంది. ఆ ధర్మం స్వరూపం తెలుసుకోవటానికి మనకు శక్తి సామర్థ్యాలు లేకపోతే మహాత్ముల సేవచేసి ధర్మ స్వరూపాన్ని తెలుసుకోవచ్చు.

ఐశ్వర్యం, అధికారం వీటివల్ల సుఖం కలుగుతుంది అనుకుంటారు కాని అది తాత్కాలికమే, శాశ్వతం కాదు. ఐశ్వర్యవంతుని వద్దకు వెళ్ళి సుఖమైన శాంతి అనుభవిస్తున్నావా? అని ప్రశ్నిస్తే 'లేదు' అనే స్పష్టంగా చెప్తాడు. ఇంత ఐశ్వర్యం వుందిగదా – సుఖశాంతులు లేకపోవడమేమిటి? అని మనం మళ్ళీ ప్రశ్నిస్తే – ఈ ఐశ్వర్యం వచ్చాకే సుఖశాంతులు కరువైనాయి అంటాడు. అలాగే అధికారం లభిస్తే సుఖంగా ఉండొచ్చు అనుకుంటాం. అధికారం పెరిగేకొద్దీ అశాంతి పెరుగుతుంది. సమస్యలు ఎక్కువౌతాయి. మరి శాశ్వతమైన సుఖశాంతి ఎక్కడుందీ అంటే పరమాత్మ స్వరూపం తెలుసుకున్నప్పుడే మనకు శాశ్వతమైన సుఖశాంతులు దొరుకుతాయి. అది లేనినాడు సుఖశాంతులు ప్రాప్తించవు. వాస్తవ స్వరూపం తెలుసుకోవలసి వుంది. పరమాత్మ ఎక్కుడున్నాడు? గుడిలో ఉన్నాడా? పర్వతాలలో ఉన్నాడా? కాదు. పరమాత్మ సర్వ వ్యాపకుడు. ఆయనలేని చోటు లేదు. సమస్త జగత్తులో పరమాత్మ నిండి ఉన్నాడు.

ఒకసారి భాగవతం తీసి దాంట్లో ప్రహ్లాదోపాఖ్యానం చదివితే – భగవంతుడు లేనిచోటు కనిపించదు. హిరణ్యకశిపుడు ప్రహ్లాదునితో 'ఎక్కుడున్నాడు నీ భగవంతుడు చూపు' అని అంటే భగవంతుడు ఎక్కడలేడు? అని అడుగుతాడు.

**ఇందుగలడందు లేడని సందేహము వలదు చక్రి సర్వోపగతుం**
**డెందెందు వెదకి చూచిన అందందే గలడు దానవాగ్రణి వింటే**

అంటాడు. బాలభక్తుడు ప్రహ్లాదునికి ఉన్న ఉత్కృష్ట సంస్కారం లేనందువల్లే మనం భగవద్దర్శనం చేయలేకపోతున్నాం.

భగవద్గీతలో కృష్ణభగవానుడు -

**'ఈశ్వర స్సర్వ భూతానాం హృద్దేశేర్జున తిష్ఠతి'**

నీవు ఎక్కడికి పోయీ వెతకవలసిన పనిలేదు. నీ హృదయంలోనే ఉన్నాడు. ఆ పరమాత్మను గనుక నీవు దర్శించావంటే శాశ్వతమైన సుఖశాంతి లభిస్తుంది అంటాడు. పరమాత్మ నిజ స్వరూపం తెలుసుకోవడానికి, చర్మ చక్షువులతో చూడలేము. దివ్య చక్షువులే కావాలి. అభ్యాసం చేసినవాడికి, కళ్ళు మూసుకుంటే భగవంతుని సుందరాకృతి కనిపిస్తుంది. అంతర్దృష్టితో విశ్వరూపం చూడగలం. అది కలగాలంటే భగవంతుని కృప తప్పక కావాల్సి ఉంటుంది.

అభ్యాసము, వైరాగ్యము ఈ రెండు మన మనస్సనే గుఱ్ఱాన్ని వశంలోకి తీసుకొని రావచ్చు. యోగశాస్త్రంలో కూడా ఇదే తెలిపారు.

**'అభ్యాస వైరాగ్యాభ్యాన్ తన్నిరోధః'**

మనస్సును నిగ్రహంలోకి తెచ్చుకొని, భగవద్దర్శనం చేయగల్గుతామో, అప్పుడు మనం శాంతిని పొందగల్గుతాము. అభ్యాస, వైరాగ్యాలవల్ల సుఖం, శాంతి, సంతోషం పొందగల్గుతాము. అభ్యాసం అంటే ఎలా? భగవంతుని పటం ముందుగాని, విగ్రహం ముందుగాని కూర్చుని మనస్సు కేంద్రీకృతం చేసుకోవడం - ఇలా రోజూ చేస్తూ సమయాన్ని పెంచుకుంటూ పోతే అదే అలవాటవుతుంది. అలవాటు ఎప్పుడైతే ఏర్పడుతుందో కళ్ళు మూసుకున్నా ఆ చిత్రమే మన ముందు ప్రత్యక్షమౌతూ ఉంటుంది. దీనినే అభ్యాసము అంటారు.

ఇక రెండవది 'వైరాగ్యము'. ఏ వస్తువులను నేను ఆశిస్తున్నానో వాటి వల్ల సుఖం లేదు. వాటిని గురించి చింతించకూడదు అనేటటువంటి దృఢమైన

భావన. ఎంతమటుకు మనం వాటిని అంటిపెట్టుకుని ఉంటామో, అంతవరకు మనం సుఖాన్ని పొందలేము. కనుక అమూల్యమైన సమయాన్ని వాటికోసం వినియోగించుకోకూడదు. పరమాత్మ దర్శనం తప్పక చేసుకోవాలి.

ఎప్పుడైతే మనం మనస్సును నిగ్రహించుకుంటామో అప్పుడు మన హృదయంలో ఉన్న పరమాత్మను చూడగల్గుతాము. భాగవతంలో శ్రీకృష్ణపరమాత్మ గోపబాలురతో గోవుల్ని మేపటానికి వెళ్తాడు. వాళ్ళందరినీ కూడ బ్రహ్మ మాయం చేస్తాడు. అప్పుడు శ్రీకృష్ణుడు తానే గోపబాలురుగా, తానే గోవులు అయి వ్యవహారం నడుపుతాడు. బ్రహ్మకు ఆశ్చర్యమౌతుంది. 'ఇదే భగవంతుని సర్వవ్యాపనము' అనుకుంటాడు బ్రహ్మ.

మనష్య జన్మ పొంది కూడా మోక్షప్రాప్తికి ప్రయత్నం చేయకపోతే వాడికి మళ్ళీ పశు జన్మే గతి. కూడని పనులు చేయడంవల్ల నరకం, దుఃఖం ఇవి రెండు మాత్రం తప్పదు. భగవంతుడు అందరి హృదయాలలో ఉన్నాడని, సమస్త పుణ్యపాపాలు చూస్తుంటాడని ఎప్పుడో ఒకప్పుడు ఆ పరమాత్మకు మనం జవాబు చెప్పాల్సి ఉంటుందని జ్ఞాపకం ఉంచుకోవాలి. మన కర్తవ్యాన్ని మనం ఏమరుపాటు లేకుండా నిర్వహించుకోవాలి. అప్పుడు మనవల్ల పొరపాట్లు అనేవి జరగవు.

సనాతన ధర్మం అనేది నిన్న యివాళ పుట్టినది కాదు. సృష్టి మొదట్లోనే పరమాత్మ ప్రజలకు ధర్మం గురించి బోధించాడు. ఈ ధర్మాన్ని మీరు పాటిస్తూ శ్రేయస్సును పొందండి. ఆ ధర్మాన్ని కాపాడవలసిన బాధ్యత మనమీదే వుంది. ఆ పరంపర ప్రకారమే మనం జీవనం గడపాల్సి వుంటుంది. మన పూర్వీకుల చరిత్ర చదువుతుంటే వాళ్ళు ఎటువంటి కష్ట పరిస్థితులలోను ధర్మాన్ని వదలిపెట్టలేదు. ఆపదలు ఎప్పుడూ మనష్యులకు వస్తూనే వుంటాయి. అయితే ఆ ఆపదలు తప్పించుకోవడం కోసం మన ధర్మాన్ని మాత్రం వదలకూడదు. పరిస్థితుల్నిబట్టి ధర్మాన్ని వదులుతున్నామనేది వివేకులైన వారికి ఏమాత్రం తగదు.

వాల్మీకి రామాయణంలో 'రామో విగ్రహవాన్ ధర్మః'. ధర్మమే శ్రీరాముడి రూపంలో ఉంది. ఆయన మానవుడిగా జన్మించారు కాబట్టి మనందరికీ మార్గదర్శకుడయ్యాడు. తన ప్రజల్ని ఏవిధంగా చూచుకున్నాడు. తన సోదరులను ఎంత అనురాగంతో చూచుకున్నాడు? రావణాసురుని సోదరుడు విభీషణుడు తనవద్దకు ఆశ్రయానికి వస్తే దగ్గరి వారు. శత్రువునకు ఆశ్రయమివ్వ కూడదు అని చెప్పినా 'యదివారావణ స్వయం' మీరంతా అతనికి శత్రువుకి తమ్ముడు అంటున్నారు. సాక్షాత్ శత్రువే స్వయంగా వచ్చినా సరే. "నేను శరణు వేడుతున్నాను. మీరే నాకు ఆశ్రయం" అంటే వాడికి తప్పక ఆశ్రయమిస్తాను అంటాడు రాముడు.

ధర్మాచరణలో ఆటంకం రాకూడదు. వివేకం పెరిగేకొద్దీ ధర్మంలో నిష్ఠ పెరగాలి. మనం తెలుసుకున్నది చాలా తక్కువ. తెలుసుకోవలసింది ఎక్కువ. అహంకారమనేది లేకుండా వుండటం పెద్దలు, మహాత్ముల అభిప్రాయాలకు గౌరవం యివ్వడం ముఖ్యం. ధర్మం చేసేవారు, న్యాయంగా వుండేవారు. ఎన్నో కష్టాలు అనుభవిస్తున్నారు కదా అంటే కాలక్రమేణా వాళ్ళు నశిస్తారు. ధర్మాన్ని ఆచరించేవారు మొదట్లో కష్టాలు ఎదుర్కొన్నా చివరికి వారే జయిస్తారు.

మనం సంకల్పించే పనులు పరిశుద్ధమైన సంకల్పంతో కూడి వుండాలి. అప్పుడు భగవంతుని సన్నిధిలో మనశ్శాంతిని పొందుతారు. భగవంతుడు కూడా తోడ్పడుతాడు.

దిలీప మహారాజు రాజ్యాన్ని వర్ణించేటపుడు కాళిదాసు మహాకవి యిలా చెప్పాడు. ప్రజల మేలుకోసం ఆయన వాళ్ళదగ్గర శిస్తు వసూలు చేసేవాడు. తన కర్తావ్యాన్ని ఏమరుపాటు లేకుండా నిర్వహించేవాడు. స్వార్థం లేకుండా పరోపకారాన్ని దృష్టిలో పెట్టుకొని, ధార్మికుడుగా ప్రశంసలు పొందాడు. మహాత్ముడు కావడానికి ఇతరులపట్ల దయ, పరోపకారము ఇవే ముఖ్యం. ధర్మ

నాశనానికి మనమే కారణం. మనం ముందు ధర్మాన్ని ఆచరిస్తే ఇతరులకు చెప్పడానికి అవకాశముంటుంది. నియమాలకు లోబడి మనం నడచుకుంటే ధర్మం చెడటానికి అవకాశమే లేదు.

శంకర భగవత్పాదులు పరమేశ్వరుని ఇలా ప్రార్థించాలని తెలిపారు.

**"కపాలిన్ భిక్షోమమ హృదయకపి అత్యంత చపలం**
**దృఢ భక్త్యా బద్ధ్వాశివ భవ దధీనంకురు విభో"**

నా మనః పద్మంలో శ్రీశైలక్షేత్రంలో విహరించే మల్లికార్జునుడు విహరించు గాక. అందుకే శ్రీశైలక్షేత్రానికి, 'శివానందలహరి'కి దగ్గర సంబంధం – అయ్యా స్వామీ! నా మనస్సు కోతిలాంటిది. నేను చెప్పినట్లు వినటంలేదు. ఈ పర్వతాలు, చెట్లు ఎక్కి అనేక కష్టాలు పెడుతోంది. నా మనస్సనే కోతిని నీ భక్తి అనే తాడుతో పట్టుకున్నావంటే ఎంతో దివ్యంగా వుంటుంది అని ప్రార్థిస్తాడు. మన మనస్సు వేరువేరు చోటికి పరుగెత్తుతుందో అంతకంతకూ దుఃఖమే అని – ఆయన, మన మనస్సును భగవంతునిలో లీనం చేయమని అది, మనకు ధన్యతను చేకూరుస్తుందని – ప్రీతితో తెలియజేశారు. ఇది అందరూ పాటించవలసిన విషయం.

*(ఆంధ్రభూమి దినపత్రిక – అక్టోబర్ 25, 2004)*

# జాషువా
# దేశాభిమాన కవి

విశ్వనరుడు జాషువా - చర్చ 'సాహితి'లో పలువురి అభిప్రాయాలు చదివాను. జాషువాకి అన్ని మతాలు సమానమే. ఏ మతాన్ని విడిచిపెట్టలేదు. తాను నాస్తికుడని చెప్పిన దాఖలాలు ఎక్కడా లేవు. ఆతని వ్యక్తిత్వం సంస్కారప్రియుల హృదయాలలో జీవిస్తుంది. ఆతని కవిత్వం ప్రజల నాలుకపై ఎప్పుడు నిలిచి వుంటుంది. జాషువా కవిత్వం అతని వ్యక్తిత్వం నుంచి విడదీయలేము. అంటరానితనం విషాగ్నులు చిమ్మినపుడు మన హృదయాలలో అతని రచనలు తప్పక గుర్తుకు వస్తాయి. వాటిలో ముఖ్యమైనదే 'ఫిరదౌసి', 'గబ్బిలం', శ్మశానవాటిక మొదలైనవి. ఆయనకున్న బిరుదుల్లో చిరస్థాయిగా నిలిచింది 'కవికోకిల'. గబ్బిలానికి ఇతివృత్తం - అస్పృశ్యుని ఆత్మక్షోభ. ఫిరదౌసిలోని ఇతివృత్తం కవితకు రాజు, (ప్రభుత్వం) చేసిన అన్యాయం.

"శ్మశానవాటిక" నేపథ్యం సమతా దృక్పథం వారి హృదయంలో చెలరేగిన ఒక్కొక్క వేదన ఒక్కొక్క ఖండాకృతిగా రూపొందింది. కవిగారి కవితా దృక్పథం ఈ క్రింది పద్యంలో ప్రతిధ్వనిస్తుంది.

**'మధుర రసమును, గడుపున మాటుకొన్న**
**ద్రాక్ష ఫల గుచ్ఛముల యందముల తూగు**
**వర కవీంద్రుని కావ్య ప్రపంచమందు**
**ప్రతి పదంబున మదికి దర్శనమొసంగు'**

ఉత్తమ కవిత్వానికి ఉండవలసిన లక్షణాలు మనం చూస్తాం.

కవితా లక్షణంలో శ్రీనాథునికి జాషువాకు ఎంతో పోలిక వుంది. కవిత్వం భువన హితం కోరేదిగా ఉండాలని జాషువా విశ్వాసం. రాజుల భోగవర్ణనలు విరహిణుల వర్ణనలు ఆతనికి గిట్టవు.

జాషువా మాదిరి, ఉర్దూ పారశీక పదాలు ఉపయోగించిన కవి మరొకరు లేరంటే నమ్ముతారో లేదో - ఉదాహరణకు -

కుమ్మక-సహాయం, నగిషీ - అలంకరణ, అయ్యాం - దినాత్రి, ఫర్మానా - సెలవిచ్చుట; ఇంకా కొన్ని షరాబు, నసీబు, ముస్తాపు, దర్జా, ధీమా, పసందు; కోన్ కిస్కాగాడు వంటి ప్రయోగాలు, జాషువా కవితలో కోకొల్లలుగా దొరుకుతాయి.

ఛందోబద్ధంగా పద్యాలు వ్రాసినా, భాషా విషయికంగా వ్యావహారిక పద ప్రయోగానికి, బాసటగా నిలిచాడు. తెలుగు నుడులను సమాదరించని పండితులను పరిహసించాడు.

జాషువా దేశాభిమాన కవిత్వం, సంఘ సంస్కరణ కవిత్వం ప్రయోగించాడే గాని, ప్రణయ కవిత్వంవైపు పోలేదు. కంటికి కనిపించిన వాస్తవాలనే ప్రవచించాడు. 'సాలీడు'లో కూడా కళల పరమార్థం అందమే కాదని నల్గురికీ ఉపయోగపడని జిలుగు, నగిషీ వ్యర్థమని అభిప్రాయపడ్డాడు.

పదాల పొందికలో పొదుపు పాటించాడు. తోచినంతలో తూచివేయటం, నొక్కి చెప్పవలసి వచ్చినపుడు, గట్టిగా చెప్పడం, జాషువా పదప్రయోగ విశిష్టత.

జాషువాకు, భావాల్ని చిత్ర చిత్రాలుగా కూర్చటం తెలుసు. అతని కవిత్వానికి ఆవేశం, జీవితాన్ని జాషువా అనుభూతితో చూస్తాడు. ఆవేశంతో వ్రాస్తాడు. క్రమపద్ధతిలో తన కవితను కొనసాగిస్తాడు.

అయి కమలమ్మ వ్యాసంలో - విశ్వనరుడైన జాషువాకు క్రైస్తవుల మేకుతో శిలువ ఎందుకు? హైందవుల పోడె ఎందుకు? ఈ వాక్యాలు అంత సమంజసంగా అనిపించలేదు. కవియొక్క చాతుర్యము, ప్రతిభ, వ్యుత్పత్తులు విడిచిపెట్టి అతడు నాస్తికుడా? ఆస్తికుడా? రాజభక్తి, దేశభక్తి గలవాడా -

చర్చవల్ల ఎవరికీ ఎలాంటి ప్రయోజనం లేదు. అంటే ఆయన గురించి తెలుసుకోవలసిన విషయాలు ఉన్నాయి కదా పాఠకులకు అనిపిస్తుంది.

జాషువా కవిత్వంలో కరుణ, వీర రసం రెండు పొందింపజేశారు. కార్చే కన్నీళ్ళను, తిలకించటం కంటె కరుణ, వీర రస సిద్ధాంతానికి బాట వేయడమే గదా –

గబ్బిలంలో అస్పృశ్యుడు పండించిన ధాన్యమేకదా ఆలయంలో సమర్పించే నైవేద్యం. అంటరానివాని ధాన్యాన్ని అంటుకోమని, ఆ దేవతలు అనుకుంటే వాళ్ళకూ కూడు లేదు. పూజారులకు బ్రతుకుతెరువు లేదు.

వర్ణ వ్యవస్థని వివరిస్తూ – ఈ ఐదవ కులమేమిటి? ఈ కులం అంటరానిది కావటమేమిటి? ఎవరు దీనిని సృష్టించారు? భారతీయులు ఎందుకు అనుసరిస్తున్నారు? కుల, మత, వ్యవస్థ కూకటివ్రేళ్ళతో పెళ్ళగించాడు. సంఘ సంస్కరణ అభిలాష ఇతని కవిత్వంలో చతుర్ముఖాలుగా సాగింది.

1. మత వైషమ్య నిరసనం
2. అస్పృశ్యతా నిరసనం
3. అంధ విశ్వాస నిరసనం
4. దారిద్ర్య నిరసనం

ఈ నాలుగు అంశాల మీదనే, ఇతని సంఘ సంస్కరణ కవితా నిర్మాణం జరిగింది.

శ్మశానవాటిలో ప్రతి పద్యం తీవ్రమైన అనుభూతిని కల్గిస్తుంది. జాషువా వ్రాసిన లఘు కావ్యాలు, ఛందకావ్యాలు, ముంతాజ్ మహల్, కాందిశీకుడు, ముసాఫర్లు, క్రీస్తు చరితము, క్రొత్తలోకము ఏడు ఖండకావ్య సంపుటాలు, నా కథలు వెలువడ్డాయి.

కవిత్వంలో ఖండకావ్య ప్రక్రియ రాయప్రోలుతో ప్రారంభమై జాషువా కవిత్వంలో పుష్పించింది. తెలివికి, కలిమిలేములతో నిమిత్తం లేదు. ప్రతిభ కులమతాల తక్కెడతో తూచరాదు అని విశ్వసించాడు.

క్రీస్తు చరిత్ర సర్వలక్షణ శోభితముగా ఆయన తీర్చిదిద్దాడు. అప్పటి భారతదేశ అధ్యక్షుడు డా॥సర్వేపల్లి రాధాకృష్ణన్ కేంద్ర సాహిత్య అకాడమీ బహుమతినిచ్చి జాషువాను సత్కరించారు.

నవయుగ కవి చక్రవర్తి, కవికోకిల, కళాప్రపూర్ణ, భారత ప్రభుత్వం పద్మభూషణ్‌గా ఆయనను గౌరవించి సన్మానించాయి. తెలుగు ప్రజలు గండపెండేరం తొడిగించారు. గజారోహణం, కనకాభిషేకం కన్నుల పండువగా చేసి ఆయనపై తమకు గల ఆదరాభిమానాన్ని చాటుకున్నారు.

*(ఆంధ్రభూమి దినపత్రిక)*

# సహజీవనం

మానవుడు సంఘజీవి. ఎవ్వరూ కూడా స్వతంత్రులు కారు. ఒకరిపై మరొకరు ఆధారపడవలసి వుంటుంది. సుఖముగా జీవించాలి. ధర్మంగా ప్రవర్తించాలి. పూర్ణ ఆయుష్షు కలిగి వుండాలి.

"సంగచ్ఛంద్వం సంపదద్వం సంనో యనాంసి జానతామ్
దేవాభాగం యుధా పూర్వే సంజననా ముపాగతే"

ఈ పైశ్లోకానికి అర్థం సంగచ్ఛద్వం అంటే కలసి నడవమని, సంవదద్వం - కలసి ప్రేమతో మాట్లాడమని, సంనో మనాంసి జానతామ్ - కలసి ఆలోచింపమని, దేవాభాగం యథాపూర్వే - పూర్వం దేవతలు, తమ భాగమును, సంజననాం ఉపానతే - ఏవిధంగా కలసి వారికి లభించిన భోగములను వివేకం అనుభవించారో అదేవిధంగా మనం అనుభవిద్దాం అని తాత్పర్యం. భావం.

"పశ్యేమ శరదశ్శతం, మోదాయ శరదశ్శతం, శృణుయామశర దశ్శతం, శృణుయామశీర దశ్శతం, ప్రబ్రవామ శరదశ్శతం" - ఈ మంత్రంలో కూడా భావం సంతోషంగా, ప్రియంగా, చక్కటి మాటలు వినుచు, చక్కగా మాట్లాడుచు, దైవానికి ప్రియాన్ని గూర్చుచు, నూరేళ్ళు జీవింతుముగాక. మనిషి సుఖంగా జీవించాలంటే అతనికి చక్కని నడవడిక ఎంతైనా అవసరం.

వాహనాలు, పిల్లలకు, పెద్దలకు ప్రమాదాలు జరగకుండా నియమాలను అనుసరించి, నడపవలసి వుంటుంది. అలాగే జీవితంలో ఏ అపాయము లేకుండా జీవించాలంటే నియమాలు అనుసరించవలసి వుంటుంది. అవే జీవిత ధర్మాలు.

ఈ జీవిత ధర్మాలు మనకు సుఖశాంతులను కలుగజేస్తాయి. తనకుగాని, ఇతరులకుగాని ఎట్టి బాధ లేకుండా, ధర్మయుక్తంగా జీవించడం ఎంతో అవసరం. ఈ భావాన్ని సూచిస్తూ 'సంగచ్ఛేద్వం' కలిసి నడువు అని తెలిపారు.

ఇక సంవదద్వంలో, సంఘ జీవనానికి ఒకరికొకరు, తమ మనోభావాలను తెల్పుసుకుంటూ, ఒకరినొకరు అర్థం చేసుకుంటూ, సదవగాహనతో జీవించాలి.

మాట్లాడుట ఒక తపస్సు అనే విషయం భగవద్గీత చెప్తోంది. మాటలు కోపం రానీయకుండా, సత్యంగా, ప్రియంగా, హితముగా ఉండాలి. సంఘ క్షేమానికి ఉపయోగపడేటట్లుగా ఉండాలి. సామ్యతతో, అవగాహనతో, చర్చించుకొని, కలసికట్టుగా నిర్ణయాలు తీసుకొని సంఘానికి అనుకూలంగా ఉపయోగపడేటట్లుగా ఉండాలి. గనుక సంవదద్వంలో – మనము మాట్లాడే మాటలు హితం కలిగేటట్లుగా ఉండాలి.

జీవితంలో ఒడిదుడుకులు లేకుండా జీవించాలంటే, ఒకరి మనసు మరొకరు తెలుసుకొని వ్యవహరించాలి. మనం చేసే పనులలో భేదాభిప్రాయాలు వుంటే పరస్పరం సంప్రదింపుల ద్వారా విభేదాలు రూపుమాపుకోవచ్చు. ఏకీభవించకపోయినా, మన్నించి సర్దుకొనిపోవాలి. సహజీవనంలో ధర్మసూక్ష్మం ఈ సర్దుబాటులోనే ఇమిడి ఉంది. ఒకరి అభిప్రాయాలు మరొకరు ఆమోదించకపోయినంత మాత్రాన వారిపై ద్వేషంగాని, కోపంగని వుండకూడదు. అభిప్రాయ భేదాలు తగ్గించుకొనిపోతే జీవితం సుఖంగా జరిగిపోతుంది.

దేవతలు ఒకరికొకరు సహాయం చేసుకుంటూ ఏవిధంగా తమకిచ్చిన ఆహారాన్ని తృప్తిగా భుజించగలిగారో – ఒక చిన్న కథ వలన మనకు తెలుస్తోంది. కశ్యప ప్రజాపతికి దేవతలు, రాక్షసులు సంతానం.

అతనికి దితి, అదితి ఇరువురు భార్యలు. దితికి పుట్టినవారు దైత్యులు. అదితికి పుట్టినవారు ఆదిత్యులు. ఆదిత్యులు మంచి మార్గంతో జీవిస్తూ, ఒకరికొకరు సహాయపడ్తూ సుఖంగా జీవించేవారు.. దైత్యులు అంటే రాక్షసులు స్వార్థపరులై, వివేకం లేకుండా కలహించుకుంటూ వుండేవారు.

ఒకరోజు ప్రజాపతి తన సంతానానికి వివేకంతో ఎలా జీవించాలి అనే పద్ధతి చెప్పడం కోసం ఒక విందు ఏర్పాటుచేశారు. రాక్షసులు, తమకు ముందుగా వడ్డించమన్నారు. అలాగే అని ప్రజాపతి సమ్మతించాడు.

ఈ విందులో ప్రతి ఒక్కరి చేతులు, మోచేతులవరకు కట్టెలతో బిగించబడ్డాయి. అలా బిగించినందున చేతులతో అన్నం తినడం సాధ్యం కాలేదు. అందుచేత రాక్షసులు పడుకొని నోటితో అన్నం తింటూ కష్టపడి భోజనం ముగించారు. ఆ ప్రదేశమంతా అలికినట్లై పదార్థాలంతా వృధా అయ్యాయి.

దేవతలకు కూడా అదే స్థలంలో వడ్డన జరిగింది. వారికి కూడా మోచేతుల వరకు కట్టి వేసినందున తినడం సమస్య అయింది. ఒకరితో ఒకరు సంప్రదించుకొని ఎదురెదురు వరుసలో కూర్చుని, విస్తళ్ళలోని ఆహారాన్ని, తమ ఎదురుగా కూర్చున్న వారి నోటిలో పెట్టి సమస్య తీర్చుకుని తృప్తిగా భోంచేసి ఎదుటివారికి సంతోషం కలిగించారు. ఇలా ప్రజాపతి దేవాసురులకు సౌమ్యంగా సహజీవన పద్ధతిని గురించి బోధ చేశాడు.

ప్రతి వ్యక్తి కూడా తనకొరకు మాత్రమే కాకుండా ఇతరుల కోసం కూడా జీవించాలి, సహాయపడాలి. ఈవిధంగా సహాయపడ్తూ వుంటే మన జీవితయాత్ర సుఖంగా జరిగిపోతుంది. 'సంజనానాం' అంటే తోటివారితో సహకరిస్తూ జీవించాలి. ప్రతి మానవుడు ఈ విషయం గమనించాలి. సంఘజీవులైన మనం ధర్మయుక్తంగా మంచి మాటలు, మంచి ఆలోచనలు, పరస్పర సహాయం తప్పకవుంటే, సుఖశాంతులు వెల్లివిరుస్తాయి.

ఉన్నదానితో తృప్తిపడటం, లోక కల్యాణానికి ఉడతాభక్తిగా సహకరించడం, మారుతున్న కాలంతోపాటు మనము మారడం, మంచిని పెంచుకోవడం, సద్గ్రంథ పఠనం, సచ్ఛీలాన్ని పెంపొందించుకోవడం, జ్ఞాన ప్రసూనాల్ని విరబూయించుకోవడానికి సాధ్యమైనంత వరకు ప్రయత్నించడం, ఇలాచేస్తే బ్రతుకంతా వెన్నెల దీపాలే అని భావించవచ్చు.

మన కర్తవ్య నిర్వహణలో ఎన్ని అవాంతరాలు ఎదురైనా, ఎన్ని త్యాగాలు చేయవలసి వచ్చినా ధైర్యంగా ఎదుర్కోవలసి వుంటుంది. అప్పుడే దేవుడు కూడా మనలను గుర్తిస్తాడు.

*(ఆంధ్రభూమి దినపత్రిక, ఫిబ్రవరి 20, 2003)*

# వృద్ధాప్యం శాపం కారాదు

వృద్ధాప్యం భారంగా వెళ్ళదీసే స్త్రీల సంఖ్య రానురాను విపరీతంగా పెరిగిపోతున్నది. అందివస్తున్న వైద్య సౌకర్యాలు, తగ్గుతున్న మరణాలు, మనిషి ఆయుర్దాయాన్ని పెంచుతాయి. ఫలితంగా వృద్ధుల జనాభా రోజురోజుకీ పెరుగుతోంది.

మహిళలు పురుషులకన్నా ఎక్కువ కాలం జీవిస్తారు. అయితే ఎంత ఎక్కువకాలం బతికితే అంత ఎక్కువ బాధలు అనుభవించాల్సి వస్తుంది. వివిధ రకాల అనారోగ్యాలు, అయినవారి నిరాదరణ, వృద్ధులపట్ల శాపాలుగా పరిణమిస్తున్నాయి. వృద్ధ స్త్రీలలో చాలామంది వితంతువులే. భర్తను పోగొట్టుకొని, ఆర్థిక స్వాతంత్ర్యం లేకుండా బిడ్డలపై ఆధారపడి, వారు ఏ పరిస్థితులలో కాలం వెళ్ళబుచ్చుతున్నారో అర్థం చేసుకున్నవారికే తెలుస్తుంది. మహిళల ఇబ్బందులు, వారి వయసుకన్నా, వారిని శారీరకంగా, మానసికంగా వృద్ధులను చేస్తున్నాయి.

ప్రభుత్వం అరవై పైబడ్డ స్త్రీల విషయంలో చెప్పుకోదగ్గ శ్రద్ధ తీసుకోవడం లేదని తెలుస్తోంది. వితంతు ఫించన్, సీనియర్ సిటిజన్‌కు ఇటీవల ప్రభుత్వం ఈ సౌకర్యం కల్పించడం సంతోషించదగ్గ విషయం. శక్తి తగ్గిపోయి, అనారోగ్యంతో అసహాయస్థితిలో వుండే వృద్ధులను, సమాజానికి, కుటుంబానికి భారం అనుకోవడం, సంస్కారవంతుల లక్షణం కాదు. జీవితకాలపు అనుభవాలతో, తలపండిన వారిని ఎందుకూ పనికివారుగా జమకట్టడం, మానవత్వం ఉన్నవాళ్లు చేసే పనికాదు. వృద్ధాప్యం ఒక బాధ కాదు. అది ఒక మహదావకాశంగా భావించాలి. సమాజానికి, కుటుంబానికి గొప్ప మూలధనం వారు. ముసలివారు, వారి మాటలేమిలే అని తక్కువగా చూడకూడదు.

అమెరికా, ఆఫ్రికా, ఆస్ట్రేలియా దేశాలలో వృద్ధులని గురించి వివరిస్తూ వారు మిక్కిలి జ్ఞానం కలవారని, తెలివిగలవారని, అనుభవజ్ఞులని పేర్కొంటారు. వృద్ధులైన స్త్రీలలో కనీస వేతనభత్యం వున్న ఉద్యోగాలు చేసినవారి సంఖ్య తక్కువ. వారు జీవితమంతా, ఇల్లు, పిల్లల్ని పెంచడం, కట్టుకున్న వారికీ, కన్నబిడ్డలకీ చాకిరీ చేయడం తప్ప మరో సంగతంటూ తెలియని అమాయకపు స్త్రీలెందరో జీవితం చివరిదశను నిస్సహాయంగా గడపవలసి వస్తోంది

ఎన్నో అనారోగ్యాలు, కీళ్ళ నొప్పులు, మధుమేహం, జ్ఞాపకశక్తి నశించడం, గుండె జబ్బులు ఇలాంటి అనారోగ్య సమస్యలు వృద్ధాప్యంలో విరుచుకుపడతాయి. ఇక ముందంతా ఇతరులపై ఆధారపడి బ్రతకడం తప్పదని, వారిలో నిరాశావాదం చోటు చేసుకుంటుంది. ఫలితం ఇంకా త్వరగా వారిని బలహీనుల్ని చేస్తుంది. వయసు ప్రభావం, తమపై పడకుండా ధైర్యంగా తమ పనులు తాము చేసుకుంటూ చలాకీగా తిరిగే వృద్ధులు అరుదుగా ఉన్నారు. వారు తమను ఆప్యాయంగా పలకరించే వారికోసం ఎదురు చూస్తూ ఉంటారని మరువకూడదు.

తరువాత కుటుంబ సభ్యులు వృద్ధులను ఎప్పుడు ఒంటరిగా వదలకూడదు. అన్ని పనులలో వారి సలహా తీసుకుంటూ వారిని నలుగురిలో కలుపుకుంటూ వారి పెద్దరికానికి విలువనివ్వడం మన కనీస బాధ్యత. అరవై సంవత్సరాలు తమ శక్తియుక్తులను ధారపోసి, సేవలు చేసిన తల్లికి విశ్రాంతినిచ్చి, వృద్ధాప్యాన్ని సుఖంగా గడిపేందుకు తగ్గ బాధ్యత ఆడమగ వ్యత్యాసం లేకుండా ప్రతివ్యక్తీ స్వీకరించాలి. వైద్య రంగంలో వారికి ప్రత్యేక సౌకర్యాలు కల్పిస్తే మంచిది. నేటి యువతీ యువకులు రేపటి వృద్ధాప్యం కొరకు జాగ్రత్తపడటం ఎంతో అవసరం. సమాజంలో ప్రతివారూ కూడా ఆరోగ్యపరంగా, ఆర్థికపరంగా వృద్ధుల జాగ్రత్తలను చేపట్టవలసిన అవసరం ఎంతైనా వుంది.

*(ఆంధ్రభూమి దినపత్రిక, జూలై 21, 2003)*

# అమూల్య గుణాలు - సహనం, కృతజ్ఞత

ఈ భూమిపై శ్వాసించే ప్రతి మనిషీ తాను ఉన్నతస్థాయిలో ఉండాలని, సుఖసంతోషాలతో నిండిన జీవితం తనకు దక్కాలని, సిరిసంపదలుతోపాటు అందచందాలు కూడ తన సొంతం కావాలని కోరుకుంటాడు. ఈ కోరికల పరిపూర్తికి, ధర్మసమ్మతమైన మార్గంలో ప్రయత్నించడం తప్పుకాదు. అయితే తాను ఆశించిన సుఖసంతోషాలు, ఐశ్వర్య సౌందర్యాలు, తనకు దక్కకుండా మరొకరికి ప్రాప్తమైనప్పుడు ఇతరులపై ఈర్ష్య చెందటం, వారిపట్ల అసూయ పెంచుకోవటం ధర్మ సమ్మతం కాదు.

మనకు లేనిది ఇతరులకు ఉంటే మనిషి ఈర్ష్య చెందుతాడు. ఈ దుర్గుణం దూరం చేయటానికి, మహ్మద్ ప్రవక్త 'ధన సంపదల విషయంలో, అందచందాల విషయంలో మీరు మీకంటే గొప్పవారిని చూస్తే మీ మనసులో వారిమీద అసూయ జనించే అవకాశం ఉంది. కాబట్టి మీరు మీకంటే తక్కువస్థాయి కలవారిపై దృష్టిపెట్టండి. దీనివల్ల మీరు వారిపట్ల అసూయకు బదులు సహనం, కృతజ్ఞతా భావం జనిస్తుంది" అంటారు.

ఎవరైతే ధార్మిక, నైతిక విషయాలలో తనదృష్టిని, తనకంటే ఉత్తములు, ఉన్నతులైన వారిపై ఉంచుతాడో ప్రాపంచిక విషయంలో తనకంటే తక్కువస్థాయి కలిగిన పేదసాదలు, దీనజనులపై దృష్టిపెట్టి, దైవం కేవలం తన కృపాకటాక్షాల వల్లనే వీరికంటే ఎక్కువ ఇహలోక వరాలను, తనకు ప్రసాదించాడని భావిస్తాడో, అలాంటి వ్యక్తి దైవం దగ్గర కృతజ్ఞులు, సహనవంతులుగా పరిగణింపబడతాడు.

తనకు లభించని, ఇహలోక వరాల వలన విచారిస్తూ, బాధపడ్తాడో, అలాంటివాడు దైవం దగ్గర కృతజ్ఞులు, సహనవంతుల జాబితాలో రాబడడు. సహనం, కృతజ్ఞత రెండూ అమూల్యమైన గుణాలు. విశ్వాసం, నైతికత, సదాచరణలాంటి విషయాలను అనుసరించాలి.



## చుండి కృష్ణవేణి

జననం : 11-01-1938

తల్లిదండ్రులు : కీ॥శే॥ శ్రీమతి చుండి సరస్వతమ్మ
కీ॥శే॥ చుండి హనుమంతరావు

విద్యార్హతలు : ఎం.ఎ., బి.యిడి. – జర్నలిజంలో డిప్లమో

ఉద్యోగం : ఉపాధ్యాయురాలు – పురపాలక అభ్యుదయ ప్రాథమికోన్నత పాఠశాల, గుంతకల్లు, అనంతపురం జిల్లా

అభిరుచి : సంగీతం, సాహిత్యం, కళలు, రంగస్థలం, ఆకాశవాణిలో సూక్తులు, మన సాంప్రదాయాలు వినిపించటం, పద్యపఠనం–పద్యాలతోరణం దూరదర్శన్‌లో పాల్గొనుట – వివిధ సాహిత్య ప్రసంగాలు

భర్త : కీ॥శే॥ శ్రీ కంఠం నారాయణమూర్తి

సంతానం : శ్రీ కంఠం లక్ష్మీనరసింహం పంతులు

కోడలు : శ్రీమతి అరుణ

మనుమరాళ్లు : చి॥ శ్రీలక్ష్మి – చి॥ ఉమాశ్రావణి